శ్లో॥ గాయంతి తే విశదకర్మ గృహేషు దేవ్యో
రాజ్ఞాం స్వశత్రు వధమాత్మ విమోక్షణం చ ।
గోప్యశ్చ కుంజరపతేర్జనకాత్మ జాయాః
పిత్రోశ్చ లబ్ధశరణామునమో వయం చ ॥ 9

టీ:– అతోఽనేనోపాయేన త్వయా శీఘ్రం హంతవ్య ఇత్యాశయేనాహ – గాయంతీతి. జరాసంధనిరుద్ధానాం రాజ్ఞాం దేవ్యః పత్న్యః. తే విశదం కర్మ స్వగృహేషు బాలకలాలనాదౌ గాయంతి. కిం తత్కర్మ స్వశత్రోర్జరాసంధస్య వధం. ఆత్మనాం పతీనాం విమోక్షణం చ. వత్స మారోదీః శ్రీకృష్ణ ఏవం కరిష్యతీతి. అత్ర దృష్టాంతా గోప్యశ్చేత్యాదయః. యథా గోప్యః శంఖచూడ వధం స్వ మోక్షం చ గాయంతి అవతారాంతరగతం చ కుంజరపతేః నక్రాత్. జనకాత్మజాయాః రావణాత్. పిత్రోశ్చ కంసగృహాత్. మోక్షం. అత ఏవం భూతానాం తాసాం. కృపయా త్వయా తథైవ కర్తవ్యమితి భావ. 9

ఈ ఉపాయముచేతనే వెంటనే జరాసంధుని వధించవలెనని చెప్పుచున్నాడు. – యుద్ధభిక్షనెపముతో నీవు జరాసంధుని వధింపుము. దానివల్ల అతడు బంధించిన రాజులందరికీ స్వేచ్ఛ లభించగా వారి పత్నులు మిగుల సంతోషముతో – శంఖచూడుని వధవలన ముక్తి పొందిన గోపికలవలె, మకరిబాధనుండి బైటపడిన గజరాజువలె, రావణవధ పిమ్మట కలతదీరిన సీతవలె, కంసవధవలన చెరను విడిన నీ తండ్రివలె, నీ ఆశ్రయమును పొందిన మా వంటి మునులవలె – కీర్తించుచు తమ ఇండ్లలో పసిపిల్లలకు 'మీరు ఏడువకుడు మీకు శ్రీకృష్ణుని రక్షణ కలుగగలదని' జోలపాటలు పాడుదురు. కనుక నీ భక్తులైన ఆ రాజుపట్ల, వారి పత్నులపట్ల దయతో వారిని కాపాడుట నీకు అవశ్య కర్తవ్యమని భావము. 9

శ్లో॥ జరాసంధ వధః కృష్ణ భూర్యర్థాయోప కల్ప్యతే ।
ప్రాయః పాపవిపాకేన తవచాభిమతః క్రతుః ॥ 10

టీ:– కించ జరాసంధవధ ఇతి. భూర్యర్థాయేతి.తతః శిశుపాల వధాయోఽపి సుఖసాధ్యా భవిష్యంతీతి భావః. ఏతచ్చ సర్వం

జరాసంధుని వధించుట నీకు అధిక ఫలప్రదమగును. పిమ్మట శిశుపాలాది శత్రువులను నిర్మూలించుట నీకు సులభసాధ్యము కాగలదు. ఇదంతయు జరుగగలదని చెప్పుచున్నాడు. కర్మఫలము విపాకము. ఆ రాజుల పుణ్యకర్మల వశము వలనగానీ, జరాసంధుని

భవిష్యత్యేవేతి సంభావయన్నాహ– ప్రాయ ఇతి. పచ్యత ఇతి పాకః కర్మ. తస్య విపాకఃనేతి. తేనాయం క్రతుస్తవాభిప్రేతః తత్ర గతే త్వయి. సర్వం భవిష్యతీత్యర్థః. 10

పాపకర్మలవశము వలనగానీ ఓ కృష్ణా! నీవు రాజసూయయాగమునకు వెళ్లుటే సర్వోత్కృష్ట నిర్ణయము. నీవు యాగమునకు వెళ్లినచో అన్ని కార్యములు సానుకూలపడగలవు అని ఉద్ధవుడు చెప్పినాడు. 10

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇత్యుద్ధవ వచో రాజన్ సర్వతోభద్ర మచ్యుతమ్ ।
దేవర్షిర్యదువృద్ధాశ్చ కృష్ణశ్చ ప్రత్యపూజయన్ ॥ 11

టీ:– ఇతీతి. అచ్యుతం ఉపపత్త్యాదృఢం. యదువృద్ధా ఇత్యనేన అనిరుద్ధాదయ స్తథా నాపూజయన్నితి సూచితం. 11

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు**

ఓ పరీక్షిత్తుమహారాజా ! సర్వశుభప్రధముగ ఉపపత్తులతో రూఢియైన ఉద్ధవుని మాటను నారదుడు, వసుదేవ, బలరామాది యాదవుల పెద్దలు, కృష్ణుడు గౌరవించిరి. ఐతే అనిరుద్ధాదులైన యాదవ బాలవీరులకు జరాసంధునిపై యుద్ధమును పరిహరించి రాజసూయ యాగమునకు వెళ్లుట రుచించలేదని భావము. 11

శ్లో॥ అథాదిశత్ప్రయాణాయ భగవాన్ దేవకీసుతః ।
భృత్యాన్ దారుకజైత్రాదీననుజ్ఞాప్య గురూన్ విభుః ॥ 12

టీ:– అథేతి. అనుజ్ఞాప్యఅనుజ్ఞాం ప్రార్థ్య.గురూన్ వసుదేవాదీన్. 12

పిమ్మట భగవంతుడైన దేవకీ పుత్రుడు కృష్ణుడు పెద్దల అనుమతిని పొంది దారుకుడు, జైత్రుడు మొదలైన సేవకులకు ఇంద్రప్రస్థప్రయాణమునకు రథమును సిద్ధము చేయమని ఆదేశించెను. 12

శ్లో॥ నిర్గమయ్యావరోధాన్ స్వాన్ ససుతాన్ సపరిచ్ఛదాన్ ।
సంకర్షణమనుజ్ఞాప్య యదురాజంచ శత్రుహన్ ।
సూతోపనీతం స్వరథమారోహద్గరుడ ధ్వజః ॥ 13

టీ:– నిర్గమయ్యేతి. అవరోధాన్ దారాన్. నిర్గమయ్య ప్రయాణం కారయిత్వా. 13

తన భార్యలను, పుత్రులను వారివారి పరిజనముతో ప్రయాణమునకు సిద్ధపరిచి, వసుదేవ బలరామాదుల అనుమతినడసి శత్రునాశకుడైన గరుడ వాహనుడు సూతుడు సిద్ధముచేసిన రథమును అధిరోహించినాడు. 13

శ్లో॥ పురోరథపభటసాదినాయకైః
కరాళయాపరివృత ఆత్మసేనయా।
మృదంగ భేర్యానక శంఖగోముఖైః
ప్రఘోషఘోషత్కకుభోనిరాకమల్ ॥ 14

టీ:- పురఇతి. భటాః పదాతయః. సాదినః అశ్వారోహా, రథాదినాయకైః కరాళయా తీవ్రయా. ఆత్మసేనయా పరివృతో నిరాక్రమత్ నిరగాత్. పురస్సకాశాత్ మృదంగాదిభిర్వాద్యైః ప్రఘోషేణ ఘోషితాయాః కకుభః. 14

రథ, గజ, తురగ, పదాది దళపతులతో కూడిన భయంకరమైన సైన్యముతో పరివృతుడై, సమీపమున మ్రోగు మృదంగములు, భేరులు, తప్పెటలు, శంఖములు మొదలైన వాద్యముల మ్రోతలతో దిక్కులు మారుమ్రోగునట్లుగా కృష్ణుడు బయలుదేరినాడు. 14

శ్లో॥ నృవాజి కాంచన శిబికాభిరచ్యుతం
సహాత్మజాః పతిమను సువ్రతాయయుః ।
వరాంబరాభరణ విలేపన స్రజ
స్సుసంవృతా నృభిరపి చర్మపాణిభిః ॥ 15

టీ:- నృవాజీతి. నరయానైరశ్వైః కాంచనశిబికాభిశ్చ. అచ్యుతం పతిమనుయయుః. సువ్రతాః పతివ్రతాః. వరణ్యాంబరాదీని యాసాం తాః. 15

మనుషులు మోయు పల్లకీలు, గుఱ్ఱములు, రథములు మొదలైన వానిపై తనకొడుకులతో సహా, శ్రేష్ఠమైన వస్త్రములు, ఆభరణములు, పరిమళ ద్రవ్యములు, పూలదండలు ధరించినవారై పతివ్రతలగు శ్రీకృష్ణుని పత్నులు ఆయుధములు ధరించిన భటులు పరివేష్టించి వెంటరాగా తమ భర్త అచ్యుతుని వెంట వెళ్లినారు. 15

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ నరోష్ట్ర గోమహిష ఖరాశ్వతర్యనః
కరేణుభిః పరిజనవారయోషితః ।
స్వలంకృతాః కటకుటికంబళాంబరా
ద్యుపస్కరా యయురధియుజ్య సర్వశః ॥ 16

టీ:- నరేతి. నరోష్ట్రాదిభిర్యానైః. అశ్వతరీగర్దభాభ్యామశ్వాజ్జాతా అనః శకటం. కరేణుర్గజీ. పరిజనయోషితో వారయోషితశ్చ కటకుటయః. ఉశీరాది తృణనిర్మిత గృహాః. కంబళాంబరాదయశ్చ ఉపస్కరాః కుడ్యాదిరూపా యాసాం తాః. అధియుజ్య బలీవర్దాదిషు తానుపస్కరాన్ దృఢం సన్నహ్య. 16

నరులు, ఒంటెలు, గోవులు, దున్నలు, గాడిదలు, కంచర గాడిదలు, ఆడ ఏనుగులు మొదలైనవి లాగు బండ్లలో పరిచారికలు, వేశ్యలు, చక్కని అలంకారములతో, వెంట తీసుకొని వెళ్ళుతున్న గడ్డి, ఉన్ని వస్త్రములు మొదలైన వానితో చెదురుముదురు కాకుండ గట్టిగా మూటలు కట్టిన సంభారములతో అనుసరించి వెళ్లినారు. 16

శ్లో॥ బలం బృహద్ధ్వజ పటఛత్ర చామరై
ర్వరాయుధాభరణ కిరీటవర్మభిః ।
దివాంశుభిస్తుములరవం బభౌ రవే
ర్యథార్ణవః క్షుభిత తిమింగిలోర్మిభిః ॥ 17

టీ:- బలమితి. రవేరంశుభిశ్చ తద్బలం దివా బభౌ. కథంభూతం. తుములరవం ఆకులస్వనం. క్షుభితైస్తిమింగిలైః ఊర్మిభిః. 17

గొప్ప కేతనములు, గొడుగులు, చామరములతో శ్రేష్ఠమైన ఆయుధములు, ఆభరణములు, కిరీటములు, కవచములు ధరించిన సైనికులు దట్టమైన సూర్యకిరణములు వ్యాపించిన పగటివలె, తిమింగలాలు, అలలచేత క్షోభచెందిన సముద్రమువలె అపారముగా గర్జించిరి. 17

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అథో మునిర్యదుపతినా సభాజితః
ప్రమణ్య తం హృది విదధద్విహాయసా ।
నిశామ్య తద్వ్యవసిత మాహృతార్హణో
ముకుంద సందర్శన నిర్వృతేంద్రియః ॥ 18

టీ:- అథో ఇతి.మునిర్నారదో విహాయసా యయావితి శేషః. 18

శ్రీకృష్ణునికి కర్తవ్యము నిర్దేశించి, ముకుందుని సందర్శనముచేత పరితృప్తిని పొందినవాడై, యాదవరాజు సత్కారములు పొంది, పరమాత్మకు మనస్సులోనే ప్రణమిల్లి నారదమహర్షి ఆకాశమార్గమున వెళ్లిపోయినాడు. 18

శ్లో॥ రాజదూతమువాచేదం భగవాన్ ప్రీణయన్ గిరా ।
మాభైష్ట దూత భద్రంవోఘాతయిష్యామి మాగధమ్ ॥ 19

టీ:- రాజేతి. మాభైష్టేతి బహుత్వం రాజాభిప్రాయేణ. 19

జరాసంధుడు బంధించిన రాజులు పంపిన దూతతో కృష్ణుడు ఉచితమైన మాటలతో ప్రీతిని కలిగించుచు 'ఓయీ నీవు భయము చెందకుము. నేను తప్పక ఆ దుష్టుని వధింతునని' చెప్పినాడు.19

శ్లో॥ ఇత్యుక్తః ప్రస్థితో దూతో యథావదవదన్నృపాన్ ।
తే౨_పి సందర్శనం శౌరేః ప్రత్యైక్షన్ యన్ముముక్షవః ॥ 20

టీ:-ఇతీతి. ప్రత్యైక్షన్ ప్రత్యైక్షంత. యత్ యస్మాత్ ముముక్షవః. 20

ఈ విధముగా కృష్ణుని అభయ సందేశమును కొని వెళ్లిన దూత ఆ రాజులకు నివేదించగా వారందరు తమతమ బంధవిముక్తిని కాంక్షించినవారై కృష్ణుని ఆగమనమునకై ఎదురుచూచుచుండిరి. 20

శ్లో॥ ఆనర్త సౌవీరకురూన్ తీర్త్వా వినశనం హరిః ।
గిరీన్నదీరతీయాయ పురగ్రామ వ్రజాకరాన్ ॥ 21

టీ:- అనర్తేతి,అనర్తాదయో మార్గస్థదేశాః.తాన్ తీర్త్వా అతిక్రమ్య వినశనం కురుక్షేత్రం గిరీన్ రైవతకాదీన్ అతీయాయ అతిక్రమ్యయో21

కృష్ణుడు మార్గమధ్యమందలి ఆనర్త సౌవీరకురు దేశములను దాటి కురుక్షేత్రము ( వినాశనము )ను, రైవతకాది గిరులను, నదులను, నగరములను, గ్రామములను, పల్లెలను అతిక్రమించినాడు. 21

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తతోవృషద్వతీం తీర్త్వా ముకుందోఽథ సరస్వతీం ।
పాంచాలానాథ మత్స్యాంశ్చ శక్ర ప్రస్థముపాగమత్ ॥ 22

పిమ్మట కృష్ణుడు వృషద్వతి, సరస్వతీ నదులను దాటి, పాంచాల మత్స్య దేశములను దాటి ఇంద్రప్రస్థము చేరినాడు. 22

శ్లో॥ తముపాగతమాకర్ణ్య ప్రీతో దుర్దర్శనం నృణాం ।
అజాతశత్రుర్నిరగాత్సోపాధ్యాయస్సుహృద్వృతః ॥ 23

టీ:- తత ఇతి. శక్రప్రస్థం ఇంద్రప్రస్థం .(22-23)

శ్లో॥ గీతవాదిత్ర ఘోషేణ బ్రాహ్మ ఘోషేణ భూయసా ।
అభ్యయాత్సహృషీకేశం ప్రాణాః ప్రాణమివాగతమ్ ॥ 24

టీ:- గీతేతి. ప్రాణాః ఇంద్రియాణి ప్రాణాంముఖ్యం ప్రాణమివ. 24

ఎల్లరకు ప్రియదర్శకుడైన శ్రీకృష్ణుని రాక తెలిసి ధర్మరాజు ఆయనకు స్వాగతము చెప్పుటకై పురోహితులతో కూడి నగరము వెలుపలికి వచ్చి, మంగళ వాద్యములు మ్రోగుచుండగా, పురోహితుల వేద మంత్రాలతో ప్రాణములకు ప్రాణమైన అప్తుడు హృషీకేశునికి ఆప్యాయతతో ఎదురేగినాడు. (23-24)

శ్లో॥ దృష్ట్వా విక్లిన్న హృదయః కృష్ణం స్నేహేన పాండవః ।
చిరాద్దృష్టం ప్రియతమం సస్వజేస్మ పునః పునః ॥ 25

టీ:- దృష్ట్వేతి. సస్వజే పరిరేభే. 25

చాలాకాలము తర్వాత వచ్చిన ప్రియతముడైన శ్రీకృష్ణుని చూచి ఆర్ద్రహృదయుడై ఆదరముతో ధర్మరాజు మాటిమాటికి స్నేహసాంద్రుడై కౌగిలించుకున్నాడు. 25

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ దోర్భ్యాం పరిష్వజ్య రమామలాలయం
ముకుందగాత్రం నృపతిర్హతా శుభః ।
లేభే పరాంనిర్వృతి మశ్రులోచనో
హృష్యత్తనుర్విస్మృత లోక విభ్రమః ॥ 26

నిర్మలమైన లక్ష్మీనిలయుడైన కృష్ణుని శరీరమును రెండు భుజాలతో కౌగిలించుకొని ధర్మరాజు సర్వశుభములు పొందినవాడై ఆనంద బాష్పాలతో పులకించిన శరీరముతో సర్వ లోకవ్యాపారములను మరచినవాడై అపారమైన అనిర్వచనీయమైన పరమానందనము పొందినాడు. 26

శ్లో॥ తం మాతులేయం పరిరభ్య నిర్వృతో
భీమస్స్మయన్ ప్రేమజలాకులేంద్రియః ।
యమౌ కిరీటీ చ సుహృత్తమం ముదా
ప్రవృద్ధబాష్పాః పరిరేభిరేऽచ్యుతమ్ ॥ 27

మేనత్త కొడుకైన కృష్ణుని చిరునవ్వుతో ప్రేమ నిండిన ఆనందబాష్పాలతో భీముడు కౌగిలించుకొని అధికానందమును పొందినాడు. స్నేహితుడైన శ్రీకృష్ణుని అర్జునుడు, నకులసహదేవులు ఆనందముతో ఆర్ద్రనయనములతో కౌగిలించుకొనిరి. 27

టీ:- దోర్భ్యామితి. రమాయాః అమలం నిర్దోషం ఆలయం. విస్మృతో లోకవిభ్రమః లోకవ్యాపారో యేన సః.(26-27)

శ్లో॥ యుధిష్ఠరస్య భీమస్య కృత్వా పాదాభివందనమ్ ।
అర్జునేన పరిష్వక్తోయమాభ్యామభ్యామభివందితః ॥ 28

కృష్ణుడు ధర్మరాజ భీముల పాదాలకు నమస్కరించినాడు. అర్జునుని కౌగిలించుకున్నాడు. నకుల సహదేవులు కృష్ణునికి నమస్కరించినారు. 28

శ్లో॥ బ్రాహ్మణేభ్యో నమస్కృత్య వృద్ధేభ్యశ్చ యథార్హతః ।
మానితో మానయామాస కురుసృంజయకేకయాన్ ॥ 29

కృష్ణుడు బ్రాహ్మణులకు, పెద్దలకు గౌరవముతో నమస్కరించినాడు. కురు, సృంజయ, కేకయాదులచే ఉచితరీతిని గౌరవముపొంది వారిని అర్హమైన విధముగా సంబావిమచినాడు. 29

శ్లో॥ సూతమాగధ గంధర్వా వందినశ్చోపమంత్రిణః ।
మృదంగశంఖ పటహవీణాపణవ వేణుభిః ।
బ్రాహ్మణాశ్చారవిందాక్షం తుష్టువున్ననృతుర్జగుః ॥ 30

మృదంగములు, శంఖములు, తప్పెటలు, వీణలు, వేణువులు మొదలైన మంగళ వాద్యములు మ్రోగుచుండగా స్తోత్ర పాఠములు చేయుచుండగా సూత, వందిమాగధులు, మంత్రులు, బ్రాహ్మణులు కృష్ణుని తృప్తి పరచే నాట్యములు సల్పుచుండగా కృష్ణుడు వారివెంట వెళ్లినాడు. 30

శ్లో॥ ఏవం సుహృద్భిః పర్యస్తః పుణ్యశ్లోక శిఖామణిః ।
సంస్తూయమానో భగవాన్ వివేశాలంకృతం పురమ్ ॥ 31

టీ:- యుధిష్ఠిరస్యేతి. అర్జునేన సమస్వాత్ పరిష్వక్తఏవ కేవలం యమాభ్యాంనకులసహదేవాభ్యాంఅభివందితఃనమస్కృతశ్చేతి (28-31)

ఈ విధముగా ఆత్మీయుల సమూహముతో స్తుతులనందుకొన్న వాడై పుణ్యముల రాశియైన భగవంతుడు చక్కగా అలంకరింపబడిన ఇంద్రప్రస్థనగరమున ప్రవేశించినాడు. 31

శ్లో॥ సంసిక్త వర్త్మ కరిణాం మదగంధతోయై
శ్చిత్రధ్వజైః కనకతోరణపూర్ణకుంభైః ।
మృష్టాత్మ భిర్నవదుకూల విభూషణస్ర
గ్గంధైర్నృ భిర్యువతిభిశ్చ విరాజమానమ్ ॥ 32

టీ:- సంసిక్తేతి. చిత్రధ్వజాదిభిర్విరాజమానం. 32

ఏనుగుల మదజలముతో తడిసిన మార్గమందు చిత్ర విచిత్రములైన ధ్వజములు, బంగారుతోరణములు పూర్ణకుంభములు మొదలైన వానితో అలంకరింపబడిన ఇంద్రప్రస్థ నగరమునకు మిగులు ఆనందముతో కొత్తవస్త్రములు, ఆభరణములు, పూలమాలలు, పరిమళ ద్రవ్యములు ధరించిన పురజనులు కళకళలాడిరి. 32

శ్లో॥ ఉద్దీప్తదీపబలిభిః ప్రతిసద్మజాల
నిర్యాతధూపరుచిరం విలసత్పతాకం ।
మూర్ధన్య హేమకలశై రజతోరుశృంగై
ర్జుష్టం దదర్శ భవనైః కురురాజధామ ॥ 33

టీ:- ఉద్దీప్తేతి. ప్రతిసద్మ ఉద్దీప్తైర్దీపైః బలిభిః పుష్పాదిప్రకరైశ్చ. జుష్టం జాలేభ్యో గవాక్షేభ్యో నిర్యాతైర్ధూపైః రుచిరం విలసంత్యః పతాకాః యస్మిన్ తత్. ముర్ధన్యాః మూర్ధ్ని భవాః. హేమకలశాః యేషాం తైః. రజత మయాని రూప్యమయాని. ఊరూణి స్థూలాని శృంగాణి కలశాధస్తన భూమికాః యేషాం తైః. భవనైర్జుష్టం కురురాజస్యధామ పురం దదర్శ. 33

శ్లో॥ ప్రాప్తం నిశమ్య నరలోచన పానపాత్ర
మౌత్సుక్యవిశ్లథిత కేశదుకూలబంధాః ।
సద్యో విసృజ్య గృహకర్మపతీంశ్చ తల్పే
ద్రష్టుం యయుర్యువతయశ్చ నరేంద్రమార్గే ॥ 34

టీ:- ప్రాప్తమితి. నరాణాం లోచనాని తేషాం పానస్య సార సౌందర్య సాదర వీక్షణస్య. పాత్రం విషయం. కిపుర్నారీణామిత్యర్థః. ఔత్సుక్యేన ఇష్టార్థోద్యుక్త త్వేన.విశ్లథితాః స్రస్తాః. కేశదుకూలబంధా యాసాం తాః 34

వెలిగించిన దీపకాంతులతో, గవాక్షములనుండి వెలువడు పరిమళభరిత ధూపదీపములతో మనోహరమైనది, విరాజిల్లు పతాకము లతో, బంగారు కలశములతో, వెండి గోపురములతో, విలసిల్లిన మేడలతో, కూడిన ధర్మరాజు ప్రాసాదమును కృష్ణుడు చూచెను. 33

పురుషుల కళ్లకే వ్యామోహమును కలిగించునట్టి మనోహర రూపుడైన శ్రీకృష్ణుడు సమీపించుటను గమనించి ఉత్సాహముతో జుట్టుముడులు, కట్టుబట్టలు జారిపోవుటనుకూడా గమనించక, వెంటనే తాము చేయు పనిని కూడా విడిచి భర్తలను పడకలందే వదిలి రాజమార్గమున కృష్ణుని దర్శించుటకై యువతులు వెళ్లిరి. 34

శ్లో॥ తస్మిన్ సుసంకుల ఇభాశ్వరథ ద్విపద్భిః
కృష్ణం సభార్యముపలభ్య గృహాధిరూఢాః ।
నార్యో వికీర్యకుసుమైర్మన సోపగూహ్య
సుస్వాగతం విదధురుత్స్మయ వీక్షితేన ॥ 35

టీ:- తస్మిన్నితి. సుష్ఠు స్వాగతం తత్ప్రశ్నాదికం ప్రియం. ఉత్స్మయ వీక్షితేనైవ విదధుః. 35

అపారముగా రథ, గజ, తురగ పదాతుల సైన్యసముదాయమున భార్యలతో కూడిన కృష్ణుని దర్శనమును పొంది ఇండ్ల పైభాగమునుండి మనస్సులోనే ఆ సుందరరూపమును కౌగలించుకొని చిరునవ్వుతో కూడిన శృంగార వీక్షణములతో పువ్వులు చల్లుచూ స్వాగతము చెప్పిరి. 35

శ్లో॥ ఊచుస్స్త్రియః పథినిరీక్ష్య ముకుంద పత్నీః
తారాయథోడుపసహాః కిమకార్యమూభిః ।
యచ్చక్షుషాం పురుషమౌళి రుదారహాస
లీలావలోక కలయాసుఖమాతనోతి ॥ 36

టీ:- ఊచురితి. ఉడుపసహాః చంద్రసహచరా ఇత్యర్థః. అమూభిః కింపుణ్యమకారితి. 36

"చంద్రుని వెన్నంటిన నక్షత్రాలవలె కృష్ణపత్నులు తమ కన్నులతో నిరంతరము ఆ పురుషోత్తముని చిరునవ్వు లావణ్యములను దర్శించు సుఖవాసము పొందుటకు పూర్వ జన్మమున ఎంతటి పుణ్యములను చేసిరో గదా"యని మార్గమున వారిని చూచిన ఇంద్రప్రస్థపుర స్త్రీలు తమలోతాము చెప్పుకొనిరి. 36

శ్లో॥ తత్ర తత్రోపసంగమ్య పౌరామంగళపాణయః ।
చక్రుస్సపర్యాం కృష్ణాయ శ్రేణిముఖ్యాహతైన సః ॥ 37

టీ:- తత్రేతి. శ్రేణ్యః ఏకశిల్పోపజీవినాం సంఘాః తేషు ముఖ్యాశ్చ. 37

అక్కడక్కడ గుంపులు కట్టిన జనసమూహాలు పుణ్యాత్ములైన ముఖ్యనాయకులు శుభహస్తములతో కృష్ణునికి సేవలు చేసిరి. 37

శ్లో॥ అంతఃపురజనైః ప్రీత్యా ముకుందః ఫుల్ల లోచనైః ।
సససంభ్రమైరభ్యుపేతః ప్రావిశద్రాజమందిరమ్ ॥ 38

టీ:- అంతఃపురేతి. అభ్యుపేతః అభిగమనేన సత్కృతః. 38

సంతోషముతో వికసించిన కనులతో అంతఃపురస్త్రీలు ప్రీతితో వెంట నడువగా కృష్ణుడు రాజమందిరమును ప్రవేశించినాడు. 38

శ్లో॥ పృథా విలోక్య భ్రాత్రేయం కృష్ణం త్రిభువనేశ్వరం ।
ప్రతాత్మోత్థాయ పర్యంకాత్స స్నుషా పరిషస్వజే ॥ 39

టీ:- పృథేతి. సస్నుషా ద్రౌపదీ సహితా. 39

కోడలు ద్రౌపదితో ఉన్న కుంతి త్రిలోకనాథుడైన మేనల్లుడు కృష్ణుని చూచి ప్రేమతో తల్పమునుండి లేచివచ్చి కృష్ణుని కౌగిలించు కొన్నది. 39

శ్లో॥ గోవిందం గృహమానీయ దేవదేవేశ మాదృతః ।
పూజాయాం నావిదత్కృత్యం ప్రమోదోపహతో నృపః ॥ 40

టీ:- గోవిందమితి. కృత్యం ప్రకారవిశేషం ప్రమోదేన ఉపహతః అభిభూతః. 40

ఆనంద పూర్ణుడైన ధర్మరాజు కృష్ణుని గృహములోనికి తోసుకొని వెళ్లి యథోచితమైన ఆసనార్ఘ్యాదులతో పూజించినాడు. 40

శ్లో॥ పితృష్వసుర్గురుస్త్రీణాం కృష్ణశ్చక్రేఽభివాదనమ్ ।
స్వయంచ కృష్ణయా రాజన్ భగిన్యా చాభివాదితః ॥ 41

టీ:- పితృష్వసురితి. గురుస్త్రీణాం కృష్ణయా ద్రౌపద్యా. భగిన్యా సుభద్రయా. 41

ఓ రాజా ! మేనత్తకు, పెద్దలైన స్త్రీలకు కృష్ణుడు నమస్కరించినాడు. సోదరి ద్రౌపది కృష్ణునికి నమస్కరించినది. (శుక మహర్షి పరీక్షిత్తునకు చెప్పినాడు.) 41

శ్లో॥ శ్వశ్ర్వా సంచోదితా కృష్ణా కృష్ణపత్నీ స్తు సర్వశః ।
ఆనర్చ రుక్మిణీం సత్యాం భద్రాం జాంబవతీం తథా ॥ 42

టీ:- శ్వశ్రేతి. ఆనర్చ అర్చితవతీ. 42

శ్లో॥ కాళిందీం మిత్రవిందాం చ శైబ్యాం నాగ్నజితీం సతీం ।
అన్యాశ్చాభ్యాగతాయాస్తావాసస్స్రజ్మండనాదిభిః ॥ 43

టీ:- కాళిందీమితి. అన్యాశ్చయాః కృష్ణపత్న్యో౽భ్యాగతాః తా అపి. 43

శ్లో॥ సుఖం నివాసయామాస ధర్మరాజో జనార్దనమ్ ।
ససైన్యం సానుగామాత్యం సభార్యం చ నవం నవమ్ ॥ 44

టీ:- సుఖమితి. ప్రత్యాహం నవం నవం యథా భవతి తథా సుఖం నివాసయామాస. 44

శ్లో॥ తర్పయిత్వా ఖాండవేన వహ్నిం ఫల్గున సంయుతః ।
మోచయిత్వామయం యేన రాజ్ఞే దివ్యా సభాకృతా ॥ 45

అత్త కుంతీ ఆదేశముతో ద్రౌపది కృష్ణుని అష్టభార్యలైన రుక్మిణి, సత్యభామ, భద్ర, జాంబవతి, కాళింది, మిత్రవింద, శైబ్య, నాగ్నజితి అనే వారిని, ఇంకా వారివెంట వచ్చిన ఇతర భార్యలను వస్త్రములు, ఆభరణములు,పూలమాలలు మొదలైన వానిని సమర్పించి అర్చించెను. (42-43)

ఎడతెగని ప్రేమతో నిత్యము అర్జునునితో కలిసి (ఉన్నందు వలన అతనితో) ఇంద్రుని ఖాండవ వనమును అగ్ని దేవునికి ఆహారముగా దహింపజేసి సంతృప్తిపరచి, ఆ వనమందు చిక్కుకున్న రాక్షస శిల్పి మయుని అగ్ని బాధ పొందకుండా రక్షించి, అతనిని నియోగించి ధర్మరాజు కొరకై ఒక దివ్య సభా భవనమును నిర్మింపజేసిన కృష్ణునికి, అతని భార్యలకు, అమాత్యులకు, సైన్యమునకు ప్రతి దినము కొత్తకొత్త సౌకర్యములు కలుగునట్టి నివాసములను ధర్మరాజు ఏర్పరచినాడు.(44-45)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఉవాసకతి చిన్మాసాన్ రాజ్ఞః ప్రియచికర్షయా ।
విహారన్ రథమారుహ్య ఫల్గునేన బలైర్వృతః ॥ 46

టీ:- కథంభూతం. తర్పయిత్వేతి. యః ప్రేమ్ణా నిత్యం ఫల్గునేన సంయుతః అత ఏవ తస్య సయేన ఖాండవేన వహ్నిం తర్పయిత్వా. తత్ర చ మయం మోచయిత్వా. తం మయం ప్రయుజ్య యుధిష్ఠిరాయ దివ్యాసభాకృతా తం శ్రీకృష్ణం. అనేన రాజ్ఞః కృష్ణోపకారానుస్మరణం. సభాయా దివ్యత్వాద్యధామనోరథం సర్వావకాశ సంపాదనం చ దర్శతమితి. (45-46)

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, ఏకసప్తతితమోऽధ్యాయః**

మయుని వలన దివ్య సభా భవణము సిద్ధింపజేసిన కృష్ణుని ఉపకారమునకు కృతజ్ఞుడైన ధర్మరాజు కోరినందు వలన అర్జునునితో రథముపై విహారములు సలుపుచు సైన్యమేతుడై కృష్ణుడు కొన్ని మాసములు ఇంద్రప్రస్థముననే ఉండినాడు. 46

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**డెబ్బదియొకటవ అధ్యాయముసమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ






## ద్విసప్తతితమో௨_ధ్యాయః

శ్లో॥ తతోద్విసప్తతి తమే రాజ్ఞా కార్యేనివేదితే ।
దుర్జయం మాగధం బుద్ధ్వా భీమేనాఘాతయద్ధరిః ॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఏకదాతు సభామధ్యేహ్యస్థితోమునిభిర్వృతః ।
బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైర్భ్రాతృభిశ్చ యుధిష్ఠిరః ॥ 1

టీ:- ఏకదేతి. అస్థితః ఆసనమితి శేషః . 1

శ్లో॥ ఆచార్యైః కులవృద్ధైశ్చ జ్ఞాతి సంబంధిబాంధవైః ।
శృణ్వతామేవ చైతేషా మాభాష్యేన మువాచహా ॥ 2

టీ:- ఆచార్యైరితి. శృణ్వతామేవేతి యత్రప్రసన్నః శ్రీకృష్ణః కరోతి. తత్ అన్యః కశ్చిదపి కర్తుంన సమర్థ ఇతి నిశ్చిత్య. సర్వానేన తాననాదృత్య. కృష్ణమువాచేత్యర్థః. ఆభాష్య భో భో కృష్ణభక్తవత్సలేత్యేవం సంభోధ్య. 2

## 72 వ అధ్యాయము

పిమ్మట డెబ్బదిరెండవ అధ్యాయమున రాజసూయయాగ సందర్భమున చేయవలసిన పనులను నిర్ణయముచేయు అవసరమున మగధ పాలకుడైన జరాసంధుడు అపారమైన బలము కలవాడనీ, అతని వలన యాగమునకు విఘ్నము కలుగగలదనీ ఆలోచించి కృష్ణుడు భీమునితో అతన్ని సంహరింపజేసినాడు.

**శ్రీశుకుడు పలికెను**

ఒకసారి ధర్మరాజు మునులతో, బ్రాహ్మణ క్షత్రియ,వైశ్యులతో, సోదరులతో సభతీర్చి ఉండెను. 1

ఆచార్యులు, కులశ్రేష్ఠులు, దాయాదులు, సంబంధులు, బంధువులతో కూడిన వాడైన ధర్మరాజు ఓ భక్త వత్సలా! కరుణామయా! అని శ్రీకృష్ణుని సంబోధించి ఆయనతో ఈ విధముగా చెప్పినాడు. సభలో అందరున్నను తాను చెప్పబోవు కార్యమును శ్రీకృష్ణుడు తప్ప వేరెవరూ చేయలేరని నిశ్చయించి, మిగిలినవారు అశక్తులని అనాదరముతో కేవలము కృష్ణునికే తను విన్నవించినాడు. 2




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

### యుధిష్ఠిర ఉవాచ

శ్లో॥ క్రతు రాజేన గోవింద రాజసూయేన పావనీః ।
యక్ష్యే విభూతీర్భవతస్తత్సంపాదయ నః ప్రభో ॥ 3

టీ:- క్రత్వితి. విభూతీః అంశాన్. 3

శ్లో॥ త్వత్పాదుకే అవిరతం పరి యే చరంతి
ధ్యాయంత్యభద్ర నశనే సుధియో గృణంతి ।
విందంతి తే కమలనాభ భవాపవర్గ
మాశాసతే యది త ఆశిష ఈశనాన్యే ॥ 4

టీ:- ఏష చక్రవర్తినాం మనోరథః కథం త్వయా క్రియత ఇతి చేదత ఆహ- త్వత్పాదుక ఇతి. పరియే చరంతీతి యచ్ఛబ్దవ్యవధానమార్షం. యే పరిచరంతి దేహేన. ధ్యాయంతి మనసా. ఆభద్రవ్యనశనే నాశకే గృణంతి వాచా. తేభవస్య అపవర్గం మోక్ష విందంతి. యద్యాశాసతే తర్హ్యాశిషోऽపి త ఏవ విందంతి.నాన్యే చక్రవర్తినోऽపీతి. 4

### యుధిష్ఠరుడు పలికెను

ఓ గోవిందా ! పవిత్రమై యజ్ఞములలో శ్రేష్ఠమైన రాజసూయ యాగమును చేయదలుచుకున్నాను. నీ అపారమైన సామర్థ్యముతో ఓ ప్రభూ ! నీవు దానిని నిర్వహింపుము. 3

చక్రవర్తుల కోరికలు కృష్ణుడెట్లు తీర్చగలడను దానికి సమాధానము చెప్పుచున్నాడు. ఓ పద్మనాభా ! నిరంతరము శుభమును కోరువాడు శరీరముతో నీ పాదుకలు సేవించి, మనస్సుతో ధ్యానించి, మాటలతో స్తుతించును. ఈ సంసార దుఃఖములను తొలగించునట్టి మోక్షము నీ ఆశీస్సుల వలననే సిద్ధించగలదు. ఇతరులైన చక్రవర్తులకును అది సాధ్యముకాదు. ( మనో వాక్కాయములనే త్రికరణముల ద్వారా సర్వాత్మనా సేవించువారికే భగవత్ప్రసాదము సిద్ధంచ గలదని భావము) . 4

శ్లో॥ తద్దేవదేవ భవతశ్చరణారవింద
సేవానుభావ మిహపశ్యతులోక ఏషః ।
యే త్వాం భజంతి న భజంత్యుత వోభయేషాం
నిష్ఠాప్రదర్శయ విభో కురుసృంజయానామ్ ॥ 5

టీ:- భగవతో భక్తపక్షపాతమావిష్కుర్వన్నాహ- తదితి. తత్తస్మాత్ పశ్యతు సాక్షాత్ ఏవం నిశ్చితేఽపి. యే కర్మాది ప్రధానా కేచిత్కురు సృంజయాః భగవద్భక్తిం న మన్యం తే. తేషాం మోహనివృత్తయే భజంతి యే వా న భజంతి. తేషాముభయేషాం నిష్ఠాం ప్రదర్శయస్థితిం ప్రకటయేతి. 5

భగవంతుని భక్త పక్షపాతమును స్పష్టపరిచి తెలుపుచున్నాడు. - ఓ దేవదేవా! నిన్ను సేవించినవారు - సేవించనివారు ఉభయుల మధ్యగల భేదము ప్రకటమగునట్లుగా నీ పాదపద్మములను భక్తితో సేవించిన భక్తులకు కలుగునట్టి ఆనందానుభవమును లోకము తెలియునడ్లుగా నీ ప్రభావమును విశదపరచుము, నీ పట్ల నిర్లక్ష భావముతో భగవద్భక్తిని తృణీకరించి సేవించని కొందరు సృంజయులకు, కౌరవులకు వెూహము నశించి కనువిప్పు కలుగునట్లుగా నీ వాస్తవ తత్వమును వెళ్ళడింపుము. 5

శ్లో॥ న బ్రాహ్మణస్స్వపరభేదమతి స్తవ స్యా
త్సర్వాత్మనస్సమదృశస్స్వసుఖానుభూతేః ।
సంసేవతాం సురతరోరివ తే ప్రసాద
స్సేవాను రూప ఉదయో న విపర్యయోఽత్ర ॥ 6

టీ:- ననురాగాదిరహితే మయి కథమిదం వైషమ్యం స్యాత్త్రాహ. - నేతి. స్వః పర ఇతి భేదమతి స్తవ న స్యాదేవ. కుతః. బ్రహ్మణోనిరుపాధేః కించ. సర్వస్యాత్మనః అతః సమదృశః. కించ. స్వసుఖానుభూతేః.

అయితే అనురాగముకానీ, ద్వేషముకానీ లేకుండ సమదృష్టిగల భగవంతునకు తన పర భేదములు లేవుకదా అనే విషయమును వివక్షించి చెప్పుచున్నాడు. సర్వాత్ముడు, నిరుపాధికుడు అయిన పరబ్రహ్మకు భేదబుద్ధిలేదు. ఆయన సర్వ సమభావనతో ఆత్మానందమున ఓలలాడుచున్నందువల్ల సేవించేవారు భక్తులైనను, కాకపోయినను ఆయనకు వారిపట్ల భేదభావము కలుగదు. అయినప్పటికి పరమాత్మను సేవించినవారే ఆయన అనుగ్రహముకు పాత్రులగుదురు. ఆ అనుగ్రహము భక్తులు కాని వారికి సిద్ధించదు. కల్పవృక్షమునకు ప్రేమ,

అతో రాగాద్యభావాదితి భావః. తథాపి సంసేవ్యమావానామేవ త్వత్ప్రసాదోనాన్యేషాం. తత్రాపి సేవానురూపః. ఉదయఃఫలం. నత్వత్ర విపర్యయఃఅన్యథాభావః యథా కల్పద్రుమస్య రాగాది రాహిత్యేఽపి సేవకేష్వేవ ఫలజనకత్వం నాన్యేష్వితి. 6

ద్వేషము లేకపోయినను తనను కోరిన వారికే తప్ప ఇతరులకు ఫలమును ప్రసాదించని విధముగా పరమాత్మ అంతట మార్పులేని వాడైనను తన సేవకులనే అనుగ్రహించును. 6

### శ్రీ భగవానువాచ

శ్లో॥ సమ్యగ్వ్యవసితం రాజన్ భవతా శత్రుకర్శన ।
కల్యాణీ యేన తే కీర్తిర్లోకాననుభవిష్యతి ॥ 7

శ్లో॥ ఋషీణాం పితృదేవానాం సుహృదామపి నః ప్రభో ।
సర్వేషామపి భూతానామీప్సితః క్రతు రాడయమ్ ॥ 8

టీ:- సత్యం భక్తానమేవ కైవల్యాది నాన్యేషామిత్యనుమోదమాన ఆహ-సమ్యగితి. శత్రుకర్శనేతి సంబోధయన్ సర్వరాజవిజయశక్తిం సంభావయతి, అనుభవిష్యతి సర్వలోకవ్యాప్తాభవిష్యతీత్యర్థః. (7-8)

### శ్రీ భగవానుడు చెప్పినాడు

భక్తులకు తప్ప ఇతరులకు మోక్షము మొదలైన విభూతులు కలుగవు అనే విషయము చెప్పుచున్నాడు. సర్వరాజ సముదాయమును జయించి విజయమును పొందిన ఓ ధర్మరాజా ! నీవు చక్కని అవగాహనతో యథార్థమును చెప్పితివి. ఋషులకు, పితృదేవతలకు, నా వంటి మిత్రులకు, సర్వ జీవులకు మిక్కిలి ప్రీతిపాత్రమైన యాగములలో రాజువంటి ఈ రాజసూయ యాగానుభవముతో నీవు లోకమంతట వ్యాపించునట్టి మంగళకరమైన కీర్తిని పొందగలవు. దాని సారరూపమైన ఫలితమును లోకము అనుభవించగలదు. (7-8)

శ్లో॥ విజిత్య నృపతీన్ సర్వాన్ కృత్వా చ జగతీం వశే ।
సంభృత్య సర్వ సంభారానాహరస్వ మహాక్రతుమ్ ॥ 9

నా సహాయముతో నీవు సాధించగల పనులేమున్నవి. నీకు రాజసూయయాగము కూడా మిక్కిలి సులభ సాధ్యము అనే విషయమును చెప్పుచున్నాడు. రాజులందరినీ జయించి సర్వ జగత్తును

టీ:- కిమత్ర మయా అన్యేన వా సంపాదనీయం తవ సుకరఏవ రాజసూయ ఇత్యాహ-విజిత్యేతి. జగతీం సర్వాం పృథివీం. సంభారాన్ యజ్ఞోపస్కరాన్ సంభృత్య సంపాద్య ఆహరస్వ ఆహర అనుతిష్ఠేత్యర్థః (9)

శ్లో॥ య ఏతే భ్రాతరో రాజన్ లోకపాలాంశ సంభవాః ।
జితోఽస్మ్యాత్మవతా తేఽహం దుర్జయో యోఽకృతాత్మభిః ॥ 10

టీ:- నను నృపతి విజయాది కథం శక్యం స్యాదతఆహ- యఇతి. కించ. ఆత్మవతా జితేంద్రియేణ తే త్వయా అహమపి జితోఽస్మి. వశీకృతోఽస్మి అకృతాత్మభిః జితేంద్రియైః. 10

శ్లో॥ న కశ్చిన్మత్పరం లోకే తేజసా యశసా శ్రియా ।
విభూతిభిర్వాభి భవేద్దేవోఽపి కిముపార్థివాః ॥ 11

టీ:- ఆస్తాం తావదేవంభూతస్య తవ పరై రభిభవశంకా కించ. కమపి మత్పరం కోఽపి నాభిభవితుం ప్రభావతీత్యాహ.- నేతి. తేజసా ప్రభావేన. విభూతిభిః సైన్యాదిసామగ్రీభిః. 11

వశము చేసుకొని, సమస్త యజ్ఞ సంభారములను సేకరించి రాజులు సర్వోత్కృష్టముగా చేయదగిన రాజసూయయాగమును చేయుము. 9

సర్వ జగద్విజయము అసాధ్యమేమో అనుకొన వలసినది లేదని చెప్పుచున్నాడు. ఓ ధర్మరాజా ! నీ నలుగురు తమ్ములు దిక్పాలకుల అంశలనుండి జన్మించినారు. ఆత్మజ్ఞానము లేని వారికి పొందసాధ్యము కాని నేను సర్వేంద్రియములను జయించిన ఆత్మవంతుడవైన నీకు వశుడనైతిని. 10

ఇదిట్లుండగా ఇంత సామర్థ్యము కలిగిన నీకు ఇతరులెవరో యాగమునకు విఘ్నము కలిగింతురేమో అన్న సంశయమేల? నన్ను శరణుపొందిన వారిని తిరస్కరించగల సామర్థ్యము వేరెవరికిని లేదనే విషయము చెప్పుచున్నాడు. అపారమైన ప్రభావము, కీర్తి, సంపద, సైన్యాదిసామగ్రి కలిగిన నా ముందు నిన్ను తిరస్కరించగల సామర్థ్యము దేవతలకే లేదు. ఇక లోకమునందలి సామాన్య రాజుల విషయమున నీకు అనుమానము అనవసరము. 11

శ్రీశుక ఉవాచ

శ్లో॥ నిశమ్య భగవద్గీతం ప్రీతః ఫుల్లముఖాంబుజః ।
భ్రాతౄన్ దిగ్విజయే౽యుఙ్క్త విష్ణుతేజోప బృంహితాన్ ॥ 12

టీ:- నిశమ్యేతి. అయుఙ్క్త నియుక్తవాన్ విష్ణోస్తేజసా ఉపబృంహితాన్ సంవర్ధితాన్ విష్ణుతేజోపబృంహితానితి సంధిరార్షః. 12

శ్రీ శుకుడిట్లు చెప్పినాడు

అనే ఈ విధమైన కృష్ణుని ప్రోత్సాహరూపమైన మాటలువిని సంకోచములు వీడి ముఖము వికసించగా సంతసించిన ధర్మరాజు విష్ణుతేజస్సుతో ఉప్పొంగిన నలుగురు తమ్ములను నాలుగు దిక్కులయందు విజయమును సాధించుటకై దండయాత్రకు పంపినాడు. (12)

శ్లో॥ సహదేవం దక్షిణస్యామాదిశత్సహ సృంజయైః ।
దిశి ప్రతీచ్యాం నకులముదీచ్యాం సవ్యసాచినం ।
ప్రాచ్యాం వృకోదరం మత్స్యైః కేకయైస్సహ మద్రకైః ॥ 13

టీ:- సహదేవమితి. నకూలాదీనాం మత్స్యాదిభిస్సహాయైర్యథా సంఖ్యం సంబంధః. 13

దక్షిణ దిశలోనున్న సృంజయులతో యుద్ధము చేయుటకు సహదేవుని, పశ్చిమమున మత్స్యదేశముపై యుద్ధము చేయుటకు నకులుని, ఉత్తరమున కేకయాదులతో మార్కొనుటకు అర్జునుని తూర్పున మద్రదేశముపై దండయాత్రకు భీమసేనున్ని ధర్మరాజు ఆదేశించి పంపెను. 13

శ్లో॥ తేవిజిత్య నృపాన్ వీరానాజహ్రుర్దిగ్భ్య ఓజసా ।
అజాత శత్రవే భూరిద్రవిణం నృప యక్ష్యతే ॥ 14

టీ:- త ఇతి. కథంభూతా య యక్ష్యతే యాగం కరిష్యతే. 14

ధర్మరాజుని నలుగురు తమ్ములు నాలుగు దిక్కులందున్న వీరులైన రాజులను జయించి రాజసూయయాగము చేయు అజాతశత్రుడైన ధర్మరాజుకు దిక్కులనుండి అపారమైన సంపదలు తెచ్చినారు. 14

శ్లో॥ శ్రుత్వా జితం జరాసంధం నృపతేర్ధ్యాయతో హరిః ।
ఆహోపాయం తమేవాద్య ఉద్ధవోఽయమువాచహ ॥ 15

టీ:- శ్రుత్యేతి. ఆద్యో హరిః శ్రీ కృష్ణః. 15

కృష్ణుని ధ్యానించునట్టి ధర్మరాజుకు, జరాసంధుదుని మరణ వృత్తాంతము విన్న ఉద్ధవుడు ఆతని మరణమునకు సంబంధించిన ఉపాయమును ఈ విధముగా వర్ణించినాడు. 15

శ్లో॥ భీమసేనోఽర్జునః కృష్ణో బ్రహ్మలింగధరాస్తతః ।
జగ్ముర్గిరివ్రజంతాత బృహద్రథసుతో యతః ॥ 16

టీ:- భీమసేన ఇతి. బ్రహ్మలింగధరాః బ్రాహ్మణవేషధారిణః. యతః యత్ర బృహద్రథసుతో జరాసంధః. 16

ఓ నాయనా ధర్మరాజా! భీముడు, అర్జునుడు, కృష్ణుడు బ్రాహ్మణ వేషములను ధరించి బృహద్రథుని కొడుకైన జరాసంధుడున్న గిరివ్రజ పురమునకు వెళ్లిరి. 16

శ్లో॥ తం గత్వాతిథ్య వేళాయాం గృహేషు గృహమేధినం ।
బ్రహ్మణ్యం సమయాచంత రాజన్యా బ్రహ్మలింగ నః ॥ 17

టీ:- తమితి. గృహేషు వర్తమానం. సమయాచంత సమ్యక్ యాచితవంతః ప్రార్థయామాసురిత్యర్థః. 17

జరాసంధుడు తన ఇంటిలో అర్థులతో సంభాషించు సమయమున యజమానియైన ఆ చక్రవర్తిని బ్రాహ్మణులతో పాటుగా విప్ర వేశధారులైన వీరు ఈ విధముగా యాచించినారు. 17

శ్లో॥ రాజన్ విద్ధ్యతి థీనస్మానర్థినో దూరమాగతాన్ ।
తన్నః ప్రయచ్ఛ భద్రం తే యద్వయం కామయమహే ॥ 18

ఓ రాజా! చాలా దూరము నుండి నిన్ను యాచించుటకు వచ్చిన అతిథులము. మమ్ము గమనించి మేము కోరిన భిక్షను మాకు

టీ:- రాజన్నితి. నన్విదం కామయామాహ ఇతి విశేషో నిర్దిశ్యతాం అన్యథాయస్య పుత్రాదేర్వియోగో దుస్సహః. స కథం దేయః తథా రాజమండనం కిరీటాద్యదేయంయత్. తద్భిక్షుభ్యః కథం దేయం. తథాతి రమ్యం రత్నాభరణాదిపుత్రాదియోగ్యం కథం పరస్మై దేయమితి చేదత ఆహుః. 18

ప్రసాదించుము. దాని వలన నీకు శుభమగును. మేమడిగినదే ఇవ్వుమని విశేషించుటలో ఇది దానము చేయుటకు అవకాశములేదే అని అడుగుటకు వీలు లేకుండ - భార్యాపుత్రాదుల దానము భరించరానిది. కిరీటము మొదలైన రాజలాంఛనముల దానము చేయుటలో అధికారభంగము. పుత్రాదులకు అవసరమైన అమూల్య రత్నాభరణములు దానము చేయుటలో సంపద నాశనము మొదలైన చిక్కులున్నందు వలన ఇట్టి వానిని అర్థులకెట్లు దానము చేయగలమనే అవకాశము లేకుండునట్లుగా చెప్పుచున్నాడు. 18

శ్లో॥ కిందుర్మర్షం తితిక్షూణాం కిమకార్యమసాధుభిః ।
కిమదేయం వదాన్యానాం కఃపరస్సమదర్శినామ్ ॥ 19

టీ:- కిమితి. అత్ర దృష్టాంతత్వేనార్థాంతరమహుః - కిమకార్యమితి. యథా అసాధూనామకార్యం నాస్తి. తథా తితిక్షూణాం దుర్మర్షం దుస్సహం నాస్తి. వదాన్యానామత్యుదారాణాం అదేయం దాతుమయోగ్యం నాస్తి. సమదర్శినాం శత్రుమిత్రాదీన్ సమం పశ్యతాం. పరశ్చ నాస్తి. అతః కిం విశేషనిర్దేశేనేత్యర్థః. 19

ఈ విషయముననే ఇక్కడ దృష్టాంత పూర్వకముగా అర్థాంతర సమర్థనముతో విశదీకరించుచున్నాడు. సమదృష్టులకు చేయగూడని పని అనేది ఉండదు. తీవ్రమైన శీతోష్ణములను సహించగలవారికి ఓర్చుకొనలేనిది కానీ, భరించలేనిది కానీలేదు. మిక్కిలి ఉదారులు, దానవీరులు అయిన వారికి దానముచేయకూడనిది లేదు. శత్రువులను, మిత్రులను సమానముగ సంభావింపగల వారికి పరుడైన వాడు లేడు. కావున మేమడిగిన భిక్షనే ఇవ్వుమని విశేషించి చెప్పవలసిన అవసరము లేదని భావము. 19

శ్లో॥ యోనిత్యేన శరీరేణ సతాం గేయం యశోధ్రువమ్ ।
న చినోతి స్వయం కల్యస్సవాచ్యశ్శోచ్య ఏవ సః ॥ 20

టీ:- కించ. అర్థినే ధీరేణ ముద్గలాదివత్ ప్రాణా అపి న వంచనీయా ఇత్యాశయేనాహుః.- య ఇతి.న చినోతి న సంపాదయతి వాచ్యః నింద్యః. 20

శ్లో॥ హరిశ్చంద్రో రంతిదేవ ఉంఛవృత్తిశ్శిబిర్బలిః ।
వ్యాధఃకపోతో బహవో వ్యాధ్రువేణ ధ్రువంగతాః ॥ 21

టీ:- హరిశ్చంద్ర ఇతి. విశ్వామిత్రానృణ్యాయ హరిశ్చంద్రో భార్యాత్మజాది సర్వం విక్రియ స్వయం చండాలతాం ప్రాప్తోஉప్య నిర్విణ్ణః సహయోధ్యావాసిభిర్జనైః స్వర్గం గతః రంతిదేవస్సకుటుంబః అష్టాచత్వారింశదహాన్యలబ్ధోదకోஉపి కథం చిల్లబ్ధాన్నోదకాద్యర్థిభ్యో దత్వా బ్రహ్మలోకం గతః. ఉంఛవృత్తిర్ముద్గలః షణ్మాసంసీదత్కుటుంబో ఉప్యాతిథ్యదా నేన బ్రహ్మలోకంగతః. శిబిః శరణాగత కపోతరక్షణాయ స్వమాంసం శ్యేనాయ దత్వా దివం గతఃబలిః సర్వస్వం బ్రాహ్మణ వేషధారిణే వామనాయ హరయే దత్వా తమే వాత్మసాచ్చకార.

అర్థులకు ధీరులై గుదిబండలవంటి శరీరమునందలి ప్రాణముల నైనను దానము చేయవలెగాని వారిని వట్టిచేతులతో నిరుత్సాహ పరచకూడదనే ఆశయముతో తెల్పుచున్నాడు. స్వయముగా నేర్పరియై అభీష్టదానముతో అర్థులను సంతోషపెట్టినవాడు జరామరణములులేని శాశ్వతమైన కీర్తి కాయముతో నిశ్చయముగా సత్పురుషుల స్తోత్ర గానములకు పాత్రుడగును. లేనిచో ఆతని జన్మము నింద్యమై నిరర్థకమగును. 20

హరిశ్చంద్రుడు, రంతీదేవుడు, ముద్గలుడు, శిబి, బలి, వ్యాధుడు, కపోతము మొదలైన పెక్కురు అశాశ్వతమైన శరీర త్యాగముతో శాశ్వతమైన కీర్తి శరీరమును పొందినారు.విశ్వామిత్రుని అప్పుతీర్చుటకై షట్చక్రవర్తులలో ఒకడైన హరిశ్చంద్రుడు తనను భార్యతో పాటుగా సర్వస్వమును విక్రయించి కాటికాపరి తనమును స్వీకరించి కూడా ఖిన్నుడు కాక, తన అయోధ్యా వాసులందరితో కూడి స్వర్గమును పొందినాడు. రంతిదేవుడు తన భార్య పిల్లలతో నలుబది ఎనిమిది దినములు నీటిని కూడా పొందలేక ఎట్లో దైవవశమున దొరికిన అన్నమును, నీటిని అతిథులకిచ్చి బ్రహ్మ లోకమునకు వెళ్లినాడు. అడవిలో శిలలపై ఎండి రాలిపడిన ధాన్యపు గింజలతో ఆరు మాసములు కుటుంబభారమును మోయుచుండియు అతిథులకు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

కపోతశ్చాతిథయే వ్యాధాయ కపోత్యా సహాత్మమాంసం దత్వా విమానేన దివంగతః. వ్యాధస్తయోః సత్యం వీక్ష్య స్వయమతినిర్విణ్ణో మహాప్రస్థానే వనాగ్నినిర్దగ్ధదేహో నిష్కల్మషో దివమారురోహ. –ఏవమన్యే చ బహవో హ్యధ్రువేణ శరీరేణధ్రువం లోకం గతా ఇతి. 21

ఆహారమును దానము చేయుటతో ముద్గలుడు బ్రహ్మ లోక స్థితిని పొందినాడు. శిబి చక్రవర్తి శరణు వేడిన పావురమును రక్షించుటకై గ్రద్ద కొరకు తన శరీర మాంసమును కోసి ఇచ్చి స్వర్గమునకు వెళ్లినాడు. బలి చక్రవర్తి కపట బ్రాహ్మణ వేషధారియైన వామన రూపుడైన శ్రీహరికి తన సర్వస్వమును సమర్పించి అతనినే తన ఆత్మగా పొందినాడు. అతిథిగా వచ్చిన వ్యాధునికొరకై పావురములజంట తమ మాంసమును సమర్పించి దివ్య విమానములో స్వర్గమునకు వెళ్లినవి. కిరాతకుడు కూడా పావురముల సత్యశీలతను గమనించి స్వయముగా విరక్తిని పొంది జీవయాత్రను చాలించి ఆ అగ్నిలో దగ్ధుడై స్వర్గమునకు వెళ్లినాడు. ఈ విధముగా అనేకులు అశాశ్వతమైన శరీరమును త్యాగముచేసి శాశ్వత బ్రహ్మ పదమును పొందిరి. 21

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ స్వరైరాకృతిభిస్తైస్తాన్ ప్రకోష్ఠైర్జ్యాహతైరపి ।
రాజన్య బంధూన్ విజ్ఞాయ దృష్టపూర్వానచింతయత్ ॥ 22

### శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు

జరాసంధుడు అతిథులై యాచనకు విచ్చేసిన కృష్ణ, భీమార్జునుల ఆకారమును, కంఠధ్వనిని, వారికి గల వింటినారి తాకిడుల వలన కాయలుగాచిన ముంజేతులను బట్టి వారు క్షత్రియులు అనే విషయమును గ్రహించి వారిని తానెక్కడో ఇంతకు ముందు ద్రౌపదీ స్వయంవరమునందు – చూచినట్లున్నదని ఆలోచించినాడు. 22

శ్లో॥ రాజన్య బంధవో హ్యేతే బ్రహ్మలింగాని బిభ్రతి ।
దదామి కామితం తేభ్య ఆత్మానమపి దుస్త్యజమ్ ॥ 23

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- స్వైరైరితి. జాహత్రైర్జ్యాఘాతకిణాంకితైః. దృష్టపూర్వాన్ ద్రౌపదీ స్వయంవరాదిషు. (22-23)

శ్లో॥ బలేర్ను శ్రూయతే కీర్తిర్వితతా దిక్ష్వ కల్మషా ।
ఐశ్వర్యాద్భ్రంశితస్యాపి విప్రవ్యాజేన విష్ణునా ॥ 24

టీ:- బలేరితి. ఇంద్రస్య శ్రియం జిహీర్షతా విప్రవ్యాజేన విష్ణునా. భ్రంశితస్యాపి బలేః శ్రూయతే ను అహో న శ్రూయత ఇతిపాఠే న శ్రూయతే కిం. అపితు శ్రూయత ఏవేతి. 24

శ్లో॥ శ్రియం జిహీర్షతేంద్రస్య విష్ణవే ద్విజరూపిణే ।
జానన్నపి మహీం ప్రాదాద్వార్య మాణోऽపిదైత్యరాట్ ॥ 25

టీ:- శ్రియమితి. తం శ్లాఘతే విష్ణవ ఇతి. శుక్రేణ వార్యమాణోऽపి. అత ఏవ విష్ణురితి జానన్నపి. 25

బ్రాహ్మణ వేషమును ధరించి వచ్చిన క్షత్రియులు వీరని నిశ్చయించుకొని, అసాధ్యమైన ప్రాణత్యాగమునకైనను వేనుదీయక వీరికోర్కెను నెరవేర్చెదను. 23

ఇంద్రునికి సంపదను కట్టబెట్టుటకై బ్రాహ్మణ రూపధారియైన విష్ణువు బలిరాజ్య సర్వస్వమును అపహరించినప్పటికి దిక్కులయందు ఆయన కీర్తి విస్తరించియేయున్నది. 24

అసుర గురువైన శుక్రాచార్యుడు - వచ్చినవాడు బ్రాహ్మణ వామనుడు కాదు. శ్రీ మహావిష్ణువు. నీ దానము సర్వనాశన కరమగునని వలదనుచున్నను గణించక దైత్యరాజు బలి చక్రవర్తి మూడడుగుల నేలను దానము చేసినాడు. 25

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ జీవతా(బ్రాహ్మణార్థాయకోన్వర్థః క్షత్రబంధునా ।
దేహేన పతమానేన నేహతా విపులం యశః ॥ 26

టీ:- జీవతేతి. పతమానేన పతతా. క్షత్రబంధునా దేహేన. బ్రాహ్మణార్థాయవిపులం యశః. నేహతా నేహనూనేన అసంపాదయతా కోనుఅర్థఃనకోఽపీత్యర్థః. 26

శ్లో॥ ఇత్యుదారమతిః ప్రాహ కృష్ణార్జున వృకోదరాన్ ।
హే విప్రాః ప్రియతాం కామో దాస్యామ్యాత్మ శిరోఽపివః॥ 27

భగవాన్ ఉవాచ

శ్లో॥ యుద్ధం నో దేహి రాజేంద్ర ద్వంద్వం త్వం యదిమన్యసే ।
యుద్ధార్థినో వయం ప్రాప్తా రాజన్యా నాన్య కాంక్షిణః ॥ 28

టీ:- ఇతీతి. ఇత్యేవం నిశ్చిత్యాహ.- హే విప్రా ఇతి. (27-28)

శ్లో॥ అసౌవృకోదరః పార్థస్తస్యభ్రాతాఽర్జునోహ్యయం ।
అనయోర్మాతులేయం మాం కృష్ణంజానీహి తేరిపుమ్ ॥ 29

బ్రాహ్మణకార్య నిర్వహణకు వినియోగించి శాశ్వతమైన అపారమైన కీర్తిని పొందుటకు కాక అనిత్యమై పడి పోవునట్టి రాజుల యొక్క శరీరము వలన ఫలమేమున్నది. 26

అని ఈ విధమైన ఉదార బుద్ధితో జరాసంధ చక్రవర్తి కృష్ణుడు అర్జునుడు భీమసేనులతో ఓ విప్రులారా! మీ కోరిక తెలుపుడు, దానిని నెరవేర్చుటకై నా తలను కూడ ధారపోయుదును అని అన్నాడు. 27

భగవంతుడిట్లు చెప్పినాడు

అప్పుడు కృష్ణుడతనితో ఓరాజా! నీకు అంగీకారమైనచో మాకు ద్వందయుద్ధ భిక్షను ప్రసాదించుము. మేము క్షత్రియులము. వేరే దానిని ఇష్టపడక యుద్ధమును కోరి వచ్చితిమి. 28

ఇతడు భీముడు. ఇతని తమ్ముడు అర్జునుడితడు. వీరి మేనమామ కొడుకైన కృష్ణుడను నేను. మేము నీ శత్రువులని తెలియుము. 29

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఏవమావేదితో రాజా జహాసోచ్చైస్స్మ మాగధః ।
ఆహచామర్షితో మందాః యుద్ధం తర్హి దదామివః ॥ 30

టీ:- రాజన్యతా మేవ ప్రపంచయతి.- అసావితి.(29-30)

ఈ విధముగా కృష్ణుడు చెప్పిన మాటలు విని మగధ చక్రవర్తియైన జరాసంధుడు బిగ్గరగా నవ్వి ఓ మూర్ఖులారా! మీపై నాకు కోపములేదు. అయినను మీరు కోరిన విధముగా యుద్ధమునకు అంగీకరించితిని. 30

శ్లో॥ నత్వయా భీరుణా యోత్స్యే యుధి విక్లబచేతసా ।
మధురాం స్వపురీం త్యక్త్వా సముద్రం శరణం గతః ॥ 31

టీ:- నేతి.యతస్త్వం మద్భయాత్ సముద్రం శరణం గత ఇతి. 31

జరాసంధుడు కృష్ణునితో నాకు భయపడి పిరికితనముతో నీ అభిజనమైన మధురను వీడి సముద్రమును ఆశ్రయించిన నీ వంటి భీరునితో మాత్రము యుద్ధము చేయను అన్నాడు. 31

శ్లో॥ అయం తు వయసాతుల్యో నాతిసత్త్వో న మేసమః ।
అర్జునో నో భవేద్యోద్ధా భీమస్తుల్య బలోమమ ॥ 32

టీ:- అయమితి. వయసాప్యతుల్యః. నాతిసత్త్వః అనతిబలశ్చ న చ దేహేన మయా సమః. అతోఽర్జునో యోద్ధా న భవేత్. భీమస్తు భవేత్ యతో మమ తుల్యబల ఇతి. 32

ఈ అర్జునుడు వయస్సున నాకంటే చిన్నవాడు. తగినంత బలములేని వాడైనందున ద్వంద్వ యుద్ధమున నాకు సమానమే కాదు. అందువలన ఇతనితో యుద్ధము చేయను. నాతో సమానమైన బలముకల భీముడే నాతో యుద్ధమున ప్రతియోధునిగా సరిపోవును. 32

శ్లో॥ ఇత్యుక్త్వా భీమసేనాయ ప్రాదాయ మహతీం గదామ్ ।
ద్వితీయాం స్వయ మాదాయ నిర్జగామ పురాద్బహిః ॥ 33

టీ:- ఇతీతి.ప్రాదాయ దత్వేత్యర్థః. 33

అని చెప్పి భీమసేనునికి ఒక గొప్ప గదను ఇచ్చి మరొక గదను తాను స్వీకరించి యుద్ధమునకై నగరము వెలుపలి ప్రదేశమునకు వచ్చినాడు. 33

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తతస్సమేఖలే వీరౌ సంయుక్తా వితరేతరమ్ ।
జఘ్నతుర్వజ్ర కల్పాభ్యాం గదాభ్యాం రణ దుర్మదౌ ॥ 34

టీ:- తత ఇతి. సమే ఖలే యుద్ధాంగణే. 34

పిమ్మట ద్వంద్వయుద్ధమున వీరులు, యుద్ధవిశారదులు అయిన భీమజరాసంధులు జట్టీలను ధరించి పరస్పరము వజ్రాయుధముల వంటి గదలతో కొట్టుకొనిరి. 34

శ్లో॥ మండలాని విచిత్రాణి సవ్యం దక్షిణమేవ చ ।
చరతో శ్శుశుభే యుద్ధం నటయోరివ రంగిణోః ॥ 35

టీ:- మండలానీతి. మండలాని గదా యుద్ధగతిభేదాన్ సవ్యం దక్షిణం చయథాతథా రంగిణోః రంగగతయోః నటయోరివేతి నిర్భయత్వే ఉపమా. 35

శ్లో॥ తతశ్చటచటాశబ్దో వజ్రనిష్పేష సన్నిభః ।
గదయోః క్షిప్తయో రాజన్ దంతయోరిపదంతినోః ॥ 36

టీ:- తత ఇతి. చటచటేతి గదయోః పరస్పరాఘాతశబ్దానుకరణం వజ్రస్య నిష్పేషః పాతః తత్సదృశః. యుధ్యమానయోర్దంతినోర్దంతాఘాత శబ్ద ఇవశుశుభే. 36

ఓ రాజా ! చిత్రవిచిత్రముగా కుడి ఎడమలకు గుండ్రముగా తిరుగుచూ నాటక రంగముపై నిర్భయముగా నటించు నటులవలె, రెండు మదపుటేనుగులు పోటీపడి పోరాడుచుండగా వాని దంతముల రాపిడుల చటచటధ్వనులు పిడుగులు రాలినట్లుగా భీమజరాసంధుల యుద్ధము శోభిల్లినది. (35-36)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తేవై గదే భుజబలేన నిపత్యమానే
అన్యోన్యతోఽంసకటి పాదకరోరుజత్రూన్ ।
చూర్ణీ బభూవతురుపేత్య యథార్కశాఖే
సంయుధ్యతోర్ద్విరదయోరివ దీప్తమన్వ్యోః ॥ 37

టీ:- తేఇతి. అంసకట్యాదీనుపేత్య. దీప్తోమన్యుర్యయోస్త యోర్ద్వి రదయోర్గజయోః అర్క శాఖాభ్యాం యుధ్యతోః యుద్యమానయోః తే యథా చూర్ణీభవతస్తద్వత్. 37

వారిరువురు గదతో భుజబలముతో పరస్పరము ఇనుమడించిన క్రోధముతో భుజములపై భాగములు, నడుము, పాదములు, చేతులు, తొడలు, భుజవలయపుటెముకలు మొదలగు వానిపై మోదుకొనుచూ రెండు మదపుటేనుగులు తొండములతో జిల్లేడు కొమ్మలను విరచి పట్టుకొని పోరాడినపుడు చూర్ణమగునట్లుగా కొట్టుకొనిరి. 37

శ్లో॥ ఇత్థం తయోః ప్రహతయోర్గదయోర్నృవీరౌ
క్రుద్ధౌ స్వముష్టిభిరయస్సదృశైరపిష్టాం ।
శబ్దస్తయోః ప్రహరతో రిభయోరివాసీ
న్నిర్ఘాత వజ్ర పరుషస్తల తాడనోత్థః ॥ 38

టీ:- ఇత్థమితి. అపిష్టాం చూర్ణీచక్రతుః. 38

ఈ విధముగా భీమజరాసంధులు కోపముతో పరస్పరము గదలతో మోదుకొని అన్యోన్యము గెలువవలెనని పోరాడు ఏనుగుల వలె ఇనుప ముద్దలవంటి పిడికిలి పోట్లతో శరీరమును పిండిపిండి చేసుకొనిరి. వారి ముష్టిఘాతముల ధ్వని వజ్రాయుధముల అంచుల ఒరిపిడి శబ్దముల వలె ఉన్నది. 38

శ్లో॥ తయోరేవం ప్రహరతో స్సమశిక్షా బలౌజసోః ।
నిర్విశేష మభూద్యుద్ధమక్షీణ బలయోర్నృప ॥ 39

ఓ రాజా! ఈ విధముగా సమానముగా గదాయుద్ధమందలి శిక్షణ, పటిమ, బలము గలవారిరువురు పరస్పరము కొట్టుకొనుచు ఇంచుకంతయు సడలని శక్తితో భయంకరముగా పోరాడిరి. 39

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ శత్రోర్జన్మమృతీ విద్వాన్ జీవితం చ జరాకృతమ్ ।
పార్థమాప్యాయయన్ స్వేన తేజసా చింతయద్ధరిః ॥ 40

టీ:- తయోరితి. శిక్షా అభ్యాసః బలం సత్త్వం ఓజః ప్రభావః. సమాని తాని యయోస్తయోః. శత్రోరితి. జన్మశకలరూపం. మృతిః పునః శకలీభావః. ఏతే విద్వాన్ జరా నామ కాచిద్రాక్షసీ.తత్కృతం జీవితం అచింతయత్ కథమసౌ శకలీభవేదితి. (39-40)

శ్లో॥ సంచింత్యారివధోపాయం భీమస్యామోఘ దర్శనః ।
దర్శయా మాస విటపం పాటయన్నివ సంజ్ఞయా ॥ 41

టీ:- సచింత్యేతి. విటపం శాఖాం కరేణ విటపం గృహీత్వా హరిర్భీమస్య యథా అహం విటపం పాటయామి. తథా త్వమేనం విపాటయేతి. సంజ్ఞయా సంకేతేన అరివధోపాయం దర్శయామాసేత్యర్థః .(41-43)

శత్రువైన జరాసంధుని పుట్టుక నిలువుగా రెండు సమానమైన ముక్కల వలన జరిగినందువలన జర అనే రాక్షసి ఆ రెండు భాగములను సంధానం చేసినందువలన ప్రాణము పొందుటచే అతడు మరలా రెండు శకలములుగా చేసిననేగాని మరణించడనే విషయమును తన ప్రభావముచేత గమనించిన శ్రీకృష్ణుడు జరాసంధుని మరణ విషయమై కలత చెందుచున్న పార్థునికి (అర్జునునికి) తన ఆలోచన వివరించి సమాధాన పరిచినాడు. 40

శత్రువధకు ఉపాయము ఆలోచించి భీముడు చూచుచుండగా వ్యర్థముకాని దర్శన శక్తిగల శ్రీకృష్ణుడు ఒక చెట్టుకొమ్మను విరిచి దానిని నిలువుగా రెండు భాగములుగా చీల్చి ఆ భాగములను కుడి ఎడమలకు వ్యత్యస్తమగునట్లుగా పడవేయుటను అభినయించి చూపినాడు. తనేవిధముగా నిలువుగా చీల్చిన చెట్టుకొమ్మ భాగమును కుడిని ఎడమకు, ఎడమది కుడికి విసిరివేసినట్లుగా భీముడు కూడ జరాసంధుని శరీరమును నిలువుగా రెండు భాగములుగా చీల్చి కుడి ఎడమలకు వ్యతిరేకముగా పడవేయుమని సంకేతముతో జరాసంధుని వధించు ఉపాయమును చూపెట్టినాడని భావము. 41

శ్లో॥ త్వదిజ్ఞాయ మహాసత్త్వో భీమః ప్రహరతాంవరః ।
గృహీత్వా పాదయోశ్శత్రుం పాతయామాస భూతలే ॥ 42

ఆ విషయమును గమనించిన భీమసేనుడు జరాసంధుని పాదములు పట్టుకొని నిలువుగా చీల్చి ఆ భాగములను కుడి ఎడమలకు వ్యతిరేకముగా భూమిపై పడవేసినాడు. 42

శ్లో॥ ఏకంపాదం పదాక్రమ్య దోర్భ్యామన్యం ప్రగృహ్య సః ।
గుదతః పాటయామాసశాఖామివ మహాగజః ॥ 43

ఒక పాదమును తనకాలుతో తొక్కి పట్టి జరాసంధుని మరొక కాలును చేతులతో ఎత్తి పట్టి ఏనుగు చెట్టుకొమ్మను చీల్చిన విధముగా గుద భాగము నుండి తల వరకు రెండు భాగములుగా చీల్చినాడు. 43

శ్లో॥ ఏకపాదోరువృషణ కటి పృష్ఠస్తనాంసకే ।
ఏకబాహ్వక్షి భ్రూకర్ణే శకలే దదృశుః ప్రజాః ॥ 44

చీల్చిన ఒక్కొక్క భాగమున కుడి ఎడమ భేదముతో ఒక్కొక్క కాలు, తొడ, వృషణము, నడుము, వీపు, రొమ్ము, భుజము, చేయి, కన్ను, కనుబొమ్మ, చెవి వుండునట్లుగా రెండు ముక్కలైన జరాసంధుని శరీరభాగములను ప్రజలు చూచినారు. 44

శ్లో॥ హాహాకారోమహానాసీన్నిహతే మగధేశ్వరే ।
పూజయామాసతుర్భీమం పరిరభ్య జయాచ్యుతౌ ॥ 45

జరాసంధుని మరణమును చూచి ప్రజలు భీతితో పెద్దగా హాహాకారము చేసినారు. కృష్ణార్జునులు ఆనందముతో భీముని కౌగిలించుకొని పూజించినారు. 45

టీ:- ఏకేతి. ఏకైకః పాదాదిః యయోస్తే శకలే. (44-45)

శ్లో॥ సహదేవం తత్తనయం భగవాన్భూతభావనః ।
అభ్యషించదమేయాత్మ మగధానాం పతిం ప్రభుః ।
మోక్షయామాస రాజన్యాన్ సంరుద్ధాన్ మాగధేన సః ॥ 46

టీ:- దుర్వృత్తత్వాదసౌ హతః న రాజ్యాభిలాషేణేతి దర్శయన్నాహ. - సహదేవమితి. 46

శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, ద్విసప్తతితమోఽధ్యాయః

పిమ్మట కరుణామయుడు సమదృష్టి కలిగిన భగవంతుడు శ్రీకృష్ణుడు తాము జరాసంధుని అతని దుర్మార్గమును బట్టి వధించితిమే కాని రాజ్యకాంక్షవలన కాదనే విషయమును తెలియజేయుటకై జరాసంధుని పుత్రుడు సహదేవుని మగధ రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసి, జరాసంధుడు బంధించిన రాజులందరికి విముక్తిని కలిగించాడు. 46

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
డెబ్బదిరెండవ అధ్యాయముసమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## త్రిసప్తతితమో౽ధ్యాయః

శ్లో॥ తతస్త్రి సప్తతితమే మోచయిత్వానృపాన్ హరిః ।
రాజార్హభోగైస్స్వాన్ దేశాన్ ప్రస్థాప్య పునరాగమత్ ॥
అత్యున్నద్ధ జరాసంధవధాత్తద్రుద్ధ భూపతీన్ ।
విమోక్ష కృపయా కృష్ణో నిజరూపమదర్శయత్ ॥

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఆయుతేద్వేశతాన్యష్టౌ లీలయా యుధినిర్జితాః ।
తే నిర్గతాగిరిద్రోణ్యాం మలినామలవాససః ॥ 1

టీ:- అయుతేతి. యే నిర్జితాః జరాసంధేన. నిరుద్ధాశ్చ గిరిద్రోణ్యాం. తే తతో నిర్గతాస్సంతో ఘనశ్యామం దదృశురిత్యుత్తరేణాన్వయః. 1

శ్లో ॥ క్షుత్క్షామాశ్శుష్క వదనాస్సంరోధ పరికర్శితాః ।
దదృశుస్తేఘనశ్యామం పీతకౌశేయ వాససమ్ ॥ 2

శ్లో॥ శ్రీవత్సాంకం చతుర్బాహుం పద్మపత్రాయతేక్షణం ।
చారుప్రసన్నవదనం స్ఫురన్మకరకుండలమ్ ॥ 3

## 73 వ అధ్యాయము

డెబ్బది మూడవ అధ్యాయమున మిక్కిలి ఉద్ధతుడైన జరాసంధుడు బంధించిన రాజులను కరుణామయుడై శ్రీకృష్ణుడు బంధవిముక్తులను చేసి వారివారి రాజ్యములందు మరల పునః ప్రతిష్ఠించి తన స్వరూపమును దర్శింపజేసి మరలి వచ్చినది విషయము.

శ్రీ శుకమహర్షి ఇట్లు చెప్పినాడు

జరాసంధుడు ఇరువదివేల ఎనమిదివందల మంది రాజులను అవలీలగా జయించి గిరివ్రజము నందలి కొండలోయలలో బంధించి ఉంచినాడు. జరాసంధుని మరణానంతరము మాసిన బట్టలతో, ఆకలివల్ల శుష్కించిన శరీరములతో, వాడిన ముఖములతో, చెరలో శత్రువుల వల్ల పెక్కు బాధలను పొందిన వారందరూ లోయల్లో నుండి బయటకు వచ్చి శ్రీకృష్ణుని సందర్శించినారు. (1-2)

వర్షాకాలమునాటి నీలి మబ్బులవలె నల్లని శరీరకాంతులతో, పీతాంబరమును, శ్రీవత్సమణిని ధరించినవాడు, నాలుగు భుజములు,

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ పద్మహస్తం గదాశంఖరథాంగైరుపలక్షితం ।
కిరీట హారకటకకటి సూత్రాంగదాన్వితమ్ ॥ 4

టీ:- క్షుదితి. క్షధా క్షామాః కృశాః సంరోధేన పరికర్శితాః క్లేశితాః. (2-4)

శ్లో॥ భ్రాజద్వరమణిగ్రీవం వీతంచ వనమాలయా ।
పిబంత ఇవ చక్షుర్భ్యాం ఆహంత ఇవ జిహ్వయా ॥ 5

టీ:- భ్రాజదితి. భ్రాజాన్ భ్రాజమానో వరమణిః కౌస్తుభో యయా సా. గ్రీవాయస్య తం వీతం కంఠలంబితాయా వ్యాప్తం. పిబంత ఇవేత్యాదీనాం హరేః పాదయోః ప్రణేమురిత్యుత్తరేణాన్వయః. 5

శ్లో॥ జిఘ్రంత ఇవ నాసాభ్యాం రంభంత ఇవ బాహునా ।
ప్రణేమూర్ధ్వతపాప్మానో మూర్ధభిః పాదయోర్హరేః ॥ 6

టీ:- జిఘ్రంత ఇతి. రంభంతః పరిరంభమాణా ఇవ. 6

పద్మదళముల వంటి విశాలమైన కన్నులు, మనోహరమైన ప్రసన్న ముఖముతో ఒప్పి, ప్రకాశించే మణికుండలములు, చేతులకు కడియములు, మొలతాడు, భుజకీర్తులు, మెడపై ప్రకాశించే కౌస్తుభమణి, చేతి యందు పద్మము, గద, శంఖము, చక్రము, కిరీటము, మణిహారములు, కంఠమున తులసీదళాల దండలతో విరాజిల్లు శ్రీకృష్ణుని యొక్క స్వరూపమును కన్నులతో త్రాగునట్లుగా, నాలుకతో ఆస్వాదించునట్లుగా, ముక్కుతో వాసన చూచునట్లుగా, భుజములతో కౌగిలించినట్లుగా, సర్వ పాపములు నశించినవారై ఆయన పాదాలకు తమ తలలు వంచి నమస్కరించిరి. శ్రీకృష్ణుని అద్భుత దర్శనము వలన వారి సర్వేంద్రియములు పరితృప్తిని పొందినవని భావము. (3-6)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ కృష్ణ సందర్శనాహ్లాద ధ్వస్త సంరోధనక్లమాః ।
ప్రశశంసుర్హృషీకేశం గీర్భిః ప్రాంజలయో నృపాః ॥ 7

టీ:- కృష్ణేతి. శ్రీకృష్ణసందర్శనాహ్లాదేన ధ్వస్తః సంరోధనక్లమో యేషాంతే. 7

శ్రీకృష్ణుని దివ్య స్వరూపమును దర్శించినందు వల్ల జరాసంధుని చెరలో మ్రగ్గిన దుఃఖమును విస్మరించి ఆరాజులందరు చేతులుజోడించి ఇంద్రియాదినాథుడైన శ్రీకృష్ణుని ఈ విధముగా స్తుతించినారు. 7

రాజాన ఊచుః

శ్లో॥ నమస్తే దేవదేవేశ ప్రపన్నార్తిహరావ్యయ ।
ప్రపన్నాన్ పాహినః కృష్ణ నిర్విణ్ణాన్ ఘోరసంసృతేః ॥ 8

టీ:- నమ ఇతి. సంరోధాద్రక్షితానస్మాన్. ఘోరాయాస్సంసృతేరపా పాహి విమోచయ. 8

రాజులు ఈ విధముగా పలికినారు

దేవదేవేశా! ఆపన్నుల బాధలను తొలగించువాడా, అవ్యయా నీకు నమస్కారము. జరాసంధుని చెరనుండి రక్షించిన మమ్ములను మరల భయంకరమైన సంసారమున సంకటములను అనుభవించని విధముగా ఉద్ధరింపుము. 8

శ్లో॥ నైనం నాథాన్వసూయామో మాగధం మధుసూదన ।
అనుగ్రహో యద్భవతో రాజ్ఞాం రాజ్యచ్యుతి ర్విభో ॥ 9

టీ:- నను భవంతో జరాసంధాసూయావిష్టాః. ఇహాముత్ర భోగాసక్తాశ్చ. కథం సంసృతేర్మోచనీయా ఇత్యాశంక్య. సంప్రతి న వయం తథాభూతా ఇత్యాహురష్టభిః - నేతి. హేనాథ వయం ఏనం. నాన్వసూయామః ఆముం దోషదృష్ట్యా న పశ్యామః కుత ఇత్యత ఆహుః అనుగ్రహ ఇతి యద్యస్మాత్. 9

జరాసంధునిపట్ల అసూయతో ఇహపరభోగములపట్ల ఆసక్తి కలిగిన మిమ్ము సంసారబంధమునుండి ఎట్లు తొలగించవలెనను సందేహ నివృత్తికై చెప్పుచున్నాడు. ఆ రాజులు శ్రీకృష్ణునితో ప్రస్తుతము మా మనస్సు మారినది. మేమిపుడు రాజ్యభోగముపట్ల ఆసక్తులము కాదు. మమ్ము బంధించి బాధలకు గురిచేసిన జరాసంధునిపై మాకు ఆవంతయు అసూయలేదు. అతనిని ఇష్టపడు మేము దోషిగా పరిగణించుటలేదు. విశేషముగా ఓ స్వామీ! మాకు రాజ్యభ్రష్టత, బంధనములు కలుగుట కేవలము మీ అనుగ్రహమే అని మేము గ్రహించితిమి. 9

శ్లో॥ రాజ్యైశ్వర్యమదన్నద్ధో నశ్రేయో విదంతే నృపః ।
త్వన్మాయామోహితో నిత్యామన్యతే సంపదోఽచలాః ॥ 10

టీ:- ఏతదేవ వ్యతిరేకేణోపపాదయంతి. రాజ్యేతి. రాజ్యైశ్వర్యాభ్యాం మదస్తేన ఉన్నద్ధ ఉచ్ఛృంఖలః. నిత్యాః అచలాశ్చ సంపదో మన్యతే. యద్వా. అనిత్యాస్సతీః అచలాః శాశ్వతీర్మన్యతే. 10

ఈ విషయముననే వ్యతిరేక విధానముతో ప్రతిపాదించుచున్నారు. రాజ్యము, ఐశ్వర్యము వలన మదము వృద్ధి పొందును. దాని వల్ల రాజునకు శ్రేయస్సు కలదు. ఆ రాజ్యభోగముల మాయలందు పడి అనిత్యములైన సంపదలను నిత్యములని భ్రాంతి పడుదురు అంటు చెరను వీడిన రాజులు తమకు భోగముల పట్ల వ్యామోహము లేదని నిషేధరూపమున స్పష్టముగా చెప్పుచున్నారు. రాజ్య భోగముల వలన అడ్డులేని తనము వృద్ధి పొందును. నిత్యము సంపదలు చంచలము అని మాకు అవగతమైనది. లేక సంపదలు అనిత్యములైనను జనులు వానిని నిత్యములని భావింతురు. కనుక ఓ స్వామీ! మీకు మాపై దయ కలిగినచో మాకీ రాజ్యభార దుఃఖమును తొలగించమని భావము. 10

శ్లో॥ మృగతృష్ణాం యథాబాలా మన్యంత ఉదకాశయం ।
ఏవం వైకారికీం మాయామయుక్తా వస్తుచక్షతే ॥ 11

టీ:- కించ. అవస్తు వస్తుతయా పశ్యంతీత్యాహుః - మృగతృష్ణామితి. వైకారికీం శబ్దాది వికారాపన్నాం అయుక్తాః అవివేకినః. 11

వాస్తవముగా వస్తువు కాని దానిని లోకులు వస్తువుగా దర్శించుచున్నారని చెప్పుచున్నాడు. ఎండమావులందు బాలురు జలాశయమని భ్రాంతితో అవస్తువును వస్తువుగా దర్శించినట్లు అవివేకులు శబ్ద స్పర్శాది పంచ తన్మాత్రలయందు అనగా పంచేంద్రియ లాలసతో మాయను వస్తువని భ్రాంతిని పొందుచున్నారు. వాస్తవముగ సుఖము కాని దానిని సుఖమని భ్రాంతిని చెందుచున్నారని భావము. 11

శ్లో॥ వయంపురా శ్రీమదనష్టబుద్ధయో
జిగీషయా స్యా ఇతరేతరస్పృధః ।
ఘ్నంతః ప్రజాస్స్వా అతి నిర్ఘృణాః ప్రభో
మృత్యుం పురస్త్వాऽవిగణయ్య దుర్మదాః ॥ 12

టీ:- రాజ్యస్య యోగవియోగ యోరనర్థావహత్వమస్మాస్వేవ దృష్టమిత్యాశయేనాహుర్ద్వాభ్యాం వయమితి. శ్రీమదేన నష్టా బుద్ధిర్యేషాం తే. అస్యాః పృథివ్యాః ఇతరేతరస్పృధః పరస్పరం స్పర్ధమానః. పురః పురతః త్వాం త్వాం మృత్యుమవిగణయ్య. 12

రాజ్యముండుట, పోవుటల వలన కలుగు అనర్థములకు మేమే సాక్షులమనే విషయము చెప్పుచున్నాడు. ఓ ప్రభూ మేము ఇంతకు ముందు సంపదల గర్వముతో బుద్ధిని కోల్పోయిన వారమై ఈ రాజ్యమును ఇంకను పెంచుకొనవలెనని దుర్మదముతో పోటిపడి దయలేక మా ప్రజలను చంపుకొంటిమి. ముందుముందు మృత్యువు కలుగగలదనే విషయమును గణించక విఱ్ఱవీగియుంటిమి. 12

శ్లో॥ త ఏవ కృష్ణాద్య గభీరరంహసా
దురంతవీర్యేణ విచాలితాః శ్రియః ।
కాలేన తన్వా భవతోऽను కంపయా
వినష్టదర్పాశ్చరణౌ స్మరామ తే ॥ 13

టీ:- త ఇతి. పురా యే దుర్మదా వయం. హే కృష్ణ, త ఏవ వయం అద్యవినష్టదర్పాస్తే చరణౌ స్మరామః స్మర్తుమాశాస్మహే. కథంభూతాః భవతః తన్వామూర్త్యా కాలేన శ్రియో విచాలితాః భ్రంశితాః. అతో రాజ్యచ్యుతిః భవదనుగ్రహ ఏవేత్యర్థః. 13

ఓ కృష్ణా ! ఆ విధముగా దుర్మదముతో ఉండిన మేమే ఇప్పుడు నీ అపారమైన వేగప్రతాపములుగల నీరూపమగు కాలముచేత సంపదలు కోల్పోయి, గర్వము సంపూర్ణముగా నశించిన వారమైనాము మాకు రాజభ్రష్టత మిషతో నీ పాదములసేవను ప్రసాదించుట కేవలము మీ అనుగ్రహమే. 13

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అథో న రాజ్యం మృగతృష్ణ రూపితం
దేహేన శశ్వత్పతతా రుజాంభువా ।
ఉపాసితవ్యం స్పృహయామహే విభో
క్రియా ఫలం ప్రేత్య చ కర్ణరోచనమ్ ॥ 14

టీ:- అథో ఇతి. అత ఏవ అథో అనంతరం మృగతృష్ణికయా రూపితం సదృశం. రాజ్యం శశ్వత్ ప్రతిక్షణం. పతతా క్షీయమాణేన తథా రుజాం రోగాణాం. భువా జన్మక్షేత్రేణ దేహేన ఉపాసితవ్యం సేవ్యం. న స్పృహయామహే ప్రేత్య పరలోకే చ క్రియాఫలం స్వర్గాదిభోజ్యం ఉపాసితవ్యం న స్పృహయామహే. కథంభూతం కర్ణయోః రోచనం రుచిజనకమాత్రం తత్ర గతస్యస్పర్ధాద్యనపగ మేన సుఖాభావాదిత్యర్థః. 14

శ్లో॥ తన్నస్త్వమాది శోపాయం యేవతే చరణాబ్జయోః ।
స్మృతిర్యథా న విరమేదపి సంసరతామిహ ॥ 15

శ్లో॥ కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే ।
ప్రణతః క్లేశనాశాయ గోవిందాయ నమోనమః ॥ 16

టీ:- యద్యేవంభూతా యూయం తర్హి మమ చరణౌ స్మరతః. తతః అనాయాసేన ముక్తిర్భవిష్యతీతి. కిం మదపేక్షయేతి చేదత అహుః - తదితి. త్వచ్చరణస్మృతిరపి త్వత్ప్రసాదఫలమే వేత్యర్థః.(15-16)

పిమ్మట ఎండమావులవంటి రాజ్యభోగములు, రోగాలకు నిలయమై ప్రతిక్షణము క్షీణించిపోవునట్టి ఈ శరీరముతో సేవించుటను మేము కోరుకొనము. వ్యక్తి తానుచేసిన సత్కర్మలవలన మరణానంతరము లభింపబోవు స్వర్గభోగములపట్ల కూడా మాకు కోరిక లేదు. సత్కర్మాచరణ, యజ్ఞయాగాదులవల్ల స్వర్గభోగాలు కలుగునన్న మాట చెవులకు ఇంపైనదే తప్ప వాస్తవము కాదు. పుణ్యఫలితముగా స్వర్గమునకు వెళ్ళుట, ఫలభోగానాంతరము పుణ్యము క్షీణించి అక్కడ నుండి పతితుడగుట వలన వానియందు సుఖాభావము తప్ప (సుఖములేక పోవుట తప్ప) వాస్తవసుఖము లేదని భావము. 14

మీరు భక్తులై నా పాదాల స్మరణ విడువని వారైనచో దాని వలన అనాయాసముగనే ముక్తి కలుగగలదు. ఇంకను మీకు నా ఆపేక్ష వలన ప్రత్యేకముగా ఉపయోగమేమి అనే దానికి సమాధానము చెప్పుచున్నారు. శ్రీకృష్ణా ! వాసుదేవా ! శ్రీహరీ ! పరమాత్మా ! భక్తుల క్లేశములను నాశముచేయువాడా ! గోవిందా ! నీకు నమస్కారము. ఓ ప్రభూ ! మాకు మీ పాద ధ్యానమున ఎల్లప్పుడు ఏమరుపాటు కలుగని ఉపాయమును ఆదేశించుడు అని రాజులు ప్రార్థించినారు. భగవదనుగ్రహములేనిది భగవంతునిపట్ల భక్తి జనించదని సారాంశము. (15-16)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ సంస్తూయమానో భగవాన్ రాజభిర్ముక్త బంధనైః ।
తానాహ కరుణస్తాత శరణ్యశ్శ్లక్ష్ణయా గిరా ॥ 17

టీ:- సంస్తూయమాన ఇతి. శ్లక్ష్ణయా మంజుళయా. 17

ఓ పరీక్షిన్మహారాజా ! జరాసంధుని చెరనుండి ముక్తులైన రాజులు ఈ విధముగా స్తుతించిగా శరణ్యుడైన శ్రీకృష్ణుడు కరుణాపూరితుడై మధుమైన వాక్కులతో వారికిట్లని చెప్పినాడు. 17

**శ్రీ కృష్ణ ఉవాచ**

శ్లో॥ అద్యప్రభృతివో భూపామయ్యాత్మన్యఖిలేశ్వరే ।
సుదృఢా జాయతే భక్తిర్బాఢమాశంసితం తథా ॥ 18

టీ:- అద్యేతి. యథా. భవద్భిరాశంసితం. తథాబాఢం. నిశ్చితం. వః మయి భక్తిర్జాయతే జాయతామిత్యర్థః. 18

**శ్రీకృష్ణుడు పలికెను**

ఓ రాజులారా ! ఇప్పటి నుండి మీరు కోరిన విధముగా సర్వేశ్వరున్నైన నాయందు మీకు మిక్కిలి నిర్మలమైన భక్తి నిశ్చయముగా కలుగును. 18

శ్లో॥ దిష్ట్యా వ్యవసితం భూపా భవంత ఋతభాషిణః ।
శ్రియైశ్వర్య మదోన్మాహం పశ్యేహ్యున్మాదకం నృణామ్ ॥ 19

టీ:- దిష్ట్యేతి. హే భూపాః మద్భజనమేవ కర్తవ్యమితి భవద్భిః వ్యవసితం సంకల్పితం దిష్ట్యా భద్రం భవద్భిరుక్తం చ సత్యమేవేత్యాహ భవంత ఇతి. శ్రీరైశ్వర్యం చ తాభ్యాం మదస్తేనోన్నాహం ఉన్నహనం ఉద్బంధనం. స్వైరచారమిత్యర్థః. పశ్యే పశ్యామి. 19

ఓ రాజులారా ! మీకు నన్ను సేవించుటయే అవశ్య కర్తవ్యమనే నిశ్చయ భావన మీ అదృష్టము వలన కలిగినది. మీ ఈ సంకల్పము శ్రేయోదాయకనమనే విషయము సత్యమని చెప్పుచున్నాడు. - సంపద, ఐశ్వర్య మదములచేత కట్టుబడిన అనగా స్వైరముగా సంచరించు మనుషుల ఉన్మాదస్థితి ( ధనగర్వ వ్యామోహ స్థితి ) చూచితిని. 19

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ హైమయో నహుషో వేనో రావణో నరకో పరే ।
శ్రీమదాద్భ్రం శీతాస్థానాద్దేవ దైత్యనరేశ్వరాః ॥ 20

టీ:- తదేవాహ - హైహయ ఇతి. హైహయః కార్తవీర్యః చక్రవర్తీ నరేశ్వరః పితుః కామధేనుహరణాత్ పరశురామేణ సపుత్రో హతః. నహుషో దేవేంద్రతాం ప్రాప్తః ఉన్మత్తశ్శచీసంగాయ బ్రాహ్మణాన్ శిబికాం వాహయాన్ తైరేవ తతో భ్రంశితః అజగరత్వమవాప. వేనో௨పి ఉన్మత్తో బ్రాహ్మణానధిక్షిపన్ తైరేవ హుంకారైర్హతః. రావణో రాక్షసేశ్వరః సీతామభిలషన్ రాఘవేణ హతః నరకో దైత్యేశ్వరః అదితి కుండలా ద్యాహరణాత్మయైవ హతః. అపరే௨పి శ్రీమదాత్ స్థానాద్భ్రంశితాః. 20

శ్లో॥ భవంత ఏతద్విజ్ఞాయ దేహద్యుత్పాద్యమంతవత్ ।
మాం భజంతో௨ధ్వరైర్యుక్తాః ప్రజాధర్మేణ రక్షథ ॥ 21

కార్తవీర్యుడు, నహుషుడు, వేనుడు, రావణుడు, నరకుడు మొదలైన రాజులు, దేవతలు, రాక్షసులు, రాజులు ఇంకను ఎందరో సంపద గర్వము చేత తమతమ ఉన్నత స్థితులనుండి పతితులైరి. హైహయ వంశజుడైన కార్తవీర్య చక్రవర్తి పరశురాముని తండ్రియైన జమదగ్ని మహాముని హోమధేనువును అపహరించి ఆయనను సంహరించి నందువల్ల పరశురాముడు కార్తవీర్యుని పుత్ర సహితముగా సంహరించినాడు. నహుష చక్రవర్తి దేవేంద్ర పదవిని పొంది కూడా ఉన్మత్తుడై శచీదేవి పొందును ఆశించి గర్వముతో అగస్త్యుడు మొదలైన మునీశ్వరులతో పల్లకి మోయించుకొని వారి కోపము వలననే తన ఇంద్రపదవిని కోల్పోయి భ్రష్టుడై కొండచిలువ రూపమును పొందినాడు. వేనుడు చక్రవర్తియై కూడా ఉన్మత్తుడై బ్రాహ్మణులను నిందించినందు వలన వారు కోపముతో హుంకరించినంతనే నాశనము పొందెను. రాక్షస రాజైన రావణుడు సీతాదేవిని ఆశించినందు వలన రాముడతనిని సంహరించినాడు. అసుర రాజైన నరకాసురుడు ఇంద్రుని తల్లి అదితి కుండలములు మొదలైన వాటిని అపహరించి మరణమును పొందినాడు. ఇంకను ఇట్టి వారనేకులున్నారు. 20

మీరు పుట్టుకతో కలిగిన ఈ శరీరాలు నాశనము పొందక తప్పవనే విషయము తెలిసి, జాగరూకులై, యజ్ఞములతో దేవతలను

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- భవంత ఇతి. యదుత్పాద్యం దేహాది. తదంతవత్ ఏవం విజ్ఞాయ. యుక్తాః అప్రమత్తాః రక్షథ రక్ష తేత్యర్థః. 21

తృప్తిపొందించి, ప్రజలను ధర్మ పరిపాలనతో రక్షించుడు. 21

శ్లో॥ సంతన్వంతః ప్రజాతంతూన్ సుఖదుఃఖే భవాభవౌ ।
ప్రాప్తంప్రాప్తం చ సేవంతో మచ్చిత్తా విచరిష్యథ ॥ 22

అనుకూలవతులైన భార్యలను, వారి వలన సంతానమును సంవృద్ధిగా పొంది వారితో సంపూర్ణమైన సేవలను అనుభవించి మీరు నన్ను చిత్తమున పొందినవారై చరించగలరు. 22

టీ:- సంతన్వంత ఇతి. ప్రజాతంతూన్ పుత్రాదిసంతతీః. ప్రాప్తం ప్రాప్తం చ సమత్వేన. సేవామానాః. 22

శ్లో॥ ఉదాసీనాశ్చ దేహదావాత్మారామా ధృతవ్రతాః ।
మయ్యావేశ్య మనస్సమ్యఙ్మామంతే బ్రహ్మాయాస్యథ ॥ 23

పిమ్మట మీరు దేహము, భార్యా పుత్రులు, సంపదలందు ఉదాసీన భావమును పొంది, దృఢమైన నియమములతో ఆత్మారాములై చక్కగా నాయందే మనస్సు లగ్నము చేసి మరణాంతరము నన్ను పొందగలరు. మీకు క్రమముక్తిని ప్రసాదింతునని భావము. 23

టీ:- ఉదాసీనా ఇతి. మాం బ్రహ్మ. యాస్యథ. 23

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇత్యాదిశ్య నృపాన్ కృష్ణో భగవాన్ భువనేశ్వరః ।
తేషాం న్యయుఙ్క్త పురుషాన్ స్త్రియో మజ్జనకర్మణి ॥ 24

**శ్రీ శుకుడిట్లు చెప్పినాడు**

అని ఈ విధముగా రాజులందరికి ఉద్బోధించి భువనేశ్వరుడు, భగవంతుడు కృష్ణుడు వారికి అభ్యంగన స్నానము చేయించుమని పరిచారకులైన స్త్రీ, పురుషులను నియోగించినాడు. 24

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ సపర్యాం కారయామాస సహదేవేన భారత ।
నరదేవోచితైర్వ స్త్రైర్భూషణైస్స్రగ్విలేపనైః ॥25

టీ:- ఇతీతి. స్త్రియశ్చ స్త్రీశ్చ తేషాం మజ్జనకర్మణి అభ్యంగస్నానాదౌ న్యయుజ్య. (24-25)

ఓ పరీక్షిత్తూ ! జరాసంధుని కొడుకైన సహదేవునితో ఆ రాజులందరికీ ఉచితములైన వస్త్రములు, భూషణములు, మాలలు, గంధాదులతో కృష్ణుడు సపర్యలు చేయించినాడు. 25

శ్లో॥ భోజయిత్వా వరాన్నేన సుస్నాతాన్ సమలంకృతాన్ ।
భోగైశ్చ వివిధైర్యుక్తాన్ తాంబూలాద్యైర్నృ పోచితైః ॥ 26

టీ:- భోజయిత్వేతి. సుస్నాతాన్ సమ్యగలం కృతాన్ భోగైశ్చయుక్తాన్ వరేణాన్నేన భోజయిత్వా పునస్తేషాం సపర్యాం సహదేవేన కారయా మాసేతి పూర్వేణాన్వయః. 26

రాజులందరు స్నానముచేసి అలంకృతులైన పిమ్మట వారికి అన్ని భోగములను అమర్చి రాజోచితమైన శ్రేష్ఠమైన వంటకములతో విందుభోజనము పెట్టించి తాంబూలాది ఔపచారములను చేయించి నాడు. 26

శ్లో॥ తే పూజితా ముకుందేన రాజానో మృష్టకుండలాః ।
విరేజుర్మో చితాః కృచ్ఛ్రాత్ప్రావృడంతే యథా గ్రహాః ॥ 27

టీ:- త ఇతి. గ్రహాః చంద్రాదయో యథా. 27

ఆ రాజులందరు కృష్ణుని ద్వారా పూజలందుకొని పరిశుభ్రమైన కుండలములతో కష్టములనుండి బయటపడిన వారై వర్షాకాలాంత మున నిర్మలమైన ఆకాశమునందలి చంద్రాది గ్రహములవలె విరాజిల్లిరి. 27

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ రథాన్ సదశ్వానారోప్య మణికాంచన భూషితాన్ ।
ప్రీణీయ సూనృతై ర్వాక్యైస్స్వదేశాన్ ప్రత్యయాపయత్ ॥ 28

శ్రేష్టమైన గుఱ్ఱములు కట్టిన, మణులు బంగారములతో అలంకృతమైన రథములందు రాజులను అధిరోహింపజేసి మంచి మాటలతో వారిని తృప్తి పరుచుచు కృష్ణుడు వారివారి స్వదేశములకు సాగనంపినాడు. 28

శ్లో॥ త ఏవం మోచితాః కృచ్ఛ్రాత్కృష్ణేణ సుమహాత్మనా ।
యయుస్తమేవ ధ్యాయంతః కృతాని చ జగత్పతేః ॥ 29

ఆయా రాజులు జరాసంధుని కారాగార బాధల నుండి మహాత్ముడైన శ్రీకృష్ణుని వలన ఈ విధముగా విడుదలపొంది ఆ జగన్నాథుని విలాసమును స్మరించుచు తమ దేశములకు వెళ్ళిరి. 29

టీ:- రథానితి. ప్రీణీయ ప్రీణయిత్వా. (28-29)

శ్లో॥ జగదుః ప్రకృతిభ్యస్తే మహాపురుష చేష్టితం ।
యథాన్వశాసద్భగవాన్ తథా చక్రురతింద్రితాః ॥ 30

ఆయా రాజులు తమతమ దేశములందరి ప్రజలకు, తమవారికి ఆ మహా పురుషుడైన కృష్ణుని ఘనకార్యములను వివరించి తమ రాజ్యములను ఏమరపాటులేక పాలించిరి. 30

శ్లో॥ జరాసంధం ఘాతయిత్వా భీమసేనేన కేశవః ।
పార్థాభ్యాం సంయుతః ప్రాయాత్సహదేవేన పూజితః ॥ 31

శ్రీకృష్ణుడు భీమసేనుని వలన జరాసంధుని చంపించి, సహదేవుని గిరివ్రజ సింహాసనముపై అధిష్టింపజేసి అతనిచేత పూజలందుకొని భీమార్జునులతో కలిసి ఖాండవ ప్రస్థమునకు మరలి వచ్చిరి. 31

టీ:- జగదురితి. జగదుః ఊచుః. (30-31)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ గత్వాతే ఖాండవప్రస్థం శంఖాన్ దధ్ముర్జితారయః ।
హర్షయంతస్స్వ సుహృదో దుర్హృదాం చా సుఖావహాః ॥ 32

టీ:- గత్వేతి. ఖాండవప్రస్థం ఇంద్రప్రస్థం. 32

శ్లో॥ తచ్ఛ్రుత్వా ప్రీతమనస ఇంద్రప్రస్థనివాసినః ।
మేనిరే మాగధం శాంతం రాజా చాప్తమనోరథః ॥ 33

శ్లో॥ అభివంద్యాథ రాజానం భీమార్జున జనార్దనాః ।
సర్వమాశ్రావయాంచక్రురాత్మనా యదనుష్ఠితమ్ ॥ 34

శ్లో॥ నిశమ్య ధర్మరాజస్తు కేశవేనాను కంపితాః ।
ఆనందాశ్రుకలా ముంచన్ ప్రేమ్ణా నోవాచ కించన॥ 35

టీ:- తదితి. శాంతం మృతం ఆప్తమనోరథో బభూవేతి. (33-35)

శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, త్రిసప్తతితమోఽధ్యాయః

శత్రువులను జయించి వారందరు ఖాండవప్రస్థమునకు వచ్చి తమ విజయ వార్తను ఎరుకపరచుటకై సుహృదయులైన ఆత్మీయులకు ఆనందము, దుర్మార్గులకు భీతి గొలుపునట్లుగా తమతమ శంఖములను పూరించిరి. 32

ఖాండవప్రస్థ వాసులు ప్రీతిగొల్పునట్టి మనస్సుతో కృష్ణ భీమార్జునుల శంఖధ్వనులను వీనుల విందుగా విని జరాసంధుడు మరణించినాడని, ధర్మరాజు తమ మనోరథమైన రాజసూయ యాగము నిరాటంకమైనదని భావించినారు. 33

ధర్మరాజుకు కృష్ణ భీమార్జునులు నమస్కరించి గిరివ్రజమున తాము చేసిన పనులన్నింటిని వివరించిరి. 34

ఆ విషయములన్నియు విని ధర్మజుడు కృష్ణుని అనుగ్రహమును పొంది ఆనందబాష్పములతో ప్రేమ పారవశ్యముతో బదులు పల్కలేక పోయెను. 35

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
డెబ్బదిమూడవ అధ్యాయముసమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## చతుస్సప్తతితమోఽధ్యాయః

శ్లో॥ చతుర్యక్సప్తతితమే రాజసూయ క్రియాద్విజైః ।
అగ్రపూజా ప్రసంగేన చైద్యఘాతాది వర్ణ్యతే ॥
రాజసూయముఖే హత్వా జరాసంధం తదంతరే ।
చైద్యం తదంతే కుర్వంతం బీజం కలిమివానపత్ ॥

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం యుధిష్ఠిరో రాజా జరాసంధవధం విభోః ।
కృష్ణస్యచానుభావంతం శ్రుత్వా ప్రీతస్తమబ్రవీత్ ॥ 1

టీ:- కురూణామంతార్థం. కురూణామంతో యస్మాదసౌ కుర్వంతస్తం కలిమిత్యర్థః. ఏవమితి, కృష్ణస్య చానుభావమితి చకారాత్ తస్య చాజ్ఞానువిధాయిత్వం చాలక్ష్యేత్యర్థః. 1

### యుధిష్ఠిర ఉవాచ

శ్లో॥ యేస్యుస్త్రైలోక్య గురువస్సర్వే లోకాస్సహేశ్వరాః ।
వహంతి దుర్లభం లబ్ధ్వా శిరసై వాను శాసనమ్ ॥ 2

టీ:- తదాహ-య ఇతి. యే త్రైలోక్యస్యాపి గురవః స్యుః సనకాదయః సర్వే చ లోకాః లోకపాలాశ్చ.తే శిరసైవ తవానుశాసనం వహంతి దుర్లభంలబ్ధ్వేతి భాగ్యేనైవైతల్లబ్ధమితి బహుమానేనేత్యర్థః. 2

## 74 వ అధ్యాయము

డెబ్బదినాలుగవ అధ్యాయమున రాజసూయయాగమును నిర్వహించు ఋత్విక్కులలో అగ్రపూజ ఎవ్వరికివ్వవలెనని ప్రసంగ నిమిత్తముగా శిశుపాలుని సంహారము చెప్పబడును. రాజసూయాగారంభమున జరాసంధుని,యాగమధ్యమున శిశుపాలుని సంహరించుట చివర సమస్త కౌరవ వంశమునకు నాశనము కలిగించు నట్టి విత్తనము (హేతువు) వలె కలి ప్రవేశించినది అని చెప్పబడును.

### శ్రీ శుకమహర్షి ఇట్లు చెప్పినాడు

ఈ విధముగా ధర్మరాజు జరాసంధుని వధను, శ్రీకృష్ణుని ప్రభావమును, భీమార్జునులు ఆతని ఆజ్ఞను పాటించుటను విని మిక్కిలిగా సంతోషించినవాడై కృష్ణునితో ఇట్లు చెప్పినాడు. 1

### యుధిష్ఠిరుడు ఇట్లనెను

ముల్లోకాలకు గురువులైన సనకాది మహర్షులు, అష్టదిక్కులను పాలించు ఇంద్రాదులు అందరూ తమ అదృష్ట వశముచేత లభించిన నీ ఆజ్ఞను శిరస్సుతో ధరించుచున్నారు. పరమాత్ముని ఆజ్ఞను గౌరవముగా, ప్రసాదముగా భావింతురని భావము. 2

శ్లో॥ నభవానరవిందాక్ష దీనానామిహ మానినాం ।
ధత్తేఽను శాసనం భూమంస్తదత్యంత విడంబనమ్ ॥ 3

టీ:- స ఇతి. స భవాన్ పరమేశ్వరోఽస్మాకమనుశాసనం ధత్తే. తదత్యంత విడంబనం అననురూపమనుకరణం. స్వతేజోహాని ప్రసంగాదితి తాత్పర్యార్థః. 3

శ్లో॥ నహ్యేకస్యాద్వితీయస్య బ్రహ్మణః పరమాత్మనః ।
కర్మభిర్వర్ధతే తేజో హ్రసతే వా యథా రవేః ॥ 4

టీ:- అథవా తవ పునః పరిపూర్ణస్య ఆజ్ఞాపనాజ్ఞాధారణాభ్యాం న తేజోవృద్ధిహానీ. అతః కృపయా సర్వం సంగచ్ఛత ఇత్యాహ-నేతి. ఏకస్య అద్వితీయస్య సమానాసమానరహితస్య. బ్రహ్మణస్తవ. ఉభయం మాయా. పరమాత్మన ఇతి. సర్వజీవనియంతస్తవ నియమ్య త్వం సుతరాం న వాస్తవం. అతః పరానుగ్రహార్థైరేతైః కర్మభిస్తవ తేజోన వర్ధతే. న చ హ్రసతే. రవేరివ ఉదయాస్తమయాదికర్మభిరిత్యర్థః. తథాచ, "నకర్మణావర్ధతే నో కనీయా"నితి శ్రుతేః. 4

ఓ పరమేశ్వరా! గర్వపూరితులమైన మా వంటి దీనులు అవశ్యముగా అనుష్ఠించవలసిన శాసనమును(శిక్షణను) నీవు ధరించుచున్నావు. నీ శాసనము ఇతరములను అనుకరించునది కాదు. అట్లయినచో నీ తేజమునకు హానికలుగునని పొరబడే ప్రమాదమున్నదని తాత్పర్యము. 3

పరిపూర్ణుడవైన నీకు - ఆజ్ఞాపించుట ఆజ్ఞలు నెరవేర్చుటవల్ల తేజము వృద్ధిపొందుట కానీ, క్షయించుటకానీ లేవు. నీ దయవలననే సర్వమూ సమకూరుననే విషయము చెప్పుచున్నాడు. - ఏకము, అద్వితీయము, (రెండవది లేనిది) అయినందువల్ల రాగద్వేషములులేని పరమాత్మవు, బ్రహ్మమువు అయిననీకు - సూర్యునికి ఉదయకాలమున తేజోవృద్ధి, సాయంకాలము, రాత్రులందు తేజము నశించుటలు లేనట్లుగా వృద్ధి, నాశములు లేవు. సర్వ జీవులను నియమించు నీవు (ఇంకొకరి పెత్తనమున) నియమింపబడుట పూర్తిగా అవాస్తవము. నీవు కర్మలను అనుష్ఠించుట అనునది కేవలము ఇతరులను అనుగ్రహించుట కొరకే. ఇట్టి కర్మల వల్ల సూర్యునికి ఉదయాస్తమానములందు తేజోవృద్ధి నాశములు లేనట్లుగా - నీకును తేజోవృద్ధి నాశములు లేవు అని అర్థము. 'న కర్మణావర్ధతే, నోకనీయా' అను శ్రుతి ఈ విషయమునే చెప్పినది. 4

శ్లో॥ నచతేऽజిత భక్తానాం మమాహమితి మాధవ ।
త్వంతవేతి చ నానాధీః పశూనామివ వైకృతా ॥ 5

టీ:- నన్వేవమప్యహం పరమేశ్వరః సర్వస్యాజ్ఞాపకః మమేదం నీచం కర్మాయోగ్యమితి.మనసి కథం న భవేదత ఆహ-నేతి. హేఅజితతవ భక్తానామేవ తావత్ ఇయం నానాధీః భేదమతిర్నాస్తి.యథాపశూనాం అజ్ఞానాంవైకృతాశరీరవిషయా.తవతునాస్తితికింపునర్వ క్తవ్యమిత్యర్థః. 5

ఇట్లున్నప్పటికీ నేను పరమేశ్వరుడను, సమస్తమును ఆజ్ఞాపించు (నియంత్రించు) వాడను నాకు ఈ నీచమైన పనుల ఆవశ్యకత ఏమున్నది? అని నీకు మనసులో భావన ఎందుకు కలుగదనగా ఓ పరమేశ్వరా ! కేవలము నీ భక్తులైన వారికి మాత్రమే నేను, నాది, నీవు, నీది, అనే నానాత్వ బుద్ధి కలుగదు ( వారు సర్వసములని భావను). జడమై వికారమైన శరీర భ్రాంతి గలిగిన పశువులవంటి అజ్ఞానులకు మాత్రమే స్వ, పర భేదము కలుగునని సారాంశము. నీకు భేదబుద్ధి కలుగదని నేరుగా చెప్పవలసిన అవసరమేమున్నదని అర్థము. 5

శ్లో॥ ఇత్యుక్త్వా యజ్ఞియే కాలే వవ్రే యుక్తాన్ స ఋత్విజః ।
కృష్ణానుమోదితః పార్థో బ్రాహ్మణాన్ బ్రహ్మవాదినః ॥ 6

టీ:- ఇతీతి. యజ్ఞీయే యజ్ఞోచితే వసంతాదికాలే యుక్తాన్ అభియుక్తాన్ స యుధిష్ఠిరః. ఋత్విజోహోతృప్రముఖాన్ వవ్రే వృతవాన్. 6

అని చెప్పి యజ్ఞయాగాదులకు ఉచితమైన వసంత కాలారంభమున రాజసూయయాగనిర్వహణకై ధర్మరాజు కృష్ణునికి అంగీకారమైన హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ మొదలైన స్థానములందు ఋత్విజులుగా వ్యాసుడు, భరద్వాజుడు, సుమంత్రుడు, గౌతముడు, అసితుడు, వసిష్ఠుడు, చ్యవనుడు, కణ్వుడు, మైత్రేయుడు, కవషుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, సుమతి, జైమిని, క్రతువు, పైలుడు, పరాశరుడు, గర్గుడు, వైశంపాయనుడు, దుర్వాసుడు, వీతిహోత్రుడు, మధుచ్ఛందుడు, వీరసేనుడు, కృతవణుడు మొదలైన బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణ శిఖామణులను ఎన్నుకొన్నాడు. (6-9)

శ్లో॥ ద్వైపాయనో భరద్వాజస్సుమంతుర్గౌతమోऽసితః ।
వశిష్ఠశ్చ్యవనః కణ్వో మైత్రేయః కవషస్తతః ॥ 7

శ్లో॥ విశ్వామిత్రో వామదేవస్సుమతిర్జైమినిః క్రతుః ।
పైలః పరాశరో గర్గో వైశంపాయన ఏవ చ ॥ 8

టీ:- తానాహత్రిభిః - ద్వైపాయన ఇతి. (7-8)

శ్లో॥ దుర్వాసాః కశ్యపో ధౌమ్యోరామో భార్గవ ఆసురిః ।
వీతిహోత్రో మధుశ్ఛందో వీరసేనో కృతవ్రణః ॥ 9

టీ:- దుర్వాసా ఇతి. అకృతవ్రణాదీనేతాన్ ఋత్విగుపద్రష్టాదిభేదేన వవ్రే. 9

శ్లో॥ ఉపహూతాస్తథాచాన్యే భీష్మద్రోణ కృపాదయః ।
ధృతరాష్ట్ర స్సహసుతో విదురశ్చ మహామతిః ॥ 10

టీ:- ఉపహుతా ఇతి. అన్యే చోపహుతాః. 10

శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా యజ్ఞదిదృక్షవః ।
తత్రేయుస్సర్వ రాజానో రాజ్ఞాం ప్రకృతయో నృప ॥ 11

టీ:- బ్రాహ్మణాఇతి. యజ్ఞదిదృక్షవస్సర్వే చతత్రే యురిత్యన్వయః .11

ధర్మరాజు యాగమునకు ఆహ్వానితులైన భీష్ముడు, ద్రోణుడు, కృపుడు మొదలైన పెద్దలు, పుత్రశతసహితుడైన ధృతరాష్ట్రుడు, మేధావియైన విదురుడు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, ఇతర రాజులు, వారి మంత్రి వర్గము మొదలైన వారందరు ఓ పరీక్షిన్మహారాజా! అక్కడకు చేరిరి. (10-11)

శ్లో॥ తతస్తే దేవయజనం బ్రాహ్మణాస్స్వర్ణలాంగలైః ।
కృష్ట్వా తత్ర యథామ్నాతం దీక్షయాంచక్రిరేనృపమ్ ॥ 12

టీ:- తత ఇతి. దేవ యజనం యజ్ఞభూమిం కృష్ట్వాకర్షణాది భిస్సంశోధ్య దీక్షయాంచక్రి రే దీక్షాసంస్కారయుక్తమకుర్వన్. 12

శ్లో॥ హైమాః కిలోపకరణా వరుణస్య యథాపురా॥ 13

టీ:- హైమా ఇతి. ఉపకరణాః ఉపస్కరాః వరుణస్య రాజసూయే యథా ఆసన్నితిశేషః. 13

పిమ్మట భూమిని రాజసూయయాగదీక్షకు ఉపయుక్తముగా సంస్కరించుటకై బ్రాహ్మణులు బంగారు నాగండ్లతో దున్నుట మొదలైన క్రియలతో - పూర్వము వరుణుడు చేసిన రాజసూయ యాగమందు వలెనే చక్కగా శుభ్రపరచినారు. (12-13)

శ్లో॥ ఇంద్రాదయో లోకపాలా విరించభవ సంయుతాః ।
సగణాస్సిద్ధగంధర్వ విద్యాధర మహోరగాః ॥ 14

టీ:- కించ ఇంద్రేతి. యే ఇంద్రాదయో దేవగణాః. 14

శ్లో॥ మునమోయక్ష రక్షాంసి ఖగకిన్నర చారణాః ।
రాజానశ్చ సమాహుతా రాజపత్న్యశ్చ సర్వశః ॥ 15

టీ:- మునయ ఇతి. యే చ రాజాదయః సమాహూతాః. 15

శ్లో॥ రాజసూయం సమేయుస్స్మ రాజ్ఞః పాండుసుతస్యవై ।
మేనిరే కృష్ణ భక్తస్య సూపపన్నమ విస్మితాః ॥ 16

రాజసూయయాగమునకు ఆహ్వానితులైన ఇంద్రాది దిక్పాలకులు, బ్రహ్మదేవుడు, ప్రమథగణములతో కూడిన పరమేశ్వరుడు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, మునులు, యక్షులు, రాక్షసులు, గరుడులు, కిన్నరులు, చారణులు, రాజులు, రాజపత్నులు వచ్చి కృష్ణుని భక్తుడైన ధర్మరాజుకు సమస్తము సులభముగనే చక్కగా అమరిదని ఆశ్చర్యపడిరి. (14-16)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- రాజసూయమితి. యే తత్ర సమేయుస్సృతే సర్వే కృష్ణభక్తస్య పాండుసుతస్య రాజ్ఞో రాజసూయమవిస్మితాస్సంతః, సూపపన్నం సుసంపన్నం మేనిర ఇత్యన్వయః. 16

### శిశుపాలవధ కథా ప్రారంభఘట్టః

శ్లో॥ అయాజయన్ మహారాజం యాజకా దేవవర్చసః ।
రాజసూయేన విధివత్ప్రాచేత సమివామరాః ॥ 17

టీ:- అయాజయన్నితి. యాజకాః ఋత్విజః. 17

శ్లో॥ సుత్యేఽహన్యవనీపాలో యాజకాన్ సదసస్పతీన్ ।
అపూజయన్మహాభాగాన్ యథావత్సుసమాహితః ॥ 18

టీ:- సుత్య ఇతి. సుత్యేఽహని సోమాభిషవదినే. 18

శ్లో॥ సదస్యాగ్ర్యార్హణార్హం వై విమృశంతస్సభాసదః ।
నాధ్యగచ్ఛన్న నైకాంత్యాత్సహదేవ స్తదాబ్రవీత్ ॥ 19

### శిశుపాలవధ కథా ప్రారంభఘట్టము

దేవకాంతి కలిగిన ఋత్త్విజులు శాస్త్రవిధిననుసరించి ధర్మరాజు చేత రాజసూయయాగమును వరుణునికి దేవతలు చేయించినట్లుగా చేయించినారు. 17

యాగావసానమున అవభృథస్నానము చేయుదినమున ధర్మరాజు మహానుభావులైన ఋత్విజులకు, సభాధిపతులకు, రాజులకు వారివారికి అనురూపమైన విధముగా గౌరవ సత్కారములుచేసినాడు. 18

యాగ పరిసమాప్తిగా అగ్రపూజ ఎవ్వరికివ్వవలెనని సభలో జరిగిన చర్చలో సభాసదులకు ఏకాభిప్రాయము కుదురనందున (అగ్రపూజకై అర్హులు పలువురుండుట వలన ఏ ఒక్కన్నీ నిర్ణయించే నిశ్చయము కలుగనందున) సహదేవుడు ఈ విధముగా చెప్పినాడు. 19

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అర్హతి హ్యచ్యుతశ్శ్రైష్ఠ్యం భగవాన్ సాత్వతాం పతిః ।
ఏషవై దేవతాస్సర్వా దేశ కాలధనాదయః ॥ 20

టీ:- సదసీతి. అగ్రార్హణం అగ్రపూజా. తస్యార్హం యోగ్యం అనైకాంత్యాత్ యోగ్యానాం బహుత్వేనైకస్యానిశ్చయాత్. (19-20)

శ్లో॥ యదాత్మకమిదం విశ్వం క్రతవశ్చయదాత్మకాః ।
అగ్నిరాహుతయో మంత్రాస్సాంఖ్యం యోగశ్చ యత్పరః ॥ 21

టీ:- యదాత్మకమితి. సాంఖ్యం జ్ఞానం యోగ ఉపాసనా. 21

శ్లో॥ ఏక ఏవాద్వితీయోऽసావైతదాత్మ్యమిదం జగత్ ।
ఆత్మనాత్మాశ్రయ స్సభ్యాస్సృజత్యవతి హంత్యజః ॥ 22

టీ:- నను సాంఖ్యం కేవలపరం యోగస్సవిశేషణ పరః కథముభయోరేకపరత్వం తత్రాహ- ఏక ఇతి.ఏక ఏవాద్వితీయోऽసౌ అతస్సాంఖ్యస్యైతత్పరత్వం యుక్తం. విశేషణభూతస్యచ సర్వప్రపంచస్య తన్మయత్వాత్స విశేషణవిషయస్య యోగస్యాపి యుక్తమద్వితీయపరత్వమిత్యాహ - ఐతదాత్మ్యమితి. ఏష శ్రీకృష్ణః ఆత్మాయస్యతత్ ఏతదాత్మతస్య భావః

భగవంతుడై యాదవనాథుడైన శ్రీకృష్ణుడే అగ్రపూజకు అర్హుడు. ఈయననే సర్వదేవతలు, కాలము, సంపదలు. 20

ఈ జగత్తు ఈయనతో నిండినది. యజ్ఞముల సాఫల్యము ఈయననే. అగ్ని, ఆహుతులు, మంత్రములు, జ్ఞానము (సాంఖ్యము), ఉపాసన (యోగము) అన్నియును ఈయనకు చెందినవే. 21

సాంఖ్యము కేవలము పరము. యోగము విశేషణముతో కూడిన పరము. అయినప్పుడు ఈ రెండింటికి ఏకమపరత్వము ఎట్లు కలుగును అనే విషయము చెప్పుచున్నాడు. ఏకము, అద్వితీయము (రెండవదిలేని) వాడు పరమాత్మ అయినందువల్ల సాంఖ్యమునకే పరమాత్మ పరత్వము యుక్తము. విశేషణ రూపమైన సర్వ జగత్తున ఆయనే వ్యాపించి యున్నందువలన విశేషణమునకు విషయమైన యోగమునకును అద్వితీయ పరత్వము కూడ యుక్తమే అని చెప్పుచున్నాడు. శ్రీకృష్ణుడు ఆత్మగా కలది ఏతదాత్మము. దాని భావము ఐతదాత్మ్యము. 'ఐతదాత్మ్య

ఐతదాత్మ్యం. భవితవ్యే చ భావనిర్దేశః. శ్రు."ఐతదాత్మ్యమిదం సర్వమి"తి శ్రుతేః. అత్ర హేతుః. ఆత్మనేతి. హే సభ్యాః ఆత్మాశ్రయః అన్యనిరపేక్షః స్వయమజః ఇదం జగత్ సృజతి అవతి రక్షతి హంతి సంహరతి చ . 22

శ్లో॥ వివిధానీహకర్మాణి జనయన్ యదపేక్షయా ।
ఈహతే యదయం సర్వశ్శ్రేయో ధర్మాదిలక్షణమ్ ॥ 23

శ్లో॥ తస్మాత్కృష్ణాయ మహతే దీయతాం పరమార్హణమ్ ।
ఏవంచేత్సర్వ భూతానామాత్మనశ్చార్హణం భవేత్ ॥ 24

టీ:- కించ. వివిధానీతి.యస్య అపేక్షయా అనుగ్రహేణ వివిధాని కర్మాణి తపోయోగాదీని జనయన్ కుర్వన్ యత్ యస్మాత్ అయం సర్వోஉపి జనః ధర్మాది లక్షణం శ్రేయ ఈహతే సాధయతి కర్మాణి తత్ఫలాని చ యదధీనానీత్యర్థః.(23-24)

మిదం సర్వం' అని శ్రుతి. ఆత్మ వల్లనే ఈ జగత్తు వ్యాపించినదని హేతువు. అందువల్ల ఓ సభ్యులారా! ( ఇది సహదేవుడు సభ్యులను ఉద్దేశించిన సంభోదన), ఆత్మకు ఆశ్రయమైన వాడైనందున అతడు మరే ఇతరములైన వాటిని అపేక్షించడు (అన్య సహాయము అవసరము లేదని భావము) స్వయం సమృద్ధుడు. అతడు పుట్టుకలేని వాడు. ఈ జగత్తును సృష్టించి, రక్షించి, సంహరించు వాడు (తనలో సంహారదిశలో లీనము చేసు కొను వాడితడు). 22

ఈయన దయచేతనే తపస్సు, యోగము మొదలైన కర్మలు కలుగుచున్నవి. ప్రజలు ధర్మము అనే లక్షణము కలిగిన ఆయా కర్మలను తమకు శుభము కలుగవలెనని ఈయన కొరకే చేయుచున్నారు. అయితే వారివారి ఆయా కర్మల ఫలములు మాత్రము ఈయన ఆధీనమైనవే. (కృష్ణానుగ్రహము వలననే సర్వకర్మలు ఫలవంతమగునని భావము)23

అందువలన మహాత్ముడైన శ్రీకృష్ణునికే అగ్రపూజ చేయుము. ఈయన పూజితుడైనచో సర్వభూతముల ఆత్మలన్నియు పూజలందు కొన్నవగును. 24

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ సర్వభూతాత్మ భూతాయ కృష్ణాయానన్య దర్శినే ।
దేయం దాంతాయ పూర్ణాయ దత్తస్యానంత్యమిచ్ఛతా ॥ 25

టీ:- ఆత్మానాక్రియమాణ మర్హణమాత్మనః కథం స్యాత్తత్రాహ- సర్వేతి. సర్వభూతానామాత్మభూతాయ అనన్య దర్శినే నిరస్తభేదమతయే. 25

ఆత్మచేత ఆత్మ ఎట్లు పూజలు పొందునను విషయమును (నీవు ఆత్మనే, అతడు ఆత్మనే అయినప్పుడు నిన్ను నీవే పూజించుకొనుట ఎట్లు కుదురును అనే విషయమును) వివరించుచున్నాడు. సమస్త జీవులకు (ఉన్న వస్తువులన్ని అనగా సమస్తమునకు) ఆత్మ అయినవాడు, ఇతరములు అనగా సృష్టియందలి ఏ పదార్థమునందును కనపడని వాడు, సమస్త భేదబుద్ధులు నశించినవాడు (ఏకరూపుడు), ఇంద్రియ నిగ్రహము కలవాడు, పరిపూర్ణుడు అయిన శ్రీకృష్ణునికే అనంత ఫలమును కాంక్షించువారు (తమ కార్యములు పూర్ణమై ఫలించవలెనని కోరుకొనెడివారు) అగ్రపూజను చేయ వలెను. 25

శ్లో॥ ఇత్యుక్త్వా సహదేవోఽభూత్తూష్ణీం కృష్ణానుభావవిత్ ।
తచ్ఛ్రుత్వా తుష్టువుస్సర్వే సాధుసాధ్వితి సత్తమాః ॥ 26

టీ:- ఇతీతి. శ్రీకృష్ణానుభావవిత్ సహదేవ ఇత్యుక్త్వా తూష్ణీమభూత్. 26

శ్రీకృష్ణుని గొప్పదనమును చక్కగా తెలిసిన సహదేవుడు ఈ విధముగా చెప్పి విరమించగా విజ్ఞులైన సభాసదులందరు ఆ మాటలు సరియైనవని మెచ్చుకొని సంతోషించిరి. 26

శ్లో॥ శ్రుత్వాద్విజేరితం రాజా జ్ఞాత్వాహార్దం సభాసదాం ।
సమర్హయద్ధృషీకేశం ప్రీతః ప్రణయ విహ్వలః ॥ 27

శ్రీకృష్ణునికే అగ్రపూజ ఇవ్వమని బ్రాహ్మణులు చెప్పిన మాటలు విని, ఎల్ల సభాసదుల హృదయ భావమును గమనించి ధర్మరాజు ప్రేమపారవశ్యమున వివశుడై సంతోషముతో హృషీకేశుడైన కృష్ణుని చక్కగా అర్చించినాడు. 27

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తత్పాదావవనిజ్యాపశ్శిరసాలోక పావనీః ।
సభార్యస్సానుజామాత్యస్స కుటుంభోఽవహన్ముదా ॥ 28

పాండవాగ్రణియైన ధర్మరాజు, భార్యలు, తమ్ములు, అమాత్యులు, కుటుంబముతో శ్రీకృష్ణుని పాదాలను కడిగిన లోకపవిత్రమైన జలమును తన శిరస్సున ధరించినాడు. (సకుటుంబ సపరివారుడై శ్రీకృష్ణుని పాదతీర్థమును శిరస్సున ధరించినాడని భావము) 28

శ్లో॥ వాసోభిః పీతకౌశేయైర్భూషణైశ్చ మహాధనైః ।
భూషయిత్వా శ్రుపూర్ణాక్షోనాశకత్సమవేక్షితుమ్ ॥ 29

పట్టుపీతాంబరములు, ఆభరణములు, సంపదలు సమర్పించి, అలంకరించి ఆనంద బాష్పముల జడిలో ఆ మహనీయుని రూపమును దర్శించుటకు పారవశ్యముచేత అశక్తుడయ్యెను. 29

శ్లో॥ ఇత్థం సభాజితం వీక్ష్య సర్వే ప్రాంజలయో నృపాః ।
నమోజయేతి నేముస్తం నిపేతుః పుష్పవృష్టయః ॥ 30

ఈ విధముగా అగ్రపూజలందిన శ్రీకృష్ణుని దర్శించి రాజులందరును చేతులుజోడించి 'నమః జయ' అనే మాటలతో స్తుతించుచు పుష్ప వర్షమును కురిపించిరి. 30

శ్లో॥ ఇత్థం నిశమ్య దమఘోష సుతస్స్వపీతా
దుత్థాయ కృష్ణగుణ వర్ణనజాతమన్యుః ।
ఉత్క్షిప్య బాహుమిదమాహ సదస్యమర్షీ
సంశ్రావయన్ భగవతే పరుషాణ్యభీతః ॥ 31

ఈ స్తోత్రమువిని దమఘోషుని కొడుకైన శిశుపాలుడు క్రోధముతో తన ఆసనమునుండి లేచి రోషపూరితుడై సభలో నిర్భయుడై చేతులుత్రిప్పుచు భగవంతుని పెక్కు విధములుగా దూషించినాడు. 31

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ ఈశో దురత్యయః కాల ఇతి సత్యవతీశ్రుతిః ।
వృద్ధానామపి యద్బుద్ధిర్బాలవాక్యైర్విభిద్యతే ॥ 32

టీ:- శ్రుత్వేతి. ద్విజేరితం సాదుసాధ్వితి ఘోషం శ్రుత్వా హార్దమభిప్రాయం. (27-32)

బలమైన కాలము మీరలేనిదనే శ్రుతివాక్యము సత్యమైనది. బాలుడైన సహదేవుని మాటలతో వృద్ధులబుద్ధులుకూడా పనిచేయక వ్యర్థమైపోయినవి. 32

శ్లో॥ యూయం పాత్రవిదాం శ్రేష్ఠామామజ్ఞ్వం బాలభాషితం ।
సదసస్పతయస్సర్వే కృష్ణో యత్సంమతోఽర్హణే ॥ 33

ఓ సభాసదులారా ! మీరు ఉచితానుచితములు తెలిసిన గొప్పవానిగా కృష్ణునికి అగ్రపూజ ఇవ్వవలెననెడు ఈ సహదేవుని మాటలు స్వీకరించవద్దు. 33

శ్లో॥ తపోవిద్యా వ్రతపరాన్ జ్ఞాన విధ్వస్తకల్మషాన్ ।
పరమర్షీన్ బ్రహ్మనిష్ఠాన్ లోకపాలైశ్చ పూజితాన్ ॥ 34

టీ:- యూయమితి. హేసదసస్పతయః సర్వే బాలభాషితం మామజ్ఞ్వం మాజానీత మాగృహ్ణీత కిం తత్ యత్ యతః కృష్ణోఽర్హణే సంమతః తత్. (33-34)

తపస్సు, దీక్షలందు నిపుణులు, జ్ఞానముతో సర్వమాలిన్యములనుండి దూరమైనవారు, పరమఋషులు, బ్రహ్మనిష్ఠులు, ఇంద్రాది దిక్పాలకులచేత పూజలందుకున్న వారైన సభాసదులు ఈ సభలో పలువురుండగా వారందరినీ కాదని ఒక ఆవులు కాసేవాడు (గోపః), పాషండుడు (కుల పాంసనుడు) అయిన కృష్ణుడు కాకి ముట్టిన యజ్ఞ ప్రసాదమువలె ఈ అగ్రపూజకు ఏ విధముగా అర్హుడైనాడని శిశుపాలుడు శ్రీకృష్ణుని దోషములను దూషించినాడు. ఈ విధముగా నిందించుటలో అతని పూర్వజన్మల సంస్కార బలమువలన వేద నిందరూపమున స్తుతిగర్భితమైనది. కులపాంసనుడు అగుటలో కుత్సితమైన - నీచమైన, లపనములు - మాటలు మాట్లాడునట్టి,

శ్లో॥ సదసస్పతీనతిక్రమ్య గోపోఽయం కులపాంసనః ।
యథాకాకః పురోడాశం స పర్యాం కథమర్హతి ॥ 35

టీ:- సదసస్పతీనితి. అస్యైన్య వాస్తవోऽర్థః పూర్వవదున్నేయః. సదస్పతీనితి. గోపః వేదపృథివ్యాదిపాలక ఇత్యర్థః కుత్సితం వేదవిపరీతం లపంతీతి కులపాః పాషండాః. తాన్ అసతే ఘాతయతీతి కులపాంసనః అకాకః. కం చ అకం చ కాకే సుఖదుఃఖే. తే న విద్యతే యస్య సః అకాకః. ఆప్తకామ ఇత్యర్థః. స యథా ఆప్తకామో దేవయోగ్యం కేవలం పురోడాశాదిమాత్రం నార్హతి ఆపి తు సర్వస్వమపి. తథాయం శ్రీకృష్ణోऽపి బ్రహ్మర్షి యోగ్యం సపర్యామాత్రం శథమర్హతి కింతు స్వాత్మసమర్పణ మప్యర్హ తీత్యర్థః 35

శ్లో॥ వర్ణాశ్రమ కులాపేత స్సర్వధర్మ బహిష్కృతః ।
స్వైరవర్తీ గుణైర్హీనస్స పర్యాం కథమర్హతి ॥ 36

టీ:- వర్ణేతి. వర్ణాశ్రమకులేభ్య అపేతః బ్రహ్మత్వాత్.శ్రు. "అనామగోత్ర"మితి శ్రుతేః.అత ఏవానధికారిత్వాత్సర్వైర్ధర్మైర్బహిష్కృతః స్వైరవర్తీ పరమేశ్వరత్వాత్. అతఏవ నిర్గుణః తమ ఆదిరహితః. ఏవం భూతోజీవానాం యోగ్యం తుచ్ఛం సపర్యామాత్రం కథమర్హతీత్యర్థః. 36

పా-పాషండులను, అంసతే - సంహరించువాడు కులపాంసనుడు. దుష్టశిక్షణ చేయువాడని స్తుతి. అకాకః-కం సుఖము,అకం-దుఃఖము. కాకే - ఈ సుఖదుఃఖములు రెండును లేనిది - అకాకః. అనగా ఆప్తకాముడైన వాడని స్తుతి. అతనికి దేవయోగ్యమైన పురోడాశమేకాదు సమస్తమును సమర్పింపవచ్చును. అనగా శ్రీకృష్ణుడు బ్రహ్మర్షి యోగ్యమైన అగ్రపూజకు మాత్రమే కాదు ఆత్మ సమర్పణకును అర్హుడేయని పిండితార్థము. (34-35)

వర్ణము, ఆశ్రమము, కులములు లేనివాడు, సర్వధర్మములను తిరస్కరించినవాడు, అడ్డు ఆపులేకుండా విశృంఖలముగా వ్యవహరించేవాడు, గుణములు లేనివాడు అర్హపూజకు ఎట్లు అర్హుడని శిశుపాలుడు నిందించినాడు. ఇవి కూడా వాస్తవముగా స్తుతిగర్భిత ములే. సర్వసమమైన బ్రహ్మత్వమున వర్ణాశ్రమ కులాదులు లేవు. 'అనామగోత్రమ్' అని శ్రుతి ప్రమాణము. అధికారముకానట్టి (ప్రధానముకాని) అన్ని ధర్మములు విడిచినాడు. పరమేశ్వరత్వము చేత స్వేచ్ఛావర్తనము కలవాడు. కనుకనే కర్మాను రూపమైన గుణములు లేనివాడు. ఆదిలేనివాడు. ఇట్టి వానికి కేవలము సాధారణ మానవులకు అర్హమై, అల్పమైన సపర్యామాత్రమే సరిపోవునా? అని ఈ నిందలు స్తుతి గర్భితములు. 36








శ్లో॥ యయాతినైషాం హి కులం శప్తం సద్భిర్బహిష్కృతం ।
వృథాపానరతం శశ్వత్సపర్యాం కథమర్హతి ॥ 37

టీ:- యయాతినేతి. అపిచకథం వర్ణనీయో మాదృశైరేషాం యదూనాం మహిమా. యస్మాదేషాం కులం యయాతినా శప్తమపి కిం సద్భిర్బహిష్కృతం. అపి తు శిరసా ధృతం. కించ. అస్మదాదికులవత్ వృధాపాన రతం కిం. అపితు. అతినియతాచారమిత్యర్థః. అహో యదూనామేవ తావదీదృశం మాహాత్మ్యం యదుకులవృద్ధస్య యయాతేః శాపో న ప్రాదుర్భూయాదిత్యాది. అయం తు సాక్షాదీశ్వరః. అతః సపర్యామాత్రం కథమర్హ తీత్యర్థః. 37

యయాతి రాజు శాపము వలన యాదవ వంశము సత్పురుషుల నుండి బహిష్కారము పొందినది. నిరంతరము త్రాగుబోతులతో కూడిన వంశము వాడు అగ్రపూజకు అర్హుడెట్లయ్యెనని శిశుపాలుడు నిందించినాడు. యయాతి యాదవులకు రాజ్యాధికారములేదని శపించినను మావంటి అల్ప బుద్ధులకు యాదవుల మహిమను వర్ణించుటకు శక్తి చాలదుకదా. యాదవ వంశము శాపము పొందినను దానిని తిరస్కరించక సత్పురుషులు శిరమున ధరించుచున్నారు. (అపారమైన గౌరవమును చూచిరని భావము) నిత్యమూ సదాచార నియతి గల యాదవుల ప్రభావముచేత యయాతి శాపముకూడా తిరస్కృతమైనది. ఈ కృష్ణుడు సాక్షాత్తు పరమాత్ముడు. అందువల్ల అగ్రపూజ మాత్రమే సరిపోవునా అని నిందలో స్తుతి. 37

శ్లో॥ బ్రహ్మర్షి సేవితాన్ దేశాన్ హిత్వైతే బ్రహ్మవర్చసమ్ ।
సముద్రం దుర్గమాశ్రిత్య బాధంతే దస్యవః ప్రజాః ॥ 38

టీ:- కించ. బ్రహ్మర్షీతి. యే రాజనో దుష్టానుచ్చాటయంతి. తే తదర్థం కీకటాదిదేశానప్యాశ్రయంతి. ఏతే తు బ్రహ్మర్షి సేవితానేవ దేశానాశ్రిత్య అబ్రహ్మవర్చసం సముద్రం దుర్గమపి హిత్వా హాపయిత్వేత్యర్థః. బాధంతే తథా. యాః దస్యవః ప్రజాస్తాశ్చ. అయమర్థః

బ్రహ్మఋషులు సేవించుటవలన బ్రహ్మతేజము ఉట్టిపడునట్టి ఈ దేశమును వదిలిపెట్టి సముద్ర దుర్గము ఆశ్రయించి దొంగలవలె ప్రజలను బాధించుచున్నాడని శిశుపాలుడు కృష్ణుని నిందించినాడు. ఇది కూడా స్తుతి గర్భితమే. దుష్టులను ప్రోత్సహించే రాజులు వారికొరకు కీకటాది దేశములను ఆశ్రయింతురు. వారి వెంట వచ్చిన దుర్మార్గులు సముద్రములను వదిలి బ్రహ్మఋషులకు ఆశ్రయమైన మంచి దేశములందు ప్రవేశించి సజ్జనులను నవ్వులపాలు చేయుదురు. దీని




వేదతదర్థాభీయోగో బ్రహ్మవర్చసం తద్విరుద్ధమబ్రహ్మవర్చసం సముద్రం ముద్రా లింగం తత్సహితం సముద్రం వేదవిరుద్ధలింగధారిణం పాషండమిత్యర్థః. తల్లింగం త్యాజయిత్వా బాధం తేదండయంతి. కథంభూతం దుర్గం. ధర్మవత్ప్రతీతేరధర్మతయా దుర్జ్ఞేయమిత్యర్థః. తథా దస్యవః దస్యూనపి ప్రజావేషేణ వర్తమానాన్ దండయంతి. అతో యదుభ్యోఽన్యః కో నామ ధార్మికోఽస్తీతిపారుష్యం తత్వార్థమేవ. 38

వాస్తవస్తవార్థము ఏమనగా–వేదము, దాని అర్థమును అనుసరించుట బ్రహ్మవర్చసము. దానికి విరుద్ధమైనది అబ్రహ్మవర్చసము. సముద్రమునగా ముద్ర అనగా లింగము. దానితో కూడినది సముద్రము. అనగా వేద విరుద్ధమైన పాషండమతమని అర్థము. ఆలింగమును తీసివేసి అనగా తమ పాఖండత్వమును మాటుచేసి వంచనతో మంచివారివలె మారువేషమును వేసుకొని దుర్మార్గులు సత్పురుషులను దుర్గరూపులై ఛేదించుటకు వీలుకాని విధముగా బోధించుచున్నారు. దుర్గమనగా తెలియుటకు వీలులేని విధముగా అనగా ధర్మప్రతీతిపేరు చెప్పి అధర్మమును ప్రోత్సహించువారు పాషండులు. ఇంకావీరు తాము దొంగలై కూడా సాధారణ ప్రజలవలె వేషములను ధరించి సామాన్య ప్రజానీకమును దండించుచున్నారు. అట్టి వంచకులైన పాషండులను నాశనము చేసిన యాదవులకంటే ధార్మికులైనవారు లేరని నిందలో స్తుతి. 38

శ్లో॥ ఏవమాదీన్య భద్రాణి బభాషే నష్టమంగళః ।
నోవాచ కించద్భగవాన్ యథాసింహశ్శివారుతమ్ ॥ 39

ఈ విధమైన అమంగళకరమైన వాక్యములను క్షేమరహితుడైన శిశుపాలుడు పలుకుచున్నను భగవంతుడైన కృష్ణుడు నక్కల ఊళలను విన్న మృగరాజువలే మిన్నకుండెను. 39

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ భగవన్నిందనం శ్రుత్వా దుస్సహం తత్సభాసదః ।
కర్ణాపిధాయ నిర్జగ్ముశ్శపంతశ్చేదిపం రుషా ॥ 40

శ్లో॥ నిందాం భగవతఃశ్రుత్వా తత్పరస్య జనస్య వా ।
తతోనాపైతి యస్సోఽపి యాత్యధస్సుకృతాచ్చ్యుతః ॥ 41

శ్లో॥ తతఃపాండుసుతాః క్రుద్ధామత్స్యకేకయసృంజయాః ।
ఉదాయుధాస్సముత్తస్థుశ్శిశుపాల జిఘాంసవః ॥ 42

శ్లో॥ తతశ్చైద్యస్త్వ సంభ్రాంతో జగృహే ఖడ్గ చర్మణీ ।
భర్త్సయన్ కృష్ణపక్షీయాన్ రాజ్ఞస్సదసి భారత ॥ 43

టీ:- ఏవమితి. శివా ఫేరుః. తస్యాః రుతం శ్రుత్వా యథా సింహో న కించిద్బ్రూతే తద్వత్. (39-43)

**శ్రీశుకుడు పలికెను**

కర్ణకఠోరముగా శిశుపాలుడు భగవంతుని నిందించుటను చూచి చెవులు మూసుకొని సభాసదులు అతని దుర్మార్గమును నిందించుచు బైటకు వెళ్ళిపోయిరి. 40

భగవంతుని, అతని భక్తులను నిందించుట వల్లనే కాక ఆ మాటలను విన్నందువలన కూడా ఏమీ ఉపయోగము లేకపోవుటయే గాక విన్న వారి పుణ్యములు నశించి అధోగతి పాలగుదురు. 41

అప్పుడు పాండవులు శిశుపాలునిపై కినుక వహించగా, మత్స్య, కేకయ, సృంజయ దేశాధిపతులు తమతమ ఆయుధములను ఎత్తి పట్టుకొని మదించినవారై క్రోధముతో శిశుపాలుని సంహరింప సిద్ధపడిరి. 42

ఓ పరీక్షిత్తు! అప్పుడు శిశుపాలుడు నిర్భయుడై కత్తి, డాలు పట్టుకొని సభలో ఉన్న కృష్ణుని అభిమానులను బెదిరించినాడు. 43

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తావదుత్థాయ భగవాన్ స్వాన్నివార్య స్వయం రుషా ।
శిరః క్షురాంత చక్రేణ జహారాపతతోరిపోః ॥ 44

అప్పుడు కృష్ణుడు శిశుపాలునిపై పడ యత్నించు తనవారందరిని వారించి – ఇతడు నా వైకుంఠ మందిర ద్వారపాలకుడైన జయుడు, నాతో సమానమైన బలము కలవాడు, ఇతడు వీరందరిని సంహరించగలడని భావించి వెంటనే తానే లేచి పదునైన సుదర్శన చక్రముతో తన మీదకి వచ్చు శిశుపాలుని శిరమును ఖండించినాడు. 44

శ్లో॥ శబ్దః కోలాహలో హ్యాసీచ్ఛిశు పాలే హతే మహాన్ ।
తస్యానుయాయినోభూపా దుద్రుపుర్జీవితైషిణః ॥ 45

శిశుపాలుడు మరణించిన పిమ్మట సభలో భయంకరమైన కోలాహలమైనది. అతని అనుయాయులైన రాజులందరు ప్రాణ భయముతో పారిపోయిరి. 45

శ్లో॥ చైద్య దేహోత్థితం జ్యోతిర్వాసుదేవ ముపావిశత్ ।
పశ్యతాం సర్వభూతానాముల్కేవ భువి ఖాచ్చ్యుతా ॥ 46

అందరు ఆశ్చర్యముగా చూచుచుండగా ఆకసమునుండి రాలిన ఉల్క భూమిలో లీనమైనట్లుగా శిశుపాలుని శరీరమునుండి ఒక జ్యోతి బయటకు వచ్చి పరమేశ్వరుడైన కృష్ణునియందు లీనమైనది. 46

టీ:– తావదితి. తావదుత్థాయేత్యస్యాయమభిప్రాయః. ఏషమత్పార్షదో మత్తుల్యబలః సర్వానేతాన్ హన్యాత్. అతో మయైవ శీఘ్రం హంతవ్య ఇతి తత్క్షణమేవ ఉత్థాయ శిరోజహారేతి. 44 –46

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ జన్మత్రయానుగుణిత వైరసంరబ్ధయా ధియా ।
ధ్యాయంస్తన్మయతాం నీతో భావో హి భవకారణమ్ ॥ 47

ఇంత దుర్మార్గుడైన శిశుపాలును ఆత్మ పరమేశ్వరునందెట్లు ప్రవేశించినదనే దానికి సమాధానము చెప్పుచున్నాడు. – మూడు జన్మల (హిరణ్యకశిపుడు, రావణుడు, శిశుపాలుడు) పరిమితితో శత్రుభావమును పొంది(వైర భక్తితో)ధ్యానించిన పిమ్మట పరమాత్మైక్యము కలుగును. అనగా మరల వైకుంఠ మందిర ద్వారపాలక స్థితి కలుగునని భావము. భావమే దీనికి కారణము. భావమనగా భావన అనగా ధ్యానించుట. ఇదే జన్మకు కారణము. తన గ్రుడ్ల నుండి బయటకు వచ్చిన కీటకముల చుట్టూ తుమ్మెద తిరిగినచో ఆ కీటకములే తుమ్మెదలుగా మారినట్లు భావమే పుట్టుకకు మూలకారణము. 47

శ్లో॥ ఋత్విగ్భ్యస్సదస్యేభ్యో దక్షిణాం విపులామదాత్ ।
సర్వాన్ సంపూజ్యవిధివచ్చక్రే௨వ భృథమేకరాట్ ॥ 48

ధర్మరాజు ఋత్విక్కులకు, సదస్యులకు అపారమైన సంభావనల నిచ్చినాడు. అందరిని అర్చించి శాస్త్ర విధానుసారముగా చక్రవర్తి అయిన ధర్మరాజు యాగాంతమున అవభృథస్నాన మాచరించినాడు. 48

శ్లో॥ సాధయిత్వా క్రతుం రాజ్ఞఃకృష్ణో యోగేశ్వరేశ్వరః ।
ఉవాసకతిచిన్మాసాన్ సుహృద్భిరయాచితః ॥ 49

ధర్మరాజుని రాజసూయ యాగమును యోగేశ్వరేశ్వరుడైన కృష్ణుడు నిర్విఘ్నముగా పరిసమాప్తి చేయించి ఆత్మీయుల అభ్యర్థనను మన్నించి అక్కడే కొన్ని నెలలు గడిపినాడు. 49

శ్లో॥ తతోఽనుజ్ఞాప్య రాజానమనిచ్ఛంతమపీశ్వరః ।
యయౌ సభార్యస్సామాత్య స్స్వపురం దేవకీసుతః ॥ 50

కృష్ణుడు తిరిగి వెళ్ళుటకు ధర్మరాజు అసంతృప్తి చెందినను ఆయన అనుమతితో అమాత్యులు, భార్యలతో కూడినవాడై ద్వారకకు మరలి వెళ్లినాడు. 50

శ్లో॥ వర్ణితం తదుపాఖ్యానంమయాతే బహువిస్తరమ్ ।
వైకుంఠవాసినో జన్మవిప్రశాపాత్పునః పునః ॥ 51

ఓ పరీక్షిన్మహారాజా ! ఈ ఉపాఖ్యానమును నీకు నేను సవివరముగా వివరించితిని. వైకుంఠ వాసులైన జయవిజయులు తమ పూర్వపు స్థితి అయిన విష్ణు మందిర పార్షదత్వమును పొందిరి అని శుక మహర్షి చెప్పినాడు. 51

శ్లో॥ రాజసూయావభృథ్యేన స్నాతోరాజా యుధిష్ఠిరః ।
బ్రహ్మక్షత్ర సభామధ్యే శుశుభేదేవరాడివ ॥ 52

రాజసూయయాగమును నిర్విఘ్నముగా ముగించిన ధర్మరాజు అవభృథస్నానముచేసి బ్రహ్మ క్షత్రియాదులున్న మయసభా మధ్యమున దేవరాజైన ఇంద్రుని వలె ప్రకాశించెను. 52

టీ:- నన్వేవం నిందకస్య కథం వాసుదేవే ప్రవేశస్తత్రాహ - జన్మ త్రయేతి. జన్మత్రయే అనుగుణితమనువర్తితం యద్వైరం తేన సంరబ్ధయా అవిష్టయా తన్మయతాం తత్స్వరూపతాం యాతః. పునః పార్షదో బభూవేత్యర్థః. అత్ర హేతుః. భావో హీతి. భావో భావనా అనుధ్యానం భవస్య ధ్యేయాకారజన్మనః కారణం పేశస్కారీ ధ్యానేన కీటాదౌ తథా దృష్టత్వా దిత్యర్థః. (47-52)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ రాజ్ఞా సభాజితాస్సర్వే సురమానవఖేచరాః ।
కృష్ణంక్రతుంచ శంసంతస్స్వధామాని ముదాయయుః ॥53

టీ:- రాజ్ఞేతి. సురాః మానవాః. ఖేచరాః ప్రమథాశ్చ. 53

శ్లో॥ దుర్యోధనమృతే పాపంకలిం కురుకులామయం ।
యో న సేహేశ్రియం స్ఫీతాందృష్ట్వా పాండుసుతస్యతామ్ ॥54

టీ:- దుర్యోధనమితి. పాపం ధర్మద్విషం. అత్ర హేతుః. కలిం కలేరంశం. అత ఏవ కురుకులస్యామయం వ్యాధిం నాశకం. 54

శ్లో॥ య ఇదం కీర్తయేద్విష్ణోఃకర్మచైద్యవధాదికమ్ ।
రాజ్ఞాం మోక్షంవితానంచ సర్వపాపైఃప్రముచ్యతే ॥ 55

టీ:- య ఇతి. వితానం యజ్ఞం. 55

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, చతుస్సప్తతితమో౽ధ్యాయః**

రాజసూయయాగమునకు విచ్చేసి దర్శించిన సభ్యులైన దేవతలు, మానవులు, శివసేనా నాయకులైన ప్రమథులు మొదలైన వారందరు యాగమును, కృష్ణుని కీర్తించుచు సంతోషముతో తమ నివాసనమునకు వెళ్లిరి. 53

కలి అంశతో జన్మించి కురు వంశమును వ్యాధి రూపముగా నిర్మూలించు పాపాత్ముడైన దుర్యోధనుడొక్కడే ధర్మరాజు అపారమైన సంపదను చూచి సహించలేక పోయెను. 54

శ్రీకృష్ణుని ప్రభావమును ప్రకటించునట్టి శిశుపాలవధ, జరాసంధుని బంధనమునుండి రాజులందరు విముక్తిపొందుటల ఈ కథను కీర్తించినవారు సర్వ పాపములనుండి విముక్తులగుదురని శ్రీశుకుడు ఫలశృతి చెప్పినాడు. 55

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**డెబ్బదినాల్గవ అధ్యాయముసమాప్తము.**




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## పంచసప్తతితమోఽధ్యాయః

శ్లో॥ పంచయుక్సప్తతితమే యజ్ఞావభృథ సంభ్రమః ।
సుయోధనస్య చాక్షాంత్యా మానభంగో దృశిభ్రమాత్ ॥

### పరీక్షిత్ ఉవాచ

శ్లో॥ అజాతశత్రో స్తం దృష్ట్వా రాజసూయమహోదయం ।
సర్వే ముముదిరే బ్రహ్మన్నృ దేవా యే సమాగతాః ॥ 1

టీ:- దుర్యోధనస్య ఏకస్యైవ దుఃఖే కారణం ప్రష్టు ముక్త మనువదతి. - అజాతశత్రో రితి. 1

శ్లో॥ దుర్యోధనం వర్జయిత్వా రాజానమృషయస్సురాః ।
ఇతి శ్రుతం నోభగవన్నత్ర కారణముచ్యతామ్ ॥ 2

టీ:- దుర్యోధనమితి. ఇతి శ్రుతం తన్ముఖాదేవేత్యర్థః 2

## 75 వ అధ్యాయము

డెబ్బది అయిదవ అధ్యాయమున ధర్మజుని రాజసూయ అవభృథ వైభమును చూచి కలతచెందిన దుర్యోధనుడు అసహనముతో మయసభయందు సంచరించుచు దృష్టిదోషముతో పొందిన మానభంగము వర్ణితము. ధర్మరాజు యాగము ఎల్లరకూ ప్రీతిపాత్రమైననూ ఒక్క దుర్యోధనుడే దుఃఖించుచుండుటకు కారణము చెప్పుచున్నాడు.

### పరీక్షిత్తు ఈ విధముగా అడిగినాడు

ధర్మరాజు రాజసూయయాగము ఘనముగా పరిసమాప్తి అయినందుకు దానికి విచ్చేసిన బ్రాహ్మణులు, దేవతలు, మానవులు, రాజులు, ఋషీశ్వరులందరును అపారముగా ఆనందించగా దుర్యోధనుడొక్కడు మాత్రమే కలత చెందుటకు కారణమును ఓ మునీశ్వరా ! నాకు వినిపించమని పరీక్షిత్తు అడిగినాడు. (1-2)




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ పితామహస్య తే యజ్ఞే రాజసూయే మహాత్మనః ।
బాంధవాః పరిచర్యాయాం తస్యాసన్ ప్రేమబంధనాః ॥ 3

టీ:- దుర్యోధనస్య అసహన కారణత్వేన యాగమహోత్సవమేవ పునః సింహావలోకనేన నిరూపయతి - ఏక దాంతఃపురే తస్యేత్యతః ప్రాక్తనేన గ్రంథేన. పితామహస్యేతి. ప్రేమబంధనాః ప్రేమయంత్రితాః 3

### శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు

దుర్యోధనుని ఓర్వలేనితనము కారణముగా రాజసూయయాగ మహోత్సవము మరల సింహావాలోకన రూపముగా నిరూపించు చున్నాడు. (ఈ విషయము ముందుగా చెప్పబడినదే) మీ పితామహుడు మహాత్ముడు అయిన ధర్మరాజు రాజసూయయాగమున ప్రేమ బంధముతో బంధువులందరు ఆయనకు పలువిధములైన పరిచర్యలు చేసినారు. 3

శ్లో॥ భీమోమహానసాధ్యక్షో ధనాధ్యక్షస్సుయోధనః ।
సహదేవస్తు పూజాయాం నకులో ద్రవ్యసాధనే ॥ 4

టీ:- భీమ ఇతి. పూజాయాం సమ్మానే ద్రవ్యసాధనే నానావస్తు సంపాదనే. 4

శ్లో॥ సతాం శుశ్రూషణే జిష్ణుః కృష్ణః పాదావనేజనే ।
పరివేషణే ద్రుపదజః కర్ణో దానే మహామనాః ॥ 5

శ్లో॥ యుయుధానో వికర్ణశ్చ హార్దిక్య విదురాదయః ।
బాహ్లీకపుత్రాభూర్యాద్యాయేచ సంతర్దనాదయః ॥ 6

టీ:- సతామితి. శుశ్రూషణే చందనాలేపనాదౌ (5-6)

ఆ రాజసూయయాగ మహోత్సవమున భీముడుపాకకార్యములు, దుర్యోధనుడు ధనాదుల రూపమున వచ్చిన పారితోషకముల సేకరణ, నకులుడు పూజాకార్యక్రమములు, సహదేవుడు యాగ సామగ్రి సమకూర్చుట, అర్జునుడు సత్పురుషులకు చందనాది ద్రవ్యములతో సేవచేయుట, కృష్ణుడు భక్తులను ఆదరించుట ధృష్టద్యుమ్నుడు యాగరక్షణ, కర్ణుడు దానాది కార్యక్రమములకు అధ్యక్షులై నిర్వహించినారు. (4-5)

యుయుధానుడు, వికర్ణుడు, హార్దిక్యుడు, విదురుడు, బాహ్లీకుని పుత్రులైన భూరిశ్రవాదులు, సంతర్దనాదులు ఆయా కర్మలు చేయుటకు నియోగింపబడినవారై ఆ రాజసూయయాగమున ధర్మరాజుకు శుభము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ నిరూపితా మహాయజ్ఞే నానాకర్మసుతే తదా ।
ప్రవర్తంతేస్మ రాజేంద్రరాజ్ఞః ప్రియచికీర్షవః ॥ 7

టీ:- నిరూపితాఇతి. నిరూపితాః నియుక్తాస్సంతః నానాకర్మసు ప్రవర్తంతే స్మ. 7

కలుగవలెనని ఆయా కర్మలను సక్రమముగా నిర్వహించినారు.(6-7)

శ్లో॥ ఋత్విక్సదస్య బహువిత్సు సుహృత్తమేషు
స్విష్టేషు సూనృతసమర్హణ దక్షిణాదిభిః ।
చైద్యేచ సాత్వతపతేశ్చరణం ప్రవిష్టే
చక్రుస్తతస్త్వవభృథస్నపనం ద్యునద్యామ్ ॥ 8

ఋత్విక్కులు, సభాసదులలో బహువిజ్ఞానవేత్తలు, సుమనమస్కులు మంచిమాటలతో, అలంకారములతో, దక్షిణలతో చక్కగా పూజింపబడిరి. ఛేది భూపాలుడగు శిశుపాలుడు కృష్ణునిచే మరణించిన పిమ్మట అందరును గంగానదియందు అవభృథ స్నానము చేసిరి. 8

శ్లో॥ మృదంగ శంఖ పణవాస్తూర్యా శ్చానక గోముఖాః ।
వాదిత్రాణి విచిత్రాణి నేదురావభృథోత్సవే ॥ 9

ఆ అవభృథస్నానోత్సవ సమయమున మద్దెలలు, శంఖములు, తప్పెటలు, భేరులు, గోముఖములు మొదలైన వాయిద్యములు మ్రోగినవి. 9

శ్లో॥ నర్తక్యో ననృతుర్హృష్టాగాయకా యూథశోజగుః ।
వీణావేణుతలోన్నాదస్తేషాం సదివమస్పృశత్ ॥ 10

నర్తకులు నాట్యము సలుపుచుండగా సంతసించిన గాయకులు గుంపులు కట్టి పాడుచుండగా వీణలు, వేణువులు మ్రోయుచుండగా ఆ ధ్వనికి ఆకాశమంతయు ప్రతిధ్వనించినది. 10

టీ:- ఋత్విగితి. ఋత్విజశ్చ సదస్యాశ్చసభాసదః. బహువిదశ్చ తేషు స్విష్టేషు సంయక్ పూజితేషు. సూనృతం ప్రియవాక్. సమర్హణ మలంకారాది. దక్షిణాశ్చ తాభిః. ద్యునద్యాం గంగాయాం (8-10)

శ్లో॥ చిత్రధ్వజ పతాకాగ్రైరిభేంద్రస్యందనార్వభిః ।
స్వలంకృతైర్భటైర్భూపానిర్యయూ రుక్మమాలినః ॥ 11

టీ:- చిత్రేతి. చిత్రాణి ధ్వజపతాకాగ్రాణి యేషు తైః ఇభేంద్రైః స్యందనైః అర్వభిః అశ్వైర్భటైశ్చ. ఏవం చతురంగసైన్యైః నిర్యయుః. 11

చిత్రవిచిత్రములైన ధ్వజములు, జండాలు ధరించిన ఏనుగులు, రథములు, గుర్రములు మొదలైన వానితో చక్కగా అలంకారములతో ఒప్పిన సైనికులతో కూడిన చతురంగ బలములతో యదువులు, సృంజయులు, కాంభోజులు, కురువులు, కేకయులు, కోసలులు, మొదలైన రాజులు సైన్యముతో భూమి కంపించునట్లుగా యజమాని యైన ధర్మరాజు ముందు నడువగా బయలుదేరిరి. (11-12)

శ్లో॥ యదుసృంజయ కాంభోజ కురుకేకయ కోసలాః ।
కంపయంతో భువం సైన్యైర్యజమాన పురస్సరాః ॥ 12

టీ:- యదుసృంజయేతి. యజమానో యుధిష్ఠిరః పురస్సరో యేషాం తే. 12

శ్లో॥ సదస్యర్త్విగ్ద్విజ శ్రేష్ఠా బ్రహ్మఘోషేణ భూయసా ।
దేవర్షి పితృగంధర్వాస్తుష్టువుః పుష్పవర్షిణః ॥ 13

టీ:- సదస్యేతి. సదస్యాఋత్విజః. అన్యేచ ద్విజశ్రేష్ఠాః నిర్యయుః 13

సదస్యులు, ఋత్విజులు, బ్రాహ్మణోత్తముల వేదమంత్రాలతో దేవతలు, పితృదేవతలు, గంధర్వులు సంతోషముతో పుష్పవృష్టి కురిపించిరి. 13

శ్లో॥ స్వలంకృతానరానార్యో గంధస్రగ్భూషణాంబరైః ।
విలింపత్యోఽభిషించంత్యో విజహుర్వివిధైరసైః ॥ 14

టీ:- స్వలంకృతాఇతి. కించ. గంధాదిభిస్స్వలంకృతాః. నరా నార్యశ్చ రసైః మిథో విజహ్రుః 14

వివిధములైన విలేపనములు, పూలమాలలు, ఆభరణములు, వస్త్రములతో చక్కగా అలంకృతులైన స్త్రీ పురుషులు పెక్కు సువాసనభరితమైన ద్రవ్యములను పరస్పరము పులుముకొనిరి. చల్లుకొనిరి. 14

శ్లో॥ తైలగోరసగంధోద హరిద్రాసాంద్రకుంకుమైః ।
పుంభిర్లిప్తా ప్రలింపంత్యో విజహ్రుర్వారయోషితః ॥ 15

టీ:- రసానేవాహ–తైలేతి. కించ. సాంద్రకుంకుమాదిభిః పుంభిర్లిప్తాస్తాన్ ప్రలింపంత్యోవారయోషితశ్చ విజహ్రుః 15

వివిధములైన సువాసనభరితములైన నూనెలు, పాలు, సుగంధ జలములు, పసుపు, దట్టమైన కుంకుమలు మొదలైన వానిని పురుషులు పులుమగా మైపూతలతో వానినే వారకాంతలు ఇతరులకు పూసిరి. 15

శ్లో॥ గుప్తా నృభిర్నిరగమన్నుపలబ్ధుమేత
ద్దేవ్యో యథా దివివిమానవరైర్నృ దేవ్యః ।
తామాతులేయ సఖిభిః కిల సిచ్యమానా
స్సవ్రీడహాస వికసద్వదనా విరేజుః ॥ 16

టీ:- గుప్తా ఇతి. నృభిర్గుప్తాః. రథాదియానైః నృదేవ్యః రాజపత్న్యో నిరగమన్ నిర్గతాః. ఏతదుపలబ్ధుం విమానవరైర్దేవ్యో యథా తద్వత్ మాతులేయైస్సఖిభిశ్చ పరితః సిచ్యమానాః. సవ్రీడేన హాసేన వికసంతి వదనాని యా సాం తాః. 16

మేనమామ కొడుకులతో, చెలికాండ్రతో అంతటా సుగంధ ద్రవముచల్లబడుచు సిగ్గు, చిరునవ్వులతో వికసించు ముఖములతో పురుషులతోగల రాజపత్నులు ఆకసమున విమానములందలి దేవతాస్త్రీలవలే రథములు మొదలైన వాహనములందు ప్రకాశించిరి. 16

శ్లో॥ తాదేవరానుత సఖీన్ సిషిచుర్దృతీభిః
క్లిన్నాంబరావృత గాత్ర కుచోరుమధ్యాః ।
జాత్సుక్యముక్త కబరచ్యవమాన మాల్యాః
క్షోభం దధుర్మలధియాం రుచిరైర్విహారైః ॥ 17

ఆ రాజపత్నులు మరుదులను, చెలికాండ్రను రంగుల ద్రవమును చిమ్ము చిమ్మనగ్రోవులతో, విచిత్ర పాత్రలతో రంగునీళ్ళతో తడుపుచు చల్లులాడిరి. స్త్రీలు తడిసిన బట్టలతో ఆచ్ఛాదనలేని అయవములు, స్తనములు, తొడలు, నడుములతో తీవ్రమైన కోరికతో, ముడివిడిన సిగలనుండి జారిపోవు పూలమాలలతో, మనోహర హావ భావవికారములతో కాముకులకు మనోవికారమును కలిగించిరి. 17

టీ:- తాఇతి. దేవరాన్ పతిభ్రాతౄన్. ఉత సఖీన్ సఖీనపి. దృతిభిః ఉదకనోదనచర్మ యంత్రైః. సేచనపాత్రైశ్చ. మలధియాం కామినాం. 17

శ్లో॥ ససమ్రాడ్రథమారుహ్య సదశ్వం రుక్మమాలినమ్ ।
వ్యరోచత స్వపత్నీభిః క్రియాభిః క్రతురాడివ ॥ 18

టీ:- స ఇతి. క్రియాభిః అంగేష్టిభిః. క్రతురాట్ సశరీరో రాజసూయ ఇవ. 18

ఆచక్రవర్తి ధర్మరాజు బంగారుహారతులతోఅలంకృతమైన శ్రేష్ఠమైన గుఱ్ఱములు పూన్చిన రథమును అధిరోహించి తన భార్యలతో అంగ రూపములైన వివిధ ప్రాసంగిక యజ్ఞకార్యకలాపములతో మూర్తీభవించిన యాగశ్రేష్ఠమైన రాజసూయమువలె ప్రకాశించినాడు. 18

శ్లో॥ పత్నీసంయాజావభృథ్యైశ్చరిత్వా తే తమృత్విజః ।
ఆచాంతం స్నాపయాంచ క్రుర్గంగాయాం సహ కృష్ణయా ॥ 19

ఋత్విజులు - భార్యతో కలిసి చేయవలసిన యాగసంబంధమైన అవభృథస్నానములను ధర్మరాజుకు ద్రౌపదీ సహితముగా గంగానది యందు ఆచమన పర్యంతముగా అనుష్ఠింపజేసినారు. 19

శ్లో॥ దేవదుందుభయోనేదుర్నర దుందుభిస్సహ ।
ముముచుః పుష్పవర్షాణి దేవర్షిపితృమానవాః ॥ 20

మానవులు మ్రోగించు దుందుభులతో పాటుగా దేవ దుందుభులును మ్రోగినవి. దేవతలు, ఋషులు, పితృదేవతలు, మానవులు పుష్ప వర్షమును కురిపించిరి. 20

శ్లో॥ సస్నుస్త త్రత తస్సర్వేవర్ణాశ్రమయుతాజనాః ।
మహాపాతక్యపి యతస్సద్యోముచ్యేతకిల్బిషాత్ ॥ 21

టీ:- పత్నీతి. పత్నీసంయాజాః యాగవిశేషాః. అవభృథసంబంధి అవభృథ్యం చ తైశ్చరిత్వా తాన్యనుష్ఠాయేత్యర్థః (19-21)

ఆ సమయమున అక్కడున్న సర్వ వర్ణాశ్రమాల జనులందరు అప్పుడు స్నానమాడి మహా పాపములు చేసిన వారైనను వెంటనే సర్వ పాపములనుండి విముక్తులయిరి. 21

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అథ రాజా హతే క్షౌమే పరిధాయ స్వలంకృతః ।
ఋత్విక్సదస్య విప్రాదీనానర్చాభరణాంబరైః ॥ 22

పిమ్మట ధర్మరాజు కొత్త వస్త్రములు (రెండు వస్త్రములు – అంగ వస్త్రము, కటి వస్త్రములు ధోవతి – కండువా), అలంకారములు ధరించి ఋత్విక్కులు, సదస్యులు, బ్రాహ్మణులు మొదలైనవారిని ఆభరణములు, వస్త్రములతో అర్చించినాడు. 22

శ్లో॥ బంధుజ్ఞాతినృపాన్ మిత్రసుహృదో౽న్యాంశ్చ సర్వశః ।
అభీక్ష్ణం పూజయామాస నారాయణపరో నృపః ॥ 23

టీ:- అథేతి. అహతే నూతనే ఆనర్చ అర్చితవాన్ (22-23)

బంధువులు, దాయాదులు, మిత్రులు, స్నేహితులు, ఇతరులను శ్రీమన్నారాయణస్వరూపులనెడు బుద్ధితో ధర్మరాజు విశేషముగా పూజించినాడు. 23

శ్లో॥ సర్వేజనాస్సురరుచో మణికుండలస్ర
గుష్ణీషకంచుకదుకూల మహార్ఘహారాః ।
నార్యశ్చ కుండలయుగాలక బృందజుష్ట
వక్త్రశ్రియః కనకమేఖలయా విరేజుః ॥ 24

(ధర్మరాజుచే ఇవ్వబడిన కానుకలు ధరించి) జనులందరు మణికుండలము, మాలలు, తలపాగలు, కండువాలు పట్టు వస్త్రాలు, విలువైన హారములతో, స్త్రీలు కుండలముల జంటతో, ముంగురులతో, ఇంపైన ముఖవర్చస్సులతో, బంగారు వడ్డాణములతో దేవతలవంటి కాంతితో ప్రకాశించిరి. 24

శ్లో॥ అథర్త్విజో మహాత్మనస్సదస్యా బ్రహ్మవాదినః ।
విప్రక్షత్రియవిట్ఛూద్రా రాజానో యే సమాగతాః ॥ 25

శ్లో॥ దేవర్షి పితృభూతాని లోకపాలాస్సహానుగాః ।
పూజితాస్తమనుజ్ఞాప్య స్వధామాని యయుర్ముదా ॥ 26

పిమ్మట ఋత్విజులు, మహాత్ములు, సదస్యులు, బ్రాహ్మణులు, పితృదేవతలు, సహచరులతో కూడిన దిక్పాలకులు మొదలైన యాగమునకు విచ్చేసిన వారందరు ధర్మరాజు చేసిన పూజలందుకొని, ఆయన సమ్మతితో సంతోషముగా తమతమ నివాసములకరిగిరి. (25-26)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ హరిదాసస్య రాజర్షే రాజసూయ మహోదయమ్ ।
నైవాతృప్యన్ ప్రశంసంతఃపిబన్ మర్త్యో௨మృతంయథా ॥ 27

హరిభక్తుడైన రాజర్షి ధర్మరాజు రాజసూయయాగము గొప్పదనమును దానిని దర్శించినవారు పొగుడుచు, మానవుడు అమృతమునుత్రాగుచు ఇకచాలును అనితృప్తి చెందని విధమున తృప్తిని పొందలేకపోయిరి.(ఎంత పొగిడినను అది తక్కువే అని భావము) (పొగడుటలో తనివితీరలేకపోయిరి) 27

శ్లో॥ తతోయుధిష్ఠిరో రాజా సుహృత్సంబంధిబాంధవాన్ ।
ప్రేమ్ణా నివాసయామాస కృష్ణం చ త్యాగకాతరః ॥ 28

ఆత్మీయుల ఎడబాటును తట్టుకొనలేని ధర్మరాజు స్నేహితులను దగ్గరి బంధువులను కృష్ణుని ప్రేమతో తన వద్దనే ఉండచేసెను. 28

శ్లో॥ భగవానపి తత్రాబ్దంన్యవాత్సీత్తత్ప్రియంకరః ।
ప్రస్థాప్య యదువీరాంశ్చ సాంబాదీంశ్చ కుశస్థలీమ్ ॥ 29

టీ:- సర్వఇతి. సురాణామివ రుక్ కాంతిర్యేషాం తే. మణికుండలైః సహితాః ప్ర గుష్ణీషాదయో యేషాం తే కుండలయుగేనాలకబృందేన చ జుష్టా వక్త్రశ్రీర్యాసాంతాః (24-29)

కృష్ణుడుకూడా ధర్మరాజుకు ప్రీతికలిగించుటకై సాంబుడు మొదలైన యదువీరులను కుశస్థలీపురమునకు పంపి పాండవులకు ఆనందము కలిగించుచు ఇంద్రప్రస్థమున ఏడాదిపాటుఉండెను. 29

శ్లో॥ ఇత్థంధర్మసుతో రాజా మనోరథ మహార్ణవం ।
సుదుస్తరం సముత్తీర్య కృష్ణేనాసీద్గతజ్వరః ॥ 30

టీ:- ఇత్థమితి. గతజ్వరః నిశ్చింతః ఆసీత్. 30

ఓ రాజా! ఈ విధముగా ధర్మరాజు రాజసూయయాగము చేయవలెననే అసాధ్యమైన బలమైన కోరిక అనే మహాసముద్రమును కృష్ణుని సహాయముతో అవలీలగా తరించి నిశ్చింతుడయ్యెను. 30

శ్లో॥ ఏకదాంతఃపురేతస్య వీక్ష్య దుర్యోధనశ్శ్రియం ।
అతప్యద్రాజసూయస్య మహత్త్వం చాచ్యుతాత్మనః ॥ 31

టీ:- ఏకదేతి. అచ్యుతే శ్రీకృష్ణే ఆత్మా మనః యస్య తస్య. 31

శ్రీకృష్ణుడే ఆత్మ అయిన ధర్మరాజు యొక్క సంపదను, రాజసూయయాగ మాహాత్మ్యమును చూచి అంతఃపురమందున్న దుర్యోధనుడు మిక్కిలిగా సంకట పడినాడు. 31

శ్లో॥ యస్మిన్నరేంద్ర దితిజేంద్ర సురేంద్ర లక్ష్మీ
ర్నానా విభాంతి కిల విశ్వసృజోపక్లృప్తాః ।
తాభిః పతీన్ ద్రుపదరాజ సుతోపతస్థే
యస్యాం విషక్త హృదయః కురురాడతప్యత్ ॥ 32

టీ:- యస్మిన్నితి. నరేంద్రాదీనాం లక్ష్మీః లక్ష్మ్యః విభూతయః. విశ్వసృజా మయేన. ఉపక్లిప్తాః విరచితాః తాభిస్సహ. కురురాట్ దుర్యోధనః. అతప్యత్. 32

రాజేంద్రుల, రాక్షసేంద్రుల, దేవేంద్రుల సంపదలన్నియు ద్రుపదరాజ పుత్రియైన ద్రౌపది భర్తలైన పాండునందనులను చేరినవి. వానితో రాక్షసశిల్పియైన మయుడు పలు విధములుగా విరాజిల్లునట్టి లోకోత్తరమైన సభను నిర్మించి ఇచ్చినాడు. 32

శ్లో॥ యస్మింస్తదా మధుపతేర్మహిషీ సహస్రం
శ్రోణీభరేణ శనకైఃక్వణదంఘ్రి శోభం ।
మధ్యేసుచారు కుచకుంకుమశోణహారం
శ్రీమన్ముఖం చ చలకుండల కుంతలాఢ్యమ్ ॥ 33

మయాసురుడు తన అపారమైన నిర్మాణ విద్యా చాతుర్యముతో నిర్మించిన ఆ సభలో - పిరుదుల భారముతో, మెల్లగా మ్రోగునట్టి కాలిఅందెల శోభతో, అందమైన నడుములతో, స్తనమునందలి కుంకుమలచేత ఎర్రనైన హారములతో చలించు కుండలములు, ముంగురులతో సంపన్నమైన వదనములతో, ఒప్పునట్టి భార్యా

టీ:- యస్మిన్నితి. మహిషీ సహస్రమితి బహుత్వోపలక్షణం. క్వణద్భిరంఘ్రిభిః శోభా యస్య మధ్యే సుచారు చారుమధ్యమిత్యర్థః. కుంచకుంకుమైః శోణాహారా యస్య తత్. శ్రీమంతి ముఖాని యస్యతత్. చలైః కుండలైః కుంతలైశ్చ ఆఢ్యం సంపన్నం అశోభతేతి శేషః. 33

శ్లో॥ సభాయాం మయవిద్యాయాం క్వాపి ధర్మసుతో విరాట్ ।
వృతోఽనుజైర్బంధుభిశ్చ కృష్ణేనాపిస్వచక్షుషా ॥ 34

శ్లో॥ ఆసీనః కాంచనే సాక్షాదాసనే మఘవానివ ।
పారమేష్ఠ్య శ్రియాజుష్ట స్తూయమానశ్చ వందిభిః ॥ 35

టీ:- సభాయామితి. క్వాపి కదాచిత్ విరేజ ఇతి శేషః. స్వస్య చక్షుషా హితాహితజ్ఞాపకేన.(34-35)

శ్లో॥ తత్ర దుర్యోధనో మానీ సహితోభ్రాతృభిర్నృప ।
కిరీటమాలీన్యవిశదసిహస్తః క్షిపన్ రుషా ॥ 36

టీ:- తత్రేతి. మానీ సాహంకారః.కిరీటం చ మాలా చ విద్యేతే యస్య సః న్యవిశత్ వివేశ క్షిపన్ ద్వార్స్థాదీన్ ఆపీక్షిపన్. 36

సహస్రముతో ( పలువురు అని అర్థము), బంధువులతో తమ్ములతో, మంచిచెడ్డలు విచారించి చెప్పునట్టి ఆత్మీయుడు శ్రీకృష్ణునితో కూడి ఒకానొక వసంత కాలపు దినము ధర్మరాజు పరమైశ్వర్యముతో కూడినవాడై వందిమాగధులు స్తుతించుచుండగా సుధర్మ సింహాసనమున ఆసీనుడై ఇంద్రుని వలె బంగరు గద్దెపై కొలువు తీరి యుండెను. (33-35)

ఓ రాజా! తమ్ములతో కలసి అభిమానధనుడైన సుయోధనుడు కిరీటము, మాలలతో అలంకృతుడై క్రోధముతో చేతియందలి ఖడ్గముతో ద్వారములు మొదలైన వానిని పక్కకు తొలగద్రోయుచు ఆ సభలోనికి ఆటోపముగా ప్రవేశించినాడు. 36

శ్లో॥ స్థలేభ్యగృహ్ణాద్వస్త్రాంతం మత్వాస్థలే పతత్ ।
జలేచ స్థల భ్రాంత్యామయమాయా విమోహితః ॥ 37

మయుని అద్భుతమైన మాయా నిర్మాణమునకు విభ్రాంతి చెంది సమతల ప్రదేశమును జలమని భ్రమసి బట్టలను పైకి పెట్టుకొని నడిచి జలమున్న ప్రదేశమున స్థల భ్రాంతితో కాలిడి జలములందు పడినాడు. 37

శ్లో॥ జహాస భీమస్తం దృష్ట్వాస్త్రియోనృపతయో పరే ।
నివార్యమాణా అప్యంగ రాజ్ఞా కృష్ణానుమోదితాః ॥ 38

టీ:- స్థల ఇతి. తత్ర శుద్ధాంతే స్థలే.వస్త్రాం తమభ్యగృహ్ణాత్ ఆకుంచితవాన్. కుతః. తస్మిన్ స్థల ఏవ భ్రాంత్యా జలం మత్వా జలేచ అపతత్. కుతః స్థలవద్భ్రాంత్యా.(37-38)

ఆ విధముగా పడిపోయిన దుర్యోధనునిచూచి పరిహసించ కుండగా ధర్మరాజు, కృష్ణుడు వారించగా సమ్మతించి స్త్రీలు, రాజులు, ఇతరులు మిన్నకుండినను, భీముడొక్కడు మాత్రము అతనిని చూచి పరిహసించినాడు. 38

శ్లో॥ సవ్రీడితో ర్వాగ్వదనోరుషా జ్వల
న్నిష్క్రమ్య తూష్ణీం ప్రయయౌగజాహ్వయమ్ ।
హాహేతి శబ్దస్సుమహాన భూత్సతా
మజాత శత్రుర్విమనా ఇవాభవత్ ।
బభూవ తూష్ణీం భగవాన్ భువో భారం
జిహీర్షురేష భ్రమతిస్మ యద్ద్రుశా ॥ 39

సిగ్గుతో ముఖము పక్కకు త్రిప్పుకొని కోపముతో మండిపోవుచు దుర్యోధనుడు నిశ్శబ్దముగా సభనుండి బయటకు వచ్చి హస్తినాపురము నకు వెళ్ళినాడు. అయ్యో ఏమపకారము జరుగగలదో అని కలత చెందిన సత్పురుషుల హాహాకారములు నిండి పోయినవి. ధర్మరాజు అసంతృప్తిని పొందినాడు. భూభారమును తగ్గించదలచిన కృష్ణుడు ఆనాడు కలిగిన కలహబీజముతో కౌరవుల సంహారము చేయుదును. దుర్యోధనుడు మయసభను దర్శించి దృష్టిదోషముతో తిరిగినాడు.

మయుని మాయా నిర్మాణము ఒక నిమిత్తమే. దుర్యోధనుని భ్రమ, భీమసేనుని అపహాస్యముతో ఆతని పరాభవమును గమనించి కృష్ణుడు నాకు భూభార నివారణమునకు తగిన ఉపాయము సిద్ధించినదని ఉదాసీనముగా ఉండినాడు. 39

శ్లో॥ ఏతత్తేஉభిహితం రాజన్ పృష్టోహమితి యత్త్వయా ।
సుయోధనస్య దౌరాత్మ్యం రాజసూయే మహాక్రతౌ ॥ 40

ఓ రాజా ! రాజసూయ మహాయాగమున దుర్యోధనుని దుర్మార్గమే నీవు అడిగిన ప్రశ్నకు సమాధానము. 40

టీ:- సఇతి. భువో భరంభారం జిహర్షురితి అద్యసంపాదితేన కలహబీజేన కురూణాం సంహారంకరిష్యామీతికించ. యస్య దృశా దృష్టిమాత్రేణ. దుర్యోధనో భ్రమతిస్మ భ్రాంతిం ప్రాప. మయమాయాతు నిమిత్తమాత్రం. నః భూభారహరణబీజం దుర్యోధనస్య భ్రమం భీమాదేహాస్యేన తస్య పరాభవం చ విధాయ తూష్ణీమాసీదిత్యర్థః (39-40)

శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, పంచసప్తతితమోஉధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
డెబ్బదిఐదవ అధ్యాయముసమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## షట్సప్తతితమో௨ధ్యాయః

### సాల్వ వధ కథా ప్రారంభ ఘట్టః

శ్లో॥ తతష్షట్సప్తతితమే వృష్ణిసాల్వమహామృథే ।
ద్యుమద్గదా ప్రహారేణ రణాత్ప్రద్యుమ్న నిర్గమః ॥

## 76 వ అధ్యాయము

### సాల్వ వధ కథ ఆరంభ ఘట్టము

పిమ్మట డెబ్బది ఆరవ అధ్యాయమున వృష్ణులకు–సాల్వునకి మధ్య జరిగిన ఘోర సంగ్రామమున ద్యుమంతుడను సాల్వుని మంత్రి గదా ప్రహారమునకు దెబ్బతిన్న ప్రద్యుమ్నుని అతని సారథి యుద్ధ రంగమునుండి తప్పించుట, ధర్మరాజు రాజసూయయాగమును నిర్విఘ్నముగా పూర్తి చేసి శ్రీకృష్ణుడు–సాల్వుడు మొదలైన వారిని చంపుట అను విషయము వర్ణించబడినది.

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ అథాన్యదపి కృష్ణస్య శృణు కర్మాద్భుతం నృప ।
క్రీడానరశరీరస్య యథాసౌభపతిర్హతః ॥ 1

**శ్రీశుకుడిట్లు పలికెను**

ఓ రాజా! లీలామానుషరూపుడైన శ్రీకృష్ణుని మరికొన్ని ఘనకార్యములు చెప్పెదను వినుము. వానిలో సాల్వునివధ ఒకటి. 1

శ్లో॥ శిశుపాలసఖస్సాల్వోరుక్మిణ్యుద్వాహ ఆగతైః ।
యదుభిర్నిర్జితస్సంఖ్యే జరాసంధాదయస్తథా ॥ 2

శిశుపాలుని మిత్రుడైన సాల్వుడు రుక్మిణి వివాహమునకు వచ్చి, యాదవుల చేతిలో జరాసంధాదులు ఓటమి పాలైనట్లే తాను కూడా ఓడిపోయినాడు. 2

శ్లో॥ సాల్వః ప్రతిజ్ఞామకరోచ్ఛృణ్వతాం సర్వభూభుజామ్ ।
అయాదవాం కరిష్యేక్ష్మాం పౌరుషం మమపశ్యత ॥ 3

టీ:– సంపాద్య ధర్మరాజస్య రాజసూయ మహోదయం. నిహత్య సౌభరాజాదీనథో పారమదచ్యుతః. (1–3)

అవమాన భారముతో సాల్వుడు రాజులందరు వినుచుండగా భూమిపై యాదవులు లేకుండునట్లుగా వారిని సర్వనాశనము చేయుదును. నా ప్రతాపమును చూడుడని శపథము చేసినాడు. 3

శ్లో॥ ఇతి మూఢః ప్రతిజ్ఞాయ దేవం పశుపతిం ప్రభుం ।
ఆరాధయామాసనృపః పాంసుముష్టిం సకృద్గ్రసన్ ॥ 4

టీ:- ఇతీతి. ప్రత్యహం సకృత్. పాంసుముష్టిం. ఏకాం గ్రసన్ భక్షయన్. 4

మూర్ఖుడైన సాల్వుడిట్లు ప్రతిన బూని ప్రతిరోజు పిడికెడు ధూళిని మాత్రమే భక్షించుచు మహాదేవుడైన పరమేశ్వరుని ఆరాధించాడు. 4

శ్లో॥ సంవత్సరాంతే భగవానాశు తోష ఉమాపతిః ।
వరేణ ఛందయామాస సాల్వం శరణమాగతమ్ ॥ 5

శ్లో॥ దేవాసురమనుష్యాణాం గంధర్వోరగరక్షసాం ।
అభేద్యం కామగం వవ్రే సయానం వృష్ణి భీషణమ్ ॥ 6

టీ:- సంవత్సరాంత ఇతి. ఆశుతోషోఽపి భగవానుమాపతిః శ్రీకృష్ణ విద్విషి సాల్వే వరస్య వైఫల్యం మన్యమానోన శీఘ్రం ప్రాదురభూత్. తస్యాతినిర్బంధమాలక్ష్య సంవత్సరాంతే వరేణ ఛందయామాస ఇచ్ఛాం కారితవాన్. వరంవృణీష్వేత్యువాచేత్యర్థః.(5-6)

చాలా కాలము సాల్వుడిట్లు ఆరాధించినను ఆశుతోషుడైన భగవంతుడు పార్వతీపతి శ్రీకృష్ణుని ద్వేషించు సాల్వునికి ఎట్టి వరమిచ్చినను అది విఫలమే అగునని భావించి శీఘ్రముగా అతనికి ప్రత్యక్షమై వరమును ప్రసాదించలేదు. ఐతే సాల్వుని పట్టుదలతోకూడిన దీక్షను గమనించి తనను ఆశ్రయించిన ఆతనికి సంవత్సరాంతమున ప్రత్యక్షమై కోరుకొనమని అతడడిగిన వరమును ప్రసాదించెను. 5

దేవతలు, రాక్షసులు, మనుషులు, గంధర్వులు, నాగులకు అభేద్యమై, కామగమనమును కలిగి, యాదవులకు భయంకరమైన ఒక దివ్య పురమును సాల్వుడు కోరినాడు. 6

శ్లో॥ తథేతి గిరిశాదిష్టో మయః పరపురంజయః ।
పురం నిర్మాయ సాల్వాయ ప్రాదాత్సౌభమయస్మయమ్ ॥ 7

టీ:- తథేతి. తథేతి ప్రతిజ్ఞాయ. గిరిశేనాదిష్టో మయః అయస్మయం లోహమయం పురం సౌభసంజ్ఞం నిర్మాయ రచయిత్వాప్రాదాత్. 7

ఈశ్వరుడు సరేయని రాక్షసశిల్పి మయుని ఆదేశించి శత్రు పురములను భేదించగల ఇనుముచే నిర్మితమైన సౌభమను పేరుగల పట్టణమును నిర్మింపజేసి సాల్వునికొసగెను. 7

శ్లో॥ సలబ్ధ్వాకామగం యానం తమోధామ దురాసదం ।
యయౌద్వారవతీం సాల్వోవైరం కృష్ణకృతం స్మరన్ ॥ 8

సాల్వుడు కామగమనము కలిగి, చీకటితో నిండిన, శత్రువులు ప్రవేశించుటకు వీలులేనిదగు వాహన రూపమైన నగరముతో కృష్ణుడు చేసిన అపకారమును తలచుచు ద్వారకా నగరముపైకి యుద్ధమునకు వెళ్ళినాడు. 8

శ్లో॥ నిరుధ్యసేనయా సాల్వో మహత్యా భరతర్షభ ।
పురీం బభంజో పవనాన్యుద్యానాని చ సర్వశః ॥ 9

ఓ భరతవీరా ! సాల్వుడు అపారమైన సైన్యముతో కుశస్థలీ పురమును ముట్టడించి నగరమును, పూదోటలను, ఉద్యాన వనములను నాశనము చేసినాడు. 9

శ్లో॥ సగోపురాణి ద్వారాణి ప్రాసాదాట్టాలతోళికాః ।
విహారాన్ సవిమానాగ్ర్యాన్నిపేశతుః శ్మస్త్రవృష్టయః ॥ 10

గోపురములు, తలుపులు, మేడలు, వానిపైనున్న మిద్దెలు, వాని గోడలు, క్రీడాస్థలములు మొదలైన వానిని బాణ వర్షముతో కూల్చినాడు. 10

టీ:- స ఇతి. తమసోంధకారస్య. ధామ ఆశ్రయం. అన్యైర్దురాసదం దుష్ప్రాపం. సగోపురాణీతి. ప్రాసాదాః గృహాః అట్టాలస్తదుపరిగృహాః తోళికాస్తత్పర్యంతకుడ్యాని. తాః. విహారాన్ క్రీడాస్థానాని చ స బభంజ.కించ విమానాగ్ర్యాత్తస్మాచ్ఛస్త్రవృష్టయః. పేతుః. (8-10)

శ్లో॥ శిలాద్రుమాశ్చాశనయస్సర్వా ఆసార శర్కరాః ।
ప్రచండశ్చక్రవాతోఽభూద్రజ సాచ్ఛాదితాదిశః ॥ 11

ధారా సంపాతముతో వడగండ్లు కురిసినట్లుగా శిలలు, వృక్షములు, రాళ్ళు, ఇసుక రేణువులు రాలుచు తీవ్రమైన సుడిగాలి వలన దిక్కులన్నియు దుమ్ము, ధూళితో నిండిపోయినవి. 11

టీ:- శిలా ఇతి. అసారశర్కరాః ధారాసంపాతవజ్జలోపలాః. 11





శ్లో॥ ఇత్యర్ద్యమానా సౌభేన కృష్ణస్యనగరీ భృశం ।
నాభ్య పద్యత శం రాజంస్త్రిపురేణ యథామహీ ॥ 12

ఓ రాజా ! త్రిపురాసురులు భూమిని నాశనము చేసినట్లుగా సాల్వుడు సౌభ నగరముతో కృష్ణుని ద్వారకా నగరమును నాశనముచేసి కష్టమును కలిగించినాడు. 12

శ్లో॥ ప్రద్యుమ్నో భగవాన్ వీక్ష్యబాధ్యమానా నిజాః ప్రజాః ।
మాభైష్టేత్యభయాద్వీరో రథారూఢో మహారథః ॥ 13

శ్లో॥ సాత్యకిశ్చారుధేష్ణశ్చ సాంబో౽క్రూరస్సహానుజైః ।
హార్దిక్యోభానువిందశ్చ గదశ్చ శుకసారణౌ ॥ 14

శ్లో॥ అపరేచ మహేష్వాసారథయూథపయూథపాః ।
నిర్యయుర్దంశితా గుప్తారథేభాశ్వపదాతిభిః ॥ 15

టీ:- ఇతీతి. శం సుఖం నాభ్యపద్యత. (12-15)

విలవిలలాడు తమ ప్రజల బాధలను చూచి భగవంతుడు, వీరుడు, మహారథుడైన ప్రద్యుమ్నుడు ప్రజలకభయమిచ్చుచు రథారూఢుడై యుద్ధరంగమునకు ప్రవేశించినాడు. అతని వెంట సాత్యకి, చారుధేష్ణుడు, సాంబుడు, అక్రూరుడు, ఆతని సోదరులు, హార్దిక్యుడు, భానువిందుడు, గదుడు, శుకసారణులు, ఇంకా పలువురు ధనుర్విద్యా విశారదులు, రథసైన్యాధిపతులు కవచములు, శిరస్త్రాణములు ధరించి చతురంగ బలములతో యుద్ధమునకు వచ్చినారు. (13-15)

శ్లో॥ తతఃప్రవవృతే యుద్ధం సాల్వానాంయదుభిస్సహ ।
యథా సురాణాంవిబుధైస్తుములం రోమహర్షణమ్ ॥ 16

టీ:- తత ఇతి. తుములం వ్యాకులం. రోమహర్షణం రౌద్రం. 16

అప్పుడు యుద్ధవీరులకు, సాల్వుని సైన్యమునకు, దేవతలకు, రాక్షసులకు జరిగిన భయంకరమైన యుద్ధమువలె గగుర్పాటు కలిగించునట్టి మహా సంగ్రామము జరిగినది. 16


ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.




శ్లో॥ తాశ్చసౌభాపతేర్మాయాదివ్యాస్త్రె రుక్మిణీసుతః ।
క్షణేన నాశయామాసనైశం తమ ఇవోష్ణగుః ॥ 17

టీ:- తా ఇతి. నైశం నిశిభవం. తమః ఉష్ణగుః సూర్యఇవ. 17

సౌభపతియయిన సాల్వుడు మాయతో ప్రయోగించిన దివ్యాస్త్రములను రుక్మిణీ సుతుడైన ప్రద్యుమ్నుడు రాత్రి చీకటిని సూర్యుడు పారద్రోలినట్లు క్షణకాలములో నాశనము చేసినాడు. 17

శ్లో॥ వివ్యాథ పంచవింశత్యా స్వర్ణపుంఖైరయోమయైః ।
సాల్వస్య ధ్వజినీపాలంశరైస్సన్నత పర్వభిః ॥ 18

టీ:- కించవివ్యాధేతి. స్వర్ణ మయాని పుంఖాని పృష్ఠప్రాంతాని యేషాం తైః. అయోలోహంతన్మయాని ముఖ్యాన్యగ్రాణి యేషాంతైః. ధ్వజినీపాలం సేనాన్యం సన్నతాని నిమ్నాని. పర్వాణి గ్రంధయో యేషాం తైః. 18

బంగారుపిడి, ఇనుపములికికి తగినట్లుగా వంగిన గ్రంథులుగల ఇరువదిఐదు బాణములతో ప్రద్యుమ్నుడు సాల్వుని సేనాపతిని సంహరించినాడు. 18

శ్లో॥ శరేణాతాడయత్సాల్వమేకైకేనాన్యసైనికాన్ ।
దశభిర్దశభిర్నేతౄన్వాహనాని త్రిభిస్త్రిభిః ॥ 19

టీ:- శరేణేతి. సైనికాన్ భటాన్ నేతౄన్ సారథీన్. 19

ఒక బాణముతో సాల్వుని, ఒక్కొక్క బాణముతో సైనికులను, పదేసి బాణములతో సైనికాధిపతులను, మూడేసి బాణములతో వాహనములను కొట్టినాడు. 19

శ్లో॥ తదద్భుతం మహత్కర్మ ప్రద్యుమ్నస్య మహాత్మనః ।
దృష్ట్వాతం పూజయామాసుస్సర్వేస్వపరసైనికాః ॥ 20

టీ:- తదితి. స్వపరసైనికాః స్వపరసేనయోర్వర్తమానా స్సర్వే పూజాయామాసుః సమ్మానితవంతః. 20

మహాత్ముడైన ప్రద్యుమ్నుని యొక్క అద్భుతమైన యుద్ధమును చూచి ఆయనను అతని సైనికులు, శత్రు సైనికులు మెచ్చుకొని గౌరవించిరి. 20

శ్లో॥ బహురూపైక రూపం తదృశ్యతే న చ దృశ్యతే ।
మాయామయం మయకృతందుర్విభావ్యం పరైరభూత్ ॥ 21

టీ:- బహురూపేతి. కదాచిద్బహురూపం కదాచిదేకరూపం. క్వచి ద్దృశ్యతే. క్వచిన్న దృశ్యతే. ఏవం దుర్విభావ్యం అతర్క్యమభూత్. 21

శ్లో॥ క్వచిగ్భూమౌక్వచిద్వ్యోమ్ని గిరిమూర్ధ్నిజలేక్వచిత్ ।
అలాతచక్రవద్భ్రామ్యత్సౌభం తద్దురవస్థితమ్ ॥ 22

శ్లో॥ యత్ర యత్రోపలక్ష్యేత ససౌభస్సహసైనికః ।
సాల్వస్తతస్తతోముంచన్ శరాన్ సాత్వతయూథపాః ॥ 23

టీ:- కించ.క్వచిదితి.ఏవం తత్ దురవస్థితం అనవస్థితం.చాభూత్. (22-23)

శ్లో॥ శరైరగ్న్యర్క సంస్పర్శైరాశీ విషదురాసదైః ।
పాత్యమాన పురానీకస్సాల్వో ముహ్యత్పరేరితైః ॥ 24

టీ:- శరైరితి. అగ్నివద్దాహకః అర్క వత్సంశోషకః యుగపత్సర్వతస్సం స్పర్శో యేషాం తైః. ఆశీవిషవదేకదేశస్పర్శమాత్రేణ మారకత్వాద్దురాసదైః

మయుడు నిర్మించిన ఆ సౌభము ఒకసారి ఏకరూపముతోను, మరొకసారి పెక్కు రూపములతోను కనబడును. ఇంకోసారి అసలే కనబడదు. అది మాయమై ఎక్కడున్నదో శత్రువులు ఊహించుటకు సాధ్యము కానిది. 21

ఒక్కోసారి భూమిపై, ఒక్కోసారి ఆకాశమున, మరోసారి పర్వత శిఖరమున, ఇంకొకసారి జలములందున్నదై వలయాకారముగా త్రిప్పునట్టి మండే కొరివి కట్టెలాగా తిరుగుచు ఒక్కోసారి కనపడక లేనిదే అయినది. 22

ఎప్పుడెప్పుడు సాల్వుడు సైనికులతో కూడి సౌభమున కనబడునో అప్పుడు వారిపై యాదవ సైన్యాధిపతులు బాణ వర్షమును గుప్పించిరి. 23

అగ్నివలె కాల్చునట్టి, సూర్యునివలె తాపమును కలిగించునట్టి, ఒకే స్పర్శతో మరణమును కలిగించు పాముకాటు వంటి బాణములను శత్రువులైన యాదవులు ప్రయోగించగా పురము, సైన్యము చీల్చబడి సాల్వుడు మోహమును పొందినాడు. 24

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

దుస్సహైః పాట్యమానం పురమనీకానిచ యస్య సః. పరైర్యదుభిరీరితైర్ముక్తైః. 24

శ్లో॥ సాల్వానీకపశస్త్రాస్త్రైర్వృష్ణి వీరాభృశార్దితాః ।
నతత్యజూరణం స్వంస్వంలోకద్వయ జిగీషవః ॥ 25

టీ:- సాల్వేతి. భృశార్దితా అపి స్వం స్వం రణం స్వాం స్వాం యుద్ధ భూమిం. 25

శ్లో॥ సాల్వమాత్యోద్యుమాన్నామ ప్రద్యుమ్నంప్రాక్ప్రపీడితః ।
ఆసాద్యగదయామౌర్వ్యా వ్యాహత్య వ్యనదద్బలీ ॥ 26

టీ:- సాల్వేతి. మౌర్వ్యా కార్ష్ణాయసమయ్యా వ్యాహత్య ప్రహత్య. 26

శ్లో॥ తంద్యుమద్గదయా శీర్ణవక్షస్థలమరిందమం ।
అపోవాహరణాత్సూతో ధర్మ విద్దారుకాత్మజః ॥ 27

శ్లో॥ లబ్ధసంజ్ఞోముహూర్తేన కార్ష్ణిస్సారథిమబ్రవీత్ ।
అహో అసాధ్విదం సూత యద్రణాన్మే௨వ కర్షణమ్ ॥ 28

టీ:- తమితి. తం ప్రద్యుమ్నం. అపోవాహ అన్యతో నినాయ. (27-28)

సాల్వుని సైనికులు శస్త్రములతో యుద్ధవీరులు తీవ్రముగా గాయపడినను యుద్ధమున గెలిచి కీర్తినికాని, మరణించిన వీరస్వర్గమును కాని పొందవలెనను పట్టుదలతో యుద్ధభూమిని వదలరైరి. 25

ముందుగా ప్రద్యుమ్నుని చేతిలో దెబ్బతిన్న సాల్వుని మంత్రి ద్యుమంతుడనే వాడు మరల ప్రద్యుమ్నుని సమీపించి అతడు బాణము సంధించుటకు అల్లె త్రాడును లాగునంతలోనే ఆతనిని కొట్టి సంతోషముతో పెడబొబ్బ పెట్టినాడు. 26

శత్రుదమనుడైన ద్యుమంతుడు బలమైన గదతో ప్రద్యుమ్నుని రొమ్ములు చీల్చగా అతనిని ధర్మవేత్త అయిన శ్రీకృష్ణుని సారథి దారకుని పుత్రుడే ప్రద్యుమ్నునికి సారథియై యుద్ధరంగము నుండి తొలగించి పక్కకు కొనిపోయినాడు. 27

ప్రద్యుమ్నుడు క్షణకాలము మాత్రముననే స్పృహలోనికి వచ్చి సారథితో ఓ సూతుడా ! నీవు నన్ను యుద్ధరంగము నుండి తప్పించి పొరపాటు చేసితివి. 28

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ నయదూనాం కులేజాత శ్శ్రూయతేరణ విచ్యుతః ।
వినా మత్క్లీబచిత్తేన సూతేన ప్రాప్తకల్మషాత్ ॥ 29

టీ:- నేతి. మత్ వినా క్లీబం చిత్తం యస్య తేన త్వయా సూతేన. 29

శ్లో॥ కిన్నువక్ష్యేஉభి సంగమ్యపితరౌరామకేశవౌ ।
యుద్ధాద్ధర్మ్యాదపక్రాంతః పృష్టస్తత్రాత్మనఃక్షమమ్ ॥ 30

టీ:- కిన్వితి. పితరౌ రామకేశవౌ. అభిసంగమ్య తత్పార్శ్వం గత్వా. తాభ్యాం పృష్టః. స్వయోగ్యం కిం నువక్ష్యామితి. 30

శ్లో॥ వ్యక్తం మేకథయిష్యంతి హసంత్యోభ్రాతృజామయః ।
క్లైబ్యం కథం కథం వీరతవాన్యైః కథ్యతాంమృధే ॥ 31

టీ:- వ్యక్తమితి, భ్రాతృభార్యాః. వ్యక్తం నిశ్చితం. యత్క్లైబ్యం కథయిష్యతి. తత్కథనమనుకరోతి. - కథం కథమితి. 31

నీ వల్ల యుద్ధవీరుల వంశమున జన్మించిన నేను నా లోపము లేకపోయినను పేడి చిత్తముగల సూతుని వలన కలిగిన పాపము కారణముగా యుద్ధము నుండి పారిపోయిన వాడిననే అపకీర్తి పొందితిని. 29

నా తండ్రులైన బలరామకృష్ణులు నన్ను దరిచేరి ధర్మమునుండి, యుద్ధమునుండి తొలగిన నన్ను నీ యోగ్యత ఇంతేనా అని అడిగినచో నేనేమి చెప్పవలెను. 30

ఈ విషయము నాతమ్ముల భార్యలు విని ఓ వీరుడా! నీ పెడతనమును వ్యర్థముగా నీ సారథి పెడతనముగా చెప్పుచున్నావని నవ్వి పోగలరు అని ప్రద్యుమ్నుడు సారథిని నిష్ఠురములాడెను. 31

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

**సూతోవాచ**

శ్లో॥ ధర్మం విజానతాయుష్మన్ కృతమేతన్మయావిభో ।
సూతఃకృచ్ఛ్రగతం రక్షేద్రథినం సారథిం రథీ ॥ 32

టీ:-ధర్మమితి. విభో హే సమర్థ. ఏతదపసర్పణం ధర్మమాహ - సూత ఇతి . 32

శ్లో॥ ఏతద్విదిత్వాతు భవాన్మయా పోవాహితో రణాత్ ।
ఉపసృష్టః పరేణేతిమూర్ఛితో గదయాహతః ॥ 33

టీ:- ఏతదితి. అపోవాహితః అపనీతః ఉపసృష్టః ఉపసర్గం పీడాం ప్రాప్త ఇతి కృత్వా యతః పరేణ శత్రుణా గదయా హతస్సన్. మూర్ఛితో నిస్సంజ్ఞతాం గతో భవా నితి. 33

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, షట్సప్తతితమోఽధ్యాయః**

**సూతుడిట్లు చెప్పినాడు**

ఓ ప్రభూ! ఆయుష్మంతుడా ! సంకట పరిస్థితులలో రథికుడు సారథిని, సారథి రథికుని రక్షించ వలెననెడి ధర్మము తెలిసియే నేనీ పని చేసితిని. 32

శత్రువు గదతో మోదగా మూర్ఛపొంది నీవు స్పృహ కోల్పోయినందువలన నేను యుద్ధ రంగమునుండి తప్పించితినని సారథి ప్రద్యుమ్నునితో చెప్పినాడు. 33

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు డెబ్బదిఆరవ అధ్యాయముసమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## సప్తసప్తతితమోఽధ్యాయః

శ్లో॥ సప్తయుక్సప్తతితమే నానామాయా విచక్షణః ।
కృష్ణేనాగత్య సాల్వస్తు హతసౌభంచ చూర్ణితమ్ ॥

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ సతూపస్పృశ్యసలిలం దంశితో ధృతకార్ముకః ।
నయమాం ద్యుమతః పార్శ్వం వీరస్సేత్యాహ సారథిమ్ ॥ 1

టీ:- ఆ ఇతి. దంశితః సన్నద్ధః. 1

శ్లో॥ విధమంతం స్వసైన్యాని ద్యుమంతం రుక్మిణీసుతః ।
ప్రతిహత్య ప్రతివిధ్యన్నా రాచైరష్టభిస్స్మయన్ ॥ 2

టీ:- విధమంతమితి. విధమంతం క్షపయంతం. ప్రతిహృత్య నిరుధ్య. 2

శ్లో॥ చతుర్భిశ్చతురోవాహాన్ ఘాతమేకేన చాహనత్ ।
ద్వాభ్యాం ధనుశ్చ కేతుం చ ద్యుమతోఽన్యేనవై శిరః ॥ 3

టీ:- అష్టానాం వినియోగమాహ - చతుర్భిరితి. 3

## 77 వ అధ్యాయము

డెబ్బది ఏడవ అధ్యాయమున పెక్కు మాయలందు నిపుణుడైన శ్రీకృష్ణుడు వచ్చి సాల్వుని వధించుట, అతని సౌభమును పిండిపిండి చేయుట విషయము.

### శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు

ప్రద్యుమ్నుడు ఆచమనముచేసి పరిశుద్ధుడై కవచమును ధరించి విల్లు పట్టుకొని సారథితో తనను వీరుడైన ద్యుమంతుని దగ్గరకు కొని వెళ్ళమని ఆదేశించినాడు. 1

తన సైన్యమును నాశనము చేయుచున్న ద్యుమంతుని రుక్మిణీ పుత్రుడైన ప్రద్యుమ్నుడు నిరోధించి తనకు కలిగిన అవమానమునకు ప్రతీకారముగా చిరునవ్వు నవ్వుచూ ఎనిమిది బాణములను ప్రయోగించి వానిలో నాలుగు బాణములతో అతని రథాశ్వములను, ఒకదానితో అతని సారథిని చంపి, ఒక్కొక్కదానితో అతని ధ్వజమును, విల్లును విరిచి, ఎనిమిదవ బాణముతో అతని శిరస్సును ఖండించెను. (2-3)

శ్లో॥ గదసాత్యకి సాంబాద్యాజఘ్నుస్సౌభపతేర్బలమ్ ।
పేతుస్సముద్రేసౌభేయా స్సర్వేసంచ్ఛిన్న కంధరాః ॥ 4

టీ:- గదేతి. సౌభేయాః సౌభస్థాః. 4

గదుడు, సాత్యకి, సాంబుడు మొదలైన వారు సౌభాధిపతియైన సాల్వుని సైన్యమును సంహరించిరి. వారు తలలు తెగినవారై సౌభమునుండి సముద్రమున పడిపోయిరి. 4

శ్లో॥ ఏవం యదూనాం సాల్వానాం జఘ్నుతామితరేతరమ్ ।
యుద్ధం త్రిణవరాత్రం తదభూత్తులముల్బణమ్ ॥ 5

టీ:- ఏవ మితి. నవానాం రాత్రీణాం సమాహారో నవరాత్రం త్రయాణాం నవరాత్రాణాం సమాహారస్త్రినవరాత్రం. సప్తవింశతిరహో రాత్రాణీత్యర్థః. తుములం సంకులం ఉల్బణం ఘోరం. 5

ఈ విధముగా యాదవులు, సాల్వుని సైన్యము ఒకరికొకరు చంపుకొనుచూ ఇరువదిఏడు రోజులు ఘోరముగా సంకుల సమరము చేసిరి. 5

శ్లో॥ ఇంద్రప్రస్థంగతః ఆహూతో ధర్మసూనునా ।
రాజసూయే చ నిర్వృత్తే శిశుపాలే చ సంస్థితే ॥ 6

శ్లో॥ కురువృద్ధాననుజ్ఞాప్యమునీంశ్చ ససుతాం పృథామ్ ।
నిమిత్తాన్యతిఘోరాణి పశ్యన్ ద్వారవతీంయయౌ ॥ 7

టీ:- పరమతముపన్యస్యతి. - ఇంద్రప్రస్థ గత ఇతి. (6-7)

ఇక్కడ వేరే విషయము చెప్పుచున్నాడు. - శ్రీకృష్ణుడు ధర్మరాజు ఆహ్వానముపై రాజసూయయాగమునకు వెళ్ళి అది పరిసమాప్తి అయిన పిమ్మట శిశుపాలుని కూడా సంహరించి కురువృద్ధుల అనుమతి వడసి, మేనత్త కుంతి, పాండవులు వీడ్కోలు చెప్పగా బయలుదేరి, భయంకరమైన అపశకునములు కలుగుటను చూచి ద్వారవతికి మరలివచ్చెను. (6-7)

శ్లో॥ ఆహచాహమిహాయాత ఆర్యమిత్రాభిసంగతః ।
రాజన్యాశ్చైద్యపక్షీయా నూనం హన్యుః పురీంమమ ॥8

టీ:- ఆహేతి. స్వగతమేవ పథి చింతావిజృంభితమాభాషణం. ఆర్యమిత్రాభిసంగతో బలభద్రాది సహితః. 8

శ్లో॥ వీక్ష్యతత్కదనం స్వానాం నిరూప్యపురరక్షణమ్ ।
సౌభం చ సాల్వరాజం చ దారుకం ప్రాహ కేశవః ॥ 9

టీ:- వీక్ష్యేతి. దుర్నిమిత్తదర్శనాకులచిత్త ఏవం చింతయన్ ద్వారకామాగత్య స్వానాం కదనం వీక్ష్య సౌభం చ సాల్వరాజంచ వీక్ష్య రామంపురరక్షణం ప్రతినిరూప్యనియుజ్య దారుకం ప్రాహేత్యన్వయః 9

శ్లో॥ రథం ప్రాపయ మే సూత సాల్వస్యాంతికమాశు వై ।
సంభ్రమస్తేన కర్తవ్యోమాయావీ సౌభరాడయమ్ ॥ 10

టీ:- రథమితి. తే త్వయా. 10

మార్గమధ్యమున తీవ్రమైన చింతకులోనైన కృష్ణుడు తనలో ఈ విధముగా అనుకొన్నాడు. (స్వగత భాషణము) - అయ్యో బలభద్రాదులతో కూడా వచ్చి శిశుపాలుని పక్షమున చేరిన రాజుల గర్వమును నాశనము చేసి తిరిగి ద్వారకకు వచ్చుచు తన నగరమునకు కీడు కలిగియుండునని అపశకునముల కారణముగా మనస్సులో కలత చెంది, ద్వారకకు చేరి సౌభానగరాధిపతి సాల్వునికి తన వారికి కలుగుచున్న యుద్ధమును చూచి బలరామునికి నగర రక్షణ బాధ్యతను అప్పగించి తన సారథి దారుకుని అక్కడే ఉండనియమించి కృష్ణుడతనితో ఇట్లు చెప్పినాడు. (8-9)

ఓ సూతుడా ! నా రథమును సాల్వుని వద్దకు శీఘ్రముగా గొనిపొమ్ము. మాయావి అయిన ఈ సౌభరాజు చాలా తీవ్రముగా కనపడుచున్నాడు. ప్రస్తుతము అతనిని నిరోధించుట అవసరమైన కర్తవ్యము అని కృష్ణుడు చెప్పినాడు. 10

శ్లో॥ ఇత్యుక్తశ్చోదయామాసరణమాస్థాయ దారుకః ।
విశంతం దదృశుస్సర్వే స్వే పరే చారుణానుజమ్ ॥ 11

టీ:- ఇతీతి. ఆస్థాయ సమ్యగధిష్ఠాయ అరుణానుజం ధ్వజే వర్తమానం గరుడం. 11

అని చెప్పి కృష్ణుడు యుద్ధసన్నద్ధుడై రథమునధిరోహించగా కృష్ణుని మాట ప్రకారముగా దారుకుడు సాల్వుని వైపునకు రథమును నడిపెను. యుద్ధరమగమున ప్రవేశించునట్టి గరుడ ద్వజుడైన కృష్ణుని యాదవులు, సాల్వుని బలగము నందలి సైనికులు దర్శించిరి. 11

శ్లో॥ సాల్వశ్చ కృష్ణమాలోక్య హతప్రాయబలేశ్వరః ।
ప్రాహిణోత్కృష్ణసూతాయ శక్తిం భీమరవాంమృధే ॥ 12

సాల్వుడు కృష్ణుని చూచి తన బల సంపత్తి నశించిన వాడై కృష్ణుని సారథి దారుకుని పైకి భయంకరమైన శబ్దముతో మ్రోయునట్టి శక్తి అనే ఆయుధమును యుద్ధములో ప్రయోగించినాడు. 12

శ్లో॥ తామాపతంతీం నభసి మహోల్కామివ రంహసా ।
భాసయంతీం దిశశ్శౌరిస్సాయకైశ్శతధాచ్ఛినత్ ॥ 13

టీ:- సాల్వ ఇతి. హతప్రాయస్య బలస్య ఈశ్వరః. (12-13)

దిశలు వెలిగించుచు ఆకాశమునుండి వేగముగా మీదకు వచ్చుచున్న పెద్ద ఉల్క వలె సారథిపై పడుచున్న సాల్వుడు ప్రయోగించిన శక్తి ఆయుధమును కృష్ణుడు బాణములతో నూరు ముక్కలుగా ఖండించినాడు. 13

శ్లో॥ తం చ షోడశభిర్బాణైర్విద్ధ్వా సౌభం చ ఖే భ్రమత్ ।
అవిధ్యచ్ఛరసందోహైః ఖంసూర్య ఇవరశ్మిభిః ॥ 14

సాల్వుని పదునారు బాణములతో, ఆకాశమున తిరుగుచున్న సౌభమును బాణసముదాయములతో కృష్ణుడు చీల్చినాడు. (ఇట్లనుటలో కృష్ణునికి-ఆకాశమున అనేక కిరణ సముదాయములతో ప్రకాశించు సూర్యునితో పోలిక సిద్ధించినది. అపారమైన వేగము

టీ:- తమితి. తం చ సాల్వం శరసందోహైః శరజాలైః. ఖం సూర్య ఇవ రశ్మిభిరితి. సునీలత్వవిపులాత్వాదభిరాకాశోపమా సౌభస్య. అచింత్యవేగత్వ బహుత్వాదిభిశ్శరణాం రశ్మిసాదృశ్యం. అయత్నేనైవ రశ్మివత్ శరజాలప్రసారణాత్సూర్యతుల్యః శ్రీకృష్ణ ఇతి. 14

గల అనంతమైన బాణ సముదాయమును కృష్ణుడు సౌభముపై గుప్పించినందున కిరణ తుల్యమైన బాణములకు రశ్మితుల్యత అప్రయత్నముగనే సూర్యరశ్మి వలే అనంత బాణ జాలముల ప్రయోగించినందు వల్ల సూర్యతుల్యతలు సిద్ధించినవి) 14

శ్లో॥ సాల్వశ్శౌరేస్తు దోస్సవ్యం సశార్ఙ్గం శార్ఙ్గధన్వనః ।
బిభేద నృపతద్ధస్తాత్బార్ఙ్గమాసీత్తదద్భుతమ్ ॥ 15

శార్ఙ్గధనువును ధరించిన కృష్ణుని ఎడమ చేతిని సాల్వుడు దెబ్బ కొట్టగా ఆశ్చర్యముగా ఆయన చేతినుండి జారిపడినది. 15

శ్లో॥ హాహాకారోమహానాసీద్భూతానాం తత్రపశ్యతామ్ ।
వినద్య సౌభరాదుచ్చైరిదమాహ జనార్దనమ్ ॥ 16

ఆ విషయమును చూచినవారు పెద్దపెట్టున హాహాకారములు చేసినారు. సాల్వుడు గర్వముతో సౌభమున ఉండి గట్టిగా బొబ్బపెట్టుచు చులకనగ కృష్ణునితో ఈ విధముగా అన్నాడు. 16

టీ:- సాల్వ ఇతి. దోర్బాహుం. (15-16)

శ్లో॥ యత్వయా మూఢ నస్సఖ్యుర్భార్యాత్వపహృతేక్షతామ్ ।
ప్రమత్తస్స సభామధ్యే త్వయా వ్యాపాది తస్సఖా ॥ 17

ఓ మూఢుడా ! మా స్నేహితుడయిన శిశుపాలుని భార్యను అపహరించితివి. అతడు అజాగ్రత్తలో ఉండగా మేమందరము చూచుచుండగా సభా మధ్యమున సంహరించితివి. 17

టీ:- యదితి. సఖ్యుశ్శిశుపాలస్య ఈక్షతామస్మాకం ప్రమత్తః అనవహితః. వ్యాపాదితః నిహతః. 17

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తం త్వాద్య నిశితైర్బాణైరపరాజిత మానినమ్ ।
నయామ్య పునరావృత్తిం యదితిష్ఠేన్మమాగ్రతః ॥ 18

అట్టి నిన్ను నా వాడిబాణములతో అజేయుడనను గర్వము గల నీవు నాయెదుట నిలబడినచో నిన్ను తిరిగిరాని లోకములకు ఈ విధమున పంపుదునని సాల్వుడు దుర్భాషలాడినాడు. 18

శ్రీకృష్ణ ఉవాచ

శ్రీకృష్ణుడిట్లు బదులిచ్చెను

శ్లో॥ వృధ్ధాత్వంకత్థసే మంద నపశ్యస్యంతికే౽ంతకమ్ ।
పౌరుషం దర్శయంతి స్మశూరా న బహుభాషిణః ॥ 19

ఓ మూర్ఖుడా ! వ్యర్థముగా ఎందుకు విఱ్ఱవీగెదవు. నీకు అతి సమీపమున మృత్యువున్నదనే విషయము తెలియలేకున్నావు. నిష్ప్రయోజనముగా పౌరుషమును ప్రదర్శించుచుంటివి. శూరులైన వారు వ్యర్థముగా మాట్లాడరు. 19

శ్లో॥ ఇత్యుక్త్వా భగవాన్ సాల్వం గదయా భీమవేగయా ।
తతాడ జత్రౌ సంక్రుద్ధ స్సచ కంపే వమన్న సృక్ ॥ 20

అని చెప్పి భగవంతుడైన శ్రీకృష్ణుడు కోపముతో వేగముగా తన గదకౌమోదకిని గిరగిర త్రిప్పి సాల్వుని కొంకులపై (మూపు సందులపై) మోదినాడు. దానితో అతడు రక్తము కక్కుచు వణికి పోయినాడు. 20

శ్లో॥ గదాయాం సనివృత్తాయాం సాల్వస్త్వంతరధీయత । 21

శ్రీకృష్ణుని గద సాల్వుని మోది మరల కృష్ణుని వద్దకు తిరిగి వచ్చిన వెంటనే సాల్వుడు అదృశ్యమైనాడు. 21

శ్లో॥ తతోముహూర్త ఆగత్య పురుషశ్శిరసాచ్యుతమ్ ।
దేవక్యాప్రేషితో౽స్మీతి నత్వా ప్రాహ వచో రుదన్ ॥ 22

వెంటనే ఒక పురుషుడు కృష్ణుని వద్దకు వచ్చి తలవంచి నమస్కరించి దుఃఖించుచు తాను దేవకీదేవి పంపగా వచ్చితినని చెప్పినాడు. 22

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాభాగో పితాతే పితృవత్సల ।
బద్ధ్వాపనీతస్సాల్వేన సౌనికేనయథాపశుః ॥ 23

టీ:- తమితి. అపరాజితోऽహమితి. మానవంతం అపునరావృత్తిం మృత్యుం తిష్ఠేః స్థాస్యసి. (18-23)

ఓ కృష్ణా! పితృ వాత్సల్యమును పొందిన మహానుభావా ! మీతండ్రిగారిని బంధించి సాల్వుడు కటికవాడు. పశువును బంధించుకొని వెళ్ళినట్లుగా లాగుకొని వెళ్ళినట్లు దేవకీ మాటగా దూత కృష్ణునికి వివరించినాడు. 23

శ్లో॥ నిశమ్య విప్రియం కృష్ణోమానుషీం ప్రకృతిం గతః ।
విమనస్కో ఘృణీ స్నేహాద్బభాషే ప్రాకృతో యథా ॥ 24

మనస్సుకు కఠినమైన మాటవిని స్వయముగా సర్వజ్ఞుడైనను కొంతసేపు రిక్తవోయి సామాన్యమైన మానవుని వలె తనవారి పట్లగల ప్రేమభావముచేత కారుణ్యముతో సామరత్వమును పొంది ఇట్లు మాట్లాడినాడు. 24

శ్లో॥ కథం రామమసంమత్తం జిత్వాజేయంసురాసురైః ।
సాల్వేనాల్పీయసా నీతః పితా మే బలవాన్ విధిః ॥ 25

సురాసురులకును జయింప వీలులేని మిగుల జాగరూకుడైన బలరాముని జయించి బలహీనుడైన సాల్వుడు మాతండ్రి గారిని ఎలా బంధించుకొని పోయినాడు? ఆహా విధి బలీయమైనది కదా! అని అన్నాడు. 25

శ్లో॥ ఇతిబ్రువాణే గోవిందే సౌభరాట్ప్రత్యుపస్థితః ।
వసుదేవమివానీయ కృష్ణం చేదమువాచహ ॥ 26

టీ:- నిశమ్యేతి. ఘృణీ దయావాన్. (24-26)

కృష్ణుడీవిధముగా అనుచుండగా సౌభాపతి సాల్వుడు వసుదేవుని బంధించి తెచ్చి కృష్ణునితో ఇట్లు పలికినాడు. 26

శ్లో॥ ఏష తే జనితానీతో యదర్థమిహ జీవసి ।
వధిష్యే వీక్షతస్తే௨ముమీశశ్చేత్పాహి బాలిశ ॥ 27

ఓ మూర్ఖుడా ! నీకు ప్రాణప్రియుడైన నీ తండ్రిని తెచ్చితిని. నీవు చూచుచుండగనే నేనితనిని వధింతును. నీకు సామర్థ్యమున్నచో కాపాడుకొనుమన్నాడు. 27

శ్లో॥ ఏవం నిర్భర్త్స్యమాయావీ ఖడ్గేనానవే దుందుభేః ।
ఉత్కృత్యశిర ఆదాయ ఖస్థంసౌభం సమావిశత్ ॥ 28

టీ:- ఏష ఇతి. జనితా.జనయితా ఈశశ్చేచ్ఛక్తశ్చేత్. (27-28)

ఇట్లు బెదిరించి వసుదేవుని తలను ఖండించి దానితో మాయావి అయిన సాల్వుడు ఆకాశమున ఉన్న సౌభమును ప్రవేశించినాడు. 28

శ్లో॥ తతోముహూర్తం ప్రకృతావుపప్లుత
స్స్వబోధ ఆస్తస్వజనానుషంగతః ।
మహానుభావస్తదబుధ్యతాసురీం
మాయాంససాల్వప్రహితాంమయోదితామ్ ॥ 29

టీ:- తత ఇతి. స్వభోదః స్వతస్సిద్ధజ్ఞానవానపి. స్వజనస్నేహతః ప్రకృతౌమానుషస్వభావే ఉపప్లుతః నిమగ్నః ఆస్త అతిష్ఠత్. తతస్తత్సర్వమాసురీం మాయామబుధ్యత మాయేయమితి జ్ఞాతవాన్.29

అప్పుడు పరమాత్మ అయిన కృష్ణుడు స్వయముగా జ్ఞానవంతుడైనప్పటికీ ఆత్మీయుల పట్ల ప్రేమభావన యందు మునిగి సామాన్యమైన మానవునివలె ఏమీ చేయలేక మిన్నకుండెను. వెంటనే అదంతయు సాల్వుడు కల్పించిన మయుని ప్రభావము చేత ఏర్పడిన రాక్షసమాయ అని తెలిసుకొన్నాడు. 29

శ్లో॥ నతత్ర దూతం న పితుః కళేబరం
ప్రబుద్ధ ఆజౌయదపశ్యదచ్యుతః ।
స్వాప్నం యథాచాంబర చారిణం రిపుం
సౌభస్థ మాలోక్య నిహంతుముద్యతః ॥ 30

టీ:- నేతి.స్వాప్నం స్వప్నప్రపంచం యథా. 30

అప్పుడక్కడ దూతకాని, తన తండ్రి శవముకాని లేవు. యుద్ధ రంగమున కృష్ణుడు దర్శించినదంతయుకలవలె అసత్యముకాగా, కృష్ణుడు స్మృతిలోనికివచ్చి ఆకాశమున సంచరించుచున్న సౌభము నందున్న శత్రువు సాల్వుని చూచి వానిని సంహరించుటకు సిద్ధపడెను. 30

శ్లో॥ ఏవం వదంతి రాజర్షే ఋషయః కేచనాన్వితాః ।
యత్స్వవాచో విరుధ్యేరన్ననూనంతే స్మరంత్యను ॥ 31

టీ:- ఏవం పరమతముపన్యస్తం నిరాకరోతి- ఏవమితి.కేచ కేచన నాన్వితాః అనన్వితాః పూర్వాపరానుసంధానరహితాః. తదాహ- యత్స్వవాచ ఇతి. తన్మానుస్మరంతీత్యర్థః. అయమభిప్రాయః- నతావద్రాజసూయార్థం రామేణ సహగతః శ్రీకృష్ణః సంకర్షణమను జ్ఞాప్యేతి. పూర్వముక్తత్వాత్. నచేంద్రప్రస్థం గతే కృష్ణే సాల్వగమనం. సాల్వ సంగ్రామవ్యాసక్తేన మయా యుష్మద్ద్యూతం న జ్ఞాతమితి కామ్యకవనస్థాన్ పాండవాన్ సాంత్వయతా శ్రీకృష్ణే నోక్తమితి వ్యాసోక్తేరితి. 31

ఈ విధముగా ఇతరుల అభిప్రాయమును చెప్పుటకు వ్యతిరేకించుచున్నాడు. ఓ పరీక్షిత్తూ ! పూర్వాపరములను తర్కము తెలియని కొందరు తమ మాటలను తామే విరోధించి తాము చెప్పిన అంశమును తామే ఆచరించరు. - దీని అభిప్రాయమిది. - కృష్ణుడు రాజసూయమునకు వెళ్ళుటకై అగ్రజుడైన బలరాముని అనుమతిని పొంది వచ్చినట్లు ముందుగా చెప్పినందువలన కృష్ణుడు రాజసూయ యాగమునకు బలరామునితో కలసి వచ్చుట అసత్యము. కృష్ణుడు ఇంద్రప్రస్థమునకు వెళ్ళినప్పుడు సాల్వుడు రాలేదు.నేను సాల్వునితో యుద్ధము చేయుచున్నందు వలన మీ జూదము గురించి నాకు తెలియదని సర్వము కోల్పోయి కామ్యకవనముందున్న పాండవులను కృష్ణుడు ఓదార్చుచు చెప్పినట్లు వ్యాసుడే చెప్పినందువలన ఇదంతయు అసత్యము. 31

శ్లో॥ క్వ శోకమోహౌస్నేహోవా భయంవా జ్ఞాన సంభవమ్ ।
క్వ వా ఖండిత విజ్ఞాన జ్ఞానైశ్వర్యస్సురేడితః ॥ 32

టీ:- అసంభావితం చేత్యాహ.-క్వేతి. భయం వా దుర్నిమిత్తదర్శన కృతం నూనం హన్యుః పురీం మమేతి యదుక్తం. యచ్చ హస్తాచ్ఛార్ఙ్గం నృపతదితి ఉక్తం. తద్భయం వా క్వేతి. అజ్ఞానేన సంభవో యస్య తత్. అఖండితాని విజ్ఞానజ్ఞానైశ్వర్యాణి యస్యసః. తత్ర విజ్ఞానం స్వరూప విషయం. జ్ఞానం బాహ్యవిషయం. 32

శ్లో॥ యత్పాదసేవోర్జితయాత్మ విద్యయా
హిన్వంత్యనాద్యాత్మ విపర్యయగ్రహమ్ ।
లభంత ఆత్మీయ మనంతమైశ్వరం
కుతో నుమోహః పరమస్య సద్గతేః ॥ 33

టీ:- కించ. యదితి. యస్య పాదసేవయా ఊర్జితా పుష్కలాయా ఆత్మవిద్యా తయా. అనాదిశ్చాసావాత్మవిపర్యయగ్రహశ్చ. అహంకృశః సుఖీ దుఃఖీత్యాదిలక్షణః తం హిన్వంతి వినాశయంతి.సంతః ఐశ్వర్యం పదం చ. తస్య సతాంగతేఃకుతో నుమోహ ఇతి. అతోనైతద్వచనం సత్యమిత్యర్థః. 33

ఇదంతయు ఊహించ వీలులేదని చెప్పుచున్నాడు.- స్వరూపమైన విజ్ఞానము, పరిపూర్ణమైన బాహ్య జ్ఞానము కలిగి అఖండ విజ్ఞానజ్ఞానైశ్వర్యమయుడైన పరమాత్మకు దుఃఖము, ప్రేమ, దుర్నిమిత్తముల వలన భయము కలుగుట, తన ద్వారకా నగరము నాశనమగుట, కృష్ణుని చేతినుండి శార్ఙ్గధనువు జారిపోవుట మొదలైన విషయములన్నియు అజ్ఞానము చేత కల్పితమైనవేకాని వాస్తవము కాదని భావము. 32

పరమాత్మ పాదసేవనము వలన కలిగిన పుష్కలమైన ఆత్మ విద్యచేత ఆనాది అయిన మాయచేత కలిగిన ఆత్మవిపర్యయము అనగా కనపటునట్టి ఈ ప్రపంచము, శరీరము సత్యమనే ఆత్మ విరుద్ధమైన భావనతో నేను బలహీనుడను, సుఖవంతుడను, దుఃఖమును అనుభవించుచున్నవాడను మొదలైన అసత్యమైన లక్షణములన్నియు నశించును. విశేషముగా ఆత్మకు సంబంధించిన అనంతమైన ఐశ్వర్యముతో పాటు ఉత్కృష్టమైన సత్యమైన స్థానము లభించును. అట్టి సత్పురుషుల మార్గమును పొందిన వారికి లౌకికమైన తుచ్ఛమైన వ్యామోహము కలుగుటకు వీలులేదు. అందువలన కృష్ణుడు భయపడినాడు. శార్ఙ్గము చేతినుండి జారినది వంటి మాటలు అసత్యమని భావము. సత్పురుషులకు గమ్యమైన పరమాత్మకు వ్యామోహమెక్కడ. 33

శ్లో॥ తం శస్త్రపూగైః ప్రహరం తమోజసా
సాల్వం శరైశ్శౌరిరమోఘ విక్రమః ।
విద్ధ్వాచ్ఛినద్వర్మ ధనుశ్శిరోమణిం
సౌభం చ శత్రోర్గదయారురోజహ ॥ 34

అయితే వాస్తవ సత్యమునుఇప్పుడు చెప్పుచున్నాడు. - గర్వముతో బాణ సముదాయములతో కొట్టునట్టి సాల్వుని అపారమైన సార్థకమైన పరాక్రమము కల కృష్ణుడు బాణములతో సాల్వుని కవచమును చీల్చి, విల్లును ఛేదించి శిరస్సు నందలి మణిని ఖండించినాడు. సాల్వుని మాయా నగరమైన సౌభమును గదతో పగులగొట్టినాడు. 34

శ్లో॥ తత్కృష్ణహస్తేరితయా విచూర్ణితం
పపాతతోయే గదయా సహస్రధా ।
విసృజ్య తద్భూతలమాస్థితో గదా
మాదాయసాల్వో హరిమభ్యగాద్ద్రుతమ్ ॥ 35

కృష్ణుని గదాప్రహరమునకు వేల ముక్కలైన సౌభము సముద్ర జలమున పడిపోయినది. దాని నుండి భూమిపైకి దుమికిన సాల్వుడు ఒక గదను తీసికొని కృష్ణుని పైకి పరిగెత్తినాడు. 35

టీ:- కిం తర్హి సత్యం తదాహ-తమితి.వర్మకవచం రురోజ బభంజ. (34-35)

శ్లో॥ ఆధావతస్సగదం తస్యబాహుం
భల్లేనఛిత్వాథరథాంగ మద్భుతమ్ ।
వధాయ సాల్వస్యలయార్కసన్నిభం
బిభ్రద్బభౌసార్క ఇవోదయాచలః ॥ 36

తనపైకి గదతో పరిగెత్తి వచ్చుచున్న సాల్వుని భుజమును కృష్ణుడు బల్లెముతో ఖండించినాడు. పిమ్మట అద్భుతముగా సాల్వుని సంహరించుటకై ప్రళయార్కుని వంటి సుదర్శనచక్రమును ధరించి ఉదయసూర్యునితోప్రకాశించు తూర్పుకొండలవలె భాసించినాడు. 36

శ్లో॥ జహారతేనైవ శిరస్సకుండలం
కిరీటయుక్తం పురుమాయినోహరిః ।
వజ్రేణ వృత్రస్య యథా పురందరో
బభూవహాహేతి వచస్తదానృణామ్ ॥ 37

టీ:- ఆధావత ఇతి. లయార్కసన్నిభం ప్రళయకాలికసూర్యసదృశం. (36-37)

వజ్రాయుధముతో ఇంద్రుడు వృత్రాసురుని తలను ఖండించినట్లుగా సుదర్శనచక్రముతో కృష్ణుడు మిక్కిలి మాయావి అయిన సాల్వుని కుండలము, కిరీటముతో కూడిన శిరస్సును ఖండించినాడు, అప్పుడు ప్రజలు పెద్దపెట్టున హాహాకారములు చేసినారు. 37

శ్లో॥ తస్మిన్నిపతితే పాపే సౌభే చ గదయాహతే ।
దివి దుందుభయోనేదు స్తదా దేవగణేరితాః ॥ 38

టీ:- సఖీనామపచితిం కుర్వన్ దంతవక్త్రోరుషాభ్యగాత్ తస్మిన్నితి. దేవగణేన ఈరితాః వాదితాః. 38

శ్రీకృష్ణుని గదతో సౌభము చూర్ణమై పడిపోగా పాపాత్ముడైన సాల్వుడు చక్రముచే ఖండింపబడగా దేవతలు సంతోషముతో స్వర్గమున దుందుభులు మ్రోగించినారు. స్నేహితుని వధకు ప్రతీకారముతో పగ తీర్చుకొనుటకై దంతవక్త్రుడు కృష్ణునిపైకి యుద్ధమునకు వచ్చినాడు. 38

శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, సప్తసప్తతితమోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
డెబ్బదిఏడవ అధ్యాయముసమాప్తము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## అష్టసప్తతితమోఽధ్యాయః

శ్లో॥ తతో ష్టసప్తతితమే దంతవక్త్ర విడూరథౌ ।
హత్వాహరిః పురేరేమే రామస్సూతం తతోఽవధీత్ ॥

**దంతవక్త్ర విడూరథ వధాది కథా ప్రారంభఘట్టః**

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ శిశుపాలస్య సాల్వస్యపౌండ్రకస్యాపి దుర్మతేః ।
పరలోకగతానాం చ కుర్వన్ పారోక్ష్యసౌహృదమ్ ॥ 1

శ్లో॥ ఏకః పదాతిసన్నద్ధో గదాపాణిః ప్రకంపయన్ ।
పద్భ్యాం మహీం మహారాజ మహసత్వోఽభ్యదృశ్యత ॥ 2

టీ:- సఖీనామపచితం కుర్విన్నిత్యుక్తం తదేవాహ- శిశుపాలస్యేతి. పారోక్ష్యసౌహృదం పరోక్షే కరణీయం సుహృత్కృత్యం. (1-2)

శ్లో॥ తం తదాయాంత మాలోక్య గదా మాదాయ సత్వరః ।
అవప్లుత్య రథాత్కృష్ణస్సింధుంవేలేవ ప్రత్యధాత్ ॥ 3

టీ:- తమితి ప్రత్యధాత్ ప్రతిరురోధ. 3

## 78వ అధ్యాయము

తమ మిత్రులైన శిశుపాలసాల్వాదులను కృష్ణుడు సంహరించినందువలన దానికి ప్రాయశ్చిత్తము చేయుటకై దంతవక్త్ర విడూరథులు కృష్ణునిపైకి దండయాత్రకు రాగా ఆయన వారిని సంహరించి ప్రకాశించినాడు. పిమ్మట బలరాముడు సూతుని సంహరించు విషయము ఈ అధ్యాయములో కలదు.

**దంతవక్త్ర విడూరథాదుల వధా ప్రారంభఘట్టము**

**శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు**

ఓ రాజా ! కృష్ణుడు దుష్టులైన శిశుపాలుడు, సాల్వుడు, పౌండ్రకుడు మొదలైన తన మిత్రులను సంహరింపగా వారికి పరోక్షముగా, అనగా మరణాంతరము స్నేహభావముతో, వాని వధకు ప్రతీకారము చేయుదునని అపారమైన పదాతి సైన్యముతో దంతవక్త్రుడు ఒక్కడే గదను ధరించి పాదచారియై తన పాదఘట్టనలతో భూమిని కంపింపచేయుచు వచ్చినాడు. (1-2)

అప్పుడు ఆ విధముగా గదతో యుద్ధ సన్నద్ధుడై వేగముగా వచ్చిన కరూశాధిపతి దంతవక్త్రుని చూచి కృష్ణుడు రథము నుండి దూకి సముద్రమును దాటనివ్వని చెలియలి కట్టవలే అతనిని అడ్డగించినాడు. 3

శ్లో॥ గదాముద్యమ్య కారూశో ముకుందం ప్రాహదుర్మదః ।
దిష్ట్యా దిష్ట్యా భవానద్య మమ దృష్టిపథం గతః ॥ 4

టీ:- గదామితి.ముకుందం ప్రాహ దుర్మద ఇత్యాదేః అధిక్షేపపరతా స్ఫుటైవ. పరమార్థస్తు దుర్మదః గతమదః ప్రాహ. ముకుందం తృతీయ జన్మని ముక్తిదానార్థమాగతం. అద్యేతి. జన్మత్రయేణ అన్విష్యమాణః అద్యబ్రహ్మశాపావసానే భవాన్ మమస్వామీ దృష్టిపథం గతఃప్రాప్తః ఏతద్దిష్ట్యా దిష్ట్యా భద్రం అతిహర్షే వీప్సా. 4

శ్లో॥ త్వం మాతులేయో నః కృష్ణమిత్రధ్రుఙ్మాం జిఘాంససి ।
అతస్త్వాంగదయా మందహనిష్యే వజ్ర కల్పయా ॥ 5

టీ:- కించ.త్వమితి. హేకృష్ణ త్వమస్మాకం మాతులేయో బంధుః. ఏవమపి మిత్రధ్రుక్ మిత్రాణి ఘాతితవాన్. మాం చ త్వం జిఘాంససి తస్మాదస్మాకం త్వత్తో మృత్యుః సనకాద్యనుగ్రహప్రాప్తోనూనం దుర్వారః అతస్త్వామేతావన్మాత్రమహం యాచే. కింతత్ తదాహ-హేఅమంద సర్వసహనసమర్థ. క్షాత్రధర్మేణ సేవితుం గదయా త్వాం హనిష్యే ప్రహరిష్యామి. తామేకవారం సహస్వేతి. ననువజ్రతుల్యాం త్వద్గదాం కో వా సహేత? నైవమిత్యాహ- అవజ్రకల్పయా ఉత్పలమాలా వదతి కోమలయేత్యర్థః. 5

గదను ఎత్తి పట్టుకొని దంతవక్త్రుడు దుర్గర్వముతో - అదృష్ట వశమున నీవు ఈనాడు నాయెదుట పడితివి అని కృష్ణునితో పలికినాడు.- విష్ణుమందిర ద్వార పాలకులైన జయవిజయులలో విజయునికి దంతవక్త్ర జన్మము మూడవది. ఈ మూడవ జన్మమున సనకాదుల శాపము ముగుయునట్టి ఈ శుభ సంధర్భమున మూడు జన్మల అన్వేషణఫలితముగా నా స్వామియైన మీరు నన్ననుగ్రహించుటకై అదృష్ట వశమున మంగళకరముగా మిక్కిలి ఆనంద దాయకముగా నాయెదుట పడితిరని వాస్తవార్థము. 4

ఓ కృష్ణా ! నీవు నా మేనమామ కొడుకువైనను నా మిత్రులైన వారిని ద్రోహివై సంహరించితివి. ఇప్పుడు నన్ను కూడ చంపదలచు కున్నావు. అందువలన ఓ మూర్ఖుడా ! నిన్ను వజ్రాయుధము వంటి నా గదతో సంహరింతును అన్నాడు. సనకాదుల శాపము పరిసమాపితమై నేను విజయుడుగా వైకుంఠ మందిర ద్వారపాలక స్థితిని తిరిగి పొందుటకై నీ అనుగ్రహముచేత నీచేతిలో మరణము పొందుట అనివార్యమైనది,కనుక నిన్ను ఇంతమాత్రము యాచించెదను. ఓ అమందా ! (వ్యాజనింద) సర్వమును సహించుటలో నీవు సమర్థుడవు. క్షాత్ర ధర్మముతో నిన్ను సేవించుటకే గదతో కొట్టుచుంటిని. నాపై దయతో ఈగద తాకిడిని ఒకసారి సహింపుము.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తర్హ్యాన్యణ్యముపైమ్యజ్ఞ మిత్రాణాం మిత్రవత్సలః ।
బంధురూపమరిం హత్వావ్యాధిం దేహచరం యథా ॥ 6

టీ:- నన్వేవం హననేకస్తవపురుషార్థస్తమాహ - తర్హీతి. అజ్ఞః నవిద్యతే జ్ఞో యస్మాత్ తస్య సంబుద్ధిః హే సర్వజ్ఞేత్యర్థః. పరమార్థతః స్వామినం. ఏతద్దేహ సంబంధేన బంధురూపం.బ్రహ్మశాపేన తు శత్రుత్వేన ప్రతీతం త్వాం హత్వా మిత్రాణామానృణ్యం ఉపైమి ఉపైష్యామి. విశేషేణ ఆధీయతే మనసి చింత్యత ఇతి వ్యాధిః దేహే అంతార్యామి తయా చరతీతి తథా. తమీశ్వరం హత్వా క్షాత్రధర్మేణ ఆరాధ్య. హంతేర్గత్యర్థస్య జ్ఞానార్థత్వాత్ జ్ఞాత్వేతి వా. తేన యథా పిత్రాదీనామానృణ్యముపయంతి తద్వదితి. 6

వజ్రసమానమైన గద దెబ్బను సహించుట ఎట్లు అని భావించవలదు. ఇది వజ్రా యుధముతో తుల్యమైనదికాదు. కేవలము ఒక కలువ దండవలె కోమలమైనదే. అందువలన దీనితో నేనుమోదినను నీకు ఉత్పలమాలను సమర్పించి సేవించుటవంటిదే అగునని వాస్తవార్థము. 5

ఓ అజ్ఞుడా! మిత్రులపట్ల ప్రేమభావముగల నేను నీవు నామిత్రులను చంపిన దానికి ప్రతీకారముగా శరీరమందలి వ్యాధిని చికిత్సకుడు దూరము చేసినట్లుగా బంధువుడవై శత్రువైన నిన్ను చంపి నావారికి ఆత్మశాంతిని కలిగించి మిత్రుల ఋణమునుండి విముక్తుడగుదునన్నాడు. ఇక్కడ అజ్ఞుడని సంబోధించుటలో కృష్ణుడు జ్ఞానములేనితనములేనివాడని అనగా సర్వజ్ఞుడైన స్వామియని పరమార్థము. ఈ శరీరముతో సంబంధమున్నందువల్ల బంధురూపుడైన వాడవు, బ్రాహ్మణ శాప కారణముగా మాత్రమే ప్రకటితమైన శత్రు భావము కలిగిన నిన్ను సంహరించి మిత్రుల ఋణము నుండి విముక్తుడను కాగలను. అనుటలో వ్యాధి అనగా విశేషముగా మనస్సు నందు చింతింపబడినవాడు భగవంతుడు. అతడు నిరంతరము మనస్సులో ధ్యానింపబడుట వలన భగవంతుడు వ్యాధిః అగును. అట్టి పరమాత్మ ఈ శరీరమునందు అనవరతము అంతర్యామి రూపముగా వర్తించుచున్నందున అతడు దేహచరుడు. అట్టి

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

పరమాత్మవైన నిన్ను క్షత్రియ ధర్మముతో ఆరాధించి హంతీ అనేది గత్యర్థకమైనందు వలన జ్ఞానము అనేఅర్థము నిచ్చుట వలన - నిన్ను ఎరిగి, పిత్రు దేవతలు శ్రాద్ధ తర్పణాదులతో విముక్తులైనట్లుగా ముక్తిని పొందుదునని వాస్తవార్థము. ఇక్కడ అజ్ఞ - సర్వజ్ఞుడు, వ్యాధి, దేహచరుడు అనేవి కృష్ణుని సంబోధనలు. 6

శ్లో॥ ఏవం రూక్షైస్తుదన్ వాక్యైః కృష్ణం తోత్రైరివద్విపమ్ ।
గదయాతాడయన్మూర్ధ్ని సింహవద్వ్యనదచ్చసః ॥ 7

ఈ విధముగా ఏనుగును మావటివాడు అంకుశముతో గ్రుచ్చి బాధించినట్లు శూలమువంటి తీవ్రమైన మాటలతో కృష్ణుని ఎత్తి పొడుచుచూ గదతో కొట్టి దంతవక్త్రుడు సింహమువలే గర్జించినాడు. 7

శ్లో॥ గదయాభిహతోఽప్యాజౌ న చచాల యదూద్వహః ।
కృష్ణోఽపితమహస్గుర్వ్యాకౌమోదక్యాస్తనాంతరే ॥ 8

దంతవక్త్రుడు గదతో మోదినప్పటికి యాదవ శ్రేష్ఠుడైన కృష్ణుడు చలించలేదు. కృష్ణుడు కూడా తన కౌమోదకినీ గదతో దంతవక్త్రుని రొమ్ములపై బాదినాడు. 8

శ్లో॥ గాఢం నిర్భిణ్ణ హృదయ ఉద్వమన్ రుధిరం ముఖాత్ ।
ప్రసార్య కేశబాహ్వంఘ్రీన్ధరాణ్యాంన్యపతద్వ్యసుః ॥ 9

కౌమోదకి వలన గాఢముగా దెబ్బతగులుటచే రొమ్ములు పగిలిపోయి నోటినుండి రక్తము క్రక్కుచు చేతులు, భుజములు, పిక్కలు చాచి ప్రాణము వీడినవాడై భూమిపై పడెను. 9

శ్లో॥ తతస్సూక్ష్మతమం జ్యోతిఃకృష్ణమావిశదద్భుతమ్ ।
పశ్యతాం సర్వభూతానాం యథాచైద్యపతేర్నృప ॥ 10

అప్పుడు ఆశ్చర్యకరముగా అందరు చూచుచుండగా ఒక సన్నటి జ్యోతి దంతవక్త్రుని శరీరము నుండి బయటకు వెడలి శిశుపాలుడు మరణించినప్పటివలెనే శ్రీకృష్ణునియందు ప్రవేశించినది. 10

శ్లో॥ విదూరథస్తు తద్భ్రాతాభ్రాతృశోక పరిప్లుతః ।
ఆగచ్ఛదసిచర్మభ్యాం మత్తశ్శత్రుజిఘాంసయా ॥ 11

అతని తమ్ముడు విదూరథుడు కూడా అన్న మరణమునకు సంకటపడి కత్తి, డాలు తీసుకొని మత్తుడై శత్రువైన కృష్ణుని సంహరించుటకై వచ్చినాడు. 11

శ్లో॥ తస్యచాపతతః కృష్ణశ్చక్రేణ క్షురనేమినా ।
శిరో జహార రాజేంద్ర స కిరీటం సకుండలం ॥ 12

ఓ రాజా! అతడిట్లు తన మీదకు రాగా కృష్ణుడు చక్రధారముతో కిరీట కుండలములతో కూడిన అతని శిరస్సును తెగవేసినాడు. 12

శ్లో॥ ఏవం ససౌభం సాల్వం చ దంతవక్త్రం విదూరథమ్ ।
హత్వా దుర్విషహానన్యానీడితస్సుర మానవైః ॥ 13

శ్లో॥ మునిభిస్సిద్ధగంధర్వైర్విద్యాధర మహోరగైః ।
అప్సరోభిః పితృగణైర్యక్షైఃకిన్నర చారణైః ॥ 14

శ్లో॥ ఉపగీయమానవిజయః కుసుమైరభివర్షితః ।
వృతశ్చవృష్ణిప్రవరైర్వివేశాలంకృతాం పురీమ్ ॥ 15

టీ:- ఏవమితి.రూక్షైరిత్యాదిప్రతీత్యభిప్రాయేణ.తోత్రైరంకుశాదిభిః (7-15)

ఈ విధముగా ఇతరులు జయించుటకు వీలు కానట్టి సౌభముతో కూడిన సాల్వుడు, దంతవక్త్రుడు, విదూరథుడు అనే వారిని హతమార్చి దేవతలు, మానవులు, మునులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, అప్సరసలు, పితృదేవతలు, యక్షులు, కిన్నరులు, చారణులు మొదలైనవారు కృష్ణుని యుద్ధ విజయమును గూర్చి స్తోత్రగానము చేయుచు, పువ్వులు చల్లుచుండగా, యదువీరులచేత చక్కగా అలంకరించబడిన ద్వారకా నగరమున ప్రవేశించినాడు. (13-15)

శ్లో॥ ఏవం యోగేశ్వరః కృష్ణో భగవాన్ జగదీశ్వరః ।
ఈయతే పశుదృష్టీనాం నిర్జితో జయతీతి సః ॥ 16

టీ:- ఏవమితి. ఏవం శ్రీకృష్ణో మాహాబలానపిలీలాయా జయత్యేవేతి కృత్వా స కదాచిజ్జరాసంధాదిభిర్నిర్జిత ఇతి పశుదృష్టీనామీయత ఇత్యర్థః విజయే హేతవః. యోగేశ్వరః భగవాన్ జగదీశ్వర ఇతి. 16

ఈ విధముగా యోగేశ్వరుడు, జగదీశ్వరుడు, భగవంతుడైన కృష్ణుడు మహాబలవంతులైన సాల్వాదులను కూడా అవలీలగా జయించి నాడని చెప్పుచు ఒకప్పుడు జరాసంధుడు మొదలైన వారిచేతిలో ఓడిపోయినాడని అజ్ఞాన దృష్టిగలవారు భావింతురు. శ్రీకృష్ణుని విజయములకు యోగేశ్వరుడు, భగవంతుడు, జగదీశ్వరుడు అనే విశేషణములే హితవులగుచున్నవి. 16

(ఇది శ్రీధరుని శ్లోకము) పూతన మొదటగా విడూరథుని వరకు రాక్షస కులమును నిర్మూలించి కృష్ణుడు విరమించగా బలరాముడు సూతపల్వలులను వధించినాడు.

### బలరామ కృత తీర్థయాత్రా, సూత వధాదిక ప్రారంభఘట్టః

శ్లో॥ శ్రుత్వాయుద్ధోద్యమం రామః కురూణాం సహ పాండవైః ।
తీర్థాభిషేక వ్యాజేన మధ్యస్థః ప్రయయౌకిల ॥ 17

టీ:- శ్లో. విడూరథాంతము నృథ్య పూతనాదిదనోః కులం, కృష్ణస్తూప రమన్నాద్రామోఽహన్ సూతపల్వలౌ. శ్రీధరీయోఽయం శ్లోకం, తత్రప్రసంగమాహ - శ్రుత్వేతి. 17

### బలరాముని తీర్థయాత్ర మఱియు సూతపల్వలును వధించు కథ ప్రారంభము.

ఆ ప్రసంగమునే చెప్పుచున్నాడు – కౌరవుల పాండవుల మధ్యన యుద్ధము జరుగుతున్నదని విని బలరాముడు ఆ యుద్ధమున తాను ఎవరి పక్షము వహించక మధ్యస్థుడై తీర్థయాత్రల నెపమున వెడలి పోయినాడు. 17

శ్లో॥ స్నాత్వా ప్రభాసేసంతర్ప్యదేవర్షి పితృమానవాన్ ।
సరస్వతీంప్రతిస్రోతాం యయౌ బ్రాహ్మణసంవృతః ॥ 18

టీ:- స్నాత్వేతి. ప్రతిస్రోతాం ప్రతిలోమాం. 18

ఆయన ప్రభాసతీర్థమున స్నానమాడి దేవతలు, ఋషులు, పితృదేవతలను, మానవులను సంతృప్తి పరచి బ్రాహ్మణ సముదాయముతో కూడి ప్రతిలోమ అయిన సరస్వతీ నదికి వెళ్ళినాడు. 18

శ్లో॥ మధూదకంబిందుసరస్త్రుణకూలం సుదర్శనమ్ ।
విశాలం బ్రహ్మతీర్థం చ చక్రం ప్రాచీం సరస్వతీమ్ ॥ 19

టీ:- మాధూదకమితి. సుదర్శనం తీర్థం చక్రం చక్రతీర్థం. 19

శ్లో॥ యమునామనుయాన్యేవ గంగామనుచ భారత ।
జగామ నైమిశం యత్ర ఋషయస్సత్రమాసతే ॥ 20

టీ:- యమునామితి. యమునామనుయాని తీర్థాని. గంగామను చ యాని తాని సర్వాణి. గత్వా నైమిశమరణ్యం జగామ. 20

ఓ పరీక్షిత్తూ ! మాధూదకము, బిందు సరస్సు, తృణకూలము, సుదర్శనము, విశాలము, బ్రహ్మతీర్థము, చక్రతీర్థములను దాటి తూర్పున ఉన్న సరస్వతిని దాటి యమునా నదిని అనుసరించిన తీర్థములను దాటి గంగానదిని అనుసరించిన తీర్థములను దాటి ఋషులు యాగము చేయునట్టి నైమిశారణ్యమునకు వెళ్ళినాడు. (19-20)

శ్లో॥ తమాగతమభిప్రేత్యమునమో దీర్ఘసత్రిణః ।
అభిగమ్య యథాన్యాయ్యం ప్రణమ్యోత్థాయ చార్చయన్ ॥ 21

టీ:- తమితి. అభిప్రేత్య శ్రీబలరామ ఇతిజ్ఞాత్వా. 21

బలరాముని ఆగమనమును గ్రహించి బహుకాలముగా యాగ దీక్షలో ఉన్న మునులందరు సగౌరవముగా ఎదురేగి విధివిధానములతో నమస్కరించి పూజించిరి. 21

శ్లో॥ సోఽర్చితస్సపరీవారః కృతాసనపరిగ్రహః ।
రోమహర్షణమాసీనం మహర్షేశ్శిష్యమైక్షత ॥ 22

టీ:- స ఇతి. మహర్షేర్వ్యాసస్య. 22

పరివార సహితుడైన బలరాముని ఋషులందరు గౌరవపురస్సరముగా లేచి నిల్చుని పూజించి ఆయనను సుఖాసీనుని చేసినారు. వ్యాస మహాముని శిష్యుడైన రోమహర్షణుని పుత్రుడు ఉగ్రశ్రవసుడను సూతుడు మాత్రము ఆసనము నుండి లేవక కూర్చున్న వానిని బలరాముడు చూచినాడు. 22

శ్లో॥ అప్రత్యుత్థాయినం సూతమకృతప్రహ్వాణాంజలిమ్ ।
అధ్యాసీనం చ తాన్ విప్రాంశ్చుకోద్వీక్ష్యమాధవః ॥ 23

ఆ ఋషులకంటే ఉన్నతమైన ఆసనమున కూర్చుండి సూతుడు బలరాముని దర్శించి కూడా ఆసనము నుండి లేచి ఎదురేగి నమస్కారములు చేయనందుకు నారయణోపలక్షితుడైన బలరాముడు కోపించినాడు. 23

శ్లో॥ కస్మాదసావిమాన్ విప్రానధ్యాస్తే ప్రతిలోమజః ।
ధర్మపాలాంస్తథైవాస్మాన్ వధమర్హతి దుర్మతిః ॥ 24

టీ:- అప్రత్యుత్థాయినమితి. సూతం ప్రతిలోమజం.న కృతం ప్రహ్వాణమంజలిశ్చ యేన తం. అధ్యాసీనం చ తాన్ తేభ్యోప్యుచ్చైరాసీన మిత్యర్థః. (23-24)

ప్రతిలోముడైన ఈ సూతుడు బ్రాహ్మణులకు ఎలా బోధించుచున్నాడు? ధర్మమును కాపాడునట్టి మమ్ములను ఎందుకు తృణీకరించి ఆసనమునుండి లేవలేదు? అందువల్ల ఈ దుష్టుని వధించ వలెనని బలరాముడు తలచినాడు. 24

శ్లో॥ ఋషేర్భగవతో భూత్వా శిష్యోఽధీత్యబహూని చ ।
సేతిహాసపురాణానిధర్మశాస్త్రాణి సర్వశః ॥ 25

టీ:- అజానన్నధ్యాస్త ఇతి చేన్నైవమిత్యాహ- ఋషేరితి. 25

సూతుడు తెలియకుండా ఋషులకు అధ్యయనము చేయించడము లేదని ఇట్లు చెప్పుచున్నాడు. భగవంతుడైన వ్యాస మునీంద్రునికి శిష్యుడై పురాణ ఇతిహాసములతో సర్వధర్మ శాస్త్రము లను సూత మహాముని అధ్యయనము చేసినాడు. 25

శ్లో॥ అదాంతస్యావినీతస్య వృథాపండితమానినః ।
న గుణాయ భవంతి స్మనటస్యేవాజితాత్మనః ॥ 26

టీ:- నను బహుజ్ఞః కథమేవం కః కుర్యాత్తత్రాహ–అదాంతస్యేతి. గుణాయ యథోచితానుష్ఠానాయ. 26

శ్లో॥ ఏతదర్థోహి లోకేఽస్మిన్నవతారో మయాకృతః ।
వధ్యామి ధర్మ ధ్వజినస్తేహిపాతకినోఽధికాః ॥ 27

టీ:- నను విప్రానధ్యాస్తాం.అన్వద్యా.కించత్కరోతు కింతవేతి చేదత ఆహ.- ఏతదర్థ ఇతి. ధర్మ ధ్వజినః ఉత్తమలింగధారిణః. 27

శ్లో॥ ఏతావదుక్త్వా భగవాన్నివృత్తోఽసద్వధాదపి ।
భావిత్వాత్తంకుశాగ్రేణ కరస్థేనాహనత్ప్రభుః ॥ 28

టీ:- ఏతావదితి. భావిత్వాదితి. నహి భవితవ్యం కేనాపి పరిహర్తుం శక్యత ఇత్యర్థః అహనత్ హతవాన్. 28

శ్లో॥ హాహేతి వాదినస్సర్వేమునయః ఖిన్నమానసాః ।
ఊచుస్సంకర్షణందేవనమధర్మస్తే కృతః ప్రభో ॥ 29

టీ:- హాతి.తేత్వయా. 29

ఇతనిని ఈ విధముగా బహు శాస్త్ర కుశలుడుగా చేసిన వారెవరు అనే విషయమై చెప్పుచున్నాడు - దేనికి లొంగని వాడు పొగరు కలవాడు, అధర్మపరుడు, వ్యర్థముగ తాను పండితుడనెడు గర్వము కలవాడు ఆత్మ జ్ఞానము లేనివాడు, ధర్మ బద్ధమైన అనుష్ఠానమునకు యోగ్యత లేని నటుని వలె అర్హుడుకాదు కదా. 26

ఇట్టి లోక వంచకులను నాశనము చేయుటకే నేను అవతారమును ధరించితిని. ఈ దుష్టుడైన సూతుని వధింతును. అధర్మ పరులై ధర్మ ధ్వజమును ధరించి వంచనతో లోకమునకు దుర్నీతులు బోధించు వారు మహా పాతకులు చేసిన వారికంటే దురాత్ములు. 27

అని ఈ విధముగా చెప్పి భగవంతుడైన బలరాముడు దుర్జనుని సంహరించవలెనని భావించి ఆ సూతుని తన చేతి యందలి దర్భకొనతో ఉరకనే కొట్టి చంపినాడు. భవితవ్యమును పరిహరించుట ఎవ్వరికిని సాధ్యము కాదు కదా. 28

అప్పుడు ఋషులందరు హాహాకారములు చేసి సంకటముతో భగవంతుడైన బలరామునితో ఓ ప్రభూ ! మీరు ఒక గొప్ప అధర్మమును ఆచరించితిరని వాపోయిరి. 29

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అస్య బ్రహ్మాసనందత్తమస్మాభిర్యదునందన ।
ఆయుశ్చాత్మాక్లమంతావద్యావత్సత్రం సమాప్యతే ॥ 30

టీ:- అధార్మిక ప్రతిలోమజవధః కోஉయమర్థ ఇతి. చేత్తత్రాహుః- అస్యేతి. పురాణప్రవచనాయ ఆత్మనః శరీరస్య నాస్తిక్లమో యస్మిన్ తదాయుశ్చ దత్తమితి. 30

అధార్మికుడైన ప్రతిలోముని సంహరించుట వలన ఏమి అనర్థము జరుగుననే విషయము చెప్పుచున్నాడు. ఓ యాదవశ్రేష్ఠా ! ఈ సూతమహామునిని ఈ యాగము పరిసమాప్తి యగువరకు వ్యాస పీఠము నధిష్ఠించి మా శరీరమందలి అలసట పోవునట్లుగా మనస్సుకు ఆహ్లాదము కలిగించునట్టి పురాణములు, ధర్మ శాస్త్రములు బోధించుమని ప్రార్థించి మేమే ఈయనను బ్రహ్మాసనమందు ఆసీనుని చేసితిమి. 30

శ్లో॥ అజానతే వాచరితస్త్వయా బ్రహ్మావధో యథా ।
యోగేశ్వరస్య భవతోనామ్నాయోஉపి నియామకః ॥ 31

టీ:- అజానతేతి. బ్రహ్మావధేஉపి కిం మమేశ్వరస్యేతి చేత్సత్యమేవం తథాపి ప్రాయశ్చిత్తం కర్తవ్యమిత్యాశయేనాహుస్సార్ధేన-యోగేశ్వరస్యేతి. అమ్నాయః బ్రాహ్మణో న హంతవ్య ఇతి లక్షణః. 31

ఈ విషయము తెలియక మీరు నిష్కారణముగా బ్రాహ్మణుని వధించితిరి అని ఋషులుచెప్పిరి. బ్రాహ్మణుని వధించినప్పటికీ పరమేశ్వరుడనైన నాకు అడ్డు ఏమున్నదని భావించినచో- ఇది సత్యమైనప్పటికి దీనికి తప్పక ప్రాయశ్చిత్తము చేసుకొనవలెనని-అర్థ శ్లోకములో చెప్పుచున్నాడు. వేదప్రవర్తకుడైన ఈశ్వరుడు కూడా వేదమున అదే చెప్పిన- బ్రాహ్మణుని చంపగూడదనే విధి వాక్యమును ఆచరించక తప్పుకొనలేదుకదా - అని ఋషులు బలరాముని సమాధానపరిచిరి. 31

శ్లో॥ యద్యేతద్బ్రహ్మహత్యాయాః పావనంలోకపావన ।
చరిష్యతిభవాన్ లోకసంగ్రహేనాన్యచోదితః ॥ 32

ఓ లోకపావనా! పొరపాటున ఈ విధముగ వ్యాస పీఠమున నున్న సూతుని మీరు వధించినప్పటికిని దీనికి ప్రాయశ్చిత్తముగ మీకై

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:– యదీతి. తథాప్యేతస్యాః బ్రహ్మహత్యాయాః. పావనం ప్రాయశ్చిత్తం. హే ! లోకపావన నాన్యచోదితః అనన్యచోదితః స్వయమేవ భవాన్ యది కరిష్యతి తర్హి లోకసంగ్రహో భవిష్యతి నాన్యథేతి. 32

మీరే స్వయముగ ఈ సూత మహామునిని పునర్జీవితుని చేసినట్లైన లోకపకారము జరుగగలదు. కాని మరే విధముగను లోక క్షేమము కలుగదని ఋషులందరు బలరాముని ప్రార్థించిరి. 32

భగవానువాచ

శ్లో॥ చరిష్యేవధనిర్వేశం లోకానుగ్రహకామ్యయా ।
నియమః ప్రథమేకల్పేయావాన్ సతు విధీయతామ్ ॥ 33

భగవంతుడైన బలరాముడు ఋషులకిట్లు చెప్పినాడు.

లోకములను అనుగ్రహించవలెనను కోరికతో ప్రథమ కల్పమున ఏర్పరచిన నియమములు ప్రకారముగా ఈ సూతుని వధకు పరిహారమును ఆచరింతును. 33

టీ:– చరిష్యఇతి. వధస్య నిర్వేశం ప్రాయశ్చిత్తం. ప్రథమే కల్పే ముఖ్యపక్షే విధీయతాం ఉపదిశ్యతాం. 33

శ్లో॥ దీర్ఘమాయుర్బతైతస్య సత్త్వమింద్రియ మేవచ ।
ఆశాసితం యత్తద్బ్రూతసాధయే యోగమాయయా ॥ 34

టీ:– కిం చ. దీర్ఘమితి. బతహే మునయః. ఏతస్య దీర్ఘమాయుః సత్వం బలం. ఇంద్రియం తత్పాటవం. అన్యచ్చ యద్భవద్భిరాశాసితం అపేక్షితం తత్ బ్రూహి సర్వం. 34

ఓ మునీశ్వరులారా! ఈ సూతునికి దీర్ఘాయువు, బలము, ఇంద్రియ పాటవములతోపాటు ఇతర విషయములలో ఏ విధముగ ఉండవలెనని మీరు భావించుచున్నారో తెలిపినచో ఆ విధముగ యోగ మాయతో ఇతనికి అవన్నియు సమకూర్తునని బలరాముడు చెప్పినాడు. 34

ఋషయః ఊచుః

శ్లో॥ అస్త్రస్యతవవీర్యస్యమృత్యో్ రస్మాకమేవ చ ।
యథా భవేద్వచస్సత్యం తథా రామవిధీయతామ్ ॥ 35

టీ:- అస్త్రస్యేతి. అస్త్రాదీనాం సత్యతా యథా భవేత్. అస్మాకంచ వచస్సత్యం యథా భవేత్. తథా విధీయతామిత్యర్థః . 35

ఋషులు ఈవిధముగా చెప్పినారు

దేవతాస్త్రములు, మీపరాక్రమము, మా మృత్యువు, మీ పలుకులు ఎంత సత్యములగునో ఓ బలరామదేవా ఆ విధముగనే చేయుడని చెప్పినారు. 35

బలరామ ఉవాచ

శ్లో॥ ఆత్మావైపుత్ర ఉత్పన్న ఇతివేదానుశాసనమ్ ।
తస్మాదస్య భవేద్వక్తాఆయురింద్రియ సత్వవాన్ ॥ 36

టీ:- తథా సంపాదయన్నాహ-ఆత్మేతి. శ్రు."అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయసే. ఆత్మావై పుత్రనామసి సజీవశరదశ్శత" మిత్యాది వేదానుశాసనం వేదవచనణం. తస్మాదస్య రోమహర్షణస్య పుత్రః ఉగ్రశ్రవాః భవతాం పురాణవక్తా భవత్సే చ ఆయురాదిమాంశ్చ భవేత్. అతస్సాక్షాదజీవనాదస్త్రస్య మృత్యోశ్చ సత్యతా, పుత్రరూపేణ ఆయురాది సిద్ధేః యుష్మద్వచనస్యాపి సత్యతా స్యాదితి భావః. 36

బలరాముడు ఈ విధముగా చెప్పినాడు

ఋషులకోర్కె తీర్చుచు చెప్పుచున్నాడు. "స్త్రీ పురుష సంపర్కము వలన జీవుడై పుట్టుచున్నావు. పితృహృదయమునుండి జన్మను పొందితివి. నేనే పుత్రనాముడవైతివి. అట్టి నీవు నూరువత్సరములు జీవించుము" అని వేదశాసనము. అట్టి వేదమును మీకు ఈ సూతుడు ఆయుస్సు, ఇంద్రియ పటుత్వము, బలములు కలవాడై ఉపదేశించును. అది కూడా ఇతని జీవనము వలన దేవతాస్త్రములు, మృత్యువులు సత్యములగును. పుత్ర రూపముతో ఆయుస్సు మొదలైనవి సిద్ధించి నందువలన ఈ మాటలుకూడా సత్యత్తమును పొందునని భావము. 36

శ్లో॥ కిం వః కామో మునిశ్రేష్ఠా బ్రూతమాంకరవాణ్యథ ।
అజానతశ్చాపచితిం యథామేచింత్యతాం బుధాః ॥ 37

టీ:- కించ. బ్రహ్మదండార్థం యుష్మదపేక్షితంకథయత. తదహం కరిష్యామీత్యాహ–కిమితి. కింవిషయోవఃకామః వర్తతే తద్బ్రూతేతి. అథానంతరం బ్రహ్మదండం గృహీత్వా అపచితిం నిష్కృతిమజానతోమే. హేబుధాః యథా వచ్చింత్యతామపచితిరితి. 37

శ్లో॥ ఇల్వలస్యసుతో ఘోరః పల్వ లోనామదానవః ।
స దూషయతి నస్సత్రమేత్య పర్వణి పర్వణి ॥ 38

శ్లో॥ తంపాపంజహిదాశార్హతన్నశ్శుశ్రూషణంపరమ్ ।
పూయశోణిత విణ్మూత్రసురామాంసాభివర్షిణమ్ ॥ 39

టీ:- ప్రథమం తావదపేక్షితం కర్తవ్యం కథయంతి ద్వాభ్యాం. పల్వలస్యేతి. (38–39)

బ్రాహ్మణుని సంహరించిన దానికి పరిహారముగ ఇంకను మీకేమైన కోరిక ఉన్నచో తెలుపుడు. దానిని కూడా నెరవేర్చుదునని బలరాముడీ విధముగ ఋషులతో చెప్పుచున్నాడు – ఓ మునిశ్రేష్ఠులారా ఇంకను మీకేమైన కోరిక ఉన్నచో తెలుపుడు. ఇప్పుడు నా ఈ బ్రాహ్మణ వధకు పరిహారము చేసిన పిదప కూడా మీరింకేమైన ప్రాయశ్చిత్తమును ఆలోచించినచో తెలుపమని బలరాముడు అడిగినాడు. 37

ముందుగ మీకోరికను తెలుపుట మీ కర్తవ్యమనగా ఋషులు రెండు శ్లోకములందు తమ అభ్యర్థన తెలుపుచున్నారు. – ఈ ఇల్వలాసురుని పుత్రుడు పల్వుడనెడివాడు ప్రతి పూర్ణిమకు వచ్చి మా యాగమునకు విఘ్నము కలిగించుచున్నాడు. 38

ఓ యాదవరత్నమా! యాగకుండమున చీము, నెత్తురు, మలమూత్రములు, మద్యము, మాంసములను వర్షించునట్టి ఆ పాపాత్ముని సంహరింపుము. అదియే మీరు మాకు చేయగల శుశ్రూష అని ఋషులు చెప్పినారు. 39

శ్లో॥ తతశ్చ భారతం వర్షం పరీత్య సుసమాహితః ।
చరిత్వా ద్వాదశాన్మాసాన్తీర్థస్నాయీ విబుధ్యసే ॥ 40

టీ:- ప్రాయశ్చిత్తమాహుః - తత ఇతి. పరీత్య ప్రదక్షిణీకృత్య. సుసమాధానాది గుణవిశేషాదేకాబ్దమాత్ర ముక్త మిత్యవిరోధః. సుసమాహితః కామక్రోధాదిరహితః. చరిత్వా కృచ్ఛ్రాణి. 40

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, అష్టసప్తతితమోఽధ్యాయః**

ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాడు. - పిమ్మట బలరాముడు కామక్రోధాదులను విడిచిన వాడై సంపూర్ణ భారతదేశమును తీర్థయాత్రల నెపమున సంవత్సర కాలమున ప్రదక్షిణము చేసినాడు. 40

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు డెబ్బదిఎనిమిదవ అధ్యాయముసమాప్తము.**

## ఏకోనాశీతితమో௨ధ్యాయః

శ్లో॥ ఊనాశీతితమే రామః పల్వలం ద్విజతుష్టయే ।
నిహత్య తీర్థస్నానాద్యైస్సూత హత్యామసానుదత్ ॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ తతః పర్వణ్యుపావృత్తే ప్రచండః పాంసువర్షణః ।
భీమో వాయురభూద్రాజన్పూతిగంధశ్చ సర్వశః ॥ 1

శ్లో॥ తతో௨మేధ్యమయం వర్షం పల్వలేన వినిర్మితమ్ ।
అభవద్యజ్ఞశాలాయాంసో௨ప్యదృశ్యత శూలభృత్ ॥ 2

టీ:- తత ఇతి. ఉపావృత్తే ప్రాప్తే. (1-2)

శ్లో॥ తంవిలోక్య బృహత్కాయం భిన్నాం జనచయోపమమ్ ।
తప్తతామ్రశిఖాశ్మశ్రుం దంష్ట్రోగ్ర భ్రుకుటీముఖమ్ ॥ 3

## 79వ అధ్యాయము

డెబ్బది తొమ్మిదవ అధ్యాయమున బ్రాహ్మణులను తృప్తిపరచుటకు బలరాముడు పల్వలాసురుని చంపిన విషయము, తీర్థస్నానాదుల వలన సూతుని సంహరించిన పాపానికి ప్రాయశ్చిత్తము చేసుకొని మరలుట చెప్పబడినది.

శ్రీ శుకుడిట్లు చెప్పినాడు

ఓ రాజా ! పిమ్మట పున్నమనాడు యాగ సమయమున అపారముగా దుమ్మును వర్షించుచు అంతట దుర్వాసనను వ్యాపింప జేయుచు తీవ్రమైన వేగముతో సుడిగాలి వీచినది. 1

అనంతరము యజ్ఞశాలయందు పల్వలుడు సృష్టించిన మలమయమైన వర్షము అసహ్యకరముగా కురిసినది. భయంకరమైన శూలమును ధరించి పల్వలాసురుడు కనపడినాడు. 2

దట్టమైన నల్లని కాటుక వంటి బ్రహ్మాండమైన శరీరము, ఎర్రని రాగి వంటి జుట్టు, మీసములు, కోరలతో, ముడివడిన బొమముడితో కూడిన ముఖముతో నున్న పల్వలుని చూచి బలరాముడు వానిని సంహరించుటకై శత్రుసైన్యమును చీల్చు ముసలాయుధమును,

శ్లో॥ సస్మార ముసలం రామః పరసైన్యవిదారణమ్ ।
హలం చ దైత్యదమనం తేతూర్ణముపతస్థతుః ॥ 4

రాక్షసులను నాశనము చేయునట్టి నాగలిని స్మరించినాడు. అవి వెంటనే అతని సమీపమున ప్రత్యక్షమైనవి. (3-4)

శ్లో॥ తమాకృష్య హలాగ్రేణ పల్వలం గగనే చరమ్ ।
ముసలేనాహనత్క్రుద్ధో మూర్ధ్ని బ్రహ్మద్రుహం బలః ॥ 5

టీ:- తమితి. భిన్నో విదీర్ణః అంజనచయః ఉపమా యస్య తం. అతికృష్ణమిత్యర్థః. తవ తామ్రవత్ శిఖాశ్మశ్రూణి చ యస్య తం. దంష్ట్రాభిరుగ్రం భృకుటీయుతం ముఖం యస్య తం. (3-5)

బలరాముడు ఆకాశమున సంచరించుచున్న బ్రహ్మద్రోహియైన పల్వలుని నాగలికొనతో క్రిందకులాగి క్రోధముతో వాని తలపై రోకలితో మోదినాడు. 5

శ్లో॥ సోఽపతద్భువి నిర్భిన్న లలాటోఽసృక్సముత్సృజన్ ।
ముంచన్నార్త సర్వం శైలో యథావజ్రహతోఽరుణః ॥ 6

ఆ దెబ్బలకు పల్వలుడు ఫాలభాగముచీలి ఆపాదము రక్తము కారుచుండగా ఆర్తనాదములు చేయుచు - వజ్రాయుధము వ్రేటుకు రెక్కలు కూలి పడిన గైరిక ధాతువులతో ఎర్రనైన పర్వతమువలె రక్తముతో ఎర్రని ముద్దగా భూమిపై పడినాడు. 6

శ్లో॥ సంస్తుత్యమునమోరామం ప్రయుజ్యాపి తథాశిషః ।
అభ్యషించన్మహాభాగం వృత్తఘ్నం విబుధాయథా ॥ 7

టీ:- స ఇతి. అరుణో రుధిరేణ దైత్యః. శైలోధాతుభిః.(6-7)

ఋషులందరు బలరాముని స్తుతించి యాగమును పూర్తిచేసి మహానుభావుడైన ఆయనను - వృత్రాసురుని సంహరించిన ఇంద్రున్ని దేవతలవలె ఆశీస్సులతో అభిషేకించినారు. 7

శ్లో॥ వైజయంతీం దదుర్మాలాం శ్రీధామామ్లాన పంకజమ్।
రామాయ వాససీ దివ్యే దివ్యాన్యాభరణాని చ ॥ 8

టీ:- వైజయంతీమితి.శ్రియోధామాని అమ్లానాని పంకజాని యస్యాం తాం. 8

శ్లో॥ అథతైరభ్యనుజ్ఞాతః కౌశికీమేత్య బ్రాహ్మణైః ।
స్నాత్వా సరోవర మగాద్యతస్సరయురాస్రవత్ ॥ 9

టీ:- అథేతి. కిం తత్సరః తదాహ-యత ఇతి అస్రవత్ ఉదగాత్. 9

శ్లో॥ అనుస్రోతేన సరయూం ప్రయాగముపగమ్యసః ।
స్నాత్వా సంతర్ప్య దేవాదీన్ జగామ పులహాశ్రమమ్ ॥ 10

టీ:- అనుస్రోతేనేతి. అనుస్రోతేన అనులోమతః. పులహాశ్రమం హరిక్షేత్రం. 10

శ్లో॥ గోమతీం గండకీం స్నాత్వా విపాశాం శోణ ఆప్లుతః ।
గయాంగత్వా పితౄనిష్ట్వా గంగాసాగర సంగమమ్ ॥ 11

శ్లో॥ ఉపస్పృశ్య మహేంద్రాద్రౌ రామం దృష్ట్వాభివాద్య చ ।
సప్త గోదావరీం వేణీం పంపాం భీమరథీంతతః ॥ 12

బలరామునికి ఋషులు లక్ష్మికి నిలయమైన వాడని పద్మములుగల వైజయంతి మాలను, రెండు దివ్యమైన వస్త్రములను, దివ్యమైన ఆభరణములను సమర్పించినారు. 8

అనంతరము ఋషుల వద్ద సెలవు గైకొని బలరాముడు యాత్రలకు బయలుదేరినాడు. బ్రాహ్మణులతో కూడినవాడై కౌశికి నది వద్దకు వచ్చి అక్కడ స్నానముచేసి అక్కడ నుండి సరోవరమునకు వచ్చి సరయూనదిలో స్నానము చేసినాడు. 9

బలరాముడు సరయూనదినుండి ఎదురునకు వెళ్లి ప్రయాగను చేరి అక్కడ పవిత్ర స్నానమాచరించి దేవతలకు, పితృదేవతలకు సంతర్పణలు చేసి అక్కడినుండి హరిక్షేత్రమైన పులహాశ్రమమునకు వెళ్ళినాడు. 10

గోమతీ నది, గండకీ నది, విపాశా నది, శోణానది, మొదలైన పవిత్ర తీర్థములందు స్నానమాడి, అక్కడినుండి గయకు వెళ్ళి పితృదేవతలకు శ్రాద్ధ తర్పణములు చేసి, గంగాసాగర సంగమమునకు వెళ్ళినాడు. పిమ్మట మహేంద్రగిరిపై తపము చేయుచున్న భార్గవ రాముని దర్శించి నమస్కరించినాడు. పిమ్మట సప్త గోదావరి, కృష్ణవేణి,

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- గోమతీమితి. గోమత్యాం గండక్యాం విపాశాయాం చ స్నాత్వా శోణే చ ఆప్లుతః స్నాతః . (11-12)

శ్లో॥ స్కందమిష్ట్వా యయౌరామః శ్రీశైలం గిరిశాలయం ।
ద్రవిడేషు మహాపుణ్యం దృష్ట్వాద్రిం వేంకటం ప్రభుమ్ ॥ 13

టీ:- స్కందమితి. ఇష్ట్వా సంపూజ్య శ్రీశైలం శ్రీపర్వతం. 13

శ్లో॥ కామకోటిపురీం కాంచీం కావేరీంచ సరిద్వరామ్ ।
శ్రీరంగాఖ్యం మహాపుణ్యం యత్ర సన్నిహితో హరిః ॥ 14

టీ:- కామకోటీతి. కాంచీపురీం. 14

శ్లో॥ ఋషభాద్రిం హరిక్షేత్రం దక్షిణాం మధురాం తథా ।
సముద్రసేతుమగమన్మహా పాతక నాశనమ్ ॥15

శ్లో॥ తత్రాయుతమదాద్ధేనూర్బ్రాహ్మణేభ్యో హలాయుధః ।
కృతమాలాం తామ్రపర్ణీం మలయం చకులాచలమ్ ॥ 16

టీ:- ఋషేభేతి. దక్షిణాం మధురాం చ. (15-16)

పంపా, భీమరథి మొదలైన నదులందు స్నానమాడి, కుమారస్వామిని సేవించి, అక్కడ నుండి పరమేశ్వరుని స్థానమైన శ్రీశైలము, దక్షిణ దేశమున పవిత్రమైన తిరుమలగిరిని వేంకటనాథుని, కామకోటియైన కంచీక్షేత్రమును కాంచీనాథుని, నదీలలామ అయిన కావేరిని, పుణ్యప్రదమైన శ్రీరంగ క్షేత్రమును అందు కొలువుదీరిన శ్రీరంగనాథుని, విష్ణు క్షేత్రమైన వృషభాద్రిని, దక్షిణ దిశలో ఉన్న మధురను దర్శించి మహా పాపామును శమింపచేయు సముద్ర సేతువును చేరినాడు. (11-15)

రామసేతువు వద్ద అర్ఘ్య విధులు నిర్వహించి బ్రాహ్మణ సముదాయమునకు బలరాముడు పదివేల ఆవులను దానము చేసినాడు. అక్కడి నుండి కృతమాలానదిని, తామ్రపర్ణిని, కులాచలమైన మలయ పర్వతమును సేవించినాడు. 16

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తత్రాగస్త్యం సమాసీనం నమస్కృత్యాభివాద్య చ ।
యోజితస్తేన చాశీర్భిరనుజ్ఞాతోగతోఽర్ణవమ్ ।
దక్షిణం తత్ర కన్యాఖ్యాం దుర్గాం దేవీం దదర్శ సః ॥ 17

టీ:- తత్రేతి. దక్షిణమవర్ణం. 17

అక్కడ ఆసీనుడైన అగస్త్య మహామునికి నమస్కరించి, సాష్టాంగ ప్రణామములుచేసి ఆమునీశ్వరుని ఆశీస్సులను పొంది, బలరాముడు ఆయన అనుమతిని వేడి దక్షిణసముద్రమునుచేరి అక్కడ కొలువున్న కన్యకుమారీ నామముతో ప్రసిద్ధమైన దుర్గాదేవిని దర్శించినాడు. 17

శ్లో॥ తతః ఫాల్గునమాసాద్య పంచాప్సరముత్తమమ్ ।
విష్ణుసన్నిహితో యత్ర స్నాత్వా స్పర్శద్గవాయుతమ్ ॥ 18

టీ:- తత ఇతి. ఫాల్గునం అనంతపురం పంచాప్సరసం సరః అస్పర్శత్ అదదాత్. 18

అక్కడినుండి ఫాల్గునమాసము రాగా నిత్యము విష్ణువు సన్నిహితుడైనందున ఉత్తమమైన పంచాప్సరస తీర్థమున స్నానమాచరించి పదివేల గోవులను దానము చేసినాడు. 18

శ్లో॥ తతోఽభివ్రజ్యభగవాన్ కేరళాన్‌సోమగర్తకాన్ ।
గోకర్ణాఖ్యంశివక్షేత్రం సాన్నిధ్యం యత్ర ధూర్జటేః ॥ 19

టీ:- తత ఇతి. కేరళాదీన్ దేశాన్. 19

అక్కడనుండి ముందుకు వెళ్ళి భగవంతుడైన బలరాముడు కేరళా దేశమును, సోమగర్తక దేశములను, శివుని సన్నిధానమైన శివ క్షేత్రమైన గోకర్ణమును దర్శించినాడు. 19

శ్లో॥ ఆర్యాం ద్వైపాయనీం దృష్ట్వా శూర్పారకమగాద్బలః ।
తాపీంపయోష్ణీంనిర్వింధ్యాముపస్పృశ్యాథ దండకమ్ ॥ 20

శ్లో॥ ప్రవిశ్యరేవామగమద్యత్ర మాహిష్మతీపురీ ।
మనుతీర్థముపస్పృశ్య ప్రభాసం పునరాగమత్ ॥ 21

అక్కడ ద్వీపమందు వెలసిన పార్వతీదేవిని (శాంకరీ) దర్శించి బలరాముడు శూర్పారకమునకు వెళ్ళినాడు. పిమ్మట తాపి, పయోష్ణి, నిర్వింధ్యా నదులను దాటి దండకారణ్యమున ప్రవేశించి, తన తీరమందు మాహిష్మతీనగరము వెలసిన రేవా నదీ తీర్థమున స్నానమాడి ప్రభాసతీర్థమునకు తిరిగి వచ్చినాడు బలరాముడు. (20-21)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ శ్రుత్వా ద్విజైః కథ్యమానం కురుపాండవ సంయుగే ।
సర్వ రాజన్య నిధనం భారం మేనేహృతం భువః ॥ 22

టీ:- ఆర్యామితి. ద్వీపమయనం అస్యాస్తాం. (20-22)

అక్కడ కురుపాండవ సంగ్రామమున సమస్త రాజ సముదాయము నాశనమైనదనే విషయమును ఋషులు చెప్పగా విని భూభారము తొలగినదని భావించినాడు. 22

శ్లో॥ సభీమ దుర్యోధనయోర్గదాభ్యాం యుధ్యతోర్మృధే ।
వారయిష్యన్ వినశనం జగామ యదునందనః ॥ 23

టీ:- స ఇతి. వినశనం కురుక్షేత్రం. 23

పిమ్మట యుద్ధ రంగమున భీమ, దుర్యోధనుల గదాయుద్ధమును నివారించుటకై బలరాముడు కురుక్షేత్రమునకు వెళ్ళినాడు. 23

శ్లో॥ యుధిష్ఠరస్తుతం దృష్ట్వా యయౌ కృష్ణార్జునావపి ।
అభివాద్యాభవం స్తూష్ణీం కిం వివక్షురిహాగతః ॥ 24

శ్లో॥ గదాపాణీ ఉభౌదృష్ట్వా సంరబ్ధౌ విజయైషిణౌ ।
మండలాని విచిత్రాణి చరంతావిదమబ్రవీత్ ॥ 25

శ్లో॥ యువాం తుల్యబలౌ వీరౌ హే రాజన్ హే వృకోదర ।
ఏకం ప్రాణాధికం మన్య ఉతైకం శిక్షయాధికమ్ ॥ 26

టీ:- యుధిష్ఠిర ఇతి. వివక్షుః వక్తుమిచ్ఛుః. కిం వదిష్యతీతి భియా తూష్ణీమాసన్నితి. (24-26)

కురుక్షేత్రమునకు చేరవచ్చు బలరాముని చూచి, నమస్కరించి కృష్ణార్జునులు వెళ్ళిపోగా, ధర్మరాజు ఈయన ఏమి చెప్పుటకు ఇక్కడికి వచ్చినాడో అని భయపడి నోరు మెదపక మిన్నకుండెను. 24

అప్పుడు బలరాముడు పరస్పరము గెలువవలెనని పట్టుదలతో చిత్రవిచిత్రముగా వలయములు తిరుగుచు మిగులజాగరూకతతో గదలతోపోరాడు భీమదుర్యోధనులను చూచి ఈ విధముగా చెప్పినాడు. 25

ఓ దుర్యోధనా ! ఓ భీమసేనా ! మీరిరువురు సమాన బలముగల వీరులు. మీలో ఒకరిని నేను ప్రాణాధికముగను,మరొకరిని అపారమైన గదాయుద్ధ కుశలునిగను భావింతును. 26

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తస్మాదేకరతస్యేహ యువయోస్సమ వీర్యయోః ।
నలక్ష్యతే జయోఽన్యోవా విరమత్వఫలో రణః ॥ 27

టీ:- తస్మాదితి. అన్యః పరాజయో వారణస్సంగ్రామః. 27

మీరు ఒకరికొకరు సమానమైన పరాక్రమము కలవారైనందున ఎవరికిని విజయము కాని ఓటమికాని కలుగునట్లు కనిపించుట లేదు. కనుక మీ పోరాటము నిష్ఫలము. యుద్ధమును విరమించుడని చెప్పినాడు. 27

శ్లో॥ న తద్వాక్యం జగృహతుర్బద్ధవైరౌ నృపార్థవత్ ।
అనుస్మరంతావన్యోన్యం దురుక్తం దుష్కృతాని చ ॥ 28

టీ:- నేతి. అర్థవత్ వాక్యమ్. 28

శ్లో॥ దిష్టం తదనుమన్వానో రామో ద్వారవతీం యయౌ ।
ఉగ్రసేనాదిభిః ప్రీతైర్జ్ఞాతిభిస్సముపాగతః ॥ 29

టీ:- దిష్టమితి. దిష్టం ప్రాచీనం కర్మ, సముపాగతః సంగతః. 29

ఓ రాజా ! బద్ధవైరముగల భీమదుర్యోధనులు బలరాముని హితోపదేశమును సార్థకమైనదిగా స్వీకరించక పెడచెవిని పెట్టినారు. వారి దుర్మార్గములు, పరస్పరనిందలను జ్ఞాపకము చేసుకొనుచు పురాకృత కర్మ ఫలితముగా జరగవలసినది జరుగక మానదని భావించి ఉగ్రసేనుడు మొదలైన ఇష్టులైన దాయాదులతో ద్వారకా నగరమునకు బలరాముడు వెళ్ళినాడు. (28-29)

శ్లో॥ తం పునర్నైమిషం ప్రాప్తమృషయోఽయా జయన్ ముదా ।
క్రత్వంగం క్రతుభిస్సర్వై నివృత్తాఖిలవిగ్రహమ్ ॥ 30

టీ:- త మితి. తం బలరామం క్రత్వంగం యజ్ఞమూర్తిం. 30

మరల నైమిశారణ్యమునకు వచ్చిన యజ్ఞమూర్తి విష్ణురూపుడు అయిన బలరాముని ఋషులందరు సంతోషముతో అర్చించి యజ్ఞములు చాలించిరి. 30

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తేభ్యోవిశుద్ధం విజ్ఞానం భగవాన్ వ్యతిరద్విభుః ।
యేనైవాత్మన్యదో విశ్వమాత్మానాం విశ్వగం విదుః ॥ 31

భగవంతుడు, ప్రభువు అయిన బలరాముడు ఆ ఋషులందరికి ఆత్మను అధిష్ఠించిన పరమాత్మను తెలియగల తననే ఈ అనంత విశ్వముగా (వ్యష్టి సమష్టి భేదము లేకుండునట్లుగా) అంతటా పరమాత్మను దర్శించగల మిక్కిలి శుద్ధమైన విజ్ఞానమును ప్రసాదించినాడు. 31

శ్లో॥ స్వపత్న్యావభృథస్నాతో జ్ఞాతిబంధుసుహృద్వృతః ।
రేజే స్వజోత్స్న యేవేందుస్సువాసాస్సుష్ఠ్వలంకృతః ॥ 32

తన భార్యలతో అవభృథస్నానముచేసి జ్ఞాతులు,బంధువులు, స్నేహితులతోకూడినవాడై శ్రేష్ఠమైనవస్త్రములు,ఆభరణములతో అలంకృతుడై తన వెన్నెలచేత ప్రకాశించు చంద్రునివలె వెలిగినాడు. 32

శ్లో॥ ఈదృగ్విధాన్యసంఖ్యాని బలస్య బలశాలినః ।
అనంతస్యాప్రమేయస్య మాయామర్త్యస్య సంతి హి ॥ 33

అనంతుడై, మాయామానుషరూపమును ధరించిన బలరాముడు తన ప్రభావముతో చేసిన ఘనకార్యములైన లీలలు పెక్కులు. 33

శ్లో॥ యోనుస్మరతి రామస్య కర్మాణ్యద్భుతకర్మణః ।
సాయం ప్రాతరనంతస్య విష్ణోస్సదయితో భవేత్ ॥ 34

అద్భుత కార్యములుచేయునట్టి బలరామునివిలాసములను ప్రతి నిత్యము ఉదయాస్త మానములందు స్మరించినవారు శ్రీమహావిష్ణువుకు ప్రీతిపాత్రులు కాగలుగుదరని శుక మహర్షి వివరించినాడు. 34

టీ:- తేభ్యఇతి. ఆత్మని అధిష్ఠానే విశ్వగం సర్వానుసూత్యం యేనైవ విదుః పశ్యంతి తత్ విశుద్ధం విజ్ఞానం వ్యతరత్ అదాత్.(31-34)

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, ఏకోనాశీతితమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు డెబ్బదితొమ్మిదవ అధ్యాయముసమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## అశీతితమో௨ధ్యాయః
## కుచేలోపాఖ్యానః

శ్లో॥ అథాశీతితమే కృష్ణశ్శ్రీదామానంగృహాగతమ్ ।
సంపూజ్యాపృచ్ఛదర్థేప్సుం గురువాసకథాం ముదా ॥
సురారిమారకోహరిః పురా చకార శంసతా ।
మతఃపరం వినైవతం నిజోపకారమాచరత్ ॥

రాజోవాచ

శ్లో॥ భగవన్ యానిచాన్యాని ముకుందస్య మహాత్మనః ।
వీర్యాణ్యనంతవీర్యస్య శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో ॥ 1

టీ:- శ్రీరామచరితాని శ్రుత్వాపునర్ముకుందవీర్యాణి పృచ్ఛతి - భగవన్నితి. హేభగవన్ శ్రోతుమిచ్ఛామీత్యన్వయః. 1

శ్లో॥ కోనుశ్రుత్వాసకృద్బ్రహ్మన్నుత్తమ శ్లోకసత్కథాః ।
విరమేత విశేషజ్ఞో విషణ్ణః కామమార్గణైః ॥ 2

టీ:- క ఇతి. ఉత్తమశ్లోకస్య సత్యో మనోహరాః విషయవైతృష్ణ్య జనకాః కథాః. విశేషజ్ఞః సారవిత్ విషణ్ణః విషాదం ప్రాప్తః. 2

## 80వ అధ్యాయము
## కుచేలోపాఖ్యానము.

ఎనుబదవ అధ్యాయమున శ్రీదాముడైన కుచేలుడు సంపదను ఆశించి తన ఇంటికి రాగా కృష్ణుడతని చక్కగా అర్చించి గురుకుల వాసమునాటి విషయములను అడుగుట, రాక్షసాంతకుడైన కృష్ణుడు చేసిన లోకోపకారములైన ఘనకార్యములను గురించి అడిగిన పరీక్షిత్తుకు శుకమహర్షి అంతకు ముందుకానీ, ఆ తర్వాతకానీ లేని విధముగా - బలరాముని సాహస కార్యములను వినిపించిన పిదప **శ్రీకృష్ణుని పరాక్రమ గాథలను వినిపించుట విషయము.**

**రాజు ఈ విధముగా అడిగినాడు.**

పరీక్షిత్తు శుకమహర్షితో ఓ భగవంతుడా! స్వామీ! మహాత్ముడు, అపారమైన ప్రతాపవంతుడైన శ్రీకృష్ణుడు చేసిన ఇతరములైన ఘన కార్యములను వినగోరుచున్నాను. చెప్పవలసినదని ప్రార్థించినాడు. 1

ఓ పరమాత్మా ! ఉత్తమ శ్లోకుడైన కృష్ణ భగవానుని మనోహరమై ప్రాపంచిక వ్యామోహమును తొలగించు పుణ్య కథలను కామక్రోధాది (మన్మథుని) బాణములకు గురియై సంకటపడుచు విషాదమును పొందినవాడు, సారము తెలిసిన వాడెవడునూ ఒక్కసారి విన్నంత మాత్రముననే తృప్తి చెందదుకదా. 2

శ్లో॥ సావాగనంతస్య గుణాన్ గృణీతే
కరౌచ తత్కర్మ కరౌ చ మనశ్చ ।
స్మరేద్వసంతం స్థిరజగం మేషు
శృణోతి తత్పుణ్య కథాస్సకర్ణః ॥ 3

టీ:- కథాశ్రవణం స్తువన్ దృష్టాంత తయా అన్యార్థానాహ-సేతి. తావేవ కరౌ.యౌతత్కర్మకర్తారౌ. తదేవ మనః. యత్ స్థిరజంగమేషు వసంతం స్మరేత్. యస్తస్య పుణ్యాః కథాః శృణోతి. స ఏవ కర్ణః. 3

శ్లో॥ శిరస్తు తస్యోభయలింగమానమే
త్తదేవ యత్పశ్యతి తద్ధి చక్షుః ।
అంగాని విష్ణోరథ తజ్జనానాం
పాదోదకం యాని భజంతి నిత్యమ్ ॥ 4

శ్రీ సూత ఉవాచ

శ్లో॥ విష్ణురాతేన సంపృష్టో భగవాన్ బాదరాయణిః ।
వాసుదేవే భగవతి నిమగ్నహృదయోஉబ్రవీత్ ॥ 5

భగవంతుని శ్రవణమాహాత్మ్యమును స్తుతించుచు దృష్టాంతములతో ఇతరత విషయములను చెప్పుచున్నాడు - స్థావర జంగములందు అనగా సమస్త సృష్టిలో అనంతుడై నిండిన పరమాత్ముని గుణములకు సంబంధించిన కార్యములను చేసిన చేతులేచేతులు(పరమాత్మ సేవ చేయుటయే చేతులకు సార్థక్యము). ఆయనను స్మరించు మనస్సే మనస్సు. అనవరతము పరమాత్మ గుణగాథలను వినుటయే చెవులకు సార్థక్యము. 3

సమస్త భూచర సృష్టి పరమాత్మ స్థానమే అనితెలిసి ఆనంద పారవశ్యముతో వంచి నమస్కరించిన తలయే సార్థకమైనది. సమస్త శరీరావయములు శ్రీ మహావిష్ణువుయొక్క, అతని భక్తుల యొక్క పాద జలము సేవించిన వారి అవయవములే సార్థకములు. 4

శ్రీ సూతుడు ఇట్లు చెప్పినాడు

విష్ణు రాతుడు పరమాత్ముని గురించి తెల్పుమని చక్కగా అడిగిన విషయముతో మిక్కిలి సంతసించి భగవంతుడైన వాసుదేవుడియందు అంచలంచెలుగా నిలిపిన మనస్సుతో యోగీంద్రుడైన శుక మహర్షి ఈ విధముగా చెప్పెను. 5

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ కృష్ణస్యాసీత్సఖా కశ్చిద్బ్రాహ్మణో బ్రహ్మవిత్తమః ।
విరక్త ఇంద్రియార్థేషు ప్రశాంతాత్మా జితేంద్రియః ॥ 6

టీ:- శిర ఇతి. ఉభయలింగం స్థిరం జంగమం చ తస్యైవలింగమితి మత్వా ఆనమేత్తదేవ శిరః. తదేవ తస్య లింగమిత్యేవయత్ పశ్యతి. తదేవ చక్షుః. తాన్యేవచాంగాని యాని తజ్జనానాం పాదోదకం భజంతీతి. (4-6)

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

శ్రీకృష్ణునికి బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు, ఇంద్రియ వ్యామోహము లందు విరక్తుడు, ప్రసన్నమైన చిత్తము, ఇంద్రియ నిగ్రహము కలవాడైన ఒకానొక బ్రాహ్మణుడు ఇష్టసఖుడై ఉన్నాడు. 6

శ్లో॥ యదృచ్ఛయోపపన్నేన వర్తమానో గృహాశ్రమీ ।
తస్యభార్యా కుచేలస్యక్షుత్క్షమా చ తథా విధా ॥ 7

టీ:- యదృచ్ఛయేతి. తథా విధా కుచేలా. కిం చ. క్షుత్ క్షామా యత్కించిత్సంపన్నమన్నం తత్ తస్మై పరివిష్యస్వయం క్షుధాజీర్ణా. 7

అతడు గృహస్థధర్మమును నిర్వర్తించుచూ దైవానుగ్రహము వలన లభించిన దానితోనే తృప్తి పడేవాడు. అతని సతీమణి అన్ని విధముల అతనికి సరిజోడై ఆకలితో శుష్కించి పోయినను దొరికిన అన్నమును భర్తకు పెట్టి తాను పస్తులుండెడిది. 7

శ్లో॥ పతివ్రతాపతిం ప్రాహమ్లాయతావదనేన సా ।
దారిద్ర్యాత్సీదమానా సా వేపమానాభిగమ్య చ ॥ 8

ఆ పతివ్రతయైన ఇల్లాలు వాడిన ముఖముతో సుఖపెట్టలేని అశక్తతతో సంకట పడుచు దారిద్రబాధతో కంపించినదై భర్తను సమీపించి ఈ విధముగా విన్నవించినది. 8

శ్లో॥ నను బ్రహ్మన్ భగవతస్సఖా సాక్షాచ్ఛ్రియః పతేః ।
బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ భగవాన్ సాత్వతాం పతిః ॥ 9

బ్రహ్మవేత్త అయిన ఓ స్వామీ ! సాక్షాత్తు సంపదలకు ఆకరమైన లక్ష్మీదేవికి భర్త, పరమాత్మ, ఆశ్రితులైన భక్తులను ఆదరించువాడు అయిన శ్రీకృష్ణుడు మీకు స్నేహితుడు. 9

శ్లో॥ తముపైహి మహాభాగ సాధూనాం చ పరాయణమ్ ।
దాస్యతి ద్రవిణం భూరి సీదతే తే కుటుంబినే ॥ 10

టీ:- పతివ్రతేతి. మ్లాయతా శుష్యతా. తథా సీదమానా భర్తృభోగ సంపాదనాశక్త్యైవ సీదంతీ. వేపమానా భయేన కంపమానా. (8-10)

ఓ పుణ్యాతుడా ! సజ్జనులను రక్షించు ఆ పరమాత్మ వద్దకు వెళ్ళండి. ఆయన అమితమైన సంపదలు ప్రసాధించగలడు. దాని వలన మన కుటుంబము రక్షింపబడును. 10

శ్లో॥ ఆస్తే௨ధునా ద్వారవత్యాం భోజవృష్ణ్యంధకేశ్వరః ।
స్మరతః పాదకమలమాత్మానమపి యచ్ఛతి ।
కిమర్థః కామాన్ భజతోనాత్యభీష్టాన్ జగద్గురుః ॥ 11

ఆ పరాత్పరుడిప్పుడు భోజకులు, వృష్ణులు, అంధకులకు అధినాయకుడై ద్వారకా నగరమున వెలసి తనను నిరంతరము స్మరించు భక్తులకు ఆత్మ సమర్పణము కూడా చేయగలవాడైయున్నాడు. అట్టి జగద్గురుడు సేవించిన వారికి కోరిన కోరిక కంటే అధికముగా అర్థ కామములను ప్రసాదించడా ఏమి?అనే ప్రశ్నకు తప్పక ఇవ్వగలడని సమాధానము. 11

శ్లో॥ ఏవం స్వభార్యయా విప్రోబహుశః ప్రార్థితో మృదు ।
అయంహి పరమో లాభ ఉత్తమశ్లోక దర్శనమ్ ॥ 12

అని ఈ విధముగా కుచేలుని పత్ని మృదువుగా తన భర్తను పెక్కు విధములుగా ప్రార్థించగా ఆయన కృష్ణుని ధనసహాయము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- ఆస్త ఇతి. భోజవృష్ణ్యంధకేశ్వర ఇతి తత్స్వీకారమాత్రేణ సర్వే తే దాస్యంతీతి భావః. నాత్యభీష్టాన్ పరిపారకవిరసత్వాత్.(11-12)

విషయము ఎట్లు ప్రార్థించగలను? అయినా నాకు నా చిరకాల మిత్రుడైన ఆ పురుషోత్తముని దర్శించగలుగుటయే సర్వోత్కృష్టమైన లాభము. 12

శ్లో॥ ఇతి సంచింత్య మనసా గమనాయ మతిందధే ।
అప్యస్త్యుపాయనం కించద్గృహే కళ్యాణి దీయతామ్ ॥ 13

అని మనస్సులో భావించి కుచేలుడు ద్వారకకు వెళ్ళుటకు సిద్ధపడినాడు. శ్రీకృష్ణ పరమాత్మకు ఇచ్చుటకు ఏమైన కానుక ఉన్నదా అని పతివ్రత అయిన భార్యను అడిగినాడు. 13

శ్లో॥ యాచిత్వా చతురో ముష్టీన్ విప్రాన్ పృథుకతండులాన్ ।
చేలఖండేన తాన్ బధ్వా భర్త్రే ప్రాదాదుపాయనమ్ ॥ 14

ఆమె బ్రాహ్మణుల ఇల్లలో తిరిపెముగా తెచ్చుకున్న అటుకులను ఒక వస్త్రమున ముడివేసి కానుకగా ఇవ్వమని భర్తకు ఇచ్చినది. 14

టీ:- ఇతీతి. అప్యస్తి కిమస్తీతి ప్రశ్నః. (13-14)

శ్లో॥ సతానాదాయ విప్రాగ్ర్యః ప్రయయౌ ద్వారకాంకిల ।
కృష్ణసందర్శనం మహ్యం కథంస్యాదితి చింతయన్ ॥ 15

టీ:- స ఇతి.మహ్యం మమ. 15

శ్లో॥ త్రీణి గుల్మాన్యతీయాయ తిస్రఃకక్ష్యాశ్చ సద్విజః ।
విప్రోగమ్యాంధవృష్ణీనాం గృహేష్వచ్యుత ధర్మిణామ్ ॥ 16

బ్రాహ్మణ శ్రేష్ఠుడైన ఆ కుచేలుడు అటుకులను తీసుకుని ద్వారకానగరమునకు వెళ్ళి తనకు శ్రీకృష్ణునిదర్శనము ఎట్లు కలుగునో? అని చింతించుచు రక్షణార్థమై ఉన్న మూడు సైన్యస్థానములను దాటి, మూడు ప్రాకారములను అతిక్రమించి బ్రాహ్మణ సముదాయముతో కూడిన కుచేలుడు సామాన్యులు ప్రవేశించుటకు వీలుకాని కృష్ణుని ఆత్మీయులైన అంధకులు, వృష్ణుల ఇండ్లను దాటి పదహారువేల మంది

టీ:- త్రీణీతి.గుల్మాని రక్షార్థం సైన్యస్థానాని. కక్షాఃప్రతోళీః అతీయాయ అతిక్రమ్య జగామ. సద్విజః ద్విజైస్సహితః తతశ్చ. అగమ్యాః దుర్గమాః యే అచ్యుతధర్మాణః అంధవృష్ణయశ్చ. తేషాం గృహేషు. 16

రాజకుమార్తెల ఇండ్లుదాటి ఎనిమిది మంది పట్టమహిషుల ఇండ్లలో ఒకానొక ఇంటిలో ప్రవేశించి బ్రహ్మానందానుభూతి పొందిన వానివలె అయినాడు.(15-17)

శ్లో॥ గృహం ద్వ్యష్టసహస్రాణాం మహిషాణాం హరేర్ద్విజః ।
వివేశైకతమం శ్రీమద్బ్రహ్మానందగతో యథా ॥ 17

టీ:- గృహమితి. తథా హరేః ద్వ్యష్టసహస్రాణాం మహిషీణాం చ యే గృహాః తేషు మధ్యే. శ్రీమత్కాంతం. ఏకతమం గృహం వివేశ. తదాచ సద్విజో బ్రహ్మానందగతో యథా తథా బభూవేతి శేషః. 17

శ్లో॥ తం విలోక్యాచ్యుతో దూరాత్ప్రియాపర్యంకమాస్థితః ।
సహసోత్థాయ చాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీన్ముదా ॥ 18

టీ:- తమితి.పర్యగ్రహీత్ ఆలింగితవాన్. 18

ప్రియురాలితో పడకపై కూర్చున్న శ్రీకృష్ణుడు, వచ్చుచున్న కుచేలుని దూరము నుండి చూచి శీఘ్రముగా లేచి ఎదురేగి పరమానందముతో రెండు చేతులతో కౌగిలించుకున్నాడు. 18

శ్లో॥ సఖ్యుః ప్రియస్య విప్రర్షే రంగసంగాతినిర్వృతః ।
ప్రీతో వ్యముంచదబ్బిందూన్నేత్రాభ్యాం పుష్కరేక్షణః ॥ 19

టీ:- సఖ్యురితి. అబ్బిందూన్ ఆనందాశ్రూణి. 19

బాల్యమునందలి ప్రియమిత్రుడైన బ్రహ్మర్షి కుచేలుని శరీర స్పర్శతో పారవశ్యమును పొంది, సంతోషముతో పద్మాక్షుడైన కృష్ణుని రెండు నేత్రములనుండి ఆనందబాష్పములు స్రవించినవి. 19

శ్లో॥ అథోపవేశ్య పర్యంకే స్వయం సఖ్యుస్సమర్హణమ్ ।
ఉపహృత్యావనిజ్యాస్యపాదౌ పాదావనేజనీః ॥ 20

శ్లో॥ అగ్రహీచ్ఛిరసా రాజన్ భగవాన్ లోకపావనః ।
వ్యలింపద్దివ్యగంధేన చందనాగరు కుంకుమైః ॥ 21

శ్లో॥ ధూపైస్సురభిర్మిత్రం ప్రదీపావళిభిర్ముదా ।
అర్చిత్వా౽౽వేద్యతాంబూలం గాం చ స్వాగతమబ్రవీత్ ॥ 22

టీ:- అథేతి. సమర్హణం ఉపాయనం ఉపహృత్య సమర్ప్య. పాదావనేజనీః అపః (20-22)

శ్లో॥ కుచేలం మలినం క్షామం ద్విజం ధమనిసంతతమ్ ।
దేవీ పర్యచరద్భైష్మీచామరవ్యజనేన వై ॥ 23

టీ:- కుచేలమితి. ధమనీభిః.సిరాభిః. సతతం వ్యాప్తం. 23

శ్లో॥ అంతఃపురజనో దృష్ట్వా కృష్ణేనామల కీర్తినా ।
విస్మితో౽భూదతి ప్రీత్యా అవధూతం సభాజితమ్ ॥ 24

టీ:- అంతఃపురేతి. అవధూతం మలినం. 24

ఓ రాజా ! పిమ్మట ప్రియసఖుడైన కుచేలుని తన పడక మంచముపై తానే కూర్చుండజేసి స్వయముగా అర్చించి, అతని పాదములను కడిగి మంచి గంధము, కుంకుమాదులచే దివ్యమైన సువాసనలతో కూడిన ఆ పాదజలమును లోకపావనుడైన భగవంతుడు కృష్ణుడు తన తలపై చల్లుకున్నాడు. (20-21)

కృష్ణుడు సువాసనలతో కూడిన ధూపములు, మంగళ హారతులతో సంతోషముగా మిత్రుడైన కుచేలుని అర్చించి గోవును, తాంబూలమును సమర్పించి స్వాగత వాక్యములు పలికినాడు. 22

మాసిన వస్త్రములు, శుష్కించిన శరీరముతో బక్కదనముతో వంటినిండా రక్తనాళములు కనపడునట్లుగాఉన్న కుచేలునికి శ్రీకృష్ణుని పట్టపు దేవేరి, సాక్షాత్తు లక్ష్మీ అయిన రుక్మిణీదేవి చామరములతో గాలి వీచి సపర్యలు చేసినది. 23

అగ్రాసనమును అధిష్ఠించిన అవధూత అయిన కుచేలునికి నిర్మల కీర్తిమంతుడైన శ్రీకృష్ణ స్వామి మిక్కిలి ప్రీతితో సభలో చేసిన ఈ సపర్యలను చూచి లోకము అసహ్యించుకొనునట్టి నిర్ధనుడైన,

శ్లో॥ కిమనేనకృతం పుణ్యమవధూతేన భిక్షుణా ।
క్రియాహీనేన లోకేఽస్మిన్ గర్హితేనాధనేన చ ॥ 25

టీ:- విస్మయమాహ - ద్వాభ్యాం. కిమితి. 25

శ్లో॥ యోఽసౌత్రిలోకగురుణా శ్రీనివాసేన సంభృతః ।
పర్యంకస్థాం శ్రియం హిత్వా పరిష్వక్తోఽగ్రజోయథా ॥ 26

టీ:- య ఇతి. సంభృతః సంమానితః. 26

శ్లో॥ కథయాంచ క్రితుర్గాథాః పూర్వాగురుకులే సతోః ।
ఆత్మనోర్లలితా రాజన్ కరౌ గృహ్య పరస్పరమ్ ॥ 27

టీ:- కథయాంచక్రతురితి సతోర్వసతోః. కరౌ గృహ్యాగృహీత్వా. 27

శ్రీభగవానువాచ

శ్లో॥ అపి బ్రహ్మన్ గురుకులాద్భవతా లబ్ధదక్షిణాత్ ।
సమావృత్తేన ధర్మజ్ఞ భార్యోఢా సదృశీనవా ॥ 28

అమంగళకరముగా మలినుడైన ఈయాచకుడుఇంతటి గౌరవ సత్కారములు పొందుటకు పూర్వ జన్మమున ఎంతపుణ్యము చేసినాడో కదా అని అంతఃపురజనులు అపారమైన ఆశ్చర్యమును పొందినారు. (24-25)

త్రిలోకనాథుడై శ్రీపతియైన ఈ కృష్ణుడు తన పడకపై ఉన్న శ్రీరూప అయిన రుక్మిణీదేవికన్న మిన్నగా అగ్రజుడైన బలరాముని వలె చక్కగా ఆదరముతో దరిజేర్చి కౌగిలించుకున్నాడు. 26

ఓ రాజా ! పిమ్మట కృష్ణకుచేలురిరువురు మనస్సుకు ఆనందము కలుగునట్టి తమ చిన్ననాటి గురుకులమున వాసము చేయుచున్నప్పటి సన్నివేశములను ఒకరిచేతులు మరొకరు పట్టుకొని పరస్పరము చెప్పుకొని మురిసి పోయిరి. 27

**శ్రీకృషుడు ఇట్లు చెప్పినాడు**

ఓ ధర్మజ్ఞుడవైన మిత్రమా! గురుదక్షిణ సమర్పించి గురుకుల వాసము నుండి తిరిగి మీ ఇంటికి చేరిన పిదప వివాహము చేసు కుంటివా? లేదా? నీ భార్య నీకు అనుకూలమైనదా? అని కృష్ణుడు

టీ:- అపీతి. భార్యా ఊఢా పరిణతానవేతి. గృహస్థలింగదర్శనాత్ భోగాదర్శనాచ్చ సంశయాదేవ ప్రశ్నః .28

కుచేలుని అడిగినాడు - కుచేలుని యందు వివాహితుని గార్హస్థ్య లక్షణములు కనబడుచున్నవి.( వివాహితులైన బ్రాహ్మణులకు తొమ్మిది పోగుల యజ్ఞోపవీత ధారణ లక్షణము, లింగము కనబడుచునే ఉన్నది. కానీ అతని ముఖము గృహస్థ భోగములనుభవించినట్లు కనబడలేదు. అందువల్లనే కృష్ణునికి అతడు వివాహితుడా కాదా అనే సంశయమునకు ఆస్కారము కలిగినది). 28

శ్లో॥ ప్రాయోగృహేషుతేచిత్తం న కామవిహితం తదా ।
నైవాతిప్రీయసే విద్వన్ ధనేషు విదితం హి మే ॥ 29

టీ:- అప్రతిషేధాదుద్వాహమనుమతం మత్వాహ - ప్రాయ ఇతి. తర్హితే చిత్తం మానం కామవిహతం కామైర్విహతం సభవతీతి మే విదితం. తథా హి.- ధనేషు వస్త్రాదిషు నైవ్రాతిప్రీయసేహే విద్వన్నితి విదుషస్తవైతద్యుక్తమితి భావః. 29

ఓ విద్వాంసుడా ! నాయందే చిత్తముంచిన నిరీహులైన వారి మనస్సు కోరికల గూర్చి వ్యామోహమును పొందదు. అట్టి వాడనైన నీకు సంపదలపట్ల అభిమానుము లేదనే విషయము నాకు స్పష్టమే. 29

శ్లో॥ కేచిత్కుర్వంతి కర్మాణి కామైరహతచేతసః ।
త్యజంతః ప్రకృతీర్దైవీర్యథాహం లోకసంగ్రహమ్ ॥ 30

టీ:- కామహతత్వాభావే కిం గృహకర్మక్లేశేనేత్యాశంక్యాహ-కేచిదితి.

గృహస్థధర్మమున కోరికలున్నచో అవి సంకటకారణములే అనే విషయమై చెప్పుచున్నాడు. కొందరు ఈశ్వరుని మాయచేత నిర్మితమైన ప్రకృతికి సంబంధించిన విషయవాసనలు విడిచిపెట్టి కోరికలు లేనివారై కూడా లోకసంగ్రహము కొరకై కర్మలను చేయుదురు. కోరికలు

దైవీః ఈశ్వరమాయావిరచితాః ప్రకృతీః విషయవాసనాః. త్యజంతః .కామైరనాకృష్ణచేతసామపి కర్మకరణే దృష్టాంతః-యథాహమితి. లోకసంగ్రహం లోకస్య సంగ్రహః గ్రహణం యథా భవతి తథా. అహమీశ్వరో౭పి కర్మాణి యథా కరోమి తద్వత్. 30

శ్లో॥ కచ్చిద్గురుకులే వాసం బ్రహ్మన్ స్మరసి నౌ యతః ।
ద్విజో విజ్ఞాయ విజ్ఞేయం తమసః పారమశ్నుతే ॥ 31

టీ:- కచ్చిదితి.నౌ ఆవయోః. యతః గురోః విజ్ఞేయం పరమాత్మ తత్త్వం తమసః సంసారస్య. 31

శ్లో॥ సవైసత్కర్మణాం సాక్షాద్ద్విజాతేరిహ సంభవః ।
ఆద్యో౭ంగ యత్రాశ్రమిణాం యథాహం జ్ఞానదో గురుః ॥ 32

టీ:- తత్రాత్మజ్ఞానప్రదస్య గురోరత్యంత పూజ్యత్వం వక్తుం పురుషస్య త్రీన్ గురూనాహ. -స ఇతి. ఇహ సంసారే యత్రసంభవః జన్మమాత్రం స పితా తావదాద్యః ప్రథమః గురుః పూజ్యః. కర్మవిద్యాప్రదం గురుమాహ -ద్విజాతేస్సతః పుంసః సత్కర్మణాం యత్రసంభవః ఉపనీయ వేదాధ్యాపక ఇత్యర్థః.స ద్వితీయో గురుః యథాహమీశ్వరస్తథా

లేకపోయినను కర్మలు తప్పవనుటకు-కృష్ణుడు లోకేశ్వరుడైనను లోకవ్యవహారానుగుణమైన కర్మలు చేసినట్లుగా ఎల్లరికిని కర్మాచరణ తప్పదని దృష్టాంతముగా చెప్పుచున్నాడు. 30

ఓ మిత్రమా! గురుకుల వాసము నాటి మనము చేసిన పనులు నీకు గుర్తున్నవా? బ్రాహ్మణుడు గురువుల వలన పరమాత్మ తత్త్వము తెలిసి సంసార సముద్రముయొక్క దరిని చేరును. అనగా ప్రాపంచిక వ్యామోహము నశించి దుఃఖములను పొందరని భావము. 31

ఆత్మ జ్ఞానము కలిగించునట్టి గురువు మిక్కిలి పూజనీయుడు అని స్థాపించుటకై మూడు విధములైన గురువుల భేదములను చెప్పుచున్నాడు - ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ! ఈ జగత్తునందు జన్మకు కారణమైన జనకుడు ముందుగా పూజించదగిన మొదటి గురువు. చేయవలసినపనులను, విధులనుఏర్పరచి విద్యాదానము చేయు గురువును చెప్పుచున్నాడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనే ద్విజాతులకు ఏ జాతిలో జన్మించిన వారికి వారివారి సంస్కార నియమములను బట్టి ఉపనయనము చేసి వేదమును అభ్యసింపజేయువాడు రెండవ

ప్రథమాదపి పూజ్య ఇత్యర్థః. బ్రహ్మ విద్యాప్రదం గురుమాహ - ఆశ్రమిణాం సర్వేషామపి. జ్ఞానదః యః స తు సాక్షాదహమేవేతి. 32

గురువు. ఈశ్వరసంహుడైన గురువు జన్మపితకన్న పూజనీయుడని అర్థము. బ్రహ్మవిద్యను ప్రసాదించు గురువును గురించి చెప్పుచున్నాడు బ్రహ్మచారి, గృహ, వనప్రస్థ, సన్యాసి అనే నాలుగు ఆశ్రమములందున్న ఎల్లరకు జ్ఞానమును ప్రసాదించు మూడవ గురుడను నేను అని చెప్పినాడు. (జన్మపిత, విద్యాదాత, జ్ఞాన ప్రదాత అనే ముగ్గురు గురువులలో ఉత్తరోత్తరులు శ్రేష్ఠులని భావము.) 32

శ్లో॥ నన్వర్థ కోవిదా బ్రహ్మన్ వర్ణాశ్రమవతామిహ ।
యే మయా గురుణా వాచా తరంత్యంజో భవర్ణవమ్ ॥ 33

టీ:- అతో జ్ఞానప్రదం గురురూపమాశ్రిత్య యే సంసారం తరంతి తే బుద్ధిమత్తరా ఇత్యాహ - నన్వితి. హే బ్రహ్మన్. వర్ణాశ్రమవతాం మధ్యే అర్థకోవిదాః. ఇహ మనుష్యజన్మని తత్రాపి వర్ణాశ్రమవత్త్వే సతి యే మయా గురుణా గురురూపేణ వక్త్రావాచా ఉపదేశమాత్రేణ. అంజః సుఖేనైవ. భవార్ణవం తరంతీతి జ్ఞానప్రదాద్గురోరధికః. సేవ్యోనాస్తీత్యుక్తం33

అందువలన జ్ఞానమును ప్రసాదించు గురుడైన పరమాత్మను ఆశ్రయించి ఈ సంసారమును దాటునట్టి వారే బుద్ధిమంతులలో శ్రేష్ఠులు అనే విషయమును చెప్పుచున్నాడు - ఓ బ్రాహ్మణోత్తమా ! నాలుగు విధులైన వర్ణములు, ఆశ్రమముల తత్త్వము నెరిగిన వారు. ఈ లోకమున మనుష్య జన్మలో వర్ణాశ్రమ ధర్మమును నిర్వర్తించుచు గురురూపుడైన నా ఉపదేశమాత్రము చేతనే సుఖమును పొంది ఈ సంసార సాగరమును దాటుచున్నారు. అందువలన జ్ఞానమును ప్రసాదించునట్టి గురువు కన్నా గొప్పవాడు లేడు. 33

శ్లో॥ నాహమిజ్యాప్రజాతిభ్యాం తపసోపశమేన వా ।
తుష్యేయం సర్వ భూతాత్మాగురుశుశ్రూషయా యథా ॥ 34

కనుక అటువంటి గురువును సేవించుట కన్నా ధర్మము లేదని చెప్పుచున్నాడు. యజ్ఞమును చేయుట, గృహస్థ ధర్మనిర్వహణ,

టీ:- అత ఏవ తద్భజనాదధికో ధర్మశ్చ నాస్తీత్యాహ-నాహమితి. ఇజ్యాగృహస్థధర్మః ప్రజాతిః ప్రకృష్టజన్మ ఉపనయనం. తేన బ్రహ్మచారిధర్మః ఉపలక్ష్యతే. తాభ్యాం. తథా తపసా వనస్థధర్మేణ. ఉపశమేన యతిధర్మేణవా ఆహం పరమేశ్వరఃతథా న తుష్యేయం. యథా సర్వభూతాత్మాపి గురుశుశ్రూషయేతి. 34

ఉపనయన సంస్కారముతో వేదాధ్యయనము చేయుట - బ్రహ్మచర్య గృహస్థ లక్షణములు. ఈ రెండు ఆశ్రమము వలన కానీ, తపస్సు చేయగలిగిన వానప్రస్థము, సర్వసంగపరిత్యాగమనే సన్యాసి లక్షణముల వలన కానీ సర్వభూతములందున్న పరమేశ్వరుడనైన నేను గురుసేవ చేసినందువల్ల పొందినంత తృప్తిని పొందను. ఆశ్రమ ధర్మములను నిర్వహించుటకంటే గురు శుశ్రూషమే శ్రేష్ఠతరమని భావము. 34

శ్లో॥ అపి నస్స్మర్యతే బ్రహ్మన్వృత్తం నివసతాం గురౌ ।
గురుదారైశ్చోదితానామింధనానయనే క్వచిత్ ॥ 35

టీ:- కించ అస్మాకం గురుశుశ్రూషణంకిమపి దైవాదేవ సంపన్నం తత్కిం త్వయా స్మర్యత ఇతి పృచ్ఛతి.-అపీతి. గురౌ నివసతామస్మాకం యత్కిమపి వృత్తం. తత్క్వచిత్ కదాచిత్.35

మనకు గురుశుశ్రూషణము దైవానుగ్రహమువలన అప్రయత్నముగాసిద్ధించిన విషయము నీకు గుర్తున్నదా? అని కృష్ణుడు కుచేలుని అడుగుచున్నాడు. ఓమిత్రుడా!మనము గురుకులమున వాసము చేయుచున్నకాలమున గురుపత్ని ఒకసారి వంటకట్టెలు తెమ్మని మనలను పంపిన సమయమున జరిగిన విషయము నీకు గుర్తున్నదా అని అడిగినాడు. 35

శ్లో॥ ప్రవిష్టానాం మహారణ్యమపర్తౌ సుమహద్ద్విజ ।
వాతవర్షమభూత్తీవ్రం నిష్ఠురాస్తనయిత్నవః ॥ 36

టీ:- ప్రవిష్టానామితి. అపర్తౌ అపగతే ఋతౌ అకాల ఇత్యర్థః. వాతశ్చ వర్షం చ తయోః సమాహారః. స్తనయిత్నవః గర్జితాని చాభూవన్. 36

ఓ విప్రోత్తమా ! మనము కట్టెలకై మహారణ్యమున ప్రవేశించిన సమయము వర్షాకాలము కాకపోయినను దట్టముగా మబ్బులు కమ్మి ఉరుములతో తీవ్రమైన గాలివాన వచ్చినది. 36

శ్లో॥ సూర్యశ్చాస్తం గతస్తావత్తమసా చావృతా దిశః ।
నిమ్నం కూలం జలమయం న ప్రజ్ఞాయత కించన ॥ 37

అప్పుడే సూర్యాస్తమయమై దిక్కులన్నియు చీకటితో నిండిపోయినవి. మిట్ట పల్లములు ఏకమై భూభాగమున ఏది ఏదో తెలియని విధముగా అయినది. 37

టీ:- సూర్యఇతి. నిమ్నం నతం కూలం ఉన్నతం స్థానం. 37

శ్లో॥ వయం భృశం తత్ర మహానిలాంబు
భిర్నిహన్యమానాముహురంబు సంప్లవే ।
దిశోవిదంతోஉథ పరస్పరం వనే
గృహీతహసాః పరిబభ్రి మాతురాః ॥ 38

మనము ఆ అరణ్యమున తీవ్రమైన గాలికి, వర్షమునకు గజగజ వణకుచు సముద్రమువంటి వరద జలములో దిక్కులు తెలియక ఒకరినొకరు చేతులు పట్టుకొని కట్టెల బరువు మోయుచు ఆందోళనతో వనమంతయు తిరిగితిమి. 38

శ్లో॥ ఏతద్విదిత్వా ఉదితే రవౌ సాందీపనిర్గురుః ।
అన్వేషమాణో నశ్శిష్యానాచార్యోஉపశ్యదాతురాన్ ॥ 39

ఈ విషయము తెలిసి ఉదయముననే మన గురువుగారైన సాందీపని వారు శిష్యులైన మనలను అరణ్యమున వెదకుచు ఆందోళనచెందుచున్న మనలను చూచినారు. 39

టీ:- వయమితి. అంబూనాం సంప్లవః వ్యామిశ్రణం యస్మిన్ ఏకోదకే తత్ర తస్మిన్ వన ఇత్యర్థః. పరిబభ్రిమ. పరిపరితః. బభ్రిమ భృఞ్భరణ ఇత్యస్మాద్ధాతోః ఇడాగమః ఛాందసః. భారాన్ ధృతవంత ఇత్యర్థః. (38-39)

### ఆచార్య ఉవాచ

శ్లో॥ అహో హే పుత్రకా యూయమస్మదర్థేఽతి దుఃఖితాః ।
ఆత్మావై ప్రాణినాం ప్రేష్ఠస్తమనాదృత్యమత్పరాః ॥ 40

టీ:- ఉవాచ కృపయా శ్లోకత్రయీం యయావయం కృతార్థా ఇత్యాహ - అహోఇతి. ఆత్మా దేహః. 40

శ్లో॥ ఇయదేవ హి సచ్ఛిష్యైః కర్తవ్యా గురునిష్కృతిః ।
యద్వై విశుద్ధభావేన సర్వార్థాత్మార్పణంగురౌ ॥ 41

టీ:- ఇయదితి. గురోర్నిష్కృతిః ప్రత్యుపకారః సర్వే అర్థా యస్మాత్సః ఆత్మా దేహస్తస్యార్పణం వినియోగః. 41

శ్లో॥ తుష్టోఽహం వోద్విజశ్రేష్ఠా స్సత్యాస్సంతు మనోరథాః ।
ఛందాంస్యయాతయామాని భవంత్విహ పరత్ర చ ॥ 42

టీ:- తుష్టఇతి. అయాతయామాని యాతః యామః యస్య పక్వస్యాన్నస్య తద్గతసారం భవతి. తద్వదన్యదసి గతసారం. గౌణ్యావృత్త్యా యాత యామమిత్యుచ్యతే. అగతసారాణి ఛందాంసి మత్తః అధీయమానాని భవంత్విత్యర్థః. 42

### ఆచార్యుడిట్లు చెప్పినాడు

మూడు శ్లోకములందు ఆచార్యుని దయతో కూడిన మాటలవల్ల మనము ధన్యులమైతిమన్న విషయమును చెప్పుచున్నాడు. అయ్యో ! నా పుత్రులారా ! మీరు మాకొరకై మిక్కిలి కష్టమును పొందితిరి. ఎల్లజీవులకు తమ శరీరమును రక్షించుకొనుటయే అన్నిటికన్నా ముఖ్యమైనది. అట్టిది మీరు నాయందున్న గౌరవముతో మీ శరీర క్లేశమును సైతము తృణీకరించితిరి. 40

నిర్మలమైన మనస్సుతో తమ సర్వస్వమును వీడి గురువుకు ఆత్మసమర్పణ చేసికొనుట మంచి శిష్యులు చేయవలసిన సర్వశ్రేష్ఠమైన శుశ్రూష . 41

ఓ ద్విజోత్తములారా ! మీవలన నేను సంపూర్ణముగా తృప్తిపొందితిని మీకోరిన కోర్కెలన్నియు నెరవేరుగాక. మీరు నావద్ద అభ్యసించిన వేదవిద్య అంతయు బాగుగా పచనమైన ఆహారము సులభముగా జీర్ణమై దేహమునకు శక్తిని ప్రసాదించునట్లుగా పరిపూర్ణముగా ఇహపర సుఖములకు దోహదపడగలదని గురువు వారిని ఆశీర్వదించినాడు. 42

శ్లో॥ ఇత్థం విధాన్యనేకాని వసతాం గురువేశ్మసు ।
గురోరనుగ్రహేణైవ పుమాన్పూర్ణః ప్రజాయతే ॥ 43

టీ:- ఇత్థమితి. ఇత్థం విధాని ఏవంప్రకారాణి. అనేకాని వృత్తాని కిం త్వయా స్మర్యంత ఇతిశేషః. ఫలితముసంహరతి.-గురోరితి. 43

మన గురుకులవాస కాలమున జరిగిన ఇట్టి సంఘటనలు నీ కింకనూ గుర్తున్నవా? గురువుగారి అనుగ్రహమువలననే పురుషుడు పరిపూర్ణుడగునని కృష్ణుడు ఈ విషయమును ముగించినాడు. 43

**కుచేల ఉవాచ**

శ్లో॥ కిమస్మాభిరనిర్వృత్తం దేవదేవ జగుద్గురో ।
భవతా సత్యకామేన యేషాం వాసో గురావభూత్ ॥ 44

టీ:- కిమితి. అస్మాభిః కిమనిర్వృత్తం అసంపన్నం. యేషామస్మాకం భవతా సహవాసోఽభూత్. 44

**కుచేలుడిట్లు బదులిచ్చెను**

ఓదేవదేవా ! జగద్గురుడా ! సత్యకాముడవైన నీతో గురు కులమున సహవాసము చేసిన మావంటి అదృష్టవంతులకు దొరకనిది ఏమున్నది? 44

శ్లో॥ యస్య ఛందోమయం బ్రహ్మదేవా ఆవపనంవిభో ।
శ్రేయసాం తస్య గురుషు వాసోత్యంతవిడంబనమ్ ॥ 45

టీ:- భవతస్తు సర్వమేతద్విడంబనమాత్రమిత్యాహ-యస్యేతి. ఛందోమయం వేదమయం వేదాఖ్యం బ్రహ్మ. తథా శ్రేయసామావపనం తదుద్భవస్థానం దేహో మూర్తిః యస్య తస్య తవ. 45

సర్వమూ నీవే అయినప్పుడు మమ్మిట్లడుగుట కేవలము నీలీలయే. మమ్మతిశయించుటకే నీవిట్లు అడుగుచుంటివనే విషయమును చెప్పుచున్నాడు. ఓదేవా! వేదరూపుడవైన పరమాత్ముడవు నీవు. నీతో కలిసిగురుకులమున సహవాసము మేము చేయగలుగుటే శుభ పరంపరల అతిశయము. దీనికన్న మిన్న ఏమున్నదన్నాడు. 45

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, అశీతితమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు ఎనుబదవ అధ్యాయముసమాప్తము.**

## ఏకాశీతితమోஉ ధ్యాయః

శ్లో॥ ఏకాశీతితమే సఖ్యుర్జగ్ధ్వా పృథుకతండులాన్ ।
శ్రియం నిర్మితవానింద్ర దుర్లభాం తు తదాశ్రమే ॥

**శ్రీశుకఉవాచ**

శ్లో॥ స ఇత్థం ద్విజముఖ్యేన సహ సంకథయన్ హరిః ।
సర్వభూత మనోభిజ్ఞస్స్మయమాన ఉవాచ తమ్ ॥ 1

టీ:- సఇతి. సంకథయన్ సుఖగోష్ఠీం కుర్వన్. సర్వభూతానాం మనస అభిజ్ఞఃమదర్థం పృథుకానానీయ దాతుం లజ్జితఇతి జానన్నిత్యర్థః. 1

శ్లో॥ బ్రహ్మణ్యో బ్రాహ్మణం కృష్ణో భగవాన్ప్రహసన్ప్రియమ్ ।
ప్రేమ్ణానిరీక్షణేనైవ ప్రేక్షన్ ఖలు సతాంగతిః ॥ 2

**శ్రీకృష్ణ ఉవాచ**

శ్లో॥ కిముపాయనమానీతం బ్రహ్మన్ మే భవతా గృహాత్ ॥ 3

టీ:- బ్రాహ్మణ్య ఇతి. ప్రహసన్ క్ష్వేలాం కుర్వన్. (2-3)

## 81వ అధ్యాయము

ఎనుబది ఒకటవ అధ్యాయమున మిత్రుడు తెచ్చిన అటుకులు తిని దేవనాథుడైన ఇంద్రునికినీ లభించని అపారమైన సంపదను ప్రసాదించుట విషయము.

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పెను**

శ్రీకృష్ణుడు ఈ విధముగా బ్రాహ్మణ ప్రవరుడైన కుచేలునితో ఇష్టసల్లాపములాడుచు కొంతతడవు వినోదించి సర్వజీవుల మనోగతములను చక్కగా తెలిసినవాడై అనగా తనకు కానుకగా తెచ్చిన అటుకులను అందరిముందు సమర్పించుటకు సిగ్గుపడుచున్న విషయమును గమనించి అతనితో ఇట్లనుచున్నాడు. 1

సత్పురుషులకు ఆశ్రయుడై పరమాత్ముడైన శ్రీకృష్ణ భగవానుడు ప్రియమిత్రుడైన బ్రాహ్మణోత్తముని ప్రీతితో చూచుచు, చిరునవ్వు నవ్వుచు (ఇట్లని అడిగినాడు). 2

**శ్రీకృష్ణుడు కుచేలుని అడిగినాడు**

ఓ విప్రశ్రేష్ఠా! మీ యింటినుండి నాకేమి కానుక తెచ్చితివి? 3

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అణ్వప్యుపహృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్ ।
భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే ॥ 4

తాను తెచ్చిన అటుకుల విషయము చెప్పుటకు కుచేలుడు పడుచున్న సిగ్గును పోగొట్టుటకై రెండు శ్లోకములందు చెప్పుచున్నాడు – భక్తులు పరిపూర్ణమైన ప్రేమతో ఒక అణువంత వస్తువును తెచ్చి సమర్పించినను అది నాకు చాలాగొప్పదియే అగును. భక్తులు కాని డాంబికులు ఎంత గొప్ప కానుకను నాకు సమర్పించినను అది ఎట్టి సంతోషమును కలిగించదు. 4

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదాహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥ 5

పత్రముకాని, పుష్పముకాని, పండుకాని, జలముకాని ఎవరైనను నాకు భక్తితో సమర్పించినచో దానిని మిక్కిలి ఇష్టముతో ఆరగింతును అన్నాడు. 5

శ్లో॥ ఇత్యుక్తోఽపి ద్విజస్తస్మై వ్రీడితః పతయేశ్రియః ।
పృథుక ప్రసృతిం రాజన్నప్రాయచ్ఛదవాఙ్ముఖః ॥ 6

టీ:- లజ్జయా అకథయతస్తామపనుదన్నాహ – ద్వాభ్యాం. అణ్వితి. (4–6)

ఓ రాజా! ఈ విధముగా కృష్ణుడు కుచేలునితో చెప్పినను అతడు మిక్కిలి సిగ్గు చెందినవాడై తలదించుకొని ఆ శ్రీపతికి తాను తెచ్చిన అటుకులముల్లెను సమర్పించినాడు. 6

శ్లో॥ సర్వ భూతాత్మదృక్సాక్షాత్తస్యాగమనకారణమ్ ।
విజ్ఞాయాచింతన్నాయం శ్రీకామో మాభజత్పురా ॥ 7

టీ:- సర్వేతి. సర్వభూతానామాత్మదృక్ అంతఃకరణసాక్షీ. 7

ఇతడు నిజముగా సంపదలను ఆశించి తనను దరిజేరలేదనే విషయమును సర్వజీవుల అంతఃకరణాలను దర్శించగల శ్రీకృష్ణుడు గ్రహించి ఈ నా మిత్రుడు కుచేలుడు అంతకుముందు పతివ్రత అయిన తన భార్య ప్రార్థనతో మాత్రమే ఆమెకు శుభము

శ్లో॥ పత్న్యాః పతివ్రతాయా మే సఖా ప్రియచికీర్షయా ।
ప్రాప్తోమామస్య దాస్యామి సంపదోఽమర్త్యదుర్లభాః ॥ 8

టీ:- పత్న్యా ఇతి. అమర్త్యానాం దేవానామపి దుర్లభాః. 8

శ్లో॥ ఇత్థం విచింత్య వసనాంశ్చీరబద్ధాన్ ద్విజన్మనః ।
స్వయం జహార కిమిదమితి పృథుకతండులాన్ ॥ 9

టీ:- ఇత్థమితి. అతిజీర్ణత్వాద్వసనస్య పునస్తన్మధ్యేచీరేణ బద్ధాన్. 9

శ్లో॥ నన్వేతదుపనీతం మే పరమ ప్రీణనం సఖే ।
తర్పయత్యంగమాం విశ్వమేతే పృథుకతండులాః ॥ 10

టీ:- నన్వితి. అంగ హే సఖే. విశ్వం విశ్వాత్మానం మాం. 10

శ్లో॥ ఇతి ముష్టిం సకృజ్జగ్ధ్వా ద్వితీయాంజగ్ధుమాదదే ।
తావచ్ఛ్రీర్జగృహే హస్తం సత్వరాపరమేష్ఠినః ॥ 11

టీ:- ఇతీతి. ఇతి వదన్నేకాం ముష్టింజగ్ధ్వా. సత్వరేతి. అయం భావః

కలిగించవలెనను కోరికతో వచ్చినాడని అతనికి దేవతలకు సైతము పొందలేని సంపదలను ప్రసాదింతునని తలచినాడు. (7-8)

అని ఆలోచించి బ్రాహ్మణుడు గుడ్డపేలికలో కట్టిన మూటను చూచి ఏమితెచ్చితివని అటుకులమూటనుస్వయముగా విప్పినాడు. 9

ఓ మిత్రుడా ! నీవు తెచ్చిన ఈ అటుకులు నాకు మిక్కిలి ప్రీతిగొల్పునవి. విశ్వాత్ముడనైన నాకు ఇవి అపారమైన తృప్తిని కలిగించును. 10

అని ఒక పిడికెడటుకులు తిని రెండవ పిడికిలితో తినుటకై అటుకులను తీసుకొనగా వెంటనే లక్ష్మీరూప అయిన రుక్మిణి వలదని వారించుచు అతని చేతిని పట్టుకొన్నది. ఈ ఒక్క పిడికెడు అటుకులతోడనే ఈ విప్రుడు నా(లక్ష్మీదేవియొక్క) కడగంటి విలాసమును

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

.ఏతావతా పుంసః. ఇహ అముత్ర చ మత్కటాక్షవిలాసభూతానాం సర్వ సంపదాం సమృద్ధయే అలం. అతఃపరం ద్వితీయముష్టదనేన మామప్యేతదధీనాం మాకుర్వితి. 11

శ్లో॥ ఏతావతాలం విశ్వాత్మన్ సర్వసంపత్సమృద్ధయే ।
అస్మిన్ లోకేఽథవా ముష్మిన్ పుంసస్త్వత్తోషకారణమ్ ॥ 12

టీ:- ఏతావతేతి. త్వత్తోషకారణం తవ తోషస్య కారణం.యదా భవేత్తదా సర్వసంపత్సమృద్ధయే. యాం భక్తస్య సమృద్ధిం దృష్ట్వా త్వం తుష్యేరిత్యర్థః. 12

శ్లో॥ బ్రాహ్మణస్తాం తు రజనీముషిత్వాచ్యుత మందిరే ।
భుక్త్వా పీత్వా సుఖం మేనే హ్యాత్మానం స్వర్గతం నృప ॥ 13

టీ:- బ్రాహ్మణ ఇతి. స్వర్గతం స్వర్గవాసినం. 13

పొంది సర్వసంపదలతో తులతూగు అపర కుబేరులకంటే అధికముగా ఇహపరసుఖము పొందగల ఐశ్వర్యమును పొందినాడు. ఇది చాలు. ఇంతకన్న అధికముగా రెండవ పిడికిలితో మీరు అటుకులు స్వీకరించి నన్నుకూడా(లక్ష్మీదేవినే) అతనికి సమర్పించ వద్దని రుక్మిణిదేవి అంతర్గతము. 11

ఓ విశ్వాత్ముడా ! నీ సంతోషమునకు కారకుడైన ఈ విప్రశాఖామణికి ప్రసాదించిన ఇహపర లోకసౌఖ్యాలకు అవసరమైన సర్వ సంపదల సమృద్ధి గమనించి మీరు తృప్తితో విరమించవలెను. ఇక చాలును అని రుక్మిణి కృష్ణుని నివారించినది. 12

ఓ రాజా ! కుచేలుడు శ్రీకృష్ణుని మందిరమున ఆ రాత్రి వసించి విందులారగించి, పానీయములు సేవించి తాను స్వర్గమున ఉండినంత సుఖమును పొందిన వానిగా భావించాడు. 13

శ్లో॥ శ్వో భూతే విశ్వభావేన స్వసుఖేనాభివందితః ।
జగామ స్వాలయం తాత పథ్యనువ్రజ్య నందితః ॥ 14

టీ:- శ్వోభూతా ఇతి. శ్వోభూతే ఉదితేరవౌ. విశ్వం భావయతీతి విశ్వభావనః. తేనేతి. పురతో భావినమింద్ర దుర్లభం విభవం సూచయతి. స్వసుఖేన స్వానందపరిపూర్ణేనేతి. దానే అదీనతాం దర్శయతి-నందితః వినయోక్తిభిః. 14

పుత్రా పరీక్షిత్తా ! విశ్వభావనుడు, ఆత్మారాముడు అయిన శ్రీకృష్ణుని ఆత్మీయతతో కూడిన వీడుకోలు నమస్కారములను స్వీకరించి కుచేలుడు తిరిగి వెళ్ళుచు మార్గ మధ్యమున అపారమైన ఆనందమును అనుభవించుచు తన ఇంటికి వెళ్ళినాడు. శ్రీకృష్ణుడు విశ్వభావనుడు అనుటలో అతని వలన కుచేలునికి తర్వాత కలుగబోవు - ఇంద్రునికి పొందరాని సంపదలు అనుగ్రహించుట, స్వసుఖేన - తన ఆనందముతో నిండినవాడు-స్వానందపూర్ణుడు అనుటలో అనంతమైన సంపదలను ప్రసాదించినట్టి ఈవి, ఔన్నత్యములు సూచితమైనవి. 14

శ్లో॥ స చాలబ్ధ్వా ధనం సఖ్యుర్నతు యాచితవాన్ స్వయమ్ ।
స్వగృహాన్ వ్రీడితో గచ్ఛన్మహద్దర్శన నిర్వృతః ॥ 15

టీ:- స ఇతి. వ్రీడితః స్వచిత్తే కార్పణ్యేన లజ్జితః. శ్రీకృష్ణస్య. దర్శనేన నిర్వృతః. 15

కుచేలుడు తన దుస్థితి వలన కలిగిన సిగ్గుతో స్వయముగా నోరుతెరిచి తన మిత్రుని ఆర్థిక సహాయము అర్థించనందువల్ల శ్రీకృష్ణునివలన ఏ విధమైన ధనమును పొందలేక పోయినను, పరమాత్మ దర్శనము వలన కలిగిన పరమానందముతో తన ఇంటికి తిరిగి వెళ్ళినాడు. 15

శ్లో॥ అహో బ్రహ్మణ్యదేవస్య దృష్టా బ్రాహ్మణ్యతా మయా ।
యద్దరిద్రతమో లక్ష్మీమాశ్లిష్టో బిభ్రతోరసి ॥16

టీ:- నిర్వృతిమేవాహ - చతుర్భిః. అహో ఇతి. యత్ యతః లక్ష్మీం ఉరసి బిభ్రతా ఆశ్లిష్టోఽహం. 16

కుచేలుడు శ్రీకృష్ణుని దర్శనము వలన పొందిన ఆత్మ సుఖమును నాలుగు శ్లోకములలో వివరించుచున్నాడు. ఆహా! వేదమయుడైన కృష్ణుడు నాపట్ల ఎంతటి బ్రాహ్మణ భక్తిని ప్రదర్శించినాడు. దరిద్రులలో చిట్టచివరి వాడినైన నన్ను, లక్ష్మీదేవిని వక్షస్థలమున ధరించిన శ్రీమన్నారాయణుడే కౌగలించుకొన్నాడు. 16

శ్లో॥ క్వాహం దరిద్రః పాపీయాన్ క్వ కృష్ణ శ్రీనికేతనః ।
బ్రహ్మబంధురితి స్మాహం బాహుభ్యాం పరిరంభితః ॥ 17

శ్లో॥ నివాసితః ప్రియాజుష్టే పర్యంకే భ్రాతరోయథా ।
మహిష్యావీజితశ్శ్రాంతో వాలవ్యజనహస్తయా ॥ 18

టీ:- క్వేతి. అహం పాపీయాన్ నీచః. (17-18)

శ్లో॥ శుశ్రూషయా పరమయా పాదసంవాహనాదిభిః ।
పూజితో దేవదేవేన విప్రదేవేన దేవవత్ ॥ 19

టీ:- శుశ్రూషయేతి. పూజితః చందనలేపనాదిభిః. 19

శ్లో॥ స్వర్గాపవర్గయోః పుంసాం రసాయాం భువిసంపదామ్ ।
సర్వాసామపి సిద్ధీనాం మూలం తాచ్చరణార్చనమ్ ॥ 20

టీ:- ఏవం సంపూజ్యాపి ధనస్య అదానేకారణం కల్పయతే ద్వాభ్యాం- స్వర్గాపవర్గయోరితి.స్వర్గాదీనాం యద్యపితస్య చరణార్చమేవ కారణం. 20

దరిద్రుడను నీచుడను అయిన నెనెక్కడ? లక్ష్మీ నిలయుడైన శ్రీకృష్ణుడెక్కడ? బ్రహ్మబంధుడని రెండు చేతులతో ఆప్యాయముగా ఆలింగనము చేసుకున్నాడు. 17

పట్టపురాణి అయిన రుక్మిణీదేవి సేవలు పొందుచు, పడక మంచముపై ఉన్నవాడైనప్పటికి, మార్గాయాసము వలన అలసిపోయిన నన్ను అగ్రజునిలాగా రుక్మిణీదేవితో వింజామరలతో నా అలసట పోవునట్లుగా గాలి వీచునట్లుచేసి, స్వయముగా దేవదేవుని చేత పాదములు వత్తుట వంటి శ్రేష్ఠమైన శుశ్రూషలతో దేవతలను బ్రాహ్మణులు మంచి గంధపులేపనాధులతో పూజించునట్లు పూజలందు కొంటిని. (18-19)

ఈ విధముగా పూజించి కూడా తనకు సంపదలివ్వక పోవుటకు కారణమును రెండు శ్లోకాలలో చెప్పుచున్నాడు పరమున స్వర్గమోక్షములు ఫలించుట, ఇహమున సంపదలు, భోగములు కలుగుట, ఎల్లసిద్ధులు ఒనగూరుట మొదలైన వానికి మూలము బ్రాహ్మణుల పాదములను అర్చించుటయే. 20

శ్లో॥ అధ నోஉయం ధనం ప్రాప్యమాద్యన్నుచ్చైర్న మాం స్మరేత్ ।
ఇతి కారుణికో నూనం ధనం మే భూరి నాదదాత్ ॥ 21

టీ:- అధన ఇతి.తథాపి కారుణికత్వాదభూర్యపి ధనం మహ్యం నాదదాత్. 21

శ్లో॥ ఇతి సంచింతయన్ విప్రః ప్రాప్తో నిజగృహాంతికమ్ ।
సూర్యానలేందు సంకాశైర్విమానైస్సర్వతో వృతమ్ ॥ 22

టీ:- ఇతీతి. నిజగృహస్యాంతికం తత్ప్రాంతం. తస్య విశేషణంసూర్యేతి. 22

శ్లో॥ విచిత్రోపవనోద్యానైః కూజద్ద్విజకులాకులైః ।
ప్రోత్ఫుల్ల కుముందాంభోజకల్హారోత్పలవారిభిః ॥ 23

టీ:- విచిత్రేతి. విచిత్రోపవనాదిశ్చభిశ్చ వృతం. కథంభూతైః కూజద్భిః ద్విజకులైః ఆకులైః. తథా ప్రోత్ఫుల్లాని కుముదాదీని యేషాం తాని వారీణి యేషు తాని తథా తైః. 23

ధనములేని ఈ కుచేలుడు సంపదలను పొంది ధనముతో గొప్పగానన్ను స్మరించడేమో అని భావించి దయామయుడైన కృష్ణుడు నన్నుద్ధరించుటకే నాకు అధికమైన సంపదలివ్వలేదు. 21

అని ఆలోచించుచు (కుచేలుడు) అక్కడ ఆశ్చర్యకరముగా సూర్యచంద్రాగ్నులవలె ప్రకాశించునట్టి సౌధములతో, అంతటా రక్షితమై విచిత్రములైన చిన్నచిన్న పూలతోటలు, పెద్దతోటలతో మనోహరముగా కలకలారావములు చేయు పక్షుల గూళ్ళతో, వికసించిన రంగురంగుల పద్మములు, కలువలతో కూడిన కేదారములతో చక్కగా అలంకృతులైన పురుష పరిచారకులు, స్త్రీ పరిచారికలు, అందమైన స్త్రీలు నడయాడు గృహమును చూచి ఇది ఎవరి ఇల్లు, ఇక్కడ ఎట్లు వెలసినది.
(అని ఆలోచించుచుండెను) (22-24)

శ్లో॥ జుష్టం స్వలంకృతైః పుంభిఃస్త్రీభిశ్చ హరిణాక్షిభిః ।
కిమిదం కస్యవా స్థానం కథం తదిదమిత్యభూత్ ॥ 24

టీ:- కించజుష్టమితి.హరిణానామివాక్షీణి యాసాం తాభిః. తదైశ్వర్యం దృష్ట్వా వితర్కితవాన్ తదాహ - కిమిదమితి. ప్రథమం తేజః పుంజం దృష్ట్వా కిమిదమితి. పశ్చాద్విమానాని. దృష్ట్వా కస్యవేతి స్థానం చ స్వీయమితిజ్ఞాత్వా కథం తదితం స్థానం ఇత్యభూత్. ఏవం రూపమభూదితి. 24

శ్లో॥ ఏవం మీమాంసమానం తం నరా నార్యోஉమరప్రభాః ।
ప్రత్యగృహ్ణన్ మహాభాగం గీతవాద్యేన భూయసా ॥ 25

టీ:- ఏవమితి. అమరప్రభాః తత్తుల్యకాంతయః ప్రత్యగృహ్ణన్ ఉపాయనాదిభిరాదృతవంతః. 25

శ్లో॥ పతిమాగతమాకర్ణ్య భక్త్యుద్ధర్షాతి సంభ్రమా ।
నిశ్చక్రామ గృహాత్తూర్ణం రూపిణీ శ్రీరివాలయాత్ ॥ 26

టీ:- పతిమితి. ఉద్గతో హర్షః యస్యాస్సా. అతిసంభ్రమః ఆదరో

అని తర్కించుకొనుచున్న ఆ కుచేలుని దేవతా స్త్రీలవలె కాంతిమతులైన పరిచారికలు కానుకలతో మంగళ వాయిద్యములు మ్రోగుచుండగా స్వాగత గీతములతో ఆదరముతో కొనిపోవుటకై ఎదురుగా వచ్చిరి. 25

భర్త గృహమునకు మరలి వచ్చినాడని విషయమును విన్న భార్య హర్షాతిరేకముతో మిక్కిలి ఆదరముతో తన నిలయమైన కమలవనమునుండి నిర్గమించుచున్న రూపమును ధరించిన లక్ష్మీదేవి వలెఇంటిలో నుండి భర్తను దర్శించుటకై బయటకు వచ్చినది. భర్త

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

యస్యాస్సా ఆలయాత్ కమలవనాత్. రూపధారిణీ శ్రీరివ. స్వర్గస్య తత్రభగవతా ఆనీతత్వాత్ స్వర్గిణాం సురాణామివ రూపం తయోర్బభూవేతి భావః. 26

వల్ల, కృష్ణానుగ్రహము వల్ల, అక్కడికి స్వర్గమే కొని రాబడినందువల్ల స్వర్గము నందలి దేవతల వలెనే కుచేలుని పత్నికిని దేవతా రూపము సిద్ధమైనదని భావము. 26

శ్లో॥ పతివ్రతా పతిం దృష్ట్వా ప్రేమోత్కంఠాశ్రులోచనా ।
మీలితాక్ష్యనమద్బుద్ధ్యా మనసా పరిషస్వజే ॥ 27

ఆ పతివ్రత భర్తను చూచి ప్రేమాతిశయము వలన ఆనందబాష్పాలు రాలగా వాస్తవముగా ఇతడు పూజనీయుడని బుద్ధితో నమస్కరించి మనస్సులోనే పరవశముతో కన్నులు మూసుకొని కౌగలించుకొన్నది. 27

శ్లో॥ పత్నీం వీక్ష్య ప్రస్ఫురంతీం దైవీం వైమానికీమివ ।
దాసీనాం నిష్కకంఠీనాం మధ్యేభాంతీం సవిస్మితః ॥ 28

శ్లో॥ ప్రీతస్స్వయం తయాయుక్తః ప్రవిష్టో నిజమందిరమ్ ।
మణిస్తంభ శతోపేతం మహేంద్రభవనం యథా ॥ 29

టీ:- పతివ్రతేతి. బుద్ధ్యా అయమేవ వంద్య ఇతి నిశ్చయేన. మనసా సంకల్పేన. (27-29)

విమానమున ప్రకాశించే దేవతాస్త్రీలవలే బంగారు ఆభరణములు ధరించిన దాసీజనమధ్యమున ప్రకాశించు నట్టి భార్యను మిగుల ఆశ్చర్యముతో దర్శించి మిక్కిలిగా సంతసించి ఆమెతో కలసి వందలకొలది మణిస్తంభములతో దేవేంద్ర భవనమువలె ఉన్న తన ఇంటిలోకి ప్రవేశించినాడు. (28-29)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ పయః ఫేననిభాశ్శయ్యా దాంతా రుక్మపరిచ్ఛదాః ।
పర్యంకా హేమదండాని చామరవ్యజనాని చ ॥ 30

టీ:- పయ ఇతి. యత్రమందిరే. పయఃఫేననిభాః శయ్యాః ఆసనాని ఆస్తరణానీత్యాదిసంపదః. తత్ర సర్వసంపదాం సమృద్ధీర్విలోక్య తర్కయామాసేతి చతుర్థేనాన్వయః. యత్ర చ దాంతాః గజదంతమయాః పర్యంకాః మంచాః. 30

శ్లో॥ ఆసనాని చ హైమాని మృదూపస్తరణాని చ ।
ముక్తదామవిలంబీని వితానానిద్యుమంతిచ ॥ 31

శ్లో॥ స్వచ్ఛ స్ఫటిక కుద్యేషు మహామరకతేషు చ ।
రత్న దీపాభ్రాజమానాలలనా రత్నసంయుతాః ॥ 32

టీ:- ఆసనానీతి. యత్ర ఆసనాని మృదూని ఉపస్తరణాని తూలాదిమయాని యేషుతాని. యత్ర చ ముక్తాదామవిలంబవంతా ద్యుమంతి చ వితానాని. (31-32)

శ్లో॥ విలోక్య బ్రాహ్మణస్తత్ర సమృద్ధీస్సర్వ సంపదామ్ ।
తర్కయామాస నిర్వ్యగ్రస్స్వ సమృద్ధిమహైతుకీమ్ ॥ 33

టీ:- విలోక్యేతి. నిర్వ్యగ్రః. సుస్థిరస్సన్. స చ అహైతుకీకమాస్మికీం స్వస్య సమృద్ధిం తర్కయామాస. కుత ఏషా సమృద్ధిరాగతేతి. 33

ఆ ఇంటిలో పాలనురుగు వలే తెల్లనైన పడకలు, ఏనుగు దంతములు, బంగారముతో నిర్మితములైన మంచములు, బంగరు పిడులు కలిగిన చామరములు, స్వర్ణాసనములు మెత్తటి దూది పరుపులు, ముత్యాల హారములు వేలాడదీయబడి ప్రకాశించు సోపానములు, స్వచ్ఛమై మరకతములు పొదిగిన స్ఫటికపు గోడలందు రత్నదీపాలతో వెలుగునట్టి స్త్రీ రత్నములతో కూడిన సర్వసంపదల సమృద్ధిని చూచి కుచేలుడు భ్రాంతి పడక ఇదంతయు కష్టపడక ఆకస్మికముగా సిద్ధించిన స్వప్నమునందలి సంపద వంటిదని భావించినాడు. (30-33)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ నూనం బతైతన్మమదుర్భగస్య
శశ్వద్దరిద్రస్య సమృద్ధి హేతుః ।
మహావిభూతేరవలోకతోఽన్యో
నైవోపపద్యేత యదూత్తమస్య ॥ 34

టీ:- నిశ్చినోతి-నూనమితి. ఏతన్మమేతి ఏష చ అసావహం చ తస్య ఏతన్మమ. మహతీవిభూతిర్యస్యతస్య అవలోకాదన్యస్తు న సంభవేత్. 34

అయ్యో ! ఎల్లప్పుడు దరిద్రుడనై దురదృష్టవంతుడనైన నేను యదునాథుడైన ఐశ్వర్యవంతుడైన కృష్ణపరమాత్మను దర్శించినందు వల్లనే నిశ్చయముగా నాకీ సంపద అంతయు కలిగినది. ఇంకొకరివల్ల ఇంత సంపద సిద్ధించనేరదు. 34

శ్లో॥ నన్వబ్రువాణో దిశతే సమక్షం
యాచిష్ణవే భూర్యపి భూరిభోగః ।
పర్జన్య వత్తత్స్వయమీక్షమాణో
దాశార్హకాణా మృషభస్సఖామే ॥ 35

టీ:- నను సచేదవలోకనమాత్రేణ మహదైశ్వర్యం దత్తవాన్ తర్హీదం తుభ్యం దత్తమితి కిం నావోచదత ఆహ-నన్వితి. నను మే సఖా సమక్షమబ్రువాణ ఏవ, యాచిష్ణవే యాచకాయ. భూరిబహ్వపి. దిశతే దదాతి. అత్ర హేతుః భూరిభోగఃస్వయం. తత్‌దేయం పర్జన్యవత్ ఈక్షమాణ ఇతి. అయమర్థః. స్వయం తావద్భూరిభోగః బహుభోగః. ఆప్తకామత్వాల్లక్ష్మీపతిత్వాచ్చ. అతః. యథాపారావారాపరిపూరకః

ఆ మహానుభావుడు చూచినంతమాత్రమునే నాకు అపారమైన ఐశ్వర్యమును ఇచ్చినాడు. కానీ నీకిది ప్రసాదించితినని మాట మాత్రముగానైన నాకు తెలుపలేదనే విషయము చెప్పుచున్నాడు. యదువంశశ్రేష్ఠుడైన నా మిత్రుడు స్వయముగా చూపులతోనే తన సమక్షముననున్న నాకు చెప్పకుండ అపారముగా వర్షించు మేఘమువలె యాచకుడైన నాకు అధికము కంటే అధికమైన సంపదలిచ్చినాడు. అతను స్వయముగా బహు భోగములు కలవాడై సమస్తమైన కోరికలు తీరినట్టి స్థితిలో, లక్ష్మీపతిత్వముతో, సముద్రమునకు అలుగువారు విధముగా వర్షించే గొప్ప దాతయైన మేఘము, ఒక్కసారి అపారమైన వర్షమును అల్పమైనదిగా భావించి సిగ్గుతో సమక్షమున అనగా జాగరూకతతో అందరూ దర్శించగల పగటిపూట వర్షించక, రాత్రిపూట

అతివదాన్యః పర్జన్యః కదాచిద్బహ్వపి వర్షమల్పమేవ మన్యమానః లజ్జయేవ సమక్షం అవర్షన్ రాత్రౌ నిద్రాణే కర్షకే తత్క్షేత్రమాప్లావయతి. ఏవం శ్రీకృష్ణోஉపి స్వభోగాపేక్షయా తద్దేయమింద్రాదిపదమతితుచ్ఛం మన్వానః తస్యైవ భజనం బహుమన్యమానః సమక్షమబ్రువాణ ఏవ దదాతీతి. 35

కర్షకులు నిద్రించుచుండగా వారికి తెలియకుండా, అపారమైన వర్షముతో పంటపొలములకు నీరు పారించిన విధముగా శ్రీకృష్ణుడు కూడా తనకు అత్యంత ప్రీతిపాత్రమైన బ్రాహ్మణసేవ ముందు ఇంద్రపదవి కూడా తుచ్ఛమైనదని భావించి మిత్రుడైన కుచేలుని భజించుటకే ప్రాధాన్య మిచ్చి అతనికి సంపదలు ప్రసాదించిన విషయమును చెప్పలేదని భావము. 35

శ్లో॥ కించిత్కరోత్యుర్వ్యపియత్స్వదత్తం
సుహృత్కృతం ఫల్గ్వపి భూరికారి ।
మయోపనీతాం పృథుకైకముష్టిం
ప్రత్యగ్రహీత్ప్రీతియుతో మహాత్మా ॥ 36

టీ:- తదేవాహ - కించిదితి. ఉరు బహ్వపి స్వదత్తం యత్ తత్కించిత్కరోతి అల్పం మన్యతే. స్వసుహృత్కృతం ఫల్గ్వపి తుచ్ఛమపి. భూరికారీ బహుమన్యత ఇత్యర్థః. అతఏవ మయా ఉపనీతాం సమీపం నీతాం. ప్రీతియుతః స్వయమేవ ప్రతి గృహీతవాన్. 36

ఆ విషయమునే చెప్పుచున్నాడు - తానింత అధికమైన సంపద ఇచ్చి కూడా కృష్ణుడు చాలా తక్కువ అని భావించాడు. కానీ స్నేహితుడనైన నేను చేసిన పని అల్పమైనదైనయు అది చాలా గొప్పదిగానే భావించి, నేను తీసుకొని వెళ్ళిన అటుకులలో ఒకే ఒక పిడికెడు మాత్రమే మహాత్ముడైన కృష్ణుడు స్వయముగా మిగుల ప్రేమతో స్వీకరించినాడు. 36

శ్లో॥ తస్యైవ మే సౌహృదసఖ్యమైత్రీ
దాస్యం పునర్జన్మనిజన్మని స్యాత్ ।
మహానుభావేన గుణాలయేన
విషజ్జత స్తత్పురుష ప్రసంగః ॥ 37

టీ:- శ్రీకృష్ణస్య భక్తవాత్సల్యం దృష్ట్వా తద్భక్తిం ప్రార్థయతే-తస్యేతి. సౌహృదం ప్రేమ చ. సఖ్యం హితాశంసనం చ. మైత్రీ ఉపకారిత్వం చ. దాస్యం సేవకత్వం చ. తత్సమహారైకవచనం. తస్య తత్సంబంధినః మే మమ స్యాత్ . నతు. విభూతిః. కించ. మహానుభావేన తేనైవ విషజ్జతఃన విశేషేణ సంగం ప్రాప్నువతః తద్భక్తేషు. ప్రకృష్టస్సంగస్స్యాదితి. 37

శ్రీకృష్ణునికి భక్తుల పట్లగల ప్రేమభావనను చూచి అతని భక్తిని కుచేలుడు ప్రార్థించుచున్నాడు. మహానుభావుడు, సుగుణముల రాశి అయిన శ్రీకృష్ణునితో నాకు మరల కలుగబోవు ప్రతిజన్మలోను స్నేహరూపమైన ప్రేమ, సఖ్యరూపమైన మేలును కాంక్షించుట, మైత్రీ రూపమైన ఉపకారిత్వము, దాస్య రూపమైన సేవకత్వము మొదలైనవన్నీ ఏకముగా శ్రీకృష్ణునితో, ఆయనకు సంబంధించినవారితో నాకు కలుగవలెను. నాకు సంపదలు అక్కర్లేదు. శ్రీకృష్ణ పరమాత్మతోనే నాకు నిత్య సాంగత్యము, అతని భక్తులతో విడువని సాన్నిధ్యము తప్పక కలుగవలెను. 37

శ్లో॥ భక్తాయ చిత్రాః భగవాన్ హి సంపదో
రాజ్యం విభూతీర్న సమర్థయత్యజః ।
అదీర్ఘబోధాయ విచక్షణస్స్వయం
పశ్యన్నిపాతం ధనినాం మదోద్భవమ్ ॥ 38

టీ:- నను భక్తేః ఫలం సంపదం ప్రాప్యైవ పునః పునర్భక్తిం కిమితి ప్రార్థయసే అత ఆహ- భక్తాయేతి. సంపదః కోశాదీన్ రాజ్యమైశ్వర్యం.

ఒకవేళ భక్తి ఫలము సంపదలు పొందడమే అయితే సంపదలు పొందిన పిదప కూడా భక్తితో దేనిని ప్రార్థించగలరు అనే విషయమై చెప్పుచున్నాడు. భగవంతుడు భక్తునికి సంపదల రూపమైన కోశములను, రాజ్యరూపమైన ఐశ్వర్యమును, విభూతి రూపమైన భార్యాపుత్రాదులను ప్రసాదించక తన పట్ల దృఢమైన భక్తిని మాత్రమే ప్రసాదించును. ఎందుకంటే సంపదలతో ధనవంతులు మదగర్వమున పడిపోవుటను చూచి విచక్షణుడైన భగవంతుడు తన భక్తులకు ధన

విభూతీః కళత్రపుత్రాదీన్. న సమర్థయతి న దదాతి. అపితు దృఢాం భక్తిమేవ. కుతః. అదీర్ఘబోధాయ అవివేకినే. మమ తు భక్త్యభావాదేవం జాతం అతస్తద్భక్తిరేవ మమ స్యాదతిభావః. 38

మదమును కలుగకూడదని వారికి సంపదలివ్వకుండ తన పట్ల అపారమైన భక్తిని కలిగించును. అయితే అవివేకినై భగవంతునిపట్ల సరియైన భక్తిలేక నేను అసత్య భక్తుడను భావముతో కృష్ణుడు నాకు మాత్రమే సంపదలిచ్చినాడని కుచేలుడు బాధపడినాడు. 38

శ్లో॥ ఇత్థం వ్యవసితో బుద్ధ్యా భక్తోఽతీవ జనార్దనే ।
విషయాన్ జాయయా త్యక్ష్యన్ బుభుజే నాతిలంపటః ॥ 39

టీ:- ఇత్థమితి. త్యక్ష్యన్ శనైః త్యాగమభ్యసన్. జాయయా సహ బుభుజే. 39

అని ఈ విధముగా నిశ్చయమైన బుద్ధితో జనార్దనుని పట్ల అధికమైన భక్తితో క్రమముగా విషయ సుఖాభిలాషలను విడిచిపెట్టుచు ప్రాపంచిక వ్యామోహముల పట్ల ఇష్టములేనివాడై భార్యతో జీవయాత్రను కొనసాగించినాడు. 39

శ్లో॥ తస్య వై దేవదేవస్య హరేర్యజ్ఞపతేః ప్రభోః ।
బ్రాహ్మణాః ప్రభవో దైవం న తేభ్యో విద్యతే పరమ్ ॥ 40

టీ:- శ్రీకృష్ణస్యైవం బ్రహ్మణ్యతా నాతిచిత్రమిత్యాహ-తస్యేతి. 40

శ్రీకృష్ణ పరమాత్మయొక్క బ్రాహ్మణాభిమానము సహజమైనదే అనే విషయమును చెప్పుచున్నాడు - దేవదేవుడు యజ్ఞఫలదాత, ఈశ్వరుడు అయిన శ్రీకృష్ణునికి బ్రాహ్మణులే ఈశ్వరులు, దైవము. ఆయనకు వారికంటే మించినదేదియును లేదు. 40

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఏవం స విప్రో భగవత్సుహృత్తమో
దృష్ట్వా స్వభృత్యైరజితం పరాజితం ।
తద్ధ్యా నవేగోద్రథితాత్మ బంధన
స్తద్ధామ లేభేఽభిరతస్సతాం గతిమ్ ॥ 41

టీ:- ఏవమితి. అన్యైరజితమపి స్వభృత్యైః పరాజితం. దృష్ట్వా తస్య ధ్యానం తస్య వేగః తేన ఉద్గ్రథితం ఆత్మబంధనమహంకారో యస్య సః. గతమిత్యవివక్షిత లింగం ధామవిశేషణం. సతాం బ్రహ్మవిదాం ప్రాప్యమిత్యర్థః . 41

అని ఈ విధముగా భగవంతుని సర్వశ్రేష్ఠ మిత్రుడైన విప్రుడు కుచేలుడు ఇతరులకు లొంగని కృష్ణుడు తన భక్తులకు లొంగిన విషయమును చూచి ఆయన పట్ల నిరంతర ధ్యాన పరాకాష్ఠతో ప్రాపంచిక వ్యామోహ సంబంధమైన అహంకారమును వీడినవాడై బ్రహ్మవేత్తలు పొందదగిన మాటలకందరాని పరమాత్మ స్థానమును ఆత్మానంద మగ్నుడై పొందినాడు. 41

శ్లో॥ ఏతద్బ్రహ్మణ్య దేవస్య శ్రుత్వాబ్రహ్మణ్యతాం నరః ।
లబ్ధభావో భగవతి కర్మబంధాత్ప్రముచ్యతే ॥ 42

టీ:- ఏతదితి. ఏతత్ పృథుకోపాఖ్యానం శ్రుత్వా తత్ర బ్రహ్మణ్యతాం విశేషతశ్శృత్వేతి. 42

బ్రహ్మవేత్త అయిన కుచేలునికి సంబంధించిన పరమాత్మ పరతంత్రమైన ఈ అటుకుల చరిత్ర విన్న మానవుడు పరమాత్మ యందు మనస్సును నిల్పి ప్రాపంచిక కర్మ బంధములనుండి విముక్తుడై ఉన్నతిని సాధించగలడు. 42

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, ఏకాశీతితమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనుబది ఒకటవ అధ్యాయముసమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## ద్వ్యశీతితమోఽధ్యాయః

### సూర్యోపరాగే కురుక్షేత్రం ప్రతి శ్రీకృష్ణాదీనాం గమనక కథా

శ్లో॥ ద్వ్యశీతితమ ఆగత్య కురుక్షేత్రం రవిగ్రహే ।
వృష్ణీన్ దృష్ట్వా ముదా భూపాశ్చక్రుః కృష్ణకథా మిథః ॥
శ్రీకామసుహృదేకృష్ణః ప్రకల్ప్యేంద్ర పదం భువి ।
నందాది సుహృదానందీ కురుక్షేత్రం జగామ సః ॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ అథైకదా ద్వారకాయాం వసతో రామకృష్ణయోః ।
సూర్యోపరాగస్సు మహానాసీత్కల్పక్షయే యథా ॥ 1

టీ:- అథేతి. కల్పక్షయే యథా సర్వగ్రాస ఇత్యర్థః. 1

శ్లో॥ తం జ్ఞాత్వాపురుషా రాజన్ పురుస్తాదేవ సర్వతః ।
స్యమంత పంచకం క్షేత్రం యయుశ్శ్రేయో విధిత్సయా ॥ 2

టీ:- తమితి. జ్యోతిర్విద్భిః కథ్యమానమాదావేవ జ్ఞాత్వా. స్యమంత పంచకం కురుక్షేత్రం. 2

## 82వ అధ్యాయము

### సూర్యగ్రహణ నిమిత్తమై శ్రీకృష్ణాదులు కురుక్షేత్రమునకు వెళ్ళుట

ఎనుబదిరెండవ అధ్యాయమున శ్రీకృష్ణుడు సంపదలు ఆశించిన మిత్రునికి ఇలలోనే ఇంద్రపదవిని కల్పించి, ఒక సూర్యగ్రహణ సమయమున యాదవులు కురుక్షేత్రమునకు రాగా అక్కడి రాజులు వారితో పరస్పరము కృష్ణలీలల గాథలను గురించి మాట్లాడుకొనుట, నందాదులైన ఆత్మీయులతో ఆనందించుచు కృష్ణుడు కురుక్షేత్రమునకు వెళ్ళుట చెప్పబడెను.

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పచున్నాడు**

ఒకసారి బలరామకృష్ణులు ద్వారకా నగరమున ఉన్న సమయమున ప్రళయకాలము నాటి వలె సమస్తమును నాశనము చేయునట్లుగా అధికముగా సూర్య గ్రహణము సంభవించినది. 1

ఓ రాజా ! జ్యోతిష్యమును చక్కగా తెలిసిన అనగా తర్వాతి కాలమున జరుగబోవు విషయములను ముందుగనే సంపూర్ణముగా గ్రహించిన ఆ రామకృష్ణులిరువురు శ్యమంతపంచక స్థానమైన కురుక్షేత్రమునకు శుభములు కలుగవలెనని కోరికతో వెళ్ళిరి. 2

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ





శ్లో॥ నిః క్షత్రియాం మహీం కుర్వన్ రామః శస్త్ర భృతాం వరః ।
నృపాణాం రుధిరౌఘేణ యత్రచక్రే మహాహ్రదాన్ ॥ 3

టీ:- అబ్రహ్మణ్యక్షత్రియవధస్థానత్వేన పరశురామస్యాఘాపనుత్తిస్థానత్వేన చ క్షేత్రస్యపాపనిరాసకత్వమాహ-ద్వాభ్యాం. నిః క్షత్రియామితి. 3

బ్రాహ్మణులకు ధర్మము కానట్టి క్షత్రియుల వధకు పాల్పడిన పరశురాముని రాజహననము వలన కలిగిన పాపమును తొలగించిన స్యమంతపంచకము యొక్క కలుష నివారణ ప్రాశస్త్యమును రెండు శ్లోకములందు చెప్పుచున్నాడు-ఆయుధవిద్యలో సర్వ శ్రేష్ఠుడైన పరశురాముడు ఈ భూమిపై దుష్టులైన రాజులందరిని వధించి ఆ రాజుల రక్తప్రవాహముతో ఐదు గొప్ప కాసారములను కురుక్షేత్రమున నిర్మించినాడు. ఆ ప్రాంతమే తర్వాతి కాలమున స్యమంతపంచకమని పేరుపొందినది. 3

శ్లో॥ ఈజే స భగవాన్ రామోయత్రాస్పృష్టోపి కర్మణా ।
లోకస్య గ్రాహయన్నీశో యథాన్యోఘాపనుత్తయే ॥ 4

టీ:- ఈజ ఇతి. అన్యః అవిద్వాన్ యథా. 4

ఈశ్వరుడై భగవంతుడైన పరశురామునకు రాజులను వధించుట అనే పాపకర్మ బంధము లేకపోయినను లోకవ్యవహార నిమిత్తమై స్యమంతపంచకమున పితృతర్పణాది విధులను, తన పాపము పోగొట్టుకొనుటకై యాగములను చేసినాడు. 4

శ్లో॥ మహత్యాం తీర్థయాత్రాయాం తత్రాగన్భారతీః ప్రజాః ॥ 5

భారతదేశ ప్రజలు గొప్ప తీర్థయాత్రలలో గొప్ప మహిమగల స్యమంతపంచక తీర్థమునకు వెళ్ళుదురు. 5

శ్లో॥ వృష్ణయశ్చ తథాక్రూరవసుదేవాహుకాదయః ।
యయుర్భారాత తత్క్షేత్రం స్వమఘం క్షపయిష్ణవః ॥ 6

టీ:- మహత్యామితి. ఆగన్ ఆజగ్ముః. భారతీః భారత్యః. (5-6)

ఓ కురువంశశ్రేష్ఠా ! యాదవులు, అక్రూరుడు, వసుదేవుడు, బాహుకుడు మొదలైనవారందరు తమ పాపములను తొలగించుకొన ఇచ్ఛగలవారై ఆ క్షేత్రమునకు వెళ్ళిరి. 6

శ్లో॥ గదప్రద్యుమ్నసాంబాద్యైస్సుచంద్ర శుక సారిణైః ।
ఆస్తేనిరుద్ధో రక్షాయాం కృతవర్మాచ యూథపః ॥ 7

టీ:- గదేతి. సుచంద్ర శుకసారణైస్సహఅనిరుద్ధో ద్వారకాయాః రక్షాయాం ఆస్తే. తథా కృతవర్మా చ యూథపః సేనానీః. 7

గదుడు, ప్రద్యుమ్నుడు, సాంబులతో, సుచంద్రుడు, శుకసారణులతో కృతవర్మసైన్యాదిపత్యములో, అనిరుద్ధుని రక్షణలో వారుండిరి. 7

శ్లో॥ తే రథైర్దేవ ధిష్ణ్యాభైర్హయైశ్చ తరళప్లవైః ।
గజైర్నదద్భిరభ్రాభైర్నృభిర్విద్యాధరద్యుభిః ॥ 8

టీ:- తఇతి. దేవధిష్ణ్యాభైః విమానసంకాశైః. తరళాస్తరంగాః తద్వత్ ప్లవోగతిర్యేషాంతైః. విద్యాధరద్యుభిః విద్యాధరాణామివ ద్యుతిరేషాం తైః. 8

శ్లో॥ వ్యరోచంత మహాతేజాః పృథుకాంచన మాలినః ।
దివ్యస్రగ్వస్త్ర సన్నాహాః కళత్రైః ఖేచరా ఇవ ॥ 9

విమానములవంటి ప్రకాశముగల రథములపై, తరంగముల వంటి మెత్తని నడకలుగల గుఱ్ఱములతో. గర్జించునట్టి మేఘముల కాంతి వంటి కాంతి కలిగిన ఏనుగులతో, విద్యాధరుల వంటి ప్రకాశముగల పదాతులతో, గొప్పవైన బంగారు హారములు ధరించి, దివ్యములైన పూలదండలు, వస్త్రములు, కవచములు ధరించి, భార్యలతో కూడినవారై మహాతేజముతో దేవతలవలె ప్రకాశించిరి. (8-9)

శ్లో॥ తత్రస్నాత్వా మహాభాగ ఉపోష్య సుసమాహితాః ।
బ్రాహ్మణేభ్యో దదుర్ధేనూర్వాసస్స్రగ్రుక్మమాలినీః ॥ 10

టీ:- వ్యరోచంతేతి. మహాతేజాః మహాతేజసః. దివ్యాః అత్యుత్తమాః స్రగ్వస్త్రసన్నాహాః యేషాం తే. (9-10)

ఓ పుణ్యాత్ముడా ! వారందరు ఆ తీర్థక్షేత్రమున స్నానమాడి, ఏకాగ్ర చిత్తముతో ఉపవాసముచేసి బ్రాహ్మణులకు వస్త్రములు, పూలమాలలు, బంగారు దండలతో విరాజిల్లు గోవులను దానము చేసిరి. 10

శ్లో॥ రామహ్రదేషు విధివత్పునరాప్లుత్య వృష్ణయః ।
దదుస్స్వర్ణం ద్విజాగ్రేభ్యః కృష్ణేనోభక్తిరస్త్వితి ॥ 11

టీ:- రామేతి. పునః అన్యేద్యుః. ఆప్లుత్య యద్వా. తస్మిన్నేవాహని ముక్తిస్నానం కృత్వా. 11

భార్గవరాముడు నిర్మించిన శమంతపంచక మందలి ఐదు కాసారములందు మరుసటి దినమునకానీ లేక అదేదినమునకానీ శాస్త్ర విధానముననుసరించి ముక్తి స్నానము చేసి, తమకు కృష్ణపరమాత్మ యందు అపారమైన భక్తి కలదనుటకు నిదర్శనముగా యాదవులందరు బ్రాహ్మణ శ్రేష్ఠులకు బంగారము మొదలైన వానిని సమర్పించిరి. 11

శ్లో॥ స్వయం చ తదనుజ్ఞాతా వృష్ణయః కృష్ణదేవతాః ।
భుక్త్వోపవివిశుః కామం స్నిగ్ధచ్ఛాయాంఘ్రిపాంఘ్రిషు ॥ 12

కృష్ణుడే పరదైవముగా భావించు యాదవులందరు ఆ మహనీయుని అనుమతితో ఇష్టభోజనములారగించి దట్టమైన నీడలుకల వృక్షముల క్రింద యథేచ్ఛగా విశ్రమించిరి. 12

శ్లో॥ తత్రాగతాస్తే దదృశుస్సుహృత్సంబంధి బాంధవాన్ ।
మత్స్యోశీనర కౌసల్య విదర్భ కురుసృంజయాన్ ॥ 13

శ్లో॥ కాంభోజమద్ర కైకేయాన్కుంతీ నారట్టకేరళాన్ ।
అన్యాంశ్చైవాత్మపక్షీయాన్పరాంశ్చ శతశోనృపాన్ ॥ 14

శ్లో॥ నందాదీన్సుహృదో గోపాన్ నోపిశ్చోత్కంఠితాశ్చిరమ్ ॥ 15

టీ:- స్వయమితి. స్నిగ్ధా శీతలా ఛాయా యేషాం అంఘ్రిపానాం వృక్షాణాం అంఘ్రిషు మూలేషు. (12-15)

అక్కడకు ఆ విధముగా వచ్చిన యాదవులు మత్స్యదేశము ఉశీనము, కోసల, విదర్భ, కురు, సృంజయ, కాంభోజ, మద్ర, కైకేయ, కుంతీ, ఆరట్టి, కేరళ దేశములకు చెందిన స్నేహితులు, చుట్టములు, బంధువులను, ఇంకా ఇతర దేశములకు చెందిన ఆత్మీయులను, శత్రువులను మిత్రులైన నందాది గోపకులను, గోపికలను దర్శించి చాలాసేపు ఉద్వేగమునకు లోనైరి. (13-15)

శ్లో॥ అన్యోన్య సందర్శన హర్షరంహసా
ప్రోత్ఫుల్లహృద్వక్త్ర సరోరుహశ్రియః ।
ఆశ్లిష్యగాఢం నయనైస్స్రవజ్జలా
హృష్యత్త్వచో రుద్ధగిరో యయుర్ముదమ్ ॥ 16

టీ:- అన్యోన్యేతి. ప్రోత్ఫుల్లైః హృద్వక్త్రసరోరుహైః శ్రీః శోభా యేషాం తే. 16

వారందరు ఒకరినొకరు చూచుకొనుటవల్ల ఆనందాతిరేకముతో వికసించిన హృదయములో, ముఖపద్మముల విలాసముతో పరస్పరము కౌగలించుకొని ఆనంద బాష్పములను జాలువారగ, అపారమైన స్పర్శ సుఖమును పొంది సంతోషముతో బొంగువోయిన గొంతుకతో పలుకరించుకొని హర్షవివశులైరి. 16

శ్లో॥ స్త్రియశ్చ సంవీక్ష్యమిథోఽతి సౌహృద
స్మితామలాపాంగదృశోఽభిరేమిరే ।
స్తనైస్త స్నాన్కుంకుమ పంకరూషితా
న్నిహత్యదోర్భిః ప్రణయాశ్రులోచనాః ॥ 17

స్త్రీలుకూడా స్నేహాతిశయముతో చిరునవ్వుతో కూడి నిర్మలమైన కడకంటి చూపులతో మకరికా పత్రములతో అలంకృతములైన వక్షోజములు పరస్పరము రాలిపడునట్లుగా, ఆనందబాష్పములు వెల్లుబుకగా చేతులతో ఒకరినొకరు కౌగలించుకొని హర్షపారవశ్యము ననుభవించిరి. 17

శ్లో॥ తతోఽభివాద్య తే వృద్ధాన్ యవిష్ఠైరభివందితాః ।
స్వాగతం కుశలం పృష్ట్వా చక్రుః కృష్ణకథా మిథః ॥ 18

టీ:- స్త్రియ ఇతి. అతిసౌహృదేన యత్స్మితం తేన అమలాః అపాంగైః దృశః దృష్టయో యాసాం తాః. మిథః సంవీక్ష్య దోర్భిః అభిరేమిరే ఆలింగనం కృతవత్యః. (17-18)

వారందరు పెద్దలకు నమస్కరించి, చిన్నవారి మ్రొక్కులుగొని స్వాగతవచనములు పలుకుచు, కుశలవార్తలు అడుగు పరస్పరము శ్రీకృష్ణుని లీలా గాథలను చెప్పుకొనిరి. 18

శ్లో॥ పృథా భ్రాతౄన్స్వసౄర్వీక్ష తత్పుత్రాన్పితరావపి ।
భ్రాతృపత్నీర్ముకుందం చ జహౌసంకథయా శుచః ॥ 19

టీ:- పృథేతి. సంకథయా మిథస్స ప్రేమగోష్ఠ్యా. 19

కుంతి సోదరులను వారి పుత్రులను. తండ్రులను, సోదరుల భార్యలను చూచి పరస్పరము ప్రేమసల్లాపములతో తన దుఃఖమును విడనాడినది. 19

**కుంతీ ఉవాచ**

శ్లో॥ ఆర్య భ్రాతరహంమన్యే ఆత్మనమకృతాశిషమ్ ।
యత ఆపత్సుమద్వార్తాం నానుస్మరత సత్తమాః ॥ 20

టీ:- తామేవ వసుదేవపృథయోః సంకథామాహ – చతుర్భిః. ఆర్యేతి. అకృతాశిషం అపూర్ణమనోరథం. 20

**కుంతి ఇట్లు చెప్పినది**

కుంతీ వసుదేవుల సంభాషణను నాలుగు శ్లోకములందు చెప్పుచున్నాడు. ఓ అగ్రజుడైన వసుదేవా ! నా ఆత్మీయులే మాకు ఆపదలు కలిగించిన సందర్భమున మమ్ములను గుర్తుంచుకొనలేక పోయినందుకు నేను పెద్దల ఆశీస్సులు కరువై కోరికలు తీరని దానినైతిని. కష్టములు దాటలేకపోయిన దానినైతిని అనుకొంటున్నాను. 20

శ్లో॥ సుహృదోజ్ఞాతయః పుత్రా భ్రాతరః పితరావపి ।
నానుస్మరంతి స్వజనం యస్య దైవమదక్షిణమ్ ॥ 21

దైవానుగ్రహము కొరవడిన వానిని స్నేహితులు, దాయాదులు, పుత్రులు, సోదరులు, తండ్రులు మొదలైన ఆత్మీయులెవ్వరును గుర్తుంచుకొనరు. నాకు దైవము వ్యతిరేకమైనది. కనుక నన్ను మీరు కాపాడక పోవుటలో మీ తప్పు లేదని భావము. 21

వసుదేవ ఉవాచ

శ్లో॥ అంబ మాస్మానసూయేథా దేవక్రీడనకాన్నరాన్ ।
ఈశస్య హివశేలోకః కురుతే కార్యతేఽథవా ॥ 22

టీ:- సుహృద ఇతి. అదక్షిణం అననుకూలం. తం స్వజనమపి సంతం సుహృదాదయో నానుస్మరంతి. అతః మమైవ దైవం ప్రతికూలం యుష్మాకం కోవాపరాధ ఇతి భావః. (21-22)

వసుదేవుడు ఇట్లు చెప్పినాడు

అమ్మా కుంతీ ! భగవంతుని చేతిలో కీలుబొమ్మలమైన మావంటి సామాన్య మానవులపై ఈసు చెందవద్దు. ఈశ్వరునికి వశులై మాత్రమే ఎవరైనను లోకమున ఏపనియైనను చేయుట, చేయింపబడుటలు జరుగును. 22

శ్లో॥ కంస ప్రతాపితాస్సర్వే వయంయాతా దిశందిశమ్ ।
ఏతర్హ్యేవపునస్థానం దైవేనాసాదితాస్స్వసః ॥ 23

ఏదైనను ఈశ్వరవశమే అని చెప్పుచున్నాడు - మనమందరము కంసుని బాధవలన తోచిన దిక్కులకు వెళ్ళితిమి. ఓ చెల్లీ! మరల అదే దైవవశముచేత మనమందరము మన స్థానములను పొందితిమి. 23

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ వసుదేవోగ్రసేనాద్యైర్యదుభిస్తేఽర్చితానృపాః ।
ఆసన్నచ్యుత సందర్శ పరమానంద నిర్వృతాః ॥ 24

శ్రీశుకుడు ఇట్లు పలికెను

వసుదేవుడు, ఉగ్రసేనుడు మొదలైన యాదవులు అక్కడున్న రాజులను పూజించిరి. వారు అచ్యుతుని దర్శించినందువలన పరమానంద పారవశ్యమును పొందిరి. 24

శ్లో॥ భీష్మోద్రోణోఽంభికా పుత్రో గాంధారీ ససుతా తథా ।
సదారాః పాండవాః కుంతీ సంజయో విదురః కృపః ॥ 25

ఓ రాజా! భీష్ముడు, ద్రోణుడు, ధృతరాష్ట్రుడు, పుత్రసహితమైన గాంధారి, భార్యాసహితులైన పాండవులు, కుంతీ, సంజయుడు,

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ కుంతిభోజో విరాటశ్చ భీష్మకో నగ్నజిన్మహాన్ ।
పురుజిద్ద్రుపదశ్శైబ్యో ధృష్టకేతుశ్చ కాశిరాట్ ॥ 26

శ్లో॥ దమఘోషో విశాలాక్షో మైథిలో మద్రకేకయౌ ।
యుధామన్యుస్సుశర్మా చ ససుతా బాహ్లికాదయః ॥ 27

టీ:- ఈశమశత్వమేవాహ. -కంసప్రతాపితాఇతి. హే స్వసః ఏతర్హ్యేవ సంప్రత్యేవ. (23-27)

విదురుడు, కృపుడు, కుంతిభోజుడు, విరాటుడు, భీష్మకుడు గొప్పవాడైన నగ్నజిత్తు, పురుజిత్తు, ద్రుపదుడు, శైబ్యుడు, ధృష్టకేతుడు, కాశీరాజు, దమఘోషుడు విశాలాక్షుడు, మైథిలుడు, మద్రరాజు, కేకయుడు, యుధామన్యుడు, సుశర్మ, పుత్రసహితులైన బాహ్లికాదులు ఇంకను రాజసూయయాగ సందర్భమున ఓడిపోయిన పెక్కులు రాజులు, ధర్మరాజుననుసరించిన పలువురు రాజులు అందరును భార్యసహితులుగా లక్ష్మీనిలయుడైన శ్రీకృష్ణ పరమాత్ముని దివ్యరూపమును దర్శించి పరమాశ్చర్యచకితులైరి. (25-28)

శ్లో॥ రాజానోఽన్యే చ రాజేంద్రయుధిష్ఠిర మనువ్రతాః ।
శ్రీనికేతం వపుశ్శౌరేస్సస్త్రీకా వీక్ష్యవిస్మితాః ॥ 28

శ్లో॥ అథతే కృష్ణరామాభ్యాం సమ్యక్ప్రాప్త సమర్హణాః ।
ప్రశశంసుర్ముదా యుక్తా వృష్ణీన్కృష్ణ పరిగ్రహాన్ ॥ 29

టీ:- రాజానఇతి. యుధిష్ఠిరం అనువ్రతాః తేన రాజసూయే జితత్వాత్. (28-29)

పిమ్మట వారందరు శ్రీకృష్ణబలరాములవలన ఉచితగౌరవములు పొందినవారై, సంతోషముతో కృష్ణుని పరిజనులైన యాదవులను మిక్కిలిగా ప్రశంసించిరి. 29

శ్లో॥ అహో భోజపతే యూయం జన్మభాజోనృణామిహ ।
యత్పశ్యథాసకృత్కృష్ణం దుర్దర్శమపి యోగినామ్ ॥ 30

టీ:- అహోఇతి. జన్మభాజః నృణాం మధ్యేసఫలజన్మానః. 30

ఓహో భోజమహారాజా ! ధ్యానభ్యాసవశీకృతచిత్తులైన యోగీశ్వరులకును క్షణకాలము కన్న ఎక్కువసేపు లభించని అత్యంత దుర్లభమైన శ్రీకృష్ణ పరబ్రహ్మ దర్శనము నిరంతరము అప్రయత్నముగా స్వయంసిద్ధమై నీకు లభించినందువలన మీరందరూ లోకమునందలి జనులందరిలో మిక్కిలిగా జన్మసార్థక్యమును పొందినారు. 30

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ యద్విశ్రుతిశ్శ్రుతినుతేదమలం పునాతి
పాదావనేజన పయశ్చ వచశ్చశాస్త్రమ్ ।
భూః కాలభర్జితభగాపి యదంఘ్రిపద్మ
స్పర్శోత్థశక్తిరభివర్షతి నోఽఖిలార్థాన్ ॥ 31

టీ:- కించ న కేవలం తస్య దర్శనమేవ. ఆపితు అత్యంత దుర్లభం బహు యుష్మాకం స్వతస్సంపన్నమిత్యాహుర్ద్వాభ్యాం. యదితి. యదితి. పృథక్పదం యస్యేత్యర్థః. విశ్రుతిః కీర్తిః. శ్రుతిభిర్వేదైః. నుతా స్తుతా. ఇదం విశ్వం అలం అత్యర్థం పునాతి. యస్య పాదావనేజనపయః గంగా చ. యస్య వచః వాగ్రూపం శాస్త్రం చ. వేదాఖ్యం విశ్వం. పునాతి. కించ కాలేన భర్జితః దగ్ధః భగః మాహాత్మ్యం యస్యాస్సా. తథా విధాపి యస్య అంఘ్రిపద్మ స్పర్శేన ఉత్థా ఆవిర్భూతా శక్తిర్యస్యాస్సా నః అస్మాకం. అఖిలానర్థాన్ అభితో వర్షతి. 31

శ్లో॥ తద్దర్శనస్పర్శనానుపథప్రజల్ప
శయ్యాసనాశనసయౌనసపిండబంధః ।
యేషాంగృహేనిరయవర్త్మని వర్తతాం
వస్స్వర్గాపవర్గ విరమ స్స్వయమాస విష్ణుః ॥ 32

కేవలము పరమాత్మ దర్శనము మాత్రమే కాదు ఇంకా అనేకులకు మిక్కిలి దుర్లభమైన పరతత్త్వము మీకు మాత్రమే సహజముగా సిద్ధించినది. ఆ పరతత్త్వము అనే విషయమును రెండు శ్లోకములలో తెలుపుచున్నాడు. యత్ అనుటలో పరమాత్మ స్థానమే ఈ సర్వమున కంటే భిన్నముగా వేరుగా ఉన్నది. అట్టి పరమాత్మ కీర్తిని వేదము స్తుతించుటచేత పరమాత్మ కీర్తి ప్రవాహమే పాదజలమై గంగానదిగా, ఆయన మాటలు వేదమనే వాగ్రూపమైన శస్త్రముగా ఈ అనంత విశ్వమును పవిత్రము చేయుచున్నవి. ఈ భూమి కాలప్రవాహమున దగ్ధమై అనగా ప్రభావము నశించినదైనప్పటికీ (భూః కాలభర్జిత భగాపి-పృథివీగత యౌవన) ఈ మహనీయుని పాదస్పర్శ చేత మరల అపారముగా శక్తిని సంతరించుకొన్నదై మాకు సమస్తమైన కార్యములను అంతట వర్షించుచున్నది. 31

అట్టి పరమాత్మను దర్శించుట, స్పర్శించుట, ఆయనతో కలసి తిరుగుట, మాట్లాడుట, కలిసి ఒకేచోట పడుకొనుట, భుజించుట, వివాహము, శారీరక కామసంబంధము సంతాన ప్రాప్తి, సహవాసము మొదలైన భోగములతో శ్రీకృష్ణునితో కలిసి దర్శనము మొదలైన వానిలో ప్రకటమగునట్లుగా మీ ఇంట ఆ పరమాత్ముడే బిడ్డడై ఆవిర్భవించి

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.








టీ:- త దితి. దర్శనం చ. అనుపథః అనుగతిశ్చ ప్రజల్పో గోష్ఠీ చ. శయ్యా శయనం చ. ఆసనంచ అశనం భోజనం చ. యౌనబంధః వివాహసంబంధః. సపిండబంధః దైహికసంబంధః. తేన సహ వర్తమానః తేన శ్రీకృష్ణేన సహదర్శనాద్యుపలక్షితః సయౌనపిండసంబంధో యేషాం వోऽస్తి. కించ. యేషాం వః గృహే విష్ణుః స్వయం ఆస ఆవిరభూత్. యేషాం వః నిరయవర్త్మని ప్రవృత్తిమార్గే ప్రవర్తమానానాం స్వర్గాపవర్గాభ్యాం విరమయతి వితృష్ణాం కరోతీతి తథా సః తే యూయం జన్మభాజ ఇతి. యద్వా . తదితి సామాన్యనిర్దేశః స ఇత్యర్థః సవిష్ణుః స్వయం యేషాం వో నిరయవర్త్మని సంసారకారణే గృహే వర్తమానానామపి బధ్యతే సంబధ్యత ఇతి. బంధః దర్శనాదిభిః సంబద్ధస్సన్ స్వర్గాపవర్గ విరమః ఆస పరమసుఖప్రదో బభూవేత్యర్థః. 32

నాడు. మీరు విషయములతో కూడిన ప్రవృత్తి మార్గమున అనగా సంసార కారణమైన వ్యామోహమునందుండి కూడా స్వర్గము, మోక్షములు రెండింటిని కోరుకున్నారు. అతడే మీకు జన్మసాఫల్యము లేక అపరాత్పరుడైన విష్ణువే స్వయముగా మీకు సంసార కారణమైన ఇండ్లలో గృహకృత్యములాచరించుచున్నాడు. ఆ పరమాత్మ మీతో దర్శన స్పర్శనాదుల సంబంధముతో కలిసి ఉన్నవాడై మీకు స్వర్గమోక్షములను తృణీకరించు విధముగాపరమానందము కలిగించినాడనిభావము. 32

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ నందస్తత్ర యదూన్ప్రాప్తాన్ జ్ఞాత్వా కృష్ణపురోగమాన్ ।
తత్రాగమద్వృతో గోపైరనస్థార్థైర్దిదృక్షయా ॥ 33

**శ్రీశుకుడు ఇట్లు పలికెను**

కురుక్షేత్రమునందలి శ్యమంతపంచక ప్రాంతమున నివాసము చేయు కోరికతో శ్రీకృష్ణుని వెన్నంటి వచ్చి యాదవులందరు అక్కడకు చేరినారనే విషయము తెలిసి నందుడు తానుకూడా సమస్త గోపాలురతో బండ్లపై సమస్త గృహ పరికరముతో అక్కడకు వెళ్ళినాడు. 33




శ్లో॥ తం దృష్ట్వా వృష్ణయో హృష్టాస్తన్వః ప్రాణమివోత్థితాః ।
పరిషస్వజిరే గాఢం చిరదర్శనకాతరాః ॥ 34

టీ:- నంద ఇతి. అనస్థార్థైరితి తత్రైవ వాసచికీర్షయా శకటేషు స్థాపితై రర్థైస్సహాగతైరిత్యర్థః. (33-34)

ఆ నందుని చూచి యాదవులు పరమ సంతోషముతో శరీరమున చేరిన ప్రాణములవలె లేచి చాలాకాలము తర్వాత పునర్దర్శనము కలుగుట వలన ఉద్వేగముతో గాఢముగా కౌగిలించుకొనిరి. 34

శ్లో॥ వసుదేవః పరిష్వజ్య సంప్రీతః ప్రేమవిహ్వలః ।
స్మరన్కంసకృతాన్ క్లేశాన్పుత్రన్యాసం చ గోకులే ॥ 35

వసుదేవుడు గోకులమునందు తాను కృష్ణుని విడిచినప్పటినుండి కంసుడు గోకులమునందలి వారికి కలిగించిన దుఃఖములను గుర్తుకు తెచ్చుకొనుచు నందుని పరమానందముతో కౌగిలించుకొని ప్రేమ పారవశ్యుడయ్యెను. 35

శ్లో॥ కృష్ణరామౌ పరిష్వజ్య పితరావభివాద్య చ ।
న కించిదూచతుః ప్రేమ్ణా సాశ్రుకంఠౌ కురూద్వహ ॥ 36

టీ:- వసుదేవ ఇతి. వసుదేవస్తం పరిష్వజ్య ప్రేమవిహ్వలో బభూవేతి శేషః. (35-36)

ఓ కురుశ్రేష్ఠా! బలరామకృష్ణులిద్దరు తండ్రి నందుని కౌగిలించుకొని నమస్కరించి ప్రేమ పారవశ్యముతో కన్నుల నీరు స్రవించగా, గొంతు బొంగురుపోగా మాటలతో ఏమియు చెప్పలేక పోయిరి. (మాట్లాడలేకపోయిరి) 36

శ్లో॥ తావాత్మాంకే సమారోప్య బాహుభ్యాం పరిరభ్య చ ।
యశోదా చ మహాభాగా సుతౌ విజహతుశ్శుచః ॥ 37

టీ:- తావితి. తౌ సుతౌ పరిరభ్య నందః యశోదాచ విరహశోకాత్ శుచః అశ్రూణి విజహతుః ముముచతుః. యద్వా శుచః పుత్రవిరహ శోకాన్ విజహతుః తత్యజతురిత్యర్థః. 37

రామకృష్ణులిద్దరిని మహాపుణ్యాత్మురాలైన యశోద తన తొడలపై కూర్చొనబెట్టుకొని కౌగిలించుకోగా ఇంతకాలము వారు తల్లికి దూరమైన దుఃఖమును విడనాడిరి. 37



శ్లో॥ రోహిణీ దేవకీ చాథ పరిష్వజ్య వ్రజేశ్వరీమ్ ।
స్మరంత్యౌతత్కృతాం మైత్రీం బాష్పకంఠ్యౌ సమూచతుః ॥ 38

టీ:- రోహిణీతి. వ్రజేశ్వరీం యశోదాం. 38

శ్లో॥ కా విస్మరేత వాం మైత్రీమనివృత్తాం వ్రజేశ్వరి ।
అవాప్యాప్యైంద్రమైశ్వర్యం యస్యానేహ ప్రతిక్రియా ॥ 39

టీ:- కేతి. అనివృత్తాం నివృత్తికారణే సత్యపి అనువర్తమానాం ఐంద్రమైశ్వర్యం అవాప్య ప్రాప్యాపి యస్యాః ప్రతిక్రియా కర్తుం న శక్యత ఇత్యర్థః. 39

శ్లో॥ ఏతావదృష్టపితరౌ యువయోస్స్మపిత్రోః
స్సంప్రీణనాభ్యుదయతోషణపాలనాని ।
ప్రాప్యోషతుర్భవతి పక్ష్మహయద్వదక్ష్ణో
ర్న్యస్తావకుత్ర చ భయౌ న సతాం పరస్స్వః ॥ 40

టీ:- తత్కృతాం మైత్రీమాహతుః. ఏతావితి. న దృష్టౌ పితరౌ యాభ్యాం తౌ. వస్తుతస్తు అజన్మత్వాదేవాదృష్టపితరౌ హే భవతి. యువయోః

రోహిణీ, దేవకిదేవులు గోకుల రాణియైన యశోదను కౌగిలించుకొని ఆమె స్నేహితమును, ఆమె తమ పిల్లలను లాలించి చేసిన సేవలను గుర్తుకుతెచ్చుకొనుచు ఆనందముతో, కన్నీళ్ళతో బొంగురువోయిన గొంతుతో ఈ విధముగా చెప్పిరి. 38

ఓ యశోదా ! విడివడని నీ స్నేహబంధమును ఎట్లు మరువగలము. ఇంద్రవైభవము కలిగినను నీ ఆత్మీయతకు బదులు తీర్చుకొనుటకు సాధ్యముకాదుగదా! అన్నారు. 39

ఆ యశోద చేసిన పరమోపకారమును చెప్పుచున్నారు – తల్లిదండ్రులమైన మేము ఎదురుగా లేకున్నను, తండ్రియైన వసుదేవుడు మిత్రదంపతులైన యశోదానందులైన మీ వద్దకు రామకృష్ణులను చేర్చగా ఈ పుణ్యదంపతులిరువురు పరమానందముతో ఈ బాలకులను స్వీకరించితిరి. వీరికేవిధమైన భయనష్టములు కలుగనివ్వకుండా రెండు రెప్పలు కంటిని కాపాడినట్లు రక్షించి నిత్యాభివృద్ధిని పొందినట్లుగా పాలనపోషణలను నిర్వర్తించితిరి.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

పిత్రోః న్యస్తావేతౌ సంప్రీణనాదీని ప్రాప్య. అకుత్ర చ భయౌ క్వచిదపి భయరహితౌభూత్వా ఊషతుః వాసం చక్రతుః. కథం భూతయోః అక్ష్ణోః నేత్రయోః. రక్షకం పక్ష్మ యద్వత్ తథా రక్షకయోః యువయోః యుక్తమేతత్. యతః సతాం పరః స్వ ఇతి నాస్తి వైషమ్యమితి. 40

సత్పురుషులైన వారికి ఇది తనది, ఇది ఇతరులది అనే భేదభావము ఉండదుకదా. 40

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ గోప్యశ్చ కృష్ణముపలభ్య చిరాదభీష్టం
యత్ప్రేక్షణే దృశిషు పక్ష్మకృతం శపంత్యః ।
దృగ్భిర్హృదీకృతమలం పరిరభ్య సర్వా
సద్భావమాపురపి నిత్యయుజాం దురాపమ్ ॥ 41

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

గోపికలుకూడా కృష్ణుని పొంది చిరకాల వాంఛయైన కృష్ణ దర్శనమునకు తహతహలాడుచు కంటికి రెప్పలను మూతలగునట్లు చేసిన బ్రహ్మను నిందించుచు, కన్నులే ద్వారముగా తమ హృదయమున ప్రవేశించిన కృష్ణపరమాత్మను కౌగిలించుకొని ఆత్మతత్త్వమగ్నులైన యోగీశ్వరులకును దుర్లభమైన విధముగా పరమాత్మ భావమును అనగా పరమాత్మను పొందినారు. 41

శ్లో॥ భగవాంస్తాస్తథాభూతా వివిక్త ఉపసంగతః ।
ఆశ్లిష్యానామయం పృష్ట్వా ప్రహసన్నిదమబ్రవీత్ ॥ 42

ఆ విధముగా నున్న గోపికలను ఏకాంతముగా కలిసి కౌగిలించుకొని వారి యోగక్షేమములు విచారించి చిరునవ్వుతో ఈ విధముగా చెప్పినాడు. 42

టీ:- గోప్యఇతి. అభీష్టత్వే లింగం. యస్య కృష్ణస్య ప్రేక్షణే దృశిషు నేత్రేషు వ్యవధాయకపక్ష్మకృతం విధాతారం శపంత్యః. దృగ్భిః నేత్రద్వారైః హృదీ కృతం హృదయే ప్రవేశితం. పరిరభ్య. తద్భావం తదాత్మతాం ప్రాపుః. అపినిత్యయుజాం ఆరూఢయోగినామపి. (41-42)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అపిస్మరథనస్సఖ్యస్స్వానామర్థ చికీర్షయా ।
గతాంశ్చిరాయితాన్ శత్రుపక్ష క్షపణ చేతసః ॥ 43

టీ:- అపీతి. చిరాయితాన్ విలంబితాన్ అత్రహేతుః. శత్రూణాం పక్షస్య క్షపణే చేతో యేషాం తాన్. 43

శ్లో॥ అప్యవధ్యా యథాస్మాన్ స్విదకృతజ్ఞ విశంకయా ।
నూనం భూతాని భగవాన్ యునక్తి వియునక్తి చ ॥ 44

టీ:- అపీతి. అపిస్వితి కిం వా. అస్మాన్ అవధ్యాయథ అవజానీథ. అకృతజ్ఞా ఏతఇతి విశంకయా ఈషచ్ఛంకయా. న శంకామాత్రం కింతు నిశ్చితమేవైతత్. పరిత్యజ్య గతత్వాదితిచేదత ఆహ - నూనమితి. 44

శ్లో॥ వాయుర్యథాఘనానీకం తృణతూలరజాంసి వా ।
సంయోజ్యాక్షిపతే భూయస్తథాభూతాని భూతకృత్ ॥ 45

టీ:- ఏతత్సదృష్టాంతమాహ - వాయురితి. ఆక్షిపతే ఆక్షిపతి పృథక్కరోతీత్యర్థః. 45

ఓ సఖులారా! నావారి ప్రయోజనములను సాధించుటకై శత్రువులను నాశనము చేయుట కారణముగ నేను వెళ్ళిన పిదప గడచిన చాలా రోజులలో నాప్రియులైన మీరెప్పుడైనా నన్ను స్మరించితిరా? అని కృష్ణుడు గోపికలను అడిగినాడు. 43

వీడు కృతజ్ఞతలేక మమ్ములను విడచి వెళ్ళినాడని మీరు నన్ను లేశమాత్రమైన లేక నిశ్చయమైన అనుమానముతో అవమానించితిరా? నిజమే భగవంతుడు సర్వజీవులనుకలుపుచువిడదీయుచుండును. 44

ఈ విషయమునే దృష్టాంతముతో చెప్పుచున్నాడు-వాయువు మేఘ సంఘములను, గడ్డిపరకలను, దూదిని, ధూళిని కలిపి ఎగురగొట్టి మరల కిందకు పడవేసినట్లు పరమేశ్వరుడు జీవులను కలుపుచు విడగొట్టుచుండును. 45

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ మయి భక్తిర్హి భూతానామమృతత్వాయ కల్పతే ।
దిష్ట్యా యదాసీన్మత్స్నేహో భవతీనాం మదాపనః ॥ 46

టీ:- అపిచ అతిభద్రమిదం యదుత భవతీనాం మద్వియోగేన మత్ప్రేమాతిశయో జాత ఇత్యాహ-మయీతి. మయి భక్తిమాత్రమేవ తావదమృతత్వాయ కల్పతే. యత్తు భవతీనాం మత్స్నేహ ఆసీత్. తద్దిష్ట్యా అతిభద్రం కుతః మదాపనః మత్ప్రాపక ఇతి. 46

శ్లో॥ అహం హి సర్వభూతానామాదిరంతోంతరం బహిః ।
భౌతికానాం యథా ఖం వార్భూర్వాయుర్జ్యోతిరంగనాః ॥ 47

టీ:- కీదృశః త్వం యం చ వయం స్నేహేనప్రాప్స్యామ ఇత్యపేక్షాయా మాత్మ స్వరూపమాహ-అహమితి. హే అంగనాః భౌతికాదీనాం శరావసైంధవాదీనాం. యథా ఆకాశాది పంచమహాభూతాన్యాద్యంతాది రూపాణి. ఏవం సర్వభూతానాం జరాయుజాదీనామాద్యం తాదిరహం. అతో వ్యాపకం మాం భవత్యః ప్రాప్తా ఏవేతి. 47

అయినప్పటికి మీకు చాలా మేలే జరిగినది. విశేషముగా మీకు నా ఎడబాటు వలన నాపట్ల అధికమైన ప్రేమ భావన కలిగినది. అని చెప్పుచున్నాడు.- సర్వజీవులకు నాయందలి భక్తియే శాశ్వతత్త్వమును కలిగించగలదు. నీకు నా పట్ల విడివడని స్నేహము కలిగినది. దైవ వశమున మీకు నన్నుపొందగల నిశ్శ్రేయసము సిద్ధించినది. 46

మీరెట్టివారు? నేనెవడను? మనము స్నేహభావముతో ఒకరినొకరము కలిసితిమి అనే ఆసక్తితో ఆత్మతత్త్వమును వివరించు చున్నాడు - ఓ యింతులారా! ఈ లోకము నందలి భౌతిక వస్తువులైన మూకుడు(మట్టి), ఉప్పు మొదలైన వస్తువులకు వలెనే అగ్ని, ఆకాశము, జలము, భూమి, వాయువు, అనే పంచ మహాభూతములకు ఉత్పత్తి నాశనములున్నవి. ఈ విధముగా సర్వభూతములకు, జరాయుజ, అండజాది జీవసముదాయమునకును నేనే ఆది, అంతమును. బయట లోపల ఉన్నది నేనే. అంతటా వ్యాపించిన నన్ను మీరు ఎప్పటికినీ పొందియే ఉన్నారు. కనుక ఎడబాటు అనునది లేనేలేదు. 47

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఏవం హ్యేతాని భూతాని భూతేష్వాత్మాత్మనాతతః ।
ఉభయం మయ్యథ పరే పశ్యతాభాంతమక్షరే ॥ 48

టీ:- నను చతుర్విధభూతగ్రామాణాం తద్భోక్తా ఆత్మైవాద్యంతాది రూపః తస్మింశ్చ సర్వవ్యాపకే సర్వభూతాని వర్తంత ఇతి కుతస్త్వత్ప్రాప్తి రస్మాక మిత్యత ఆహ - ఏవమితి. అయమర్థః - యథా శరావాదీనాం భౌతికానాం మహాభూతాన్యాద్యంతరూపాణి ఏవ మేవ ఏతాని చతుర్విధాని భూతాన్యపి భౌతికత్వావిశేషాత్స్వ కారణేషు భూతేష్వేవ వర్తంతే న తు భోక్తర్యాత్మని. ఆత్మా తు తేషు భూతేషు ఆత్మనా భోక్తృరూపేణ తతః వ్యాప్తః. న కారణత్వేన. అథ తు తదుభయం భూతభౌతికరూపం భోగ్యం భోక్తారం చాత్మానం మయ్యక్షరే పరిపూర్ణే ఆభాంతం పశ్యతేతి. 48

ఒకవేళ నాలుగు విధములైన జీవరాశి సముదాయముల (ఉద్భిజములు-విత్తనమునుండి జన్మించు వృక్షరాశి, జరాయుజములు - క్షీరదములు - తనరూపముతో సమానమైన శిశువునకు జన్మనిచ్చి పాలిచ్చి పోషించు మానవులు, పశువులు మొదలైనవి, అండజములు- గ్రుడ్డునుండి జన్మించు పక్షులు, పాములు, కీటకములు మొదలైనవి, స్వేదజములు-చెమటనుండి జన్మించి కంటికి కనిపించని ఏకకణాది జీవులు) కర్మలకు ఆది, అంతరూపుడైన ఆత్మనైన నేనే భోక్తను. ఆ విధముగా సర్వభూతములు అంతటా నిండిన ఆ పరమాత్మయందే వర్తించుచున్నవి అన్నప్పుడు మాకు మీప్రాప్తి ఎందుకు అనే విషయము చెప్పుచున్నాడు - మూకుడు, ఉప్పు మొదలైన భౌతిక వస్తువులకు వలెనే పంచ మహాభూతములకు కూడా పుట్టుక-నాశనములున్నవి. అట్లే ఈ నాలుగు విధములైన జీవరాశికూడా భౌతిక పదార్థాలకన్నా భిన్నమైనవి కానందువల్ల వానివాని కారణ రూపమైన పంచమహా భూతములందే వర్తించును కానీ భోక్తయైన పరమాత్మలో వర్తించవు. పరమాత్మ ఆయా భూతములందు 'నేను' (అహం) అనే భోక్తరూపముగా వ్యాపించినాడు. అంతేకాని కర్మలకు కారణముతో కాదు. (భగవంతునికి కర్మకర్తృత్వములేదని భావము) కనుక భోగ్యమైన పాంచ భౌతిక వస్తు సముదాయము, భోక్తమైన ఆత్మ అనే రెండింటిని పరిపూర్ణమై నాశరహితముగా అంతటా ప్రకాశించు నాయందే చూడవలెను. 48

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ అధ్యాత్మ విద్యయా గోప్య ఏవం కృష్ణేన శిక్షితాః ।
తదనుస్మరణ ధ్వస్తజీవకోశాస్తమధ్యగన్ ॥ 49

టీ:- అధ్యాత్మేతి. అధ్యాత్మవిద్యయా తచ్ఛిక్షయా స్వరూపోపదేశేన. శిక్షితాః బోధితాః తస్య అనుస్మరణేవ ధ్వస్తః జీవకోశః లింగం యాసాం తాః. తమేవ అధ్యగన్ ప్రాపుః. 49

శ్లో॥ ఆహుశ్చ తే నళిననాభపదారవిందం
యోగేశ్వరైర్హృది విచింత్యమగాధబోధైః ।
సంసారకూపపతితోత్తరణావలంబం
గేహం జుషామపి మనుస్యుదియాత్సదా నః ॥ 50

టీ:- ఏవం ప్రాప్తా అపి కృష్ణః పునర్గృహవ్యాసంగేన మాపయాత్వితి తచ్చరణస్మరణం ప్రార్థయంతే - ఆహురితి. హే నళిననాభ తే పదారవిందం యోగేశ్వరైః హృది విచింత్యం. గేహం జుషాం గృహసేవినామపి సదా ఉదియాత్ ఆవిర్భవేత్. 50

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, ద్వ్యశీతితమోऽధ్యాయః**

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

ఈ విధముగా కృష్ణుడు గోపికలను అధ్యాత్మిక విద్యచేత తెలియదగిన పరమాత్మ స్వరూపమును బోధించుట వలన, వారు దానిని ఆచరించుట అనగా శిక్షణను అభ్యాసమున ఆచరించి నిరంతరము స్మరించుట వలన జీవబాధలు నశించి పరమాత్మ స్వరూపమును పొందిరి. 49

ఈ విధముగా ఆత్మతత్త్వమును పొందిన పిదపకూడా కృష్ణుడు గోపికలను మరల వారివారి యిండ్లకు లోకయాత్ర నిర్వహణకై వెళ్ళాలని చెప్పినపుడు వారు తమకు ఎల్లప్పుడు అతని పాదస్మరణమే నిలువవలెనని ప్రార్థించిరి- ఓ పద్మనాభుడా! అపారమైన విజ్ఞానము కలిగిన యోగీశ్వరులు మనస్సులో చర్చించుకొని సంసార వ్యామోహ కారణమైన గృహస్థ ధర్మనిర్వహణమనే బరిలో పడిపోయినప్పటికీ నిరంతరము మనస్సును అతనియందుంచి స్మరించుటయే సంసార కూపమునుండి ఉద్ధరింపబడుటకు పరిశిష్ట కారణము అని చెప్పుదురు. కనుక అనవరతము మా మనస్సు నీయందే లగ్నమగు వరము ప్రసాదించుమని కొరుకొనిరిఅని శ్రీశుకుడు చెప్పినాడు. 50

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనుబది రెండవ అధ్యాయముసమాప్తము**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ








## త్ర్యశీతితమోఽధ్యాయః

శ్లో॥ త్ర్యశీతితమ ఏవం చ స్త్రీణాం కృష్ణకథోత్సవే ।
ద్రౌపద్యై కృష్ణభార్యాభిరుక్తా స్వ స్వ కరగ్రహాః ॥

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ తతోఽను గృహ్య భగవాన్ గోపీనాం సగురుర్గతిః ।
యుధిష్ఠిర మథాపృచ్ఛత్సర్వాంశ్చ సుహృదోఽవ్యయమ్ ॥ 1

టీ:- తత ఇతి. అవ్యయంకుశలం. 1

శ్లో॥ త ఏవం లోకనాథేన పరిపృష్టాస్సు సత్కృతాః ।
ప్రత్యూచుర్హృష్టమనసస్తత్పాదేక్షాహతాం హసః ॥ 2

టీ:- త ఇతి.తత్పాదేక్షయా హతం అంహో యేషాం తే. 2

శ్లో॥ కుతోశివం త్వ చరణాంబుజాసవం
మహన్మనస్తో ముఖనిస్సృతం క్వచిత్ ।
పిబంతి యే కర్ణపుటైరలం ప్రభో
దేహం భృతాం దేహకృదస్మృతిచ్ఛిదమ్ ॥ 3

## 83వ అధ్యాయము

ఎనుబది మూడవ అధ్యాయమున స్త్రీలు కృష్ణుని కథలు చెప్పుకొనుచుండగా ద్రౌపదితో శ్రీకృష్ణుని భార్యలు తమను ఆయన ఏ విధముగా పెండ్లాడినాడో చెప్పుకొనుట వివరింపబడును.

### శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు

పిమ్మట జగద్గురుడైన భగవంతుడు కృష్ణుడు గోపికలను వీడ్కొలిపి స్నేహభావముతో ధర్మరాజును సమస్తమైన కుశలవార్తలను అడిగినాడు. 1

జగన్నాథుడైన కృష్ణుడు ఈ విధముగా సత్కారపురస్సరముగా కుశలములను అడుగగా ధర్మరాజు పరమానందము చెంది శ్రీకృష్ణుని పాద దర్శనము వల్ల సర్వపాపములనుండి విముక్తుడైనాడు. 2

ఓ దేవా ! మహాత్ముల మనస్సులందున్న నీ పాదారవింద మకరందము వారినోటి నుండి జాలువారగా దానిని ఏ కొంచెమైనను చెవులనే దొన్నెలతో త్రాగిన (మహాత్ములు వర్ణించిన పరమాత్మ లీలలను విన్న) మానవులకు అజ్ఞానముతో శరీరము ద్వారా (ఇంద్రియముల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.





ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- కుతఇతి. మహతాం మనస్తః మనసస్సకాశాత్. ముఖద్వారతో నిస్సృతం క్వచిత్కదాచిత్ దేహభృతాందేహధారిణాం దేహకృచ్ఛా సావస్సృతిశ్చ అవిద్యా.తాంఛినత్తీతి తథా తం. దేహకృదీశ్వరః. తద్విషయాజ్ఞానచ్ఛిదంవా. 3

శ్లో॥ హిత్వాత్మధామ విధుతాత్మకృతత్ర్యవస్థ
మానంద సంప్లవ మఖండ మకుంఠబోధమ్ ।
కాలోప సృష్ట నిగమావన ఆత్తయోగ
మాయాకృతిం పరమహంసగతిం నతాస్స్మః ॥ 4

టీ:- హిత్వేతి.హిత్వేతి పదద్వయం త్వా త్వాం. హి ఏవార్థేత్వామేవ నతాస్స్మ ఇత్యర్థః. కథంభూతం ఆత్మధామ్నా స్వరూపప్రకాశేన విధుతాః నిరస్తాః ఆత్మకృతాః బుద్ధినిమిత్తాః తిస్రః అవస్థాః యస్మిన్ తం. అతఏవ ఆనందసంప్లవం సర్వానందకదంబరూపం. అఖండం అపరిచ్ఛిన్నం. యతః న కుంఠః అకుంఠః బోధః చిచ్ఛక్తిర్యస్యతం. నన్వేవం రూపతా శ్రీకృష్ణస్య కుతః. అస్మదాదివద్దేహప్రతీతేరత ఆహుః- కాలోపసృష్టేతి. కాలేన ఉపసృష్టా విప్లుతాశ్చ తే నిగమాశ్చ తేషాం అవనే రక్షణార్థం. ఆత్తాఉపాత్తా యోగమాయయా ఆకృతిః నరాకారమూర్తిర్యేన తం. పరమహంసానాం గతిం త్వాం అతస్త్వైవం రూపత్వాదస్మాకం చ ద్వారా) చేసిన కర్మలన్నియు పటాపంచలగును. ఇక శుభములు కలుగుటకు కొదువ ఏమున్నది. 3

హిత్వా అనుటలో త్వా-నిన్ను, హి-అవధారణ అనే రెండు పదములున్నవి. అనగా నిన్నే స్మరించుచున్నానని అర్థము. నీ స్వరూప ప్రకాశముచేత వ్యక్తి బుద్ధి కారణముగా - జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అనే మూడవస్థలందు చేసిన కర్మలను నాశనము చేసినందు వలన సర్వానందములకు మూలకందమై, అవిచ్ఛిన్నమై, అఖండమైన జ్ఞాన స్వరూపమే శ్రీకృష్ణుడు అయితే ఈ విధమైన పరమాత్మకు సాధారణ మానవుల వలె శరీర ధారణ ఎందుకనే విషయమై చెప్పుచున్నాడు - కాలప్రభావముచేత జారిపోయిన వేదములను ఉద్ధరించుటకై యోగమాయచేత మానవ రూపమును పొందిన పరతత్త్వమే కృష్ణుడు యోగీశ్వరులకు గమ్యమైన నీవు ఈ విధమైన భౌతికరూపముతో సాక్షాత్కరించి మమ్ము గ్రహించితివి. నీ మాయవలన ఈ జగత్తంతయూ విపరీతమైనదే అనగా వాస్తవసత్తాలేనిదే అట్టి నీకు నమస్కారము లేక ఆత్మధామా అనుటలో ఆత్మ-శరీరము, ధామ-గృహము ఈ రెండింటిని విడిచిపెట్టి నీకే నమస్కరింతునని అర్థము. 4

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

త్వన్మాయయా ఏతత్సర్వవైపరీత్యాత్ త్వామేవ నతాస్ము ఇతి. యద్వా. త్వామితి ప్రకరణాత్ జ్ఞాతవ్యం. త్వాం నతాస్ముః.కిం కృత్వా హిత్వా. కిం ఆత్మధామ ఆత్మశరీరం ధామ గృహం తచ్చ తచ్చ దేహ గేహసంగం పరిత్యజ్యేత్యర్థః. సమానమన్యత్. 4

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇత్యుత్తమశ్లోక శిఖామణిం జనే
ష్వభిష్టువత్స్వంధకకౌరవస్త్రియః ।
సమేత్య గోవింద కథామిథో గృణం
స్త్రిలోక గీతాశ్శృణు వర్ణయామి తే ॥ 5

టీ:- ఇతీతి. త్రిషు లోకేషు గీతాః. 5

### ద్రౌపది ఉవాచ

శ్లో॥ హే వైదర్భ్యచ్యుతే భద్రే హే జాంబవతి కౌసలే ।
హే సత్యభామే కాళింది శైబ్యేరోహిణి లక్ష్మణే ॥ 6

టీ:- హేవైదర్భీతి. హే కౌసలే సత్యే శైబ్యే మిత్రవిందే రోహిణీనామ కాచిత్పట్టమహిషీతుల్యా. 6

### శ్రీ శుక మహర్షి ఇట్లు చెప్పినాడు

ఈ విధముగా ఉత్తమోత్తమ కీర్తిమంతుడై, జనులకు మిక్కిలి ఇష్టుడైన శ్రీకృష్ణుని పొంది శ్రేష్ఠులైన కౌరవయాదవ స్త్రీలు పరస్పరము చెప్పుకొనుచున్న శ్రీకృష్ణునికి సంబంధించిన ముల్లోకములందు పవిత్ర గాథలను వినుమన్నాడు. 5

### ద్రౌపది ఇట్లు చెప్పినది

కృష్ణుని వదలని ఓ రుక్మిణీ, భద్రా, జాంబవతీ, కౌసలా (నాగ్నజితి), సత్యభామ, కాళింది, మిత్రవిందా(శైబ్యా), రోహిణీ(రోహిణి అనే పేరుగల పట్టమహిషి సమానురాలైన ఒకానొక స్త్రీ), లక్ష్మణా, ఓ కృష్ణపత్నులారా! భగవంతుడైన ఈకృష్ణుడు తన మాయతో లోకయాత్రను నిర్వహించుచు మిమ్మందరను ఏ విధముగా వివాహమాడినాడో నాకు తెలుపుడని ద్రౌపది వారిని అడిగినది. (6-7)

శ్లో॥ హే కృష్ణపత్న్య ఏతన్మే బ్రూత వో భగవానయమ్ ।
ఉపయే మే యథా లోకమనుకుర్వన్ స్వమాయయా ॥ 7

టీ:- హేకృష్ణపత్న్య ఇతి. అన్యాః హే కృష్ణపత్న్యః. 7

### రుక్మిణ్యువాచ

శ్లో॥ చైద్యాయ మార్పయితుముద్యత కార్ముకేషు
రాజస్వజేయ భటశేఖరి తాంఘ్రిరేణుః ।
నిన్యే మృగేంద్ర ఇవ భాగమజోఽపి యుద్ధా
త్తచ్ఛ్రీనికేత చరణోఽస్తు మమార్చనాయ ॥ 8

టీ:- చైద్యాయేతి. మా మాం అర్పయితుం సంపాదయితుం. రాజసు జరాసంధాదిషు. ఉద్యతకార్ముకేషు సత్సు. అజేయాః యే భటాః తేషాం శేఖరితాః. మకుటవత్కృతాః అంఘ్రిరేణవో యేన. తేషాం మూర్ధ్నిపదం దధదిత్యర్థః. తస్య శ్రీనికేతస్య చరణః మమ అర్చనాయాస్తు. 8

### రుక్మిణి ఇట్లు చెప్పినది

శిశుపాలునికి నన్ను వివాహబంధముతో సమర్పించుటకై జరాసంధాది రాజులందరు ధనుర్ధరులైరాగా అజేయులైన వారి సైనికుల తలలందు తన పాదధూళిని కిరీటముగా చేసిన కృష్ణుడు (వారందరినీ యుద్ధరంగమున అణగద్రొక్కినాడని భావము) నన్ను మృగరాజు మేకను పట్టినట్లుగా యుద్ధరంగమునుండి తాను పరమాత్ముడైనను కొనివచ్చినాడు. ఆ శ్రీనివాసుని పాదమే నాకు నిత్యము పూజనీయమని రుక్మిణి చెప్పినది. 8






**సత్యభామోవాచ**

శ్లో॥ యోమే సనాభివధతప్త హృదా తతేన
లిప్తాభిశాపమపమార్ష్టుముపాజహార ।
జిత్వర్క్షరాజమథ రత్నమదాత్స తేన
భీతః పితాఽదిశత మాం ప్రభవేఽపి దత్తామ్ ॥ 9

టీ:- య ఇతి. సనాభేః భ్రాతుః వధేన సింహకృతేన తప్తం హృత్ యస్య తేన. మేతతేన తాతేన. లిప్తం. అభిశాపం దుర్యశః అపమార్ష్టుం పరిహర్తుం ఋక్షరాజం జిత్వా రత్నం స్యమంతకం. ఉపాజహార ఆనీతవాన్. అథఅనంతరం. మత్పిత్రేరత్నమదాత్. తేన స్వాపరాధేన భీతఃసమేపితా ప్రభవే శ్రీకృష్ణాయ మామదిశత అదిశత్ దదావిత్యర్థః. దత్తాం అక్రూరాదిభ్యః ప్రతిశ్రుతామపీత్యర్థః. 9

**సత్యభామ ఇట్లు చెప్పినది**

సోదరుడన ప్రసేనజిత్తు వధవల్ల స్యమంతకమణిని కోల్పోయి మానసిక వ్యధకు లోనైన మా తండ్రి సత్రాజిత్తు వలన పొందిన స్యమంతకాపహరణ రూపమైన అపకీర్తిని పొగొట్టుకొనుటకై కృష్ణుడు భల్లూకరాజైన జాంబవంతుని జయించి, అతని నుండి ఆ మణిని తెచ్చి మా తండ్రికిచ్చినాడు. మా తండ్రి శ్రీకృష్ణునికి చేసిన అపకారమునకు భయము చెంది అక్రూరాదులకు ఇవ్వదలచుకున్న నన్ను ప్రభువైన శ్రీకృష్ణునికే సమర్పించినాడని సత్యభామ చెప్పినది. 9

**జాంబవత్యువాచ**

శ్లో॥ ప్రాజ్ఞాయ దేహకృదముం నిజనాథ దైవం
సీతాపతిం త్రినవహాన్యమునాభ్యయుధ్యత్ ।
జ్ఞాత్వా పరీక్షిత ముపాహరదర్హణం మాం
పాదౌ ప్రగృహ్య మణినాహ మముష్య దాసీ ॥ 10

**జాంబవతి ఇట్లు చెప్పినది**

మా తండ్రిగారైన జాంబవంతుడు స్యమంతకమణికై ఇరువది ఏడురోజులు యుద్ధముచేసి చక్కగా పరీక్షించి ఈ కృష్ణుడే త్రేతాయుగము నాటితనస్వామి, ఈశ్వరుడు, దేవుడు అయిన సీతాపతి రామచంద్రుడని గ్రహించి, ఆయన పాదములపైబడి ప్రార్థించి, పూజించి మణితోకూడా ఆ మహానుభావునకు నన్ను సమర్పించినాడు. ఈ విధముగానేనతనికి దాసినైతినని జాంబవతి చెప్పినది. 10




టీ:- ప్రాజ్ఞాయేతి. దేహకృత్ పితా. అముం శ్రీకృష్ణం. నిజనాథం స్వామినం దైవమీశ్వరం సీతాపతిం ప్రాజ్ఞాయ అవిజ్ఞాయ. త్రినవహాని హ్రస్వం ఛందోనురోధేన. సప్తవిశంతిదినాన్యమునా అభ్యయుధ్యత. పరీక్షితం సంజాతా పరీక్షా యస్యసః పరీక్షితః. తంసాక్షాత్సీతాపతి రేవాసావితి జ్ఞాత్వా. పాదౌ ప్రగృహ్య మణినా సహ మాం అర్హణ ముపాహరత్ అర్హణతయా సమర్పితవాన్. అహో తర్హి త్వమతి శ్రేష్ఠాసి. నేత్యాహ - అముష్యాహం దాసీతి. 10

**కాళింద్యువాచ**

శ్లో॥ తపశ్చరంతీమాజ్ఞాయ స్వపాదస్పర్శనేచ్ఛయా ।
సఖ్యోపేత్యా గ్రహీత్పాణిం సాహంతద్గృహమార్జనీ ॥ 11

టీ:- తప ఇతి. సఖ్యా అర్జునేన. తస్య గృహమార్జనీ గృహే సంమార్జనకర్త్రీ. 11

**భద్రోవాచ**

శ్లో॥ యోమాం స్వయంవర ఉపేత్యవిజిత్య భూపా
న్నిన్యేశ్వయూథగమి వాత్మబలిం ద్విపారిః ।
భ్రాతౄంశ్చమేఽప కురుతస్స్వపురం శ్రియోక
స్తస్యాస్తుమేఽనుభవమంఘ్ర్యవనే జనిత్వమ్ ॥ 12

**కాళింది ఇట్లు చెప్పినది**

విష్ణువును భర్తగాగోరి నేను తపస్సు చేయుచుండగా మిత్రుడైన అర్జునునితోగూడి యమునానదికి వచ్చిన శ్రీకృష్ణస్వామి తనపాద స్పర్శతో నన్ననుగ్రహించి పెండ్లియాడగా వచ్చిన నేను ఆయన ఇల్లు ఊడ్చే సేవకురాలినని కాళింది చెప్పినది. 11

**భద్ర ఇట్లు చెప్పినది**

కుక్కల సముదాయము మధ్యన ఉన్న తన ఆహారమును వాటిని చీల్చి చెండాడి దక్కించుకున్న సింహమువలె నన్నాసించి స్వయంవరమునకు వచ్చిన రాజులనుజయించి, నాసోదరులను ప్రక్కకు త్రోసి నన్ను వివాహమాడి శ్రీనివాసుడైన కృష్ణుడు ద్వారకా

టీ:- య ఇతి. శునాం, యూధగతం స్వబలిం ద్విపారిః సింహ ఇవేతి. మే భ్రాతౄంశ్చ అపకురుతః అపకారం కుర్వతః విజిత్య. శ్రియోకః శ్రీనివాసః. తస్య అంఘ్ర్యవనేజనిత్వం చరణక్షాళనకర్తృత్వం అనుభవం ప్రతిజన్మ మేఅస్తు. 12

నగరమునకు తెచ్చినాడు. ఆయన పాదపద్మాలను కడుగునట్టి అనుభవము నాకు జన్మజన్మలకు లభించిన చాలునని భద్ర చెప్పినది. 12

**సత్యోవాచ (నాగ్నజితి)**

శ్లో॥ సప్తోక్షణోఽతి బలవీర్య సుతీక్ష్ణ శృంగాన్
పిత్రాకృతాన్ క్షితిపవీర్య పరీక్షణాయ ।
తాన్వీర్య దుర్మదహనస్తరసా నిగృహ్య
క్రీడన్ బబంధ హ యథా శిశవోఽజతోకాన్ ॥ 13

టీ:- సప్తేతి. సప్తఉక్షణః వృషభాన్ బలం చ వీర్యం ప్రభావశ్చ. తీక్ష్ణశృంగాణి చ అతిశయితాని యేషాం తాన్ మేపిత్రా కృతాన్ సంపాదితాన్. బలీయసే మాం దాతుం. క్షితిపానాం వీర్యస్య బలస్య. పరీక్షణాయ తాన్ ప్రసిద్ధాన్ వీరాణాం దుర్మదంఘ్నంతి యే తాన్. తరసా శీఘ్రమేవ. నిగృహ్య దమయిత్వా. క్రీడన్ అనాయాసేనైవ బబంధ. అజతోకాన్ అజాపత్యాని. 13

**సత్య(నాగ్నజితి) ఇట్లు చెప్పినది**

మాతండ్రిగారైన కోసలరాజు నగ్నజిత్తు మిక్కిలి బలము, సాహసములందు అతిశయించి వాడికొమ్ములుగలిగిన ఏడుకోడె దూడలను సంపాదించినాడు. వానిని జయించిన వీరునికే తాను తన కుమార్తె అయిన నాతో వివాహము చేయుదునని స్వయంవరమున చాటినాడు. మదముతో పొగరెక్కి రంకెలు వేయునట్టి ఆ ఏడు ఆబోతులను శ్రీకృష్ణుడు అతిత్వరగా అనాయాసముగా-బాలురు మేకపిల్లతో చెలగాటమాడు విధముగా కట్టివేసినాడు. 13

శ్లో॥ య ఇత్థం వీర్యశుల్కాం మాం దాసీభిశ్చతురంగిణీమ్ ।
పథి నిర్జిత్య రాజన్యాన్నిన్యే తద్దాస్యమస్తు మే ॥ 14

టీ:- యఇతి. వీర్యమేవ శుల్కం దేయం యస్యాస్తాం. దాసీభిస్సహ-చతురంగిణీం గజాశ్వాదిసేనాయుక్తాం మాంపురీం.నిన్యే. 14

ఈ విధముగా కృష్ణుడు పరాక్రమమును ఓలిగా ఇచ్చి నన్ను కొనితెచ్చుచుండగా చతురంగబలములతో ఎదిరించిన రాజసముదాయమును జయించి దాసీసహితముగా ద్వారకకు తెచ్చినాడు. ఈ పరమాత్ముని దాస్యమునే నేను కోరుకొనునది అని నాగ్నజితి (సత్య, కౌసల) చెప్పినది. 14

### మిత్రవిందోవాచ

శ్లో॥ పితామే మాతులేయాయ స్వయమాహుయ దత్తవాన్ ।
కృష్ణే కృష్ణాయ తచ్చిత్తామక్షౌహిణ్యా సఖీజనైః ॥ 15

టీ:- పితేతి. కృష్ణే హే ద్రౌపది తస్మిన్నేవ చిత్తం యస్యాస్తాం మాం అక్షౌహిణ్యాసేవయా సహ సఖీజనైశ్చ సహ. 15

### మిత్రవింద ఇట్లు చెప్పినది

ఓ ద్రౌపదీ! నాకు మేనమామ కొడుకైన కృష్ణునియందే నా మనస్సు లగ్నమైనందువల్ల స్వయముగా ఆహ్వానించి నాతండ్రిగారే అక్షౌహిణ్యాది సఖీజనులతో నన్ను కృష్ణునికిచ్చి వివాహము చేసినాడు. 15

శ్లో॥ అస్యమే పాదసంస్పర్శో భవేజ్జన్మని జన్మని ।
కర్మభిర్భ్రామ్యమాణాయా యేన తచ్ఛ్రేయ ఆత్మనః ॥ 16

టీ:- అస్యేతి. యేన పాదసంస్పర్శేన ఆత్మనఃమేతత్ కైవల్యాఖ్యం శ్రేయః భవేత్. యద్వా. యేన కారణేన ఆత్మనో జీవస్య తత్ శ్రేయః స ఏవ పురుషార్థ ఇతి. 16

ఈ పరమాత్ముని పాదస్పర్శనే నేను జన్మజన్మలందు కోరుకొందును. జన్మమరణ చక్రమునందు తిరుగుచు ఈ ప్రాపంచిక వ్యామోహమున పడిన నాకు అదే సర్వశ్రేయోదాయకమైనది. ఈయన పాదస్పర్శనే నాకు కైవల్యమనే శుభమును కలిగించును. లేక జీవునికి (ఆత్మకు) ఆయన కారణము వల్లనే శ్రేయస్సు కలుగును. అదే సర్వోత్కృష్టమైన పురుషార్థము అని మిత్రవింద చెప్పెను. 16

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

**లక్ష్మణోవాచ**

శ్లో॥ మమాపి రాజ్ఞ్యచ్యుత జన్మకర్మచ
శ్రుత్వా ముహుర్నారదగీతమాసీత్ ।
చిత్తం ముకుందేకిల పద్మహస్తయా
వృత స్సుసంమృశ్య విహాయ లోకపాన్ ॥ 17

టీ:- మమేతి. రాజ్ఞి హే ద్రౌపది యథా మిత్రవిందాయాః. తథా మమాపి చిత్తం ముకుందవిషయమాసీత్. సుసంమృశ్య సుష్ఠు విచార్య పద్మహస్తయా శ్రియా.వృతః కిల. అతః మమాపి చిత్తం శ్రీముకుందే ఆసీదితి. 17

శ్లో॥ జ్ఞాత్వా మమ మతం సాధ్వి పితా దుహితృవత్సలః ।
బృహత్సేన ఇతిఖ్యాత స్తత్రోపాయమచీకరత్ ॥ 18

టీ:- జ్ఞాత్వేతి.తత్ర శ్రీకృష్ణ ప్రాప్తౌ అచీకరత్ కారయామాస. 18

**లక్ష్మణ ఇట్లు చెప్పినది**

ఓ మహారాణీ ! ద్రౌపదీ ! ఈ మిత్రవిందవలెనే శ్రీకృష్ణుని జన్మకర్మల విశేషణములను మాటిమాటికి దేవఋషి నారదుడు గానము చేయగా విని నా మనస్సు ఆ పరమాత్మయందు లగ్నమైనది. లక్ష్మీరూప అయిన రుక్మిణి చక్కగా ఆ మహనీయుని గుణగణములను విచారించి లోకపాలురనుకూడా తిరస్కరించి శ్రీకృష్ణుని వరించినది కదా. అట్లే నామనస్సు ముకుందునియందే నిలిచినది. 17

ఓ పతివ్రతా! బిడ్డపై ప్రేమగల మాతండ్రి బృహత్సేనుడు నాకు శ్రీకృష్ణునిపట్ల అనురాగమున్న విషయమును గ్రహించి శ్రీకృష్ణునికే నేను దక్కునట్లుగా ఒక ఉపాయమును ఎన్నుకున్నాడు. 18

శ్లో॥ యథా స్వయంవరే రాజ్ఞి మత్స్యః పార్థేప్సయా కృతః ।
అయంహి బహిరాచ్ఛన్నో దృశ్యతే సజలే పరమ్ ॥ 19

టీ:- యథేతి. యథా రాజ్ఞి తవ స్వయంవరే పార్థస్య ఈప్సయా ఆప్తమిచ్ఛయా కృతః. మత్స్యంకారితవాన్. పాఠాంతరే పార్థస్య ఇషుణా అపాకృతః. తర్హి మమపి అర్జున ఏవ కిం నావిధ్యత్ తత్రాహ- అయంత్వితి. నమత్స్యో బహిరేవాచ్ఛన్నః నాంతః అతః స్తంభసంలగ్నయా ఊర్ధ్వ దృష్ట్యా దృశ్యతే అయం తు న తథా.కింతు స్తంభమూలే నిహితకలశజలే కేవలం దృశ్యతే అతో దృష్టేరధస్తాదుపరి చ లక్ష్యమితి. అతః శ్రీకృష్ణ వ్యతిరేకేణ న కస్యాపి భేద్య ఇతి భావః. (19-20)

ఓ మహారాణీ ! మీ తండ్రిగారైన ద్రుపదరాజు స్వయంవరము నందు అర్జునునికి మాత్రమే నిన్నివ్వవలెనని కోరికతో మత్స్యయంత్ర ఛేదనమును స్వయంవర పరీక్షగా ఏర్పరచినాడు. అది అర్జుని బాణముచేత ఛేదింపబడినది. అట్లే మాతండ్రి కూడా స్వయంవర పరీక్షకు మత్స్యయంత్రమునే సిద్ధపరచినాడు. అయితే దీనిని కూడా అర్జునుడు ఛేదింపలేడా అనే విషయమై చెప్పుచున్నది - నీ స్వయంవర మత్స్యయంత్రము కంటే నా తండ్రి ఏర్పరచిన మత్స్యయంత్రము వేరైనది. మీ తండ్రి ఏర్పరచిన మత్స్యము బయటకు కనపడునది. అది లోపల కప్పబడలేదు. కనుక ఎత్తున స్తంభమునకు కట్టిన ఆమత్స్యము తలపైకెత్తి చూచినచో కనపడునది. పైకి చూచుచు అర్జునుడు దానిని కొట్టినాడు. ఇక్కడ దృష్టి, లక్ష్యము ఒకే వైపున ఉన్నవి. ఇది స్థిర లక్ష్యము, కానీ మాతండ్రిగారు ఏర్పరచినది అట్టిదికాదు. స్తంభము పైభాగమున కట్టిన ఆ మత్స్యము స్తంభము మూలమున(క్రిందిభాగమున)ఏర్పరచినకలశమున ప్రతిబింబ రూపమున మాత్రమే కనపడును. క్రింద కలశమునందున్న ప్రతిబింబమును చూచుచు, స్తంభము పై భాగమున ఉన్న మత్స్యమును బాణపుగురి (లక్ష్యము) తో కొట్టవలెను. కనుక దీనికి కింద దృష్టి పైన లక్ష్యములున్నవి. పైగా జలము నిరంతరము కదులుచునే ఉండును. కావున ఇది చాల కష్టము. అదియే ఈ రెంటికిని భేదము. అందువల్ల దీనిని శ్రీకృష్ణుడు తప్ప వేరెవ్వరును ఛేదించలేడని భావము. 19

శ్లో॥ శ్రుత్వైతత్సర్వతో భూపా ఉపేయుర్మత్పితుః పురమ్ ।
సర్వాస్త్ర శస్త్రతత్త్వజ్ఞాస్సోపాధ్యాయాస్సహస్రశః ॥ 20

మాతండ్రి నా వివాహమునకై మత్స్యయంత్రమును ఏర్పరచి నాడని తెలిసి సర్వశస్త్రాస్త్రకోవిదులైన రాజులు తమతమ ఉపాధ్యాయులను వెంటనిడుకొని నలుమూలలనుండి మాతండ్రి నగరమైన అవంతికి వచ్చినారు. 20

శ్లో॥ పిత్రా సంపూజితాస్సర్వేయథా వీర్యం యథావయః ।
ఆదదుస్సశరం చాపం వేద్ధుం పరిషది మద్ధియః ॥ 21

టీ:- పిత్రేతి. మత్స్యం వేద్ధుం పరిషది సంసది. మద్ధియః మయ్యేవ ధీర్యేషాం త ఇతి. అన్య చిత్తాః. వేద్ధుం న శక్తా ఇతి భావః . 21

శ్లో॥ ఆదాయ వ్యసృజన్కే చిత్సజ్జీ కర్తుమనీశ్వరాః ।
ఆకోటిజ్యాం సమాకృష్య పేతురేకేఽ మునా హతాః ॥ 22

టీ:- తదేవాహ - ఆదాయేతి. అమునా చాపేన. 22

స్వయంవరాగతులైన వారందరిని వారివారి వయస్సు, పరాక్రమములను బట్టి మాతండ్రి చక్కగా పూజించినాడు. స్వయంవరములో మత్స్యయంత్రమును ఛేదించి నన్ను పొందవలెనని కోరిన వారందరు సభలో యంత్రమునందలి మత్స్యమును కొట్టుటకై ధనుర్బాణములు స్వీకరించికూడా కొందరు (అది తమకు అసాధ్యమని) విరమించిరి. కొందరికి వింటికి నారిని బంధించు శక్తిలేక పోయినది. మరికొందరు వింటిని నారితో సిద్ధము చేసినను విల్లును ఎక్కుపెట్ట లేకపోయిరి. (21-22)

శ్లో॥ సజ్జం ధృత్వా పరేవీరా మాగధావంతి ఛేదిపాః ।
భీమో దుర్యోధనః కర్ణో మావిదంస్తదవస్థితిమ్ ॥ 23

టీ:- సజ్జమితి. నావిదన్ తదవస్థితిమితి. మాగధాదీనాం క్రియాశక్తిరేవ. న తు లక్ష్యాభిజ్ఞతేతి భావః. 23

నారితో సిద్ధమైన వింటిని ధరించి మగధ, అవంతి, ఛేది దేశముల రాజులు, భీముడు, దుర్యోధనుడు, కర్ణుడు మొదలైనవారు ఆ మత్స్యము ఎక్కడున్నదో తెలియలేకపోయిరి. మాగదాదులకు క్రియా శక్తి మాత్రమే ఉన్నది కానీ లక్ష్యము తెలియగల తెలివిలేకపోయినదని భావము. 23

శ్లో॥ మత్స్యాభాసం జలే వీక్ష్య జ్ఞాత్వా చ తదవస్థితిమ్ ।
పార్థోయత్తోఽసృజద్బాణం నాచ్ఛినత్పస్పృశే పరమ్ ॥ 24

అర్జునుడు మాత్రము కలశమునందలి చేపనీడను చూచి అది స్తంభముపై ఎక్కడున్నదో గ్రహించి ప్రయత్నముతో బాణమును విడిచినాడు. అతని బాణము చేపను స్పర్శించినది కానీ తెగవేయలేదు. లక్ష్యస్పర్శ జ్ఞానము అర్జునున కున్నప్పటికి దానిని ఛేదించు బలము లేకపోయెను. 24

శ్లో॥ రాజన్యేషు నివృత్తేషు భగ్నమానేషు మానిషు ।
భగవాన్ ధనురాదాయ సజ్జం కృత్వాథ లీలయా ॥ 25

టీ:- మత్స్యేతి. యత్తో యత్నవాన్. అస్సృజత్ ముమోచ. సబాణో మత్స్యంనాచ్ఛినత్. పరం కేవలం పస్పర్శ జ్ఞానవానప్యర్జునో బలేనాపూర్ణ ఇత్యర్థః. (24-25)

శ్లో॥ తస్మిన్సంధాయ విశిఖం మత్స్య వీక్ష్య సకృజ్జలే ।
ఛిత్వేషుణా పాతయత్తం సూర్యే చాభిజితి స్థితే ॥ 26

వీరులమని విర్రవీగు రాజులందరును మత్స్యయంత్రమును ఛేదించలేక అవమానముతో వెనుదిరిగిపోగా భగవంతుడైన కృష్ణుడు విల్లును తోసుకొని అవలీలగా నారిని సంధించి ఒక్కసారి నీటిలోని చేప ప్రతిబింబమును చూచి స్తంభమునందు లక్ష్యమైన మత్స్యమును సూర్యుడు సర్వార్థసాధకమైన అభిజిల్లగ్నమున ఉండగా బాణముతో కొట్టి పడవేసినాడు. (25-26)

శ్లో॥ దివి దుందుభయో నేదుర్జయశబ్దః పునర్భువి ।
దేవాశ్చకుసుమాసారం ముముచుర్హర్షవిహ్వలాః ॥ 27

టీ:- తస్మిన్నితి. అభిజితి సర్వార్థసాధకే ముహూర్తే.(26-27)

ఆకాశమునుండి దేవదుందుభులు మోగినవి. జయజయశబ్ద ధ్వానముతో దేవతలు భూమిపై పుష్ప వర్షమును కురిపించుచు ఆనంద పారవశ్యమును పొందిరి. 27

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ తద్రంగ మావిశమహం కలనూపురాభ్యాం
పద్భ్యాం ప్రగృహ్య కనకోజ్జ్వల రత్నమాలామ్ ।
నూత్నేనివీయ పరిధాయ చ కౌశికాగ్ర్యే
సవ్రీడ హాసవదనా కబరీధృతస్రక్ ॥ 28

టీ:- భగవత్ప్రాప్తిహర్ష నిర్భరేణాత్మానమేవాను వర్ణయంత్యాహ-ద్వాభ్యాం. తదతి. తత్తదా. అహం కలౌ కలస్వనౌ నూపురౌ యయోస్తాభ్యాం పద్భ్యాం. రంగం ప్రావిశం. కనకేన ఉజ్జ్వలాం రత్నమాలాం నివీయ ప్రావృత్య.పరిధాయ చ నీవీబంధనేన. కౌశికాగ్ర్యే ఉత్తమకౌశేయవస్త్రే సవ్రీడో హాసో యస్మిన్ తద్వదనం యస్యాస్సా కబర్యాం ధృతాః స్రజో యయా సా. 28

శ్లో॥ ఉన్నీయ వక్త్రమురుకుంతల కుండలత్వి
డ్గండస్థలం శిశిరహాస కటాక్ష మోక్షైః ।
రాజ్ఞో నిరీక్ష్య పరితశ్శనకైర్మురారే
రంసేఽను రక్త హృదయా నిదధేస్మమాలమ్ ॥ 29

భగవంతుని సన్నిధానము నాకు కలిగినదికదా అని పరిపూర్ణమైన ఆనందముతో లక్ష్మణ తనను తానే రెండు శ్లోకములందు వర్ణించుకొనుచు ఇట్లు చెప్పినది. అప్పుడు నేను మధురముగా మ్రోగునట్టి అందెల పాదాలతో స్వయంవర వేదికపైకి ప్రవేశించితిని. రత్నములతో ప్రకాశించు బంగారు హారములను స్వీకరించి, కొత్త పట్టు వస్త్రములను ధరించి, సిగ్గుతో చిరునవ్వు ముఖముతో, పూలదండలతో కూడిన సిగముడితో, ముఖమున అడ్డుపడకుండ ముంగురులను పైకి ఎత్తిపట్టి, కుండలముల కాంతితో మెరిసి పోవు చెక్కిళ్ళతో, సంతాపమును పోగొట్టునట్టి కడగంటి చూపుల విలాసముతో చక్కగా పులకరించి మెల్లగా శ్రీకృష్ణుని మెడలో అపరిమితానందముతో మాలను వేసితిని. (28-29)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తావన్మృదంగ పటహాశ్శంఖభేర్యానకాదయః ।
నినేదుర్నటనర్తక్యో ననృతుర్గాయకా జగుః ॥ 30

టీ:- ఉన్నీయేతి. ఉరవః కుంతలాః యస్మిన్ కుండలయోస్త్విషో యయోస్తే గండస్థలే యస్మిన్. తదేవ తచ్చ. శిశిరః సంతాపహరోహాసో యేషు తైః. కటాక్షమోక్షైః అపాంగవీక్షణవిలాసైః. అనురక్తం హృదయం యస్యాస్సా అహం. (29-30)

అప్పుడు మద్దెలలు, తప్పెటలు, శంఖము, భేరులు మొదలైన వాద్యములు ప్రయోగినవి. నర్తకులు నాట్యము చేసిరి. గాయకులు గీతములు ఆలపించిరి. 30

శ్లో॥ ఏవంవృతే భగవతి మయేశే నృపయూథపాః ।
నసేహిరే యాజ్ఞసేని స్పర్ధంతో హృచ్ఛయాతురాః ॥ 31

టీ:- ఏవమితి. హే యాజ్ఞసేని ద్రౌపది. ఈశే శ్రీకృష్ణే. మయా వృతే సతి. స్పర్ధంతః స్పర్ధమానాః. నన్వేవం పరమైశ్వర్యం దృష్టవతాం కుతస్స్పర్ధావసరస్తత్రాహ - హృచ్ఛయాతురా ఇతి. హృచ్ఛయేన కామేన అతురాః పరవశాః కామవిజృభితాః స్పర్ధంత ఇతి భావః. 31

ఓ ద్రౌపదీ! ఈ విధముగా నేను పరమాత్మ అయిన శ్రీకృష్ణుని భర్తగా వరించిన వెంటనే రాజులు (సైన్యాధిపతులు) మనస్సులో ఇంతటి ఐశ్వర్యమెట్లు కలిగినదని సంకట పడుచు కామపీడితులై స్పర్ధతో సహించలేకపోయిరి. 31

శ్లో॥ మాం తావద్రథమారోప్య హయరత్న చతుష్టయమ్ ।
శార్‌ఙ్గముద్యమ్య సన్నద్ధస్తస్థావాజౌ చతుర్భుజః ॥ 32

టీ:- మామితి. హయరత్నానాం చతుష్టయం యస్మిన్ తం రథం చతుర్భుజః ద్వాభ్యాం భుజాభ్యాం మామాలింగ్య ద్వాభ్యాం ధనుర్బాణౌ

అప్పుడు జాతి అశ్వములు పూన్చిన రథముపైకి అధిరోహించి రెండు భుజములతో నన్ను ఆలింగనముతో రథముపైకి ఎక్కించి, రెండు చేతులతో ధనుర్బాణములు గ్రహించి యుద్ధ సన్నాహముతో శ్రీమహావిష్ణువైన శ్రీకృష్ణుడు రథమున నిలిచినాడు. 32

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

గృహీత్వా చతుర్భుజస్తస్థావితి. 32

శ్లో॥ దారుకశ్చోదయామాస కాంచనోపస్కరం రథమ్ ।
మిషతాం భూభుజాం రాజ్ఞి మృగాణాం మృగరాడివ ॥ 33

టీ:- దారుక ఇతి. మృగాణాం మిషతాం మృగరాడివ తథా హరిర్జగామేతి. శేషో జ్ఞాతవ్యః.దారుకస్యైవ వా మృగరాజోపమా. 33

శ్లో॥ తేన్వసజ్జంత రాజన్యా నిషేద్ధుం పథి కేచన ।
సంయత్తా ఉద్ధృతేష్వాసా గ్రామసింహా యథా హరిమ్ ॥ 34

శ్లో॥ తేశార్ఙ్గచ్యుత బాణౌఘైః కృత్తబాహ్వంఘ్రికంధరాః ।
నిపేతుః ప్రధనే కేచిదేకే సంత్యజ్య దుద్రువుః ॥ 35

టీ:- త ఇతి. అన్వసజ్జంత పృష్ఠతస్సక్తాబభూవుః. నిషేద్ధుం ప్రతిబంధం కర్తుం కేచన పురతో గత్వా పథి సంయత్తా బభూవురిత్యర్థః ఉద్ధృతేష్వాసాః ఊర్ధ్వీకృతచాపాః. గ్రామసింహాః శ్వానః హరిం సింహం యథేతి. (34-35)

బంగారముతో అలంకృతమైన రథమును సారథియైన దారుకుడు నడుపగా కృష్ణుడు మృగములను వేటాడుటకై వెళ్ళు సింహమువలె వెళ్ళెను. 33

మార్గమధ్యమున తమ ధనువులు ఎత్తి పట్టుకొని - కుక్కలు మృగరాజును చుట్టుముట్టినట్లు కొందరు రాజులు వెంటపడిరి. మరికొందరు ముందుగా వెళ్ళి అడ్డగించిరి. 34

యుద్ధమున వారిలో కొందరు శ్రీకృష్ణుని శార్ఙ్గధనువు నుండి వెడలిన బాణసముదాయము చేత చేతులు, కాళ్ళు, తలలు తెగిపడిపోయిరి. మరికొందరు యుద్ధరంగమును వీడిపారిపోయిరి. 35

శ్లో॥ తతః పురీం యదుపతిరత్యలంకృతాం
రవిచ్ఛదధ్వజపటచిత్రతోరణామ్ ।
కుశస్థలీం దివి భువి చాపి సంస్తుతాం
సమావిశత్తరణిరివ స్వకేతనమ్ ॥ 36

చక్కగా అలంకృతమై భవనముల పైభాగములందలి కేతన వస్త్రములతో (జండాలు) సూర్యమండలమును కప్పునట్లుగా విలల్లునట్టి ద్వారకానగరమును ఆకాశమున దేవతలు, భూమిపై ప్రజలు స్తుతించుచుండగా సూర్యుడు పడమటి కొండకు చేరినట్లు ప్రవేశించినాము అని లక్ష్మణ చెప్పినది. 36

టీ:- తతఇతి. రవిం ఛాదయంతీతి రవిచ్ఛదాః ధ్వజేషు పటాయస్యాం. విచిత్రాణితోరణాని యస్యాం. సైవ సా చ తాం. కుశస్థలీం ద్వారకా పురీం. యదుపతిః సమావిశత్ స్వకేతనం మండలం అస్తాచలం వా. 36

శ్లో॥ పితామే పూజయామాస సుహృత్సంబంధి బాంధవాన్ ।
మహార్హవాసోలంకార శయ్యాసన పరిచ్ఛదైః ॥ 37

మాతండ్రి స్నేహితులను, సంబంధులను, బంధువులను గొప్ప వస్త్రములు, అలంకారములు, శయ్యలు, ఆసనములు, శాలువలు మొదలైన వానితో పూజించినాడు. 37

టీ:- పితేతి. మహార్హ వాసః ప్రభృతిభిః. సుహృదాదీన్ పూజయామాస. 37

శ్లో॥ దాసీభిస్సర్వ సంపద్భిర్భటేభరథవాజిభిః ।
ఆయుధాని మహార్హాణి దదౌ పూర్ణస్య భక్తితః ॥ 38

సర్వాభరణములతో కూడిన దాసీజనముతో, రథ గజ తురగ పదాతులనెడు చతురంగబలమును, గొప్ప ఆయుధములను భక్తితో సమర్పించినాడు. 38

టీ:- దాసీభిరితి. దాస్యాదిభిస్సహ ఆయుధాని పూర్ణాయాపి దదౌ. 38

శ్లో॥ ఆత్మారామస్య తస్యేమా వయం వై గృహదాసికాః ।
సర్వసంగనివృత్త్యాద్ధా తపసా చ బభూవిమ ॥ 39

టీ:- ఆత్మారామస్యేతి. ఇమాః అష్టౌ వయం సర్వసంగనివృత్త్యాతపసా స్వధర్మేణచ. అద్ధా సాక్షాత్. తస్య గృహదాసికాః బభూవిమ. 39

ఆత్మారాముడైన ఆ మహనీయుడు కృష్ణునికి మేము ఎనిమిది మందిమి అన్ని బంధములను వీడి తపస్సుతో మా భార్యాధర్మ నిర్వహణతో సాక్షాత్తుగా ఆయన ఇంటి దాసీలమైతిమని రుక్మిణ్యాది అష్టభార్యలు ద్రౌపదికి తమ తమ వివాహ వృత్తాంతములను తెలిపినారు. 39

### షోడశ సహస్ర మహిష్య ఊచుః

శ్లో॥ భౌమంనిహత్య సగణంయుధి తేనరుద్ధా
జ్ఞాత్వాథ నః క్షితిజయే జితరాజకన్యాః ।
నిర్ముచ్య సంసృతి విమోక్షమనుస్మరంతీః
పాదాంబుజం పరిణినాయ స ఆప్తకామః ॥ 40

టీ:- భౌమమితి. క్షితిజయే జితానాం రాజ్ఞాం కన్యాఃనః అస్మాన్ తేన రుద్ధాః జ్ఞాత్వా తతో నిర్ముచ్య సంసృతేర్విమోక్షో యస్మాత్తత్. పదాంబుజం అనుస్మరంతి నః పరిణినాయఉవాహ. ఆప్తకామో౾పి యః. 40

### పదహారువేలమంది భార్యలు చెప్పచున్నారు

భూపుత్రుడైన నరకాసురుడు దిగ్విజయముచేసి తాను జయించిన రాజకన్యలను బంధించినాడని తెలిసి శ్రీకృష్ణుడు పరివార సహితముగా నరకుని సంహరించి తానేకోరికలు లేనివాడైనప్పటికి మాకు సంసార వ్యామోహములనుండి ముక్తిని కలిగించుటకై నరకుని చెరనుండి విడిపించి నిత్యము అతని పాదములనే స్మరించు మమ్ము వివాహమాడినాడు. 40

శ్లో॥ న వయం సాధ్వి సామ్రాజ్యం స్వారాజ్యం భోజ్యమప్యుత ।
వైరాజ్యం పారమేష్ఠ్యంవా ఆనంత్యం వాహరేః పదమ్ ॥ 41

మాకు సామ్రాజ్య భోగాలపట్ల కోరికలేదు. ఆ జగన్మంగళుని లక్ష్మీ సంపన్నమైన పాదధూళిని తలపై ధరించుటను మాత్రమే

టీ:- నేతి. సామ్రాజ్యాది న కామయామహే. కింతు. తస్య శ్రీమత్పాదరజో మూర్ధ్నా వోఢుం కామయామహ ఇతి. నను తస్య గృహిణ్యో యూయం సర్వసంపద్భాజః కిమేవం కామ్యతే అత ఆహుః . హే సాధ్విసామ్రాజ్యం సార్వభౌమం పదం. స్వారాజ్యమైంద్రం పదం. భోజ్యం తదుభయభోగభాక్త్వం వివిధం రాజత ఇతి విరాట్. తస్య భావో వైరాజ్యం అణిమాదిసిద్ధిభాక్త్వమిత్యర్థః. పారమేష్ఠ్యం బ్రహ్మపదం ఆనంత్యం మోక్షం. హరేః పదం తత్సాలోక్యాది నతు. కామయామహ ఇతి. యద్వా. బహ్వృచ బ్రాహ్మణోక్తక్రమేణ ప్రాగాదిచతుష్టయాధిపత్యాని సామ్రాజ్యభోజ్య స్వారాజ్య వైరాజ్యాని వ్యాఖ్యేయాని. 41

శ్లో॥ కామయామహ ఏతస్య శ్రీమత్పాదరజశ్శ్రియః ।
కుచకుంకుమ గంధాఢ్యం మూర్ధ్నావోఢుం గదాభృతః ॥ 42

టీ:- కామయామహ ఇతి. కిం తత్పదరజ ఏవ కామ్యతే తతఆహుః -శ్రియః కుచకుంకుమగంధాఢ్యమితి. బ్రహ్మాదిసేవ్యయా శ్రియాపి సేవితత్వాదితి భావః. 42

కోరుచున్నాము అన్నారు. వీరు అపార సంపదలు కలిగిన శ్రీకృష్ణునికి భార్యలై ఎల్లభోగములు యథేచ్ఛగా అనుభవించగలిగి ఉండికూడా ఇట్లా ఎందుకు కోరుచున్నారనే విషయమై చెప్పుచున్నారు. - ఓ ఉత్తమఇల్లాలా ! సార్వభౌమత్వము, ఇంద్రభోగములు మొదలైనవాని అనుభవము, వైరాజ్యము-అణిమాది అష్టసిద్ధులు, బ్రహ్మానంద పదవి మోక్షము మొదలైన వన్ని మాకు శ్రీహరిపదమే. అనగా నిరంతరము ఆ మహానుభావుని పాదదర్శనముతో ఏవియు సరిరావని భావము. లేక బహ్వృచబ్రాహ్మణమునందు చెప్పిన క్రమముగా ప్రాగాదులైన నాలుగింటికి ఆధిపత్యము వహించిన సామ్రాజ్యము, భోజ్యము, స్వారాజ్యము, వైరాజ్యములను కూడా చెప్పవచ్చును. 41

లక్ష్మీదేవి స్తనమునందలి గంధము మకరికాపత్రములచేత సువాసితమైన (బ్రహ్మచేత సేవింపబడినను లక్ష్మీదేవిచేత సేవింపబడిన) గదాధరుడైన ఆశ్రీమన్నారాయణుని మంగళకరమైన పాదధూళిని ధరించుటయే మేము కోరునది. 42




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ వ్రజస్త్రియో యద్వాంఛంతిపుళింద్యస్తృణ వీరుధః ।
గావశ్చారయతో గోపాః పాదస్పర్శం మహాత్మనః ॥ 43

టీ:- నను తర్హి అతిదుర్లభత్వాత్కిం తద్వాంఛయా అత ఆహుః- వ్రజస్త్రియఇతి. యత్. యథా.గావఃగాః. మహాత్మనో౽పి గాశ్చారయతః పాదస్పర్శం చ గోపాః యథా. వాంఛంతి. తద్వత్ తత్పరణాం సులభమితి భావః. 43

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, త్ర్యశీతితమో౽ధ్యాయః**

కైవల్యాదులు మిక్కిలి దుర్లభమైనందు వలన వాటిని కోరవలసిన అవసరములేదు. ఆ గోపాలుని పాదధూళి మాత్రమే చాలునని భావించితిరా అనే విషయమై చెప్పుచున్నాడు – పుళింద దేశమందలి తృణాంకురములను మేము ఆవులను కాయుచున్న గోపాలురు మహాత్ముడైన శ్రీకృష్ణుని పాదస్పర్శను కోరినట్లుగా, వ్రజస్త్రీలును ఆ మహనీయుని పాదధూళినే కోరుచున్నారు. శ్రీకృష్ణుని కులమైన యాదవులందరు గోపాలురై జన్మించుటయే చాలాగొప్ప అయినప్పటికి వారునూ గోవులను కాయుచు శ్రీకృష్ణుని పాదధూళినే ఎల్లప్పుడు కాంక్షించుచున్నారు. అట్లే మేము కూడా ఆ కృష్ణ భక్తులకు సులభముగా లభించే ధూళిని కోరుకొంటిమని భావము. 43

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనుబది మూడవ అధ్యాయముసమాప్తము**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ




ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## చతురశీతితమోஉధ్యాయః

శ్లో॥ చతుర్భిరధికేశీతితమే మనిసమాగమే ।
వసుదేవముఖోత్సాహ బంధుప్రస్థాపనాదికమ్ ॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ శ్రుత్వా పృథాసుబల పుత్ర్యథయాజ్ఞసేనీ
మాధవ్యథక్షితిపపత్న్య ఉత స్వగోప్యః ।
కృష్ణేஉఖిలాత్మని హరౌ ప్రణయానుబంధం
సర్వావిసిస్మురలమశ్రుకలాకులాక్ష్యః ॥ 1

శ్లో॥ ఇతి సంభాషమాణాసు స్త్రీభిస్త్రీషు నృభిర్నృషు ।
ఆయయుర్మునయస్తత్ర కృష్ణరామ దిదృక్షయా ॥ 2

శ్లో॥ ద్వైపాయనో నారదశ్చ చ్యవనో దేవలోஉసితః ।
విశ్వామిత్రశ్శతానందో భరద్వాజోஉథ గౌతమః ॥ 3

శ్లో॥ రామస్సశిష్యో భగవాన్ వసిష్ఠోగాలవో భృగుః ।
పులస్త్యః పులహోஉత్రిశ్చ మార్కండేయో బృహస్పతిః ॥ 4

## 84వ అధ్యాయము

ఈ ఎనుబది నాల్గవ అధ్యాయమున మునులతో కలిగిన సమాగమమునందు వసుదేవుడు మొదలైనవారు సగౌరవముగా బంధువులను సాగనంపుట విషయము

**శ్రీ శుకుడు ఇట్లుపలికెను**

కుంతీ,గాంధారీ, ద్రౌపది, మాధవి, ఇంకా ఇతర రాజుల భార్యలు, కృష్ణుని గోపికలు, ఆయన భక్తులైన గోపాలురు మొదలైన వారందరు శ్రీకృష్ణుడు తమను వివాహమాడినవిధానమును, వారి ప్రణయాను బంధమును గురించి అతని పత్నులు చెప్పిన మాటలు విని ఆనందబాష్పములు రాలగా ఆశ్చర్యమగ్నులైరి. 1

ఈ విధముగా స్త్రీలతో - స్త్రీలు, పురుషులతో - పురుషులు పరస్పరము ఇష్టసల్లాపములాడుచుండగా అక్కడకు వ్యాసుడు, నారదుడు, చ్యవనుడు, దేవలుడు, అసితుడు, విశ్వామిత్రుడు, శతానందుడు,భరద్వాజుడు, గౌతముడు, శిష్యసితుడైన పరశురాముడు, వశిష్ఠుడు, గాలవుడు, బృగువు, పులస్త్యుడు, పులహుడు, అత్రి, మార్కండేయుడు, బృహస్పతి, బ్రహ్మ మానసపుత్రుడైన అంగీరసుడు, అతని పుత్రులైన ఆంగీరసులు, అగస్త్యుడు, యాజ్ఞ్యవల్క్యుడు, వామదేవాదులైన ఇతర ఋషులు ఒక్కొక్కరు, ఇద్దరిద్దరు, ముగ్గురు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ద్వితస్త్రితశ్చైకతశ్చ బ్రహ్మపుత్రస్తథాంగిరాః ।
అగస్త్యో యాజ్ఞవల్క్యశ్చ వామదేవాదయో పరే ॥ 5

శ్లో॥ తాన్ దృష్ట్వా సహసోత్థాయ ప్రాగాసీనా నృపాదయః ।
పాండవాః కృష్ణరామౌ చ ప్రణేముర్విశ్వవందితాన్ ॥ 6

టీ:- శ్రుత్వేతి. సుబలపుత్రీ గాంధారీ మాధవీ సుభద్రా క్షితిపానాం రాజ్ఞాం పత్న్యః స్వగోప్యః కృష్ణ భక్తాః గోపికాః విసిస్మః విస్మయం జగ్ముః . (1-6)

శ్లో॥ తానానర్చుర్యథా సర్వే సహ రామోऽచ్యుతోऽర్చయత్ ।
స్వాగతాసనపాద్యార్ఘ్య మాల్యధూపాను లేపనైః ॥ 7

టీ:- తానితి. ఆనర్చుః అర్చితవంతః. 7

శ్లో॥ ఉవాచ సుఖమాసీనాన్ భగవాన్ ధర్మగుప్తనుః ।
సదసస్తస్య మహతో యత వాచోऽను శృణ్వతః ॥ 8

టీ:- ఉవాచేతి. ధర్మగోప్త్రీ తనుర్యస్య సః ధర్మగుప్తనుః. యతా నియతా వాగ్యస్య సదసః. 8

ముగ్గురు కలిసి శ్రీకృష్ణుని, బలరాముని చూడవలెనను కోరికతో అక్కడకు వేంచేసిరి. (2-5)

ఆ మునీశ్వరులను చూచి ముందుభాగమున కూర్చున్న రాజులు, పాండవులు, బలరామకృష్ణులు వెంటనే తమతమ ఆసనములనుండి లేచి జగద్వందితులైన వారికి నమస్కరించిరి. 6

ఆ ఋషీశ్వరులందరికి స్వాగతముచెప్పి వారికి ఉచితాసనములను ఏర్పరిచి, అర్ఘ్యము, పాద్యము, మాలలు, ధూపములు, గంధములు మొదలైన ఉపచారములను చేసి బలరామకృష్ణులతో కూడిన వారై అక్కడివారందరు వారిని అర్చించిరి. 7

అందరును ఆసీనులైన పిమ్మట ధర్మపరిరక్షణ రూపుడైన శ్రీకృష్ణభగవానుడు వారికిట్లని చెప్పినాడు. నియతమైన ఆయన గొప్ప మాటలను సదస్యులు వినిరి. 8

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

**శ్రీ కృష్ణ ఉవాచ**

శ్లో॥ అహో వయం జన్మభృతో లబ్ధం కార్త్స్న్యేన తత్ఫలమ్ ।
దేవానామపి దుష్ప్రాపం యద్యోగేశ్వరదర్శనమ్ ॥ 9

టీ:- అహోఇతి. జన్మభృతః సఫలాజన్మానః. తత్ఫలం జన్మఫలం. కిం తత్ యద్యోగేశ్వరదర్శనం. 9

శ్లో॥ కిం స్వల్ప తపసాం నృణామర్చాయాం దేవచక్షుషామ్ ।
దర్శనస్పర్శన ప్రశ్న ప్రహ్వపాదార్చనాదికమ్ ॥ 10

టీ:- కించ యుష్మాకం దర్శనమేవ తావద్దేవానామపి దుష్ప్రాపం అస్మాకం తు స్పర్శనాదికమపి కథం సంఘటితమితి విస్మయేనాహ-కిమితి. స్వల్పతపసాం తీర్థస్నానాదిమాత్రే తపోబుద్ధిర్యేషాం తేషాం. తథా అర్చాయాం ప్రతిమాయాం దేవ ఇతి చక్షుర్దృష్టిర్యేషాం తేషాం. యోగేశ్వర దర్శనస్పర్శనాదికం ఇదం కిం సంభావితం న సంభావిత మిత్యర్థః. 10

**శ్రీకృష్ణుడు పలికెను**

అహో ! దేవతలకును పొందరాని యోగేశ్వరులైన మీ అందరి దర్శనము కలిగినందువల్ల మాకీనాడు మానవ జన్మ సఫలమగునట్లుగా సంపూర్ణమైన సత్ఫలము కలిగినది. 9

మీ దర్శనము దేవతలకునూ దుర్లభమైననూ మానవులమైన మాకు దర్శనము మాత్రమే కాకుండ విశేషముగా స్పర్శనాదులుకూడా కలుగుట మిక్కిలి విచిత్రమనే విషయమును చెప్పుచున్నాడు-చెక్కతో, రాతితో చేసిన దేవతాప్రతిమలకు మాత్రమే దేవతలనెడు బుద్ధితో పూజించునట్టి మానవులకు అల్పమైన తపస్సుతో అనగా కేవలము తీర్థయాత్రలు చేసినంత మాత్రమైన పుణ్య విశేషము చేతనే ఇందరు యోగీశ్వరులు సాక్షాత్తుగా దర్శనమిచ్చుటతో పాటుగా వారిని స్మరించుట, వారితో మాట్లాడుట, తలవంచి వారి పాదములకు నమస్కరించి సేవించుట మొదలైన పుణ్య పరంపరలు సిద్ధించుట పరమాశ్చర్యమైన విషయము. 10

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః ॥ 11

టీ:- ఏతత్ప్రపంచయతి.- త్రిభిః. నేతి. 11

శ్లో॥ నాగ్నిర్నసూర్యో న చ చంద్రతారకా
న భూర్జలం ఖం శ్వసనోఽథ వాఙ్మనః ।
ఉపాసితా భేదకృతో హరంత్యఘం
విపశ్చితోఘ్నంతి ముహూర్తసేవయా ॥ 12

టీ:- నేతి. వాఙ్మనసోరప్యుపాసనావిషయత్వం శ్రు."యోవాచం బ్రహ్మేత్యుపాస్తే యో మనో బ్రహ్మేత్యుపాస్త" ఇతి శ్రుతేః.అఘం తన్మూలం అజ్ఞానం చాగ్న్యాదయో న హరంతి. అత్ర హేతుః భేదకృతః భేదకర్తారః. యద్వా భేదబుద్ధిం కుర్వతః పుంసః విపశ్చితో నిరస్తభేదాః తే తు ముహూర్తమాత్రసేవయైవాఘంఘ్నంతీతి. 12

ఈ విషయమునే మూడు శ్లోకములందు వివరించుచున్నాడు. – జలరూపములైన తీర్థములు, మట్టి, శిలలతో చేసిన దేవతామూర్తులు మొదలైన వానిని సేవించినచో అవి చాలా కాలమునకు గాని ఫలితమును ఇవ్వవు. కానీ సత్పురుషులు దర్శనమాత్రము చేతనే ఉద్ధరింతురు. 11

వాక్కు, మనస్సులను బ్రహ్మగా ఉపాసించవలెనని శ్రుతి. వాక్కు, మనస్సుల ఉపాసనలకు విషయములైన అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, భూమి, జలము, ఆకాశము, వాయువు మొదలైన వానిని ఎంత ఉపాసించినను అవి పురుషుని పాపమును పోగొట్టలేవు. కానీ ఉపాసకునితో అభేదమును పొంది ముహూర్త మాత్రము సేవించినను మహాపురుషులు సర్వపాపములను క్షాళనము చేయుదురు. 12

శ్లో॥ యస్యాత్మ బుద్ధిః కుణపే త్రిధాతుకే
స్వధీః కళత్రాదిషు భౌమ ఇజ్యధీః ।
యత్తీర్థ బుద్ధిశ్చ జలేన కర్హిచి
జ్జనేష్వభిజ్ఞేషు సఏవ గోఖరః ॥ 13

టీ:- అతస్సాధూన్ విహాయాన్యత్రాత్మాదిబుద్ధ్యా సజ్జమానో౽తీవ మంద ఇత్యాహ-యస్యేతి. ఆత్మబుద్ధిరహమితిబుద్ధిః. త్రయో ధాతవో వాతపిత్తశ్లేష్మాణః ప్రకృతయో యస్య తస్మిన్ కుణపే శరీరే. స్వధీః స్వీయా ఇతి బుద్ధిః. భౌమే భూమివికారే మృచ్ఛిలాదౌ ఇజ్యధీః దేవతాబుద్ధిః. యత్ యస్య తీర్థబుద్ధిః తీర్థమితిబుద్ధిః. అభిజ్ఞేషు తత్త్వవిత్సు యస్యతాః బుద్ధయో న సంతి.స ఏవ గోష్వపి ఖరః దారుణః అత్యంతావివేకీ. యద్వా గవాం తృణాదిభారవాహః ఖరో గర్దభ ఇతి. 13

అందువల్ల సాధువులను వీడి ఇతరులను అనగా ప్రతిమలను పరమాత్మ అనెడు బుద్ధికలవాడు మిక్కిలి మూర్ఖుడు అని చెప్పుచున్నాడు. వాతము, పిత్తము, శ్లేషము, అనే ప్రకృతికి సంబంధించిన ధాతువులతో కూడిన శరీరమే నేను అని, భార్య, సంతానము, సంపదలు నావి అని, భూమి కారకములైన మట్టి, రాతిబొమ్మలను దేవతలనీ, నదీ జలములను తీర్థములనీ పవిత్రములని భావించే బుద్ధిగల వారు, తత్త్వము తెలిసిన సర్వజ్ఞులైన మహానుభావుల పట్ల దేవతలనెడు బుద్ధిలేనివారు-గోవులందు దుష్టములైన పశువుల వంటి వారు. లేక ఆవుల ఆహారమైన గడ్డిమోపులను తమ వీపులపై మోయునట్టి గాడిదలవంటి వారు. 13

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ నిశమ్యేత్థం భగవతః కృష్ణస్యాకుంఠమేధసః ।
వచోదురన్వయం విప్రాస్తూష్ణీమాసన్ భ్రమద్ధియః ॥ 14

టీ:- నిశమ్యేతి. దురన్వయం అననురూపం భ్రమంతీ అనవస్థితా ధీర్బుద్ధిర్యేషాం తే. 14

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

మొక్కవోని విజ్ఞానముగల పరమాత్మ కృష్ణుడు ఈ విధముగా చెప్పిన మాటలు తమకు వర్తించవేమో అనే భ్రాంతితో చంచలమైన బుద్ధిగల వారై ఆ ఋషులందరు మిన్నకుండిరి. 14

 



శ్లో॥ చిరం విమృశ్య మునయ ఈశ్వరస్యేశితవ్యతామ్ ।
జన సంగ్రహ ఇత్యూచుస్మయంతస్తం జగద్గురుమ్ ॥ 15

టీ:- చిరమితి. ఈశితవ్యతాం అనీశ్వరతాం కర్మాధికారితాం జన సంగ్రహమాత్ర మేతదిత్యూచుః. స్మయంతః స్మయమానాః. హసంతః 15

మునయః ఊచుః

శ్లో॥ యన్మాయయా తత్త్వవిదుత్తమా వయం
విమోహితా విశ్వసృజామధీశ్వరాః ।
యదీశిత వ్యాయతి గూఢ ఈహయా
అహోవిచిత్రం భగవద్విచేష్టితమ్ ॥ 16

టీ:- దురన్వయం వివృణ్వంత ఆహుర్ద్వాభ్యాం. యన్మాయయేతి. తత్త్వవిత్సు ఉత్తమాఅపి వయం. కాసా మాయా యయా మోహితా ఇతి తామాహుః - యదితి. యత్.యస్మాత్. ఈహయా నరచేష్టితేన. గూఢస్సన్ ఈశితవ్యాయతి అనీశ్వరవదాచరతి భవాన్ నన్వహమీశశ్చే. త్కిమిత్యేవమాచరేయం తత్రాహుః - అహో ఇతి. భగవతస్తవ విచేష్టితం విచిత్రం అవితర్క్యమేవ. 16

మునులు చాలాసేపు తమలో తర్కించుకొని సాక్షాత్తుగా భగవంతుడై సర్వేశ్వరుడైనను జనసముదాయములకు గురుసేవ అవశ్య కర్తవ్యమనే కర్మాధికారతను బోధించుటకై ఇట్లనుచున్నాడని ఆ జగదీశ్వరుని చూచి చిరునవ్వు నవ్విరి. 15

**ఆ మునీశ్వరులు ఇట్లు చెప్పిరి**

పరమాత్ముని మాటల దురన్వయత్వమును రెండు శ్లోకములలో వివరించుచున్నాడు - తత్త్వవేత్తలలో మనము ఉత్తములమైనప్పటికీ అనిర్వచనీయమైన పరమాత్ముని మాయలో మోహితులమైతిమి అని ఆ మాయను గురించి చెప్పుచున్నారు - మేము తత్వవేత్తలలో ఉత్కృష్టులమై జగన్నిర్మాణ కర్తల లక్షణము చక్కగా తెలిసిన వారమై కూడా పరమాత్మ మాయచేత వ్యామోహమును పొందితిమి. పరమాత్మ అయిన మీరే మాయతో మానవరూపముతో కర్మలను నిర్వహించవలెనను కోరికతో గూఢమూర్తివై సాధారణ మానవునివలె ప్రవర్తించుచున్నావు. అయితే ఈశ్వరుడవై కూడా ఈ విధముగా సామాన్యుని వలె ఎందుకు మెలగుచుంటివనే విషయమును చెప్పుచున్నారు - ఓ భగవంతుడా! నీ లీలలు బుద్ధితో చర్చించినను తెలియరానివై విచిత్రములైనవి కదా. 16

 

శ్లో॥ అనీహ ఏతద్బహుధైక ఆత్మనా
సృజత్యవత్యత్తిన తత్ర బధ్యతే ।
భౌమైర్హి భూమిర్బహునామరూపిణీ
అహో విభూమ్నశ్చరితంవిడంబనమ్ ॥ 17

టీ:- భగవత్త్వమేవాహుః-అనీహ ఇతి. అనీహః అక్రియఏవ. ఆత్మనా స్వరూపమాత్రేణ బహుధేత్యత్రదృష్టాంతః. యథాభౌమైరితి. భౌమైర్ఘటాది వికారైరుపలక్షితా. శ్రు."వాచరంభణం వికారో నామధేయం మృత్తికేత్యే వసత్య" మితి శ్రుతేః. నను కథమహం జగత్సృష్ట్యాదికర్తా దేవకీ వాసు దేవపుత్రత్వాదిత్యత్రాహుః-అహోఇతి. విభూమ్నః పరిపూర్ణస్య తవ ఇదం జన్మాదిచరితం విడంబనమనుకరణమాత్రం న తు తత్త్వమితి. 17

శ్లో॥ అథాపి కాలే స్వజనాభిగుప్తయే
బిభర్షి సత్త్వం ఖలనిగ్రహాయ ।
స్వలీలయా వేదపథం సనాతనం
వర్ణాశ్రమాత్మా పురుషః పరోభవాన్ ॥ 18

టీ:- జనసంగ్రహమాహుస్త్రిభిః-అథేతి. సత్త్వం శుద్ధసత్వాత్మకం రూపం బిభర్షి. 18

భగవత్తత్త్వమునే చెప్పుచున్నారు-కోరిక,కర్మకర్తృత్వము, ఫలభోక్తృత్వము, బంధముల నిమిత్తము లేకనే ఏకస్వరూపుడవై కూడా నీవు బహువిధములుగా ఈ అనంత జగత్తును సృష్టించి, రక్షించి, నాశనము చేయుచున్నావు. భూమియే కుండ, కడవ మొదలైన విధముగా పెక్కు రూపములతో, నామములతో ప్రకటమైనట్లుగా ఒకే పరమాత్మ అనేక విధములుగా భాసించినది. మన్ను మాత్రమే సత్యము, రూపనామాది వికారములు అసత్యమైనవని శ్రుతి.నేను జగత్తు సృష్టి, స్థితి, లయలకు కర్తనైనప్పుడు మరలఇప్పుడు ప్రత్యేకముగా దేవకీ వసుదేవులకు పుత్రుడై ఉండుట ఎందుకు? అనే విషయమై చెప్పు చున్నారు- నీవు పరిపూర్ణుడవైన పరమాత్మవైనను నీ ఈకృష్ణుడు అనే జన్మ, దానిలీలలు కేవలము అనుకరణలే కానీ తత్త్వమైనవి కావు. 17

పరమాత్మ జగత్తును అనుగ్రహించిన విధమును మూడు శ్లోకాలలో చెప్పుచున్నాడు-అయినప్పటికి కాలక్రమమున నశించి పోయిన వేదధర్మములైన వర్ణాశ్రమ నియమములను పునరుద్ధరించుటకై లోకులకు సత్యమును అనుభవరూపముగా బోధించుటకై, సజ్జనులైన తన భక్తులను కాపాడుటకై దుష్టులను దండించుటకై తన లీలలతో కూడిన వేద ధర్మముల ఆచరణతో ఆయా అవసరాలకు అనుగుణమైన విధముగ పరిపూర్ణమైన జ్ఞానముతో కూడిన రూపమును ధరించు చున్నావు. 18

శ్లో॥ బ్రహ్మ తే హృదయం శుక్లం తపస్స్వాధ్యాయ సంయమైః ।
యత్రోపలబ్ధం సద్వ్యక్తమవ్యక్తం చ తతః పరమ్ ॥ 19

టీ:- అతఏవ బ్రాహ్మణేషు బహుమానమపి కరోషీతి సహేతుకమాహుః -బ్రహ్మేతి. బ్రహ్మ వేదాఖ్యం. శుక్లశుద్ధం తే హృదయం అంతరంగ రూపం. కుత ఇత్యత ఆహుః-యత్రేతి. యత్ర బ్రహ్మణి వ్యక్తం కార్యం. అవ్యక్తం కారణం తతః పరం. సత్ సన్మాత్రం బ్రహ్మ చ. తప ఆదిభిరుప లబ్ధం తత్ బ్రహ్మ. 19

అందువలననే వేద ధర్మప్రవర్తకులైన బ్రాహ్మణుల పట్ల నీకు పక్షపాతమున్నదనే విషయమును సహేతుముగా చెప్పుచున్నాడు - శుద్ధ జ్ఞానమయమైన వేదమే నీ హృదయము అనగా అంతరంగ రూపము. తపస్సు, అధ్యయనము, నియమములుగల సత్పురుషులకే లభించగలదు. పరమాత్మయందు జగద్రూపకమైన కార్యము వ్యక్తమగును. ఈ కార్యము కంటే పైన అవ్యక్తమైన కారణమున్నది. సత్ అనగా శాశ్వతమైన బ్రహ్మము. అది తపస్సు మొదలైన వానివల్లనే అనుభవమగును. 19

శ్లో॥ తస్మాద్బ్రహ్మకులం బ్రహ్మన్ శాస్త్రయోనేస్త్వవాత్మనః ।
సభాజయసి సద్ధామ తద్బ్రహ్మణ్యాగ్రణీర్భవాన్ ॥ 20

టీ:- తస్మాదితి. తస్మాత్ వేదహృదయత్వాద్వేదప్రవర్తకం బ్రాహ్మణకులం. శాస్త్రయోనేర్వేదప్రమాణకస్య. తవ సద్ధామ శ్రేష్ఠముపలబ్ధిస్థానం. సభాజయసి సంపూజయసి. తత్తస్మాదేవ కారణాత్. త్వం బ్రహ్మణ్యానా మగ్రణీర్ముఖ్యః తత్ప్రవర్తకస్సన్ కర్మాచరసీత్యర్థః. 20

అందువల్ల పరమాత్మ వేద రూపుడైనందువల్ల బ్రాహ్మణుడు వేదమును ప్రవర్తించేయుటవలన, శాస్త్రముల పుట్టుకకు మూలమైన వేదమునకు ప్రామాణ్యము కలిగించునట్టి సర్వోత్కృష్టమైన పరమాత్మ కాంతిని పొందుచు స్థానమైనందువల్ల ఓ కృష్ణా ! నీవు బ్రాహ్మణులను పూజించుచున్నావు. వేద ధర్మమును ప్రర్తింపచేయుచు, ఆ కర్మలను స్వయముగా ఆచరించి చూపుట వలన నీవు బ్రాహ్మణ్యమున ముఖ్యుడవు. 20

శ్లో॥ అద్య నోజన్మ సాఫల్యం విద్యాయాస్తపసో దృశః ।
త్వయా సంగమ్య సద్గత్యా యత్త్వం నిశ్శ్రేయసాం పరః ॥ 21

పరమాత్ముడవైన నీవు ఈ విధముగా లోకవ్యవహారార్థమే జన్మాది కార్యములు చేసితివి. మేము మాత్రము నీ సాంగత్యము వలన

శ్లో॥ నమస్తస్మై భగవతే కృష్ణాయాకుంఠ మేధసే ।
స్వయోగ మాయయాచ్ఛన్న మహిమ్నే పరమాత్మనే ॥ 22

టీ:- తస్మాదీశ్వరస్య తవేదం జనసంగ్రహమాత్రం. వయం తు తవ సంగత్యా కృతార్థా ఇత్యాహుష్షడ్భిః-అద్యేతి. సతాం గత్యా త్వయా సంగమ్య సంగం ప్రాప్య.యత్ యస్మాత్ త్వం నిశ్రేయసాం పరః అవధిః.(21-22)

శ్లో॥ నయం విదంత్యమీ భూపా ఏకరామాశ్చవృష్ణయః ।
మాయాయవనికాచ్ఛన్న మాత్మానం కాలమీశ్వరం ॥ 23

టీ:- నేతి. ఏకస్మిన్నేవస్థానే ఆరామో యేషాం తే తేఽపి. కాలం సృష్ట్యాదికారణం. ఈశ్వరం నియంతారం. 23

కృతార్థులమైతిమని ఆరు శ్లోకములందు చెప్పుచున్నాడు- సత్పురుషులకు ఆశ్రయుడవై, అపారమైన శుభపరంపరలకు సమారేఖవైన నిన్ను కలిసినందు వలన ఈనాడు మా జన్మ, తపస్సు, విద్య, నేత్రములు సాఫల్యమును పొందినవి. 21

ఓకృష్ణా !పరమాత్మా, మొక్కవోని విజ్ఞానరూపుడా ! యోగమాయ చేత ఆవృతమైన మహిమగలవాడా, భగవంతుడా నీకు నమస్కారము. 22

ఈ రాజులు, ఏకాంతమున నిరంతర మననము చేయు యోగులు(మేము), ఈ యాదవులు మాయ అనే పరదామాటున ఉన్న సృష్టికి ఆదికారణుడవై కాలరూపుడిగా, సర్వనియంతయైన ఈశ్వరుడుగా ఉన్న నిన్ను తెలియలేము. 23

శ్లో॥ యథా శయానః పురుష ఆత్మానంగుణతత్త్వదృక్ ।
నామమాత్రేంద్రియాభాతం నవేద రహితం పరమ్ ॥ 24

టీ:- ఏతత్సదృష్టాంతమాహుః-యథేతి. శయానః స్వప్నాన్ పశ్యన్ గుణతత్త్వదృక్ స్వప్నవిషయేషు తత్త్వదృష్టిః. నామమాత్రమింద్రియేణ మనసా ఆభాతం సింహవ్యాఘ్రాదిరూపమాత్మానం వేదతద్రహితం పరం దేవదత్తాదిరూపమాత్మానం న వేదయథా. 24

ఈ విషయమునే నిదర్శన సహితముగా చెప్పుచున్నాడు - పురుషుడు నిద్రలో కలలుకని, ఆ కలలోని విషయములను యధార్థమైన విగా భావించి నామమాత్రపు ఇంద్రియమైన మనస్సునందు (తైజసముగా) ప్రకాశించు సింహము, పెద్దపులులు మొదలైనవిగా తన రూపమును మాత్రమే తెలియగలుగును. వీనికంటే వేరుగా దేవదత్తాది రూపమైన తన వాస్తవ తత్త్వమును తెలియలేడు.. 24

శ్లో॥ ఏవం త్వాయం జనోఽబ్రహ్మన్నామమాత్రేంద్రియేహయా ।
మాయయావిభ్రమచ్చిత్తో నవేదస్మృత్యుపప్లవాత్ ॥ 25

టీ:- ఏవమితి. ఏవంత్వా త్వాం నామమాత్రేషు స్వప్నాది తుల్య విషయేషు ఇంద్రియైర్యా ఈహా ప్రవృత్తిః. సైవ మయా తయా. విభ్రమచిత్తో న వేదస్మృతేః వివేకస్య ఉపప్లవాత్. 25

ఓ పరమాత్మా ! ఇదే విధముగా నామమాత్రమైన (వాస్తవమును తెలుపలేని) ఇంద్రియముల యొక్క కోరికలతో మాయతో చలించిన చిత్తముతో వివేకము కల్లోలితమైనందువల్ల మానవుడు పరమాత్మవైన నిన్ను తెలియలేకున్నాడు. 25

శ్లో॥ తస్యాద్య తే దదృశిమాంఘ్రిమఘౌఘమర్ష
తీర్థాస్పదం హృది కృతం సువిపక్వయోగైః ।
ఉత్సిక్త భక్త్యుపహృతాశయ జీవకోశా
ఆపుర్భవద్గతిమతోఽనుగృహాణ భక్తాన్ ॥ 26

పాపసముదాయమును నాశనము చేయునట్టి గంగ అనే మహా తీర్థప్రవాహమునకు ఆశ్రయమైన నీ పాదమును పరిపక్వమైన సాధనలచేత మనస్సులో పాదుకొల్పుచున్న మేము (ఇంతవరకు నీ పాదమును హృదయమందు నిల్పితిమి కాని దర్శించలేదు) ఇప్పుడు

మా ఈ లౌకిక నేత్రాలతో అనేక పుణ్యాల ఫలముగా దర్శించితిమి. భక్తులైన మమ్ములను అనుగ్రహించుము. అయితే ఇంతకు ముందు తపస్సు చేసినట్లుగనే ఇప్పుడు చేయుడు అనుట కాదని చెప్పుచున్నాడు - ఉత్సిక్తమైన అనగా చక్కగా తడిసిన (ఆర్ద్రమైన) ఉద్రిక్తమైన భక్తి వల్లనే జీవకోశము (జననమరణ బంధము) నశించును. అట్టి పూర్ణ భక్తులు పొందినట్టి భగవద్గతిని భక్తులమైన మాకును ప్రసాదించుమని ఋషులు కోరినారు. (తపస్సు కన్న భక్తి శ్రేష్ఠతరమని భావము). 26

శ్లో॥ ఇత్యనుజ్ఞాప్య దాశార్హం ధృతరాష్ట్రం యుధిష్ఠిరమ్ ।
రాజంస్తే స్వాశ్రమాన్ గంతుం మునయోదధిరే మనః ॥ 27

టీ:- తస్యేతి. అఘౌఘస్య మర్షం వినాశకం యత్ గంగాఖ్యం తీర్థం తస్యాస్పదం ఆశ్రయం. తే అంఘ్రిం సువిపక్వయోగైరపి హృది హృదయే కృతం కేవలం న తు దృష్టం తస్య తే అంఘ్రిం దదృశిమ దృష్టవంతో వయం బహుభిః పుణ్యైః అతోఽస్మాన్ భక్తాననుగ్రహేణ భక్తాన్ కృత్వా అనుగ్రహం కుర్విత్యర్థః. నను కింభక్త్యా యథా పూర్వం తప ఏవ తప్యతామితి నేత్యాహుః. ఉత్సిక్తా ఉద్రిక్తా యా భక్తిః తయా అపహృతః ఆశయలక్షణో జీవకోశో యేషాం. త ఏవ భగవద్గతిమాపుః నాన్య ఇతి. (26-27)

ఓ రాజా! ఋషులు కృష్ణపరమాత్మను అర్థించి ఆయన అనుమతి పొంది ధృతరాష్ట్రునికి, ధర్మరాజునకు వీడుకోలి చెప్పి వారందరు తమతమ ఆశ్రమములకు మరలివెళ్ళుటకు సిద్ధపడిరి. 27

శ్లో॥ తద్వీక్ష్యతాననువ్రజ్య వసుదేవో మహాయశాః ।
ప్రణమ్యచోప సంగృహ్య బభాషేదం సుయంత్రితః ॥ 28

టీ:- తదితి. ఉపసంగృహ్య చరణౌ పాణిభ్యాం ధృత్వా బభాషేదమితి సంధిరార్షః. 28

గృహోన్ముఖులైన మహానుభావులైన మునీశ్వరులను చూచి వసుదేవుడు వెన్నంటి వచ్చి వారి పాదములు రెండు చేతులతో పట్టుకొని నమస్కరించి చక్కని సంస్కారవంతమైన విధముగా ఇట్లు విన్నవించినాడు. 28

### వసుదేవ ఉవాచ

శ్లో॥ నమోవస్సర్వదేవేభ్య ఋషయశ్శ్రోతు మర్హథ ।
కర్మణా కర్మనిర్హారో యథాస్యాన్నస్తదుచ్యతామ్ ॥ 29

టీ:- నమ ఇతి. సర్వే దేవా యేషుతేభ్యః.శ్రు.“యావతీర్వై దేవతాస్తాస్సర్వావేదవిది బ్రాహ్మణేవసంతీ”తి శ్రుతేః. యేనకర్మణా యథాకృతేన వా కర్మణాం నిర్హారో నిరాసో భవతి తదుచ్యతాం. 29

### వసుదేవుడు ఇట్లు చెప్పినాడు

సర్వదేవతలకు నెలవులైన ఓ మహర్షులారా! (సర్వ దేవతలు వేదవేత్తయైన బ్రాహ్మణుని యందుందురని - యావతీర్వై దేవతాస్తాస్సర్వావేదవిది బ్రాహ్మణే వసంతి - అని శ్రుతి) నేను ఏమిచేసినచో ఈ ప్రాపంచిక వ్యామోహము (కర్మల) నుండి విముక్తిని పొందగలనో సెలవిండని వసుదేవుడు ప్రార్థించినాడు. 29

### నారద ఉవాచ

శ్లో॥ నాతి చిత్రమిదం విప్రా వసుదేవో బుభుత్సయా ।
కృష్ణం మత్వార్భకం యన్నః పృచ్ఛతి శ్రేయ ఆత్మనః ॥ 30

టీ:- శ్రీకృష్ణం హిత్వా అస్మాన్ పృచ్ఛతీతి విస్మితాన్ ప్రత్యాహ నారదః నేతి. బుభుత్సయా బోద్ధుమిచ్ఛయా. 30

### నారదుడు ఇట్లు చెప్పినాడు

ఓ ఋషులారా! ఈ వసుదేవుడు శ్రీకృష్ణుడు సాధారణ బాలుడు (తనపుత్రుడు) అని భ్రమించి ఆయనను విడిచి ఆత్మశ్రేయమైన పరమార్థమును బోధించుమని మిమ్మిట్లు అడుగుచున్నాడని ఆశ్చర్యమును పొందకుడని నారదుడు చెప్పినాడు. 30

శ్లో॥ సన్నికర్షో౽త్రమర్త్యానామనాదరణకారణమ్ ।
గాం గంహిత్వా యథా న్యాంభస్తత్రత్యోయాతి శుద్ధయే ॥ 31

టీ:- సన్నికర్ష ఇతి. తత్ర త్యః గంగాతీరవాసీ. 31

మానవులకు అతి సాన్నిహిత్యము అనాదరమునకు కారణమగును, పవిత్రగంగానదీ తీరమునందలి జనులు గంగాజలమును కాదని పవిత్రతకోరకై ఇతర ప్రదేశములందలి తీర్థములను సేవింతురు కదా. 31

శ్లో॥ యస్యానుభూతిఃకాలేన లయోత్పత్త్యాదినాస్య వై ।
స్వతో౽న్యస్మాచ్చ గుణతో న కుతశ్చిన్నరిష్యతి ॥ 32

టీ:- శ్రీకృష్ణే అర్భకత్వమాశంకమానః అవిద్యావిజృంభిత ఇత్యాహ ద్వాభ్యాం. యస్యేతి. అనుభూతిః జ్ఞానం. కుతశ్చిదపి న నరిష్యతిన నశ్యతి. తదేవాహ- కాలేన కర్కటికాఫలవత్ అస్య విశ్వస్య లయోత్పత్త్యాదినాపి స్వత ఏవ విద్యుదాదివత్ అన్యస్మాచ్చ ముద్గరాదివఘటః. గుణతో రూపాద్యంతరోత్పత్త్యైవ పూర్వరూపాదినాశే దేహాదిః. 32

శ్రీకృష్ణుడు సామాన్య మానవ శిశువు అనుకొని అజ్ఞానమునందు వసుదేవుడున్నాడని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు - ఈ వసుదేవునికి జ్ఞానము నశించలేదు. కాలప్రవాహమున కర్కటి సంతానమువలే (ఎంద్రకాయగ్రుడ్లను తన శరీరములో వీపు భాగమున పెట్టును. గ్రుడ్లు పిల్లలైన వెంటనే తల్లి శరీరమును చీల్చుకొని బైటపడును. అట్లే ఒక విధమైన పదార్థ రూపము నశించగా మరొక పదార్థ రూపము ఉత్పన్నమగును. బాహిరమైన రూపమునకే నాశమున్నది కానీ పదార్థము మాత్రము నశించదు). ఒక చోట నశించి మరొక చోట ఉత్పన్నమగును. అట్లే ఈ జగత్తు యొక్క ఉత్పత్తి లయములు మెరుపువలె స్వయముగా సిద్ధమైనవి. ఇతర పదార్థములైన కట్టె, రాయి తగిలినందు వలన కుండలు పగిలి పోయినట్లుగా గుణముతో ప్రయోజనమును బట్టి క్రొత్తక్రొత్త రూపములను పొందుటకై వాని పూర్వరూపములు నాశనమగును. అంతేగాని పదార్థము, గుణములు ఎన్నటికి నశించవు. 32

శ్లో॥ తం క్లేశ కర్మపరిపాక గుణప్రవాహై
రవ్యాహతానుభవ మీశ్వరమద్వితీయమ్ ।
ప్రాణాదిభిస్స్వవిభవైరుపగూఢమన్యో
మన్యేత సూర్యమివ మేఘహిమోపరాగైః ॥ 33

ఎప్పటికిని కర్మతో సంబంధంలేని సంపూర్ణమైన జ్ఞానస్వరూపమై, ఈశ్వరుడై, అద్వితీయుడైన శ్రీకృష్ణుడు-కష్టమును కలిగించు కర్మలఫలితములైన సుఖదుఃఖాలను అనుభవించుచు సత్త్వము, రజస్సు, తమము అనే గుణముల ప్రవాహమైన శరీరము, ప్రాణము మొదలైన వాని మరుగున ఉన్నందువల్ల -మేఘములు, మంచు, గ్రహణములు మొదలైన వానిచేత కప్పబడిన సూర్యునివలె ఉన్నందువల్ల వసుదేవుడు తాను అతనికి తండ్రిననెడు అజ్ఞానముతో అతడు సామాన్య మానవుడని భావించినాడు అని నారదుడు వివరించినాడు. 33

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ అథోచుర్మునయో రాజన్నాభాష్యానకదుందుభిమ్ ।
సర్వేషాం శృణ్వతాం రాజ్ఞాం తథైవాచ్యుతరామయోః ॥ 34

**శ్రీశుకుడు ఇట్లు చెప్పచున్నాడు**

ఓ రాజా ! అప్పుడు బలరామకృష్ణులతో పాటు రాజులందరు వినుచుండగా వసుదేవుని ఉద్దేశించి ఈ విధముగా మునులు చెప్పిరి. 34

శ్లో॥ కర్మాణాం కర్మనిర్హార ఏష సాధు నిరూపితః ।
యచ్ఛ్రద్ధయా యజేద్విష్ణుంసర్వయజ్ఞేశ్వరం మఖైః ॥ 35

శ్రీమన్నారాయణుడే సర్వ ప్రాపంచిక కర్మల బంధమునుండి విముక్తిని ప్రసాదించగలడని చక్కగా నిరూపితమైనది. అందువలన సర్వయజ్ఞములకు అధినాయకుడైన విష్ణువును శ్రద్ధతో యజ్ఞములతో సేవించుము. 35

టీ:- తమితి. తం ఏవం కుతశ్చిదపి అవ్యాహతానుభవం.అత ఏవ ఈశ్వరం కించ. అద్వితీయం శ్రీకృష్ణం. అజ్ఞః ప్రాకృతః. ఉపగూఢ మాచ్ఛన్నం మనుష్యం మన్యేత. తైః క్లేశకర్మాదిభిః. క్లేశాఃరాగాదయశ్చ. తత్పూర్వకాణి కర్మాణిచ. తత్పరిపాకే సుఖదుఃఖే చ. సత్త్వాదిగుణానాం పునః పునః ప్రవాహశ్చ. తైః. ప్రాణాదిభిశ్చ స్వకార్యైః అత్ర దృష్టాంతః మేఘహిమోపరాగైః అభ్రతుషారరాహుభిః స్వవిభవైః సూర్యమివేతి. (33-35)

శ్లో॥ చిత్తస్యోపశమోஉయం వై కవిభిశ్శాస్త్రచక్షుషా ।
దర్శితస్సుగమో యోగో ధర్మశ్చాత్మముదావహః ॥ 36

టీ:- చిత్తస్య ఉపశమః ఉపశమహేతుః యోగో మోక్షోపాయశ్చ శనైరాత్మనో ముదిమావాహతీతి తథా. సుగమః ప్రవృత్త్యాశ్రయత్వాత్ ధర్మశ్చ ఆవశ్యకః. అన్యథా విహితాకరణేన మాలిన్యప్రసంగాత్. 36

పరమాత్మయందు లగ్నమైన చిత్తయోగమే మోక్షమునకు అనివార్యమైన ఉపాయము అనే విషయము శాస్త్రవేత్తలైన మహాత్ములు స్వానుభవ పూర్వకముగా స్థాపించినారు. ఈ యోగమే సర్వ సంకటముల నుండి మానసిక విశ్రాంతిని కలిగించును. ఇదే మెల్ల మెల్లగా ఆత్మానంద పరిపూర్ణత్వమును పొందించును. ప్రాపంచిక విషయములందు ప్రవృత్తికి ఆశ్రయమైనందువల్ల ధర్మ నిర్వహణకును యోగము అవశ్యకము. అనగా కర్మలాచరించినను కర్మబంధమున తగుల్కొనక నిష్కామత్వమును పొందించుటకు యోగము అవసరము. అట్లుకాక కోరికలతో చేసిన కర్మల వలన మనస్సుకు మాలిన్యములు అంటక తప్పదుకదా. 36

శ్లో॥ అయం స్వస్త్యయనః పంథా ద్విజాతేర్గృహమేధినః ।
యచ్ఛ్రద్ధయాప్తవిత్తేన శుక్లేనేజ్యేత పూరుషః ॥ 37

టీ:- నను.శ్రు."న కర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశు" రిత్యాదినా త్యాగస్యైవ విహితత్వాత్ కథం కర్మమోక్షోపాయ ఇత్యాశంక్య ఆదావేవ త్యాగస్యాశక్యత్వాదిత్యాశయే నాహుస్సార్ధచతుర్భిః - అయమితి. స్వస్త్యయనః స్వస్తి క్షేమం ఈయతేஉనేనేతి తథా.శ్రద్ధయా నిష్కామతయా. శుక్లేన శుద్ధేన ఆప్తేన విత్తేన పూరుషః ఈశ్వరః ఇజ్యేతేతి యత్ ఏషః పంథాః. 37

కర్మలు, సంతానము, ధనము అనే వానివల్ల ముక్తి కలగదు. త్యాగము వల్లనే అమృతత్వము కలుగును. 'నకర్మణా నప్రజయాధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః'అని శాస్త్రము సిద్ధాంతము చేసినందువల్ల అనుమానమును పోగొట్టుటకై ముందుగనే త్యాగము యొక్క ఆవశ్యకత ఉన్నదనే విషయమును నాలుగున్నర శ్లోకములందు వివరించాడు-శ్రద్ధతో అనగా కోరికలు లేకుండనే ధర్మ మార్గమున సంపాదించిన సంపదతో వ్యక్తి స్వతంత్రుడై యాగమును చేయవలెను. ఈ విధమైన నిష్కామ కర్మల చేతనే గృహస్థ ధ్మములను నిర్వహించు ద్విజ శ్రేష్ఠులు శాశ్వతత్వమును పొందుదురు. ఇదే ఉత్తమమైన తరుణోపాయ మార్గము. 37

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ విత్తైషణాం యజ్ఞదానైర్గృహైర్దారసుతైషణామ్ ।
ఆత్మలోకైషణాం దేవకాలేన విసృజేద్బుధః ॥ 38

టీ:– స్వస్త్యయనత్వమాహుః – విత్తైషణామితి. విత్తఫలభూతై ర్యజ్ఞైర్దానైశ్చ విత్తైషణాం విత్తేచ్ఛాం విసృజేత్. గృహైః గృహోచితైర్భోగైర్దార సుతైషణాం విసృజేత్. తదనుభవేనైవ తదౌత్సుక్య నివృత్తేః దేహే మృతే ఆత్మనః స్వర్గాదిలోకైషణాం చ కాలేన క్షయానుసంధానేన విసృజేత్ దేవహే వసుదేవ. యద్వా. దేవకాలేన దేవానామపిమృత్యునా హేతుభూతే నేత్యర్థః. 38

శ్లో॥ గ్రామేత్యక్తైషణాస్సర్వే యయుర్ధీరాస్తపోవనమ్ ॥ 39

టీ:– అత్రాచారం ప్రమాణయతి.– గ్రామ ఇతి. 39

శుభమును కలింగించునట్టి కర్మల విధానమును చెప్పుచున్నాడు – ధనముపై ఆసక్తి, భార్యాబిడ్డలు, గృహములపై మమకారము, తన శరీరము, లోక వ్యవహారములపై అనురాగమును అనగా ఈషణ త్రయములను (వ్యక్తి పండితుడై) అనగా ఇవన్నియు నిష్ప్రయోజనము లని క్రమక్రమముగా వానిపైగల వ్యామోహమును విడిచిపెట్ట వలెను. ఓ వసుదేవా ! ఆచరణచేతనే ఈషణ త్రయములు క్రమముగా పూర్తిగా నశించును. తాను చేసిన యజ్ఞ యాగాది కర్మల ఫలమును శరీర పాతానంతరము స్వర్గలోకాది సుఖభోగములు కలుగుననే కోరికను– పుణ్యక్షయమైన పిమ్మట మరల ప్రాపంచిక సంకటములు తప్పవు అనే నిశ్చయబుద్ధితో నిర్ణయించుకొని స్వర్గసుఖాల ధ్యాసను వదిలి పెట్టవలెను. లేక దేవతలకును వారి కాలము ముగిసిన పిమ్మట సుఖములు నశించునను బుద్ధిచేతగాని స్వర్గాదుల కాంక్షను వీడవలెను. దేవతలకును మృత్యువు అనగా అధికార నాశము తప్పదని భావము. 38

దీనికి ఆచారమును ప్రమాణముగా చెప్పుచున్నాడు – గ్రామము నందు కోరికలు లేని బుద్ధిమంతులు తపోవనమునకు వెళ్ళుదురు. (ఇక్కడ గ్రామము అనగా అభిజనమైన ఊరు అని మాత్రమే గాకా విషయ గ్రామము అని ఉన్నందున స్వర్గసుఖములను త్యజించవలెనని భావము.) 39

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఋణైస్త్రిభిర్ద్విజో జ్ఞాతోదేవర్షి పితౄణాం ప్రభో ।
యజ్ఞాధ్యయన పుత్రైస్తాన్య నిస్తీర్యత్యజన్పతేత్॥40

టీ:- కించ. ఋణైరితి. తథాచశ్రుతిః"జాయమానో వైబ్రాహ్మణ స్త్రిభిర్ఋణవా జాయతే బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః" ఇత్యాది తాన్యని స్తీర్య తేషాం ఋణాన్యనపాకృత్యతథాచమనుః శ్లో."ఋణాని త్రీణ్యపాకృత్య మనోమోక్షే నివేశయేత్, అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః". 40

ఓరాజా ! వ్యక్తి ముందుగా తన అవశ్య కర్తవ్యములైన మూడు ఋణములను తీర్చుకొనవలెను. బ్రహ్మచర్యముతో ఋషి ఋణము, యజ్ఞయాగాదులతో దేవ ఋణము, సంతానముతో పితృదేవతల ఋణమును తీర్చిన పిమ్మటనే పురుషుడు మనస్సును మోక్షమున ప్రవేశింపజేయవలెనని ఆ విధముగా త్రివిధ ఋణముల నుండి విముక్తుడు కాకుండ మోక్షమునకై యత్నించువాడు అథోగతిని పొందునని శ్రుతి. 'ఋణానిత్రన్వపాకృత్యమనోమోక్షేనివేషయేత్ - అనపాకృత్యమోక్షం తుసేవమానోవ్రజత్యథః అని మనుసూక్తి.) 40

శ్లో॥ త్వం త్వద్యముక్తో ద్వాభ్యాం వై ఋషిపిత్రోర్మహామతే ।
యజ్ఞైర్దేవర్ణమున్ముచ్య నిర్ఋణో శరణోభవ ॥ 41

టీ:- త్వమితి. నిర్ఋంః నిర్ముక్తఋణః. అశరణోభవగృహాత్ ప్రవ్రజ. 41

బుద్ధిమంతుడైన ఓ వసుదేవా ! నీవు ఇప్పటికి బ్రహ్మచర్యముచేత ఋషి ఋణమును, గార్హస్థ్య జీవన ఫలమైన సంతానముపొందుటవల్ల పితృ దేవతల ఋణమును తీర్చుకొంటివి. ఇప్పుడు యజ్ఞయాగాదులతో దేవతల ఋణమును తీర్చుకొని త్రివిధ ఋణవిక్తుడవై ముక్తిని ఆశ్రయించుము. 41

శ్లో॥ వసుదేవ భవాన్నూనం భక్త్యాపరమయా హరిమ్ ।
జగతామీశ్వరంప్రార్చత్సయద్వాం పుత్రతాంగతః ॥ 42

అయిన అతి శుద్ధమైన మనస్సుగల నీకు ఈ ఆశ్రమములు, వానికి సంబంధించిన ఋణములతో నిమిత్తమేమున్నది. నీవు ఇంతకు ముందే సర్వమాలిన్యములను వీడి శుద్ధుడవైతివి. అని చెప్పుచున్నాడు - ఓ వసుదేవా ! నీవు సర్వోత్తమమైన అనన్య భక్తితో జగదీశ్వరుడైన

శ్రీమన్నారాయణుని తప్పక ఏకచిత్తముతో అర్చించి తరించితివి. ఆ కారణము వలన ఆ దేవదేవుడే మీ పుణ్య దంపతులకు తనయుడుగా జన్మించినాడని ఋషులు చెప్పినారు. 42

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా వసుదేవోమహామనాః ।
తానృషీనృత్విజువవ్రేమూర్ధ్నానమ్య ప్రసాద్యచ ॥ 43

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

ఈ విధమైన ఋషుల మాటలు విని మంచి మనస్సుగల వసుదేవుడు వారందరికి తలవంచి నమస్కరించి సంతృప్తి పరచి, వారిని తాను నిర్వహించు యాగమునకు యాజకులుగా ఉండి నిర్వహించుడని ప్రార్థించినాడు. 43

శ్లో॥ త ఏవమృషయో రాజన్ వృతాధర్మేణ ధార్మికమ్ ।
తస్మిన్నయాజయన్ క్షేత్రే మఖైరుత్తమ కల్పకైః ॥ 44

ఓ రాజా ! ధర్మబుద్ధుడైన వసుదేవునితో ఋషులందరు స్యమంతపంచక క్షేత్రమున శాస్త్రవిధానమును అనుసరించి సర్వోత్కృష్టములైన యాగములను చేయించుటకు యాజకులుగ నియమితులైరి. 44

శ్లో॥ తద్దీక్షాయాం ప్రవృత్తాయాం వృష్ణయః పుష్కరస్రజః ।
స్నాత్వాసువాససో రాజన్ రాజానశ్చ స్వలంకృతాః ॥ 45

టీ:- కించ. అవిశుద్ధచిత్తానాం అయం క్రమః త్వంతు కృతార్థ ఏవేత్యాహుః - వసుదేవేతి. ప్రార్చత్ అర్చితవాన్. యద్యస్మాత్ వాం యువయోః. (42-45)

వసుదేవుడు యాగదీక్షగైకొనగ యాదవులందరు స్నానములుచేసి కొత్త వస్త్రములు ధరించి పద్మముల దండలతో సింగారించుకొనిరి. రాజులు కూడా యథార్థముగ ఆలంకృతులైరి. 45

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తన్మహిష్యశ్చ ముదితా నిష్కకంఠ్యస్సువాససః ।
దీక్షాశాలా ముపాజగ్ముస్స్వాలిప్తా వస్తుపాణయః ॥ 46

వారి భార్యలు కూడా విభుల సంతసముతో స్వర్ణా భరణములు, కొత్త వస్త్రములు ధరించి అనులేపనములతో చక్కగా అలంకరించుకొని యాగమునకు అవసరమైన పూజా ద్రవ్యములను స్వీకరించి యాగశాలకు చేరిరి. 46

శ్లో॥ నేదుర్మృదంగ పటహ శంఖభేర్యానకాదయః ।
ననృతుర్నట నర్తక్యస్తుష్టువుస్సూత మాగధాః ॥
జగుస్సుకంఠ్యో గంధర్వ్యస్సంగీతం సహభర్తృకాః ॥ 47

మద్దెలు, తప్పెటలు, భేరులు,శంఖములు మొదలైన వాద్యములు మ్రోగినవి. నటీనటులు నాట్యములు సల్పిరి.స్తోత్రపాఠములు చదువుచు సూతులు,మాగధులు, సంతోషమునుపొందిరి. మధురమైన కంఠములు గల గంధర్వ స్త్రీలుభర్తలతోసహా పాటలుపాడిరి. 47

టీ:- తదితి. స్వాలిప్తాః కుంకుమాదిభిః. వస్తుపాణయః గృహీతార్హణ హస్తాః. (46-47)

శ్లో॥ తమభ్యషించన్ విధివదక్తమభ్యక్త మృత్విజః ।
పత్నీభిరష్టాదశభిస్సోమరాజమివోడుభిః ॥ 48

టీ:- తమితి. అక్తం నేత్రయోః అంజనేన. అభ్యక్తం సర్వాంగేషు నవనీతేన. 48

శ్లో॥ తాభిర్దుకూలవలయైర్హారనూపుర కుండలైః ।
స్వలంకృతాభిర్విభవైర్దీక్షితో జన సంవృతః ॥ 49

ఆ వసుదేవున్ని ఋత్విక్కులు కండ్లకు కాటుకను, శరీరమంతయు వెన్నను పులిమి శాస్త్రోక్తముగా అభిషేకించిరి. ఆయన చక్కని వస్త్రములు, హారములు, అందెలు, వడ్డాణములు మొదలైన సంపదలచే అలంకృతులైన పదునెనిమిదిమంది భార్యలతో చంద్రుడు నక్షత్ర సతులతో విరాజిల్లునట్లుగా ప్రకాశించుచు యాగదీక్షితుడైనాడు. (48-49)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తస్యర్త్విజో మహారాజన్నూత్న కౌశేయవాససః ।
ససదస్యావిరేజుస్తే యథా వృత్రహణో౽ధ్వరే ॥ 50

టీ:- తాభిరితి.తాభిః పత్నీభిస్సహితః దీక్షితః విరేజే. (49-50)

ఓ రాజా ! కొత్త దీక్షా వస్త్రములు ధరించి సదస్యులతో కూడి ఆ వసుదేవుని యాగనిర్వాహకులైన ఋత్విజులుకూడా వృత్రాసురుని సంహరించిన మహేంద్రునియాగము నందలి ఋత్విజులవలె ప్రకాశించిరి. 50

శ్లో॥ తథా రామశ్చ కృష్ణశ్చస్వై స్వైః ర్బంధుభిరన్వితౌ ।
విరేజతుస్సుతైర్దారైర్జీవేశౌ స్వభూతిభిః ॥ 51

టీ:- తథేతి. జీవేశౌ సర్వజీవానామీశ్వరౌ. 51

తదుపరి సర్వజీవులకు ఈశ్వరులైన బలరామకృష్ణులు తమ తమ బంధువులతో, భార్యాపుత్రాదులతో, తమ దివ్య విభూతులతో ప్రకాశించిరి. 51

శ్లో॥ ఈజే౽నుయజ్ఞం విధినా అగ్నిహోత్రాదిలక్షణైః ।
ప్రాకృతైర్వైకృతైర్యజ్ఞైర్ద్రవ్యజ్ఞాన క్రియేశ్వరం ॥ 52

యజ్ఞాధికారియైన యజ్ఞేశ్వరుని గురించిన ప్రతియజ్ఞమునూ అగ్నిహోత్రముమొదలైన లక్షణాలతో జ్యోతిష్టోమము, దర్శపూర్ణమాసము మొదలైన ప్రాకృత యజ్ఞములను, పిమ్మట లింగాదులచేత అతి దేశమును (రూపనిష్పత్తిని) పొందిన సర్వాంగము లలో సూర్యసూత్రము మొదలైన వైకృత యాగములను - అన్నిటిలో ద్రవ్యము, పురోడాశము, జ్ఞానము, క్రియాకలాపములు మొదలైన వానితో ఋషులు వసుదేవుని చేత చేయించినారు. 52

శ్లో॥ అథర్త్విగ్భ్యో౽దదాత్కాలే యథామ్నాతం సదక్షిణాః ।
స్వలంకృతేభ్యోలంకృత్య గో భూకన్యా మహాధనాః ॥ 53

పిమ్మట వసుదేవుడు చక్కగా అలంకృతులైన ఋత్విక్కులందరికీ ఆయా సందర్భములందు చెప్పబడిన విధముగా బంగారు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- ఈజఇతి. అనుయజ్ఞం ప్రతియజ్ఞం. ఆమ్నాతసర్వాంగాః ప్రాకృతాఃజ్యోతిష్టోమదర్శపూర్ణమాసాదయః. తేభ్యశ్చోదనాలింగాదిభి రతిదేశ ప్రాప్తాంగాః వైకృతాః సౌర్యసత్రాదయః. తైస్సర్వైః ద్రవ్యం పురోడాశాది జ్ఞానం మంత్రః.క్రియాకర్మ. తేషామీశ్వరం (52-53)

ఆభరణములతో అలంకరించిన గోవులను, భూమిని, కన్యలను; ధనములను, దక్షిణగా సమర్పించెను. 53

శ్లో॥ పత్నీసంయాజావభృథైశ్చరిత్వాథ మహర్షయః ।
సస్నూ రామహ్రదే విప్రా యజమాన పురస్సరాః ॥ 54

టీ:- పత్నీసంయాజేతి. సస్నుః స్నానం చక్రుః. 54

యజమాని అయిన వసుదేవుని యాజ్ఞానంతరము భార్యలతోగూడా అవభృథస్నానము చేయించి, పిమ్మట మహర్షులందరు శ్యమంతపంచక మందలి కాసారములందు స్నానమాడినారు. 54

శ్లో॥ స్నాత్వాలంకార వాసాంసి వందిభ్యోఽదాత్తథాస్త్రియః ।
తతస్స్వలంకృతాన్ వర్ణానాశ్వభ్యోఽన్నేన పూజయత్ ॥ 55

టీ:- స్నాత్వేతి. ఆశ్వభ్యః శునోఽభివ్యాప్య. అన్నేన పూజయత్ అపూజయత్. 55

స్నానానంతరము వసుదేవుడు అతని భార్యలు వందిమాగధులకు అలంకారములు, వస్త్రములు ఇచ్చినారు. పిమ్మట బంగారు ఆభరణము లతో చక్కగా అలంకృతములైన గుఱ్ఱములకు కుక్కల పరిరక్షణలో అన్నమును సమర్పించి పూజించినారు. 55

శ్లో॥ బంధూన్ సదారాన్ ససుతాన్ పారిబర్హేణభూయసా ।
విదర్భకోసలకురూన్ కాశికేకయ సృంజయాన్ ॥ 56

బంధువులను, విదర్భ, కోసల, కురు, కాశి, కేకయ, సృంజయాదులైన రాజులను, సదస్యులను, ఋత్విక్కులను, దేవతలను, మానవరూపము ధరించి వచ్చిన పితృ దేవతలను, చారణులను

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



టీ:- బంధూనితి. బంధ్వాదీన్ చారణాంతాన్. పారిబర్హేణ ప్రీతిదానేన చ అపూజయత్. 56

వారివారి భార్యాపుత్రాదులను వసుదేవుడు ఇష్టములైన బహుమానములతో సత్కరించినాడు. వారందరూ శ్రీకృష్ణుని వద్ద సెలవు గైకొని యాగమును పొగుడుచు తమతమ నివాసములకు వెళ్ళిరి. (56-57)

శ్లో॥ సదస్యర్త్విక్సురగణాన్ నృభూత పితృచారణాన్ ।
శ్రీనికేతమనుజ్ఞాప్య శంసంతః ప్రయయుః క్రతుమ్ ॥ 57

టీ:- సదస్యేతి. తే చ సర్వే ప్రయయుః. 57

శ్లో॥ ధృతరాష్ట్రోఽనుజః పార్థాః భీష్మద్రోణౌపృథాయమౌ ।
నారదో భగవాన్వ్యాసస్సుహృత్సంబంధి బాంధవాః ॥ 58

టీ:- ప్రయాణే కేషాంచిద్విశేషమాహ- ద్వాభ్యాం.ధృతరాష్ట్రఇతి. అనుజోవిదురః పార్థాః యుధిష్ఠిరభీమార్జునాః. యమౌనకులసహదేవౌ. 58

శ్లో॥ బంధూన్పరిష్వజ్య యదూన్ సౌహృదాక్లిన్న చేతసః ।
యయుర్విరహకృచ్ఛ్రేణ స్వదేశాంశ్చామరప్రభాః ॥ 59

ధృతరాష్ట్రుడు, ఆయన తమ్ముడు విదురుడు, కుంతీ పుత్రులైన ధర్మజభీమార్జునులు, భీష్మద్రోణులు, కుంతి, కవలలైన నకుల సహదేవులు, నారదుడు, భగవంతుడైన వ్యాసుడు, ఇతర మిత్రులు, బంధువులు, చుట్టములు మొదలైనవారు స్నేహాధిక్య కారణముగా ఆర్ద్రహృదయముతో బంధువులైన యాదవులను గాఢముగా కౌగిలించుకొని వసుదేవుడు వీడుకొల్పగా తమ తమ దేశములకు దేవతలవంటి కాంతులతో, వియోగ భారముతో వెళ్ళిరి. (58-59)

శ్లో॥ నందస్తు సహగోపాలైర్బృహత్యా పూజయార్చితః ।
కృష్ణరామోగ్రసేనాద్యైర్న్యవాత్సీద్బంధువత్సలః ॥ 60

టీ:- బంధూనితి. సౌహృదేన ఆక్లిన్నాని చేతాంసి యేషాంతే. (59-60)

గోపాలుర సహితముగా నందరాజును వసుదేవుడు గొప్పగా సత్కరించినాడు. నందుడు-కృష్ణుడు, బలరాముడు, ఉగ్రసేనుడు మొదలైన వారితోకలిసి బంధుప్రేమతో అక్కడే ఉండిపోయినాడు. 60

శ్లో॥ వసుదేవోఽఞ్జసోత్తీర్య మనోరథమహార్ణవమ్ ।
సుహృద్వృతః ప్రతమనానందమాహ కరేస్పృశన్ ॥ 61

టీ:- వసుదేవ ఇతి. మనోరథో యజ్ఞవిషయః. తమేవ మహార్ణవం. 61

వసుదేవుడీ విధముగా యాగములు చేసి దేవఋణమును తీర్చుకొని తన చిరకాలవాంఛయైన యాగనిర్వహణమనే సముద్రమును అధిగమించి స్నేహితులతో పరివేష్టితుడై సంతోషచిత్తుడై ఆత్మీయుడైన నందునిచేతిని తనచేతిలో స్పృశించుచు ఈవిధముగాచెప్పినాడు. 61

**వసుదేవ ఉవాచ**

శ్లో॥ భ్రాతరీశకృతః పాశోనృణాం యస్స్నేహ సంజ్ఞితః ।
తం దుస్త్యజమహం మన్యే శూరాణామపి యోగినామ్ ॥ 62

టీ:- భ్రాతరితి. శూరాణాం బలేన యోగినాం జ్ఞానేనాపీత్యర్థః. 62

**వసుదేవుడు ఇట్లు చెప్పినాడు**

ఓ సోదరా! మానవులకు పరమేశ్వరుడు ఎన్నటికి విడదీయరాని స్నేహమనే బంధమును ఏర్పరచినాడు. పరాక్రమవంతులైనను, సర్వసంగములు పరిత్యజించిన మాహాయోగులైనను ఈస్నేహ బంధములనుండి విడిపించు కొనలేరని నేనుభావించుచున్నాను. 62

శ్లో॥ అస్మాస్వ ప్రతికల్పేయం యత్కృతాజ్ఞేషు సత్తమైః ।
మైత్ర్యర్పితాఽఫలాచాపి న నివర్తేత కర్హిచిత్ ॥ 63

స్నేహబంధము ఎందుకంత బలీయమైనదో చెప్పుచున్నాడు- మాసంతానమును లాలన పోషణలతో వృద్ధికి తెచ్చిన మీ ఉపకారమును గుర్తించలేకపోయిన మాపై సత్పురుషులైన మీరు ప్రకటించిన

టీ:- తత్తుకుతస్తత్రాహ-అస్మాస్వితి. కృతాజ్ఞేషు కృతముపకారమజానత్సు. సత్తమైర్భవద్భిః అప్రతికల్పా అనుపమా మైత్రీయమర్తితా. అఫలాపి ప్రత్యుపకారశూన్యాపి. కర్హిచిత్ యద్యస్మాన్న నివర్తేత తస్మాదీశకృతః పాశో యః భవతామపి గమ్యత ఇత్యర్థః.63

స్నేహభావము నిరుపమానమైనది. కొందరు మహానుభావులు ప్రతిఫలము లేకపోయినను మైత్రితో అంగీకరించిన కార్యభారమును ఎప్పటికిని వదిలిపెట్టరు. భగవంతుడు ఏర్పరచిన ఈ స్నేహబంధము మీయందు సార్థకమైనది. 63

శ్లో॥ ప్రాగకల్యాస్తు కుశలం భ్రాతర్వోనాచరామహి ।
అధునా శ్రీమదాంధాక్షా న పశ్యామః పురస్థితాన్ ॥ 64

టీ:- అఫలాత్మమేవాహ.ప్రాగితి. హే భ్రాతః అకల్యాః అసమర్థత్వాత్ వః కుశలం ప్రియం నహ్యాచరామ నకృతవంతో వయం. అధునా శ్రీమదేనంధాన్యక్షిణి యేషాం తే. 64

నేను మీకేవిధమైన ప్రతిఫలమునునివ్వకపోయితిని. ఓ సోదరా! పూర్వము మీకు ప్రత్యుపకారము చేయగల శక్తిలేనందువల్ల మేలు కలిగించలేక పోయితిని. ఇప్పుడు సంపద్గర్వముతో కన్నులు మూసుకుపోయి ఎదురుగా ఉన్న నిన్నుకూడా దర్శించలేక పోయితిని. 64

శ్లో॥ మారాజ్య శ్రీరభూత్పుం సశ్శ్రేయస్కామస్య మానద ।
సుజనానుతబంధూన్వా న పశ్యతి యయాంధ దృక్ ॥ 65

మా మర్యాద నిలిపిన ఓ పుణ్యమూర్తీ! శుభమును కోరునట్టి మానవునికి రాజభోగము లభించకూడదు. సంపదలు ఒనగూరినచో గర్వముతో మానవుని కన్నులు మూసుకొని పోయిస్వార్థముతో సత్పురుషులనే కాదు, ఆత్మీయులైన బంధువులను కూడాఆదరించడు. 65

శ్లో॥ ఏవం సౌహృదశైథిల్య చిత్తఆనకదుందుభిః ।
రురోదతత్కృతాం మైత్రీంస్మరన్నశ్రువిలోచనః ॥ 66

టీ:- మేతి. రాజ్యశ్రీః మాభూత్ ఛాందసః అడాగమః. (65-66)

నందరాజు స్నేహభావమునకు ప్రత్యుపకారము చేయక మిత్రుని నిర్లక్ష్యము చేసితినని గాఢ స్నేహభావముతో మనస్సు నిలుపలేక అతడు తమకు చేసినమేలును స్మరించుచు వసుదేవుడు కంటనీరు పెట్టుకున్నాడు. 66

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ నందస్తు సఖ్యుః ప్రియకృత్ప్రేమ్ణా గోవిందరామయోః ।
అద్యశ్వ ఇతి మాసాంస్త్రీన్ యదుభిర్మానితో௨వసత్ ॥ 67

నందరాజు మిత్రుడైన వసుదేవుని బలవంతముచేత, బలరామ కృష్ణులందలి వాత్సల్యముచేత ఈ రోజు, రేపుఅని తన ప్రయాణమును వాయిదావేసుకొనుచు యాదవుల ఆదరాభిమానమును పొందుచు మూడు మాసములు అక్కడే వసించినాడు. 67

శ్లో॥ తతఃకామైఃపూర్యమాణస్సవ్రజస్సహబాంధవః ।
పరార్థ్యాభరణక్షౌమనానానర్ఘ్య పరిచ్ఛదైః ॥ 68

టీ:- నంద ఇతి. అద్యశ్వ ఇతి. ప్రాతర్నిర్గమే అద్యైవాపర్ణాహే గమ్యతామితి అపర్ణాహే నిర్గమే శ్వో గమ్యతామితి. పునః పునరేవం మానితః. (67-68)

శ్లో॥ వసుదేవోగ్రసేనాభ్యాం కృష్ణోద్ధవబలాదిభిః ।
దత్తమాదాయ పారిబర్హం యదుభిర్యాపితోయయౌ ॥ 69

పిమ్మట మనోరథము ఈడేరిన వాడై బంధువులు, ప్రజవాసులు వెంటరాగా అపారమైన సంపదలు, ఆభరణములు, వస్త్రములను వసుదేవుడు, ఉగ్రసేనుడు, కృష్ణుడు, ఉద్ధవుడు, బలరాముడు మున్నగు వారు సమర్పించగా స్వీకరించి, వారు ఆదరముగా రాచమర్యాదలతో సాగనంపగా నందుడు తన గోకులమునకు తిరిగి వెళ్ళినాడు. (68-69)

శ్లో॥ నందోగోప్యశ్చగోపాశ్చ గోవిందచరణాంబుజే ।
మనఃక్షిప్తం పునర్హర్తుమనీశామధురాం యయుః ॥ 70

నందుడు, గోపకులు, గోపికలు గోవిందుని పాదపద్మములందు నిల్చిన మనస్సును మరలా తీసుకొని వెళ్ళుటకు శక్తి చాలని వారై మధురా నగరమునకు వెళ్ళినారు. అనగా వారందరు నిరంతరము కృష్ణపరాదీన మనస్కులైరని భావము. 70

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ పాండవాశ్చ మహాత్మనః సర్వే చ మునిసత్తమాః ।
అనుజ్ఞాతాః కేశవేన బాష్పగద్గదభాషిణః ॥
శక్రప్రస్థం యయుస్సర్వే స్వజనైః పరివారితాః ॥ 71

మహాత్ములైన పాండవులు, మునీశ్వరులెల్లరు శ్రీకృష్ణుని యెడబాయుటకై పరితపించి ఉద్విగ్న భావముతో, కన్నీటితో, బొంగురు పోయిన గొంతుతో మాటలు తడబడగా ఆయన అనుమతిని పొంది, పరివార జనముతో కలిసి ఇంద్రప్రస్థమునకు వెడలి పోయిరి. 71

శ్లో॥ బంధుషు ప్రతియాతేషు వృష్ణయః కృష్ణదేవతాః ।
వీక్ష్య ప్రావృషమాసన్నాం యయుర్ద్వారవతీం పురమ్ ॥ 72

టీ:- వసుదేవేతి. యాపితః మహతా సైన్యేన ప్రస్థాపితః.(69-72)

శ్రీకృష్ణుడే పరదైవమనే యాదవులందరు గూడా బంధువులందరు వారివారి నెలవులకు వెళ్ళిపోయాన తరువాత వర్షాకాలము సమీపించుటను గమనించి ద్వారకా నగరమునకు తిరిగి వెళ్ళిరి. 72

శ్లో॥ జనేభ్యః కథయాంచ క్రుర్యదు దేవమహోత్సవమ్ ।
యదాసీత్తీర్థ యాత్రాయాం సుహృత్సందర్శనాదికమ్ ॥ 73

టీ:- జనేభ్యఇతి. యదుదేవస్య మహోత్సవం యజ్ఞాదిలక్షణం సుహృత్సందర్శనాదికం చేతి. 73

వసుదేవుడు దేవ ఋణమును తీర్చుటకై చేసిన యజ్ఞరూపమైన మహోత్సవమునందు శ్యమంతపంచక తీర్థయాత్ర కారణముగా బంధుమిత్ర సందర్శన లాభములు కలుగుటను జనులు కథలుగా చెప్పుకొనిరి. 73

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, చతురశీతితమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు ఎనుబది నాల్గవ అధ్యాయముసమాప్తము**







## పంచాశీతితమోஉధ్యాయః

శ్లో॥ పంచాశీతితమే రామకృష్ణౌ సంప్రార్థితౌ స్తుతౌ ।
పిత్రే జ్ఞానమథో మాత్రే మృతాన్ పుత్రానయచ్ఛుతామ్ ॥
నందయిత్వా కురుక్షేత్రే యాత్రాయాంసుహృదోబహూన్ ।
తత్త్వజ్ఞానం తతః పిత్రోరాదిశన్మృతసూనుభిః ॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ అథైకదాత్మజౌప్రాప్తౌ కృతపాదాభివందనౌ ।
వసుదేవోஉభినంద్యాహ ప్రీత్యా సంకర్షణాచ్యుతౌ ॥ 1

శ్లో॥ మునీనాం స వచశ్శ్రుత్వాపుత్రయోర్ధామ సూచకమ్ ।
తద్వీర్యైర్జాతవిస్రంభః పరిభాష్యాభ్యభాషత ॥ 2

టీ:- మునీనామితి. ధామ ప్రభావః. తత్సూచకం. జాతవిస్రంభః ఉత్పన్నవిశ్వాసః. పరిభాష్య సంబోధ్య. 2

## 85వ అధ్యాయము

ఈ ఎనుబదిఅయిదవ అధ్యాయమున బలరామకృష్ణులు కురుక్షేత్ర యాత్రలో పలువురు బంధుమిత్రులను సంతోషపరిచి, తల్లిదండ్రుల అభ్యర్థనమేరకు దేవకీదేవికి ముందుగా జన్మమాత్రము చేతనే మృతులైన ఆరుగురు కొడుకులను తెచ్చిచూపి, సంతోషపరచి, తత్త్వజ్ఞానమును బోధించుట చెప్పబడినది.

**శ్రీ శుకుడిట్లు పలికెను**

ఒకసారి బలరామకృష్ణులు తండ్రివసుదేవునికి ఏకాంతమున పాదాభివందనముచేయగా ఆయన సంతసించి మెచ్చుకొని ప్రీతితో వారి కిట్లని చెప్పినాడు. 1

తన పుత్రులైన బలరామకృష్ణులిరువురి ప్రభావమును గురించి మునీశ్వరులు చెప్పిన మాటలను విని వారి గొప్పదనముపై విశ్వాసము కలవాడై వారిని పేరు పేరున సంబోధించి, వారిని ఈవిధముగా అడిగినాడు. 2





ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

వసుదేవ ఉవాచ

శ్లో॥ కృష్ణకృష్ణ మహాయోగిన్ సంకర్షణ సనాతన ।
జానే వామస్య యత్సాక్షాత్ప్రధాన పురుషౌపరౌ ॥ 3

టీ:- కృష్ణేతి. అస్య విశ్వస్య. యత్సాక్షాత్ స్వరూపభూతం కారణం. ప్రధానపురుషౌ నామపరౌ తయోరపి కారణత్వేనేశ్వరౌ చ. సాక్షాద్వాం యువామితి. జానే. 3

వసుదేవుడిట్లని అడిగినాడు

యోగీశ్వరుడవైన ఓ కృష్ణా! సనాతుడవైన ఓ సంకర్షణా! మిమ్ములను ఈ అనంత విశ్వముయొక్క స్వరూపమునకు సాక్షాత్తుగా కారణమైన ప్రధాన పురుషులు, ఈశ్వరులు అని నేనుఎరుగుదును. 3

శ్లో॥ యత్ర యేన యతో యస్య యస్మై యద్యద్యథా యథా ।
స్యాదిదాం భగవాన్ సాక్షాత్ప్రధానపురుషేశ్వరః ॥ 4

టీ:- నన్విదం విశ్వమనేకైః కారణైర్జాయమానం కుతః ప్రధాన పురుషాత్మకం కుతస్తరామావయోస్తత్కారణత్వేనేశ్వరత్వం. తత్రాహ- యత్రేతి. యత్ర అధికరణే. యేన కర్త్రాకరణేన చ యతః అపాదానాత్. యస్య సంబంధేన షష్ఠ్యర్థస్యాకారకత్వే౭పి నిమిత్తతోక్తా. యస్మై సంప్రదానాయ యద్యదితి ప్రయోజ్యప్రయోజకకర్తృకర్మకారకే దర్శితే. న తు తయోర్నాస్తి భేదః యథోక్తం. శ్లో. కరోతిక్రియమాణేన న కశ్చిత్కర్మణా వినా, భవత్యర్థస్య కర్తా చ కరోతేః కర్మజాయతే. తథా. శ్లో. కరోత్యర్థస్య యః కర్తా భవితుస్సప్రయోజకః, భవితా తమ

ఈ జగత్తు అనేక కారణములచేత పుట్టినది. అయినప్పుడు ఏ ఒక్కరికో ప్రధాన పురుషత్వము ఎట్లు కలుగును? దీని నుండి ఎట్లు తరించగలము? మీ ఇరువురుకి జగత్కారణత్వము చేత ఈశ్వరత్వమెందుకు కలిగినది? అనే విషయమై చెప్పుచున్నాడు – ఏ అధికరణమున (ఆధారమున), ఏ కర్తచేత, ఏ ఉపకరణమువలన, దేనినుండి విడివడి ఏ సంబంధముతో, ఎవరికొరకు, ఏ ప్రయోజనము ను ఆశించి, ఏదేది యేయేవిధముగా ఈ జగద్రూపముగా సాక్షాత్తు ప్రధాన పురుషుడైన భగవంతుడు అయినాడు? చేయబడే కర్మ, చేయునట్టి కర్త వేరువేరుగా కనపడుచుండగా ఆ రెంటికి భేదములేదని చెప్పుటకు కారణమేమనే విషయమును చెప్పుచున్నాడు – కర్మ లేకుండా కర్తచే చేయబడు ఏ కార్యమునూ లేదు. ప్రయోజనసహితముగా

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

పేక్ష్యాథ ప్రయోజ్యత్వం ప్రపద్యత' ఇతి. చ.సత్యం. తథాప్యవస్థాభేదేన భేదో వివక్షితః. దృశ్యతే చావస్థాభేదః. తండులానోదనం పచతి.మృదం ఘటం కరోతీతి తదేవం సప్తవిభక్త్యర్థా దర్శితాః. యథేతి చ క్రియావిశేషణభూతానామన్యేషాం చ. అవ్యయానామర్థః స్యాదితి క్రియాపదార్థోపలక్షణం ఏవం సర్వ ప్రపంచమనూద్య తత్కారణ భగవద్రూపతాం విధత్తే–ఇదం సాక్షాదితి. ప్రధానం భోగ్యం. పురుషః భోక్తా. తయోరీశ్వరో భగవాన్ త్వమేవసాక్షాదితి. తయోరైక్యమభి ప్రేత్యైకవచనం. 4

విషయమును (పనిని) చేయువాడు కర్త. అట్టి కర్త లేకుండా ప్రయోజకత్వము (కర్మ నిర్వహణ) ఉండదు. ('కరోతి క్రియమాణేన నకశ్చిత్కర్మణావినా । భవత్యర్థస్య కర్తాచ కరోతేః కర్మజాయతే' ॥ 'కరోత్యర్థస్యయః కర్తా భవితుః సప్రయోజకః । భవితా తమపేక్ష్యాథ ప్రయోజ్యత్వం ప్రపద్యత' ॥) అనే విషయము సత్యమే. అయినప్పటికి చేయుచున్నాడు అనే క్రియకు ఆ క్రియను నిర్వహించేవాడైన కర్త లేకపోయినచో కర్మ జరుగదు. కర్తను ఆశించే కర్మ చేయబడుచున్నది. క్రియావ్యాపారమును నిర్వహించేవాడు కర్త. క్రియాఫలభోక్త కర్మ అనే అవస్థా భేదముచేత కర్త, కర్మలు వేరనే విషయము. ఆవస్థాభేదమును చూపుచున్నాడు – బియ్యమును అన్నముగా వండుచున్నాడు. వ్యక్తి కర్త, బియ్యము కర్మ, వండబడి అన్నమగుటలో క్రియావ్యాపార ఫలములున్నవి. అట్లే మట్టిని కుండగా చేయుచున్నాడు అనేది కూడా ఇట్లే, ఇక్కడ ఏడు విభక్తుల అర్థము చూపబడినది. యథా అనేది ఇతర క్రియాది విశేషణములకును వర్తించును. అవ్యయముల అర్థము క్రియా పదార్థమునకు ఉపలక్షకము. కనుక ఇదేవిధముగా సర్వ ప్రపంచకమునకు ఆపాదించి, దానికి కారణమైన భగవంతుని రూపత్వమును సాక్షాత్తు అనేమాటలో ఆపాదించుచున్నాడు. ఈ ప్రపంచమే భగవత్స్వరూపము అనిభావము. ప్రధానం భోగ్యవస్తువు, దానిని ఉపభోగించే భోక్త పురుషుడు. ఆరెండింటికి నీవేఈశ్వరుడవు. 4

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ ఏవం నానావిధం విశ్వమాత్మసృష్టమధోక్షజ ।
ఆత్మనానుప్రవిశ్యాత్మన్ ప్రాణో జీవో బిభర్ష్యజః ॥ 5

టీ:- కించ. ధారణ పోషణ కర్త్రాపి త్వమేవేత్యాహ- ఏవమితి. హే ఆత్మన్. ప్రాణః క్రియాశక్తిః. జీవోజ్ఞానశక్తిశ్చసన్. త్వమేవ బిభర్షీతి. 5

ఈ అనంతవిశ్వమునకు ఆధారము, పోషకుడవు నీవే అనే విషయమును చెప్పుచున్నాడు - ఓ అధోక్షజా! ఈ అనేక విధములైన విశ్వమును నీవే సృష్టించినావు. ఓ పరమాత్మా! ప్రాణ రూపమైన క్రియా శక్తిని, జీవ రూపమైన జ్ఞాన శక్తిగా నీవే దీనియందు ప్రవేశించి భరించుచున్నావు. 5

శ్లో॥ ప్రాణాదీనాం విశ్వసృజాం శక్తయో యాః పరస్య తాః ।
పారతంత్ర్యాద్వై సాదృశ్యాద్ద్వయోశ్చేష్టైవ చేష్టతామ్ ॥ 6

టీ:- ప్రాణాదీనాం విచిత్రశక్తీనాం కారణత్వావగమాత్ కథం పరమేశ్వరస్యైవ కారణత్వేన సర్వాత్మకత్వముచ్యత ఇత్యాశంక్య ప్రాణాదిశక్తయోఽపి తస్యైవేత్యాహ-ప్రాణాదీనమితి. ప్రాణః ప్రకృతి భూతంసూత్రం.తదాదీనాం విశ్వసృజాం విశ్వకారణానాం. యాశ్శక్తయః తాః పరస్య పరమకారణస్య పరమేశ్వరస్యైవ, కుతః పారంతత్ర్యాత్ యథా వేధశక్తిర్నబాణస్య. అపి తు పురుషస్య తద్వదిత్యర్థః. నను భగవతః ప్రాణాది వర్గస్య చ స్వాతంత్ర్యమేవ కిం నస్యాత్. అత ఆహ-వై సాదృశ్యాత్ ద్వయోరితి. చేతనా చేతన త్వేన విసదృశత్వాత్ ద్వయోః అచేతన ప్రాణాదివర్గస్య చేతనపారతంత్ర్యమేవ యుక్తమిత్యర్థః. యద్వా. ప్రాణాదిషు ద్వయోర్ద్వయోరేవ తావద్విసదృశత్వం విరుద్ధక్రియా

విచిత్రశక్తులుగలిగిన ప్రాణాదులకు కారణత్వమున్నందు వలన ఇక పరమేశ్వరునికి కారణత్వముచేత ఏ విధముగా సర్వాత్మకత్వమును చెప్పుటకు వీలు కలుగును అని అనుమానించి ప్రాణాదులకున్న విచిత్ర శక్తులుకూడా పరమాత్మవే అనే నిర్ణయమును తెలుపుచున్నాడు - ప్రాణము ప్రకృతి రూపమైన మూలసూత్రము. అది మొదలుకొని జగత్తు సృష్టికర్తలకు, విశ్వ కారణములకు ఉన్న సర్వశక్తులన్నియు సర్వకారణరూపుడైన పరమాత్మవే. ప్రాణాది శక్తులన్నియు పరతంత్రమైనవే. వీనికి కారణత్వమున్నను, ముందుగా అవి సర్వకారణ రూపుడైన పరమాత్మకు కార్యములుగా ఉన్నవి. లక్ష్యమును భేదించునది బాణమే అయినను దానికి లక్ష్యమును గుర్తించు శక్తి లేదు. లక్ష్యమును గుఱిచూచినవాడు పురుషుడే, లక్ష్యభేదనము వలన కీర్తి లక్ష్యమున గురిచూచి వదిలిన విలుకానికే దక్కును కాని లక్ష్యమును భేదించిన బాణమునకు రాదు. పురుషుడు, బాణములు రెండింటికి గుఱిచూచుట,

కారిత్వాత్ కింపునర్బహూనాం. తస్మాదేకేన. సర్వజ్ఞేన సర్వశక్తీనా మధిష్ఠితానా మేవ విశిష్టకార్యారంభకత్వం యుక్తం. న సత్వంత్రాణామితి. తథాచోక్తం శ్లో. "యద్వైతే సంహతా భావా భూతేంద్రియమనోగుణాః, యదాయతననిర్మాణేన శేకుర్బ్రహ్మవిత్తమ. తదా సంహత్య చాన్యోన్యం భగవచ్ఛక్తిచోదితాః,సదసత్త్వముపాదాయ చోభయం సస్సృజుర్హ్యదః." ఇతి. తథా శ్లో. నానాత్వాత్స్వక్రియానీశాఃప్రోచుః ప్రాంజలయో విభుమిత్యాది. నను ప్రాణాదీనాం క్రియాకారిత్వం శక్త్యభావే కుతుస్స్యాదత ఆహ–చేష్టైవ చేష్టతామితి. చేష్టమానానామేషాం చేష్టైవ. న శక్తిః యథా వాయోశ్శక్త్యా తృణాదీనాం చలనం. యథా చ పురుషస్య శక్త్యా శరాణాం వేధ ఇతి. (6)

లక్ష్యమును భేదించుటలలో సాదృశ్యమున్నది. గురిచూడగలుగుట అనేది చేతన ధర్మము. అది పురుషునికి మాత్రమే ఉన్నది. బాణము అచేతనమైనది. అందువల్ల పురుషుడు, బాణములకు సాదృశ్యములేదు. అట్లే అచేతనములైన ప్రాణాదుల సముదాయమునకు చేతనుడైన పరమాత్ముని పారతంత్ర్యమే ఉన్నదని నిశ్చయము. అయితే భగవంతుని వలనే ప్రాణాది వర్గమునకు స్వాతంత్ర్యము ఎందుకుండగూడదు అనే విషయమై చెప్పుచున్నాడు – పురుషుడు – చేతనుడు, ప్రాణాదులు – అచేతనములు జడములు. అందువల్ల ఈ రెండింటికీ (పురుష ప్రాణాదులకు) సాదృశ్యము లేదు. కనుక అచేతనములైన ప్రాణాదుల సమదాయమునకు చేతనుడైన పురుషుని పారతంత్ర్యమున్నదనుటయే యుక్తమైనది. లేక ప్రాణాదులు రెండు రెండింటి మధ్యనే అవి చేసే పనులు వేరువేరుగా ఉన్నందు వలన వానిలో వానికే సాదృశ్యముండుట లేదు. ఇన్ని మాటలెందుకు. సర్వజ్ఞుడైన ఒకే పరమాత్మ చేతన వ్యవహారముచేతనే సర్వ శక్తులకు అధిష్ఠాతలైన ప్రాణాదులకు కార్యారంభకత్వము కలుగుచున్నదనుట యుక్తము. అందుకే ప్రాణాదులు స్వతంత్రములు కావని చెప్పబడినది. "యద్వైతే సంహతా భావా భూతేంద్రియ మనో గుణాః, యదాయతననిర్మాణేన శేకుర్బ్రహ్మవిత్తమ. తదా సంహత్య చాన్యోన్యం భగవచ్ఛక్తిచోదితాః ,సదసత్త్వముపాదాయ చోభయం సస్సృజుర్హ్యదః" పంచభూతములు,

ఇంద్రియములు, మనస్సు, త్రిగుణములు అన్ని ఏకముఖముగా కలిసినను అవన్నియు సృష్టి నిర్మాణమునకు సమర్థములు కావు. కనుక ఓ బ్రహ్మజ్ఞాన శ్రేష్ఠా! పురుషుడు, ప్రకృతి పరస్పరము కలసి భగవంతుని ఆశ్రయత్వము చేత ప్రేరణ పొందినవై అనగా జడము చేతనత్వమును, సంతరించుకొని సృష్టి కార్యమును నిర్వహించినవి. చేతన రూపుడైన పరమాత్మ, జడమైన ప్రకృతుల పరస్పర సామరస్య సమ్మేళనమే ఈ సృష్టి అని భావము. 6

శ్లో॥ కాంతిస్తేజః ప్రభా సత్తా చంద్రాగ్న్యర్కర్క్ష విద్యుతాం ।
యత్ స్థైర్యం భూభృతాం భూమేర్వృత్తిర్గంధోఽర్థతో భవాన్ ॥ 7

టీ:- పారతంత్ర్యమేవ ప్రపంచయతి పంచభిః. కాంతిరితి. చంద్రస్య కాంతిః అగ్నేస్తేజః అర్కస్య ప్రభా. ఋక్షవిద్యుతాం సత్తా. స్ఫురణమాత్రేణ సత్త్వం.అర్థతో వస్తుతో భవాన్ తథాచ.శ్రు."న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతీ" తి. తథా చ స్మృతిః.శ్లో."యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం, యచ్చంద్రమసి యచ్చాగ్నౌతత్తేజో విద్ధిమామక" మితి భూమేర్వృత్తిః ప్రాణినామాధారత్వేన వర్తనం.గంధశ్చ భవాన్ తవైవ శక్తిరిత్యర్థః. 7

ఈ పారతంత్ర్యమును ఐదు శ్లోకములందు విశ్లేషించుచున్నాడు - చంద్రుని కాంతి, అగ్ని తాపము, సూర్యుని వేడిమి, నక్షత్రాల మెరుపుల నిగనిగల శక్తులు కనపడుటయందు మాత్రమే బలము కలవి. వాస్తవముగా అర్థము తోడను, వస్తుత్వము తోడను పరమాత్మయే వానికి ఆ విధముగా ప్రకాశించు శక్తిని కలిగించినాడు.'పరమాత్మ యందు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశించవు. ఈ మెరుపు తీగల కాంతిలేదు. ఇక అగ్ని తాపన శక్తికి అక్కడ ఉనికియే లేదు. స్వప్రకాశముగల పరమాత్మ వల్లనే ఇవన్నియు వెలుగుచున్నవి. ప్రకాశించే పరమాత్మను అనుసరించే ఈ వెలుగులన్నియు వర్తించుచున్నవి. అతని కాంతి వల్లనే ఈ సర్వము అనుసరించి వెలుగుచున్నదని' శ్రుతి ప్రమాణము. 'ఆదిత్యుని తేజము వల్లనే ఈ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తర్పణం ప్రాణనమపాం దేవత్వం తాశ్చ తద్రసః ।
ఓజస్సహో బలంచేష్టా గతిర్వాయో స్తవేశ్వర ॥ 8

టీ:- కించ.తర్పణమితి. హే దేవ. అపాంతర్పణం తృప్తిజనకత్వం. ప్రాణనం జీవనహేతుత్వం. తా ఆపశ్చతాసాం రసశ్చ త్వమేవ. కించ. వాయోరోజ ఆది తవైవ శక్తిః. 8

శ్లో॥ దిశాం త్వమవకాశోఽసిదిశఃఖం స్ఫోట ఆశ్రయః ।
నాదో వర్ణస్త్వమోంకార ఆకృతీనాం పృథక్కృతిః ॥ 9

టీ:- దిశామితి.దిశాముపాధికృతా కాశ ప్రదేశానామవకాశః దిశశ్చ త్వం. ఖంచ సామాన్యాకాశః. తదాశ్రయః స్ఫోటశ్చ శబ్దతన్మాత్రం పరావస్థావాగిత్యర్థః. నాదః పశ్యంతీ ఓంకారః మధ్యమా. వర్ణశ్చ ఆకృతీనాం పదార్థానాం పృథక్కృతిః పృథక్కరణమభిధానం యస్మా త్తత్పదం వర్ణపదాద్యాత్మికావైఖరీ చ త్వమిత్యర్థః.9

జగత్తు ప్రకాశించుచున్నది. చంద్రునియందలి, అగ్నియందలి కాంతులు నావే అని తెలియుము' అని స్మృతి ప్రమాణము. సమస్త ప్రాణులకు ఈ భూమి ఆధారమై నిలిచుటకు, గంధతన్మాత్రత్వము నీ శక్తి వలన సంబంధించినవే అని అర్థము. 7

ఓ దేవా! జలములకున్న తృప్తిని కలిగించుట, ప్రాణమునకు హేతువగుట, రుచి మొదలగు శక్తులు నీవే. వాయువుకున్న వేగము, బలము, చలన శక్తులు నీవే. 8

దిక్కులు ఉపాధికి (మూలస్థితికి) కారణమైన ఆకాశ ప్రదేశముల అవకాశము, దిక్కులు నీవే. ఆకాశము అనేది అన్నిటికి సామాన్యముగా అవకాశమైనది. ఆకాశమును ఆశ్రయించిన శబ్దతన్మాత్ర రూపమైన స్ఫోటము(ధ్వని), దీనికి శ్రేష్ఠమైన పరావస్థ(స్థితి) యైన వాక్కువుననే. ఓంకారమధ్యమందలి పశ్యంతీశక్తి, అక్షరములు (వర్ణములు, నామములు), పదార్థములయొక్క ఆకారమును, ఈ రూపనామముల భేదము వలన ఏర్పడిన వైవిధ్యములు (నామములను బట్టే పదార్థములు వేరువేరుగా అవగతమగుట), వైఖరీ రూపముగా బహిర్గతమైన అక్షర సమ్మేళన రూపముగా ఏర్పడిన పదసముదాయములు అన్నియును నీవే. 9

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఇంద్రియం త్వింద్రియాణాం త్వం దేవాశ్చ తదనుగ్రహః ।
అవబోధో భవాన్ బుద్ధేర్జీవస్యానుస్మృతిస్సతీ ॥ 10

టీ:- ఇంద్రియమితి. ఇంద్రియాణామింద్రియం విషయప్రకాశనశక్తిః దేవాశ్చ ఇంద్రియాధిష్ఠాతారః. తదనుగ్రహః తేషామధిష్ఠానశక్తిశ్చ త్వం. అవబోధః వ్యవసాయశక్తిః. అనుస్మృతిః ప్రతిసంధాన శక్తిః.10

ఇంద్రియముల యొక్క గ్రాహక రూపముగా (ఇంద్రియార్థ రూపముగా) విషయములను ప్రకాశింపజేయు శక్తి, ఆ ఇంద్రియములను అధిష్ఠించిన దేవతాసముదాయము, దయతో ఆ దేవతలు ఆయా ఇంద్రియములను ప్రవర్తింపచేయగల శక్తి నీవే. విషయావగాహన, పరిశ్రమించు శక్తి, జ్ఞాపకశక్తి, పరస్పరానుసంధాన శక్తి అన్నియును నీవే. 10

శ్లో॥ భూతానామసి భూతాదిరింద్రియాణాం చ తైజసః ।
వైకారికో వికల్పానాం ప్రధానమనుశాయినామ్ ॥ 11

టీ:- భూతానామితి. భూతానాం కారణం భూతాదిస్తామసోఽహంకారస్త్వమసి. ఇంద్రియాణాం కారణం తైజసః రాజసోఽహంకారస్త్వం వివిధం అధిదైవాధ్యాత్మ భేదేన కల్ప్యంత ఇతి వికల్పాః దేవాః. తేషాం కరణం వైకారికస్సాత్వికోఽహంకారశ్చ త్వం. అనుశాయినాం జీవానాం సంసారకారణం ప్రధానం త్వం. 11

సర్వభూతములకు కారణమైన వానికన్న ముందున తామసమనే అహంకారము నీవే. ఇంద్రియములకు కారణమై తేజోరూపమైన రాజసమనే అహంకారము నీవే. పలు విధములైన ఆధిదైవికాలు, ఆధ్యాత్మికములు అనే భేదములను కల్పించే వికల్పములే దేవతలు. వారికి సాధనమైన వికార రూపమైన సాత్త్వికాహంకారము కూడా నీవే. శరీరోపాధిలో ఉన్న జీవులకు సంసార కారణమైన ప్రధానము కూడా నీవే. 11

శ్లో॥ నశ్వరేష్విహ భావేషు తదసత్వమనశ్వరం ।
యథా ద్రవ్యవికారేషు ద్రవ్యమాత్రం నిరూపితమ్ ॥ 12

నాశనశీలములైన ఈ సర్వభావములయందు నాశరహితమై, చిట్టచివరకు అవశేషముగా మిగులు రూపము నీవే. మట్టి, బంగారు మొదలైన ద్రవ్యములు కారణముగా వాని వికారములుగా



టీ:- అపిచ. నశ్వరేష్వితి. నశ్వరేషు నాశశీలేషు. ఇహ ఏతేషు భావేషు. యదనశ్వరమవశిష్యమాణం రూపం తత్ త్వమసి. ద్రవ్య వికారేషు మృత్సువర్ణాదికార్యేషు ఘటకుండలాదిషు నశ్వరేషు ద్రవ్యమాత్రం మృత్సువర్ణమాత్రం అనశ్వరం యథా తద్వత్. 12

శ్లో॥ సత్త్వం రజస్తమఇతి గుణా స్తద్వృత్తయశ్చ యాః ।
త్వయ్యద్ధా బ్రహ్మణి పరేకల్పితా యోగమాయయా ॥ 13

టీ:- నను త్రిగుణాత్మక కార్యరూపోஉపిత్వమిత్యుక్తత్వాత్ కథ మనశ్వరత్వం తత్రాహ - సత్త్వమితి. తద్వృత్తయస్తత్పరిణామాశ్చ మహదాదయః అద్ధా సాక్షాత్. త్వయి పరే బ్రహ్మణి కల్పితాః. 13

శ్లో॥ తస్మాన్నసంత్యమీ భావాయర్హి త్వయి వికల్పితాః ।
త్వం చామీషు వికారేషు హ్యన్యథా వ్యావహారికః ॥ 14

టీ:- తస్మాదితి. తస్మాన్న సంతి.నన్వసతాం కథం ప్రతీతిరత ఆహ-యర్హీతి. యదా వికల్పితాస్తదైవ ప్రతీతిమాత్రేణ త్వయి సంతి. త్వంచామీషు తథైవ కారణతయా అనుగతః అన్యథా తు అవ్యావహారికః నిర్వికల్పః త్వమేవావశిష్యస ఇత్యర్థః. 14

కార్యరూపములై ఏర్పడిన కుండలు, ఆభరణములు నశించినను మట్టి, బంగారు ద్రవ్యము మాత్రము నాశనము కాకుండా ఉన్న విధముగా సర్వభావములు నాశనము అయినను నాశరహితముగా పరమాత్మయే మిగులును. 12

త్రిగుణాత్మకమైన, కార్యరూపమైనప్పటికీ పరమాత్మకు నాశరహితత్వము ఎలా సిద్ధించుననే విషయమై చెప్పుచున్నాడు - సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణములు, వాని ధర్మములు, మార్పులు అయిన మహదాదులను సాక్షాత్తుగా పరమాత్మవైన నీవే యోగమాయతో కల్పించితివి. 13

అందువలన ఈ భావములన్నియు వాస్తవముగా లేనివే. అసత్య స్థిరము. అట్లే వీటన్నిటియందు కారణ రూపముగా నీవే అనుసరించి ఉన్నావు. వేరేవిధముగా వ్యవహారము లేకుండానిర్వికల్పముగా చివరకు నీవేమిగులుదువు. సమస్తమునకు తాత్పర్య భూమివినీవే. 14

శ్లో॥ గుణ ప్రవాహ ఏతస్మిన్నబుధాస్త్వఖిలాత్మని ।
గతిం సూక్ష్మామబోధేన సంసరంతీహ కర్మభిః ॥ 15

టీ:- ఏవం భూతత్వాదజ్ఞాన నిబంధనశ్చ సంసార ఇత్యాహ - గుణప్రవాహ ఇతి. సూక్ష్మాం నిష్ప్రపంచాం గతిం. అబుధాః. అవిద్వాంసః అబుధ్వేతివా పాఠః. అతః అబోధేన దేహాభిమానేన కృతైః కర్మభిస్సంసరంతీతి. 15

శ్లో॥ యదృచ్ఛయానృతాం ప్రాప్య సుకల్యామిహ దుర్లభామ్ ।
స్వార్థే ప్రమత్తస్య వయో గతం త్వన్మాయయేశ్వర ॥ 16

టీ:- ఏవం తయోస్తత్త్వం నిరూప్య తదప్రాప్త్యా శోచతి-యదృచ్ఛయేతి. నృతాం మనుష్యతాం సుకల్యాం పటుతరేంద్రియాం. 16

శ్లో॥ అసావహం మమైవేతి దేహస్యాస్యాన్వయాదిషు ।
స్నేహపాశైర్నిబధ్నాతి భవాన్సర్వమిదం జగత్ ॥ 17

ఈ విధముగా ఉన్నందువల్ల సంసార వ్యామోహములకు అజ్ఞానమనేది విడదీయరానిబంధము అనే విషయమును చెప్పుచున్నాడు త్రిగుణముల తీవ్ర ప్రభావముతో అంతటా వ్యాపించిన మిక్కిలి సూక్ష్మమైన పరమాత్మతత్త్వమును తెలియలేక అజ్ఞానులు దేహాభిమానముతో కర్మలు చేయుచు ఈ సంసార సాగరమున కొట్టుమిట్టాడుచున్నారు. 15

ఓ ఈశ్వరా ! మంచి మార్గము చూపగల శ్రేష్ఠమైన ఇంద్రియ సామర్థ్యము కలిగిన దుర్లభమైన మానవ జన్మమును దైవానుగ్రహము చేత పొందికూడా స్వార్థచింతనతో ప్రాపంచికమైన మత్తులో మునిగిన వానికి నీ మాయవలన ప్రతిక్షణము ఆయువు తరిగి పోవుచునే ఉన్నది. జడచైతన్యముల రూపమైన ప్రకృతి పురుషతత్త్వమును తెలిసికూడా ఆ పరమాత్మను పొందలేక మానవుడు నిరంతరము సంకటపడుచున్నాడని భావము. 16

మానవున్ని నీవెందుకు అజ్ఞానముతో మత్తుడవైతివనగా అతడు అనేక విధములైన బంధములతో కట్టువడినందువలన అని చెప్పుచున్నాడు. మానవుడు తన శరీరమును నేను అని, దానికి

టీ:- ఆహోకిమితి ప్రమత్తోऽసి. త్వయాబహుభిఃపాశైర్నిబద్ధత్వాదిత్యాహా, అసావితి. అస్యదేహస్య అన్వయాదిషు పుత్రాదిషుచ. మమైవైత ఇతి. 17

సంబంధించిన భార్య, పుత్రులు, సంపదలు నావని భావించి వానిపై ఎడతెగని అనురాగముతో బంధితుడగుచున్నాడు. వాస్తవముగా ఈ సర్వజగత్తు నీవే. 17

శ్లో॥ యువాం న నస్సుతౌ సాక్షాత్ప్రధాన పురుషేశ్వరౌ ।
భూభారక్షత్రక్షపణా యావతీర్ణౌ తథాత్థహి ॥ 18

టీ:- అహో త్వత్పుత్రయోరావయోః కిమిదమారోప్యతే అత ఆహ - యువామితి. భూభారక్షత్రక్షపణార్థం అవతీర్ణౌ తథాహి నిశ్చితం అత్థ కథయసి. 18

అయ్యో ! మేము మీపుత్రులమై ఉండగా ఎందుకింతగా మమ్ములను గొప్పగా ఊహించుకొని చెప్పుచున్నారు అనే విషయమై వసుదేవుడు బలరామకృష్ణులతో చెప్పుచున్నాడు - మీరు నా పుత్రులు కాదు. భూమికి భారమైన క్షత్రియులను నాశనము చేయుటకు ఇలలో అవతరించిన ప్రధానపురుషేశ్వరులనే విషయము నిశ్చయమై చెప్పుచున్నాను. 18

శ్లో॥ తత్తేగతోऽస్యరణ మద్య పదారవింద
మాపన్న సంసృతి భయాపహ మార్తబంధో ।
ఏతావతాలమలమింద్రియలాలసేన
మర్త్యాత్మ దృక్త్వయి పరే యదపత్య బుద్ధిః ॥ 19

టీ:- తదితి. తత్తస్మాత్. అరణం శరణం. ఆపన్నానాం సంసృతిభయమపహంతీతి తథా తత్. నను త్వమతిసుఖీ వృథా కిం నిర్విద్యసే అతఆహ- ఏతావతేతి. ఇంద్రియలాలసేన ఇంద్రియార్థతృష్ణయా యత్ యేన

అందువల్ల మాపాదపద్మాలను (బలరామకృష్ణుల) శరణు పొందిన వారి జనన మరణ బాధలను నశింపచేయుట అనునది సరే! మీరు (వసుదేవుడు, దేవకీదేవి) ఇప్పుడు మిక్కిలి సుఖమును పొంది కూడా ఏదో బాధపడుచుంటిరే అనే విషయమై చెప్పుచున్నాడు - శరణుకోరి పాదపద్మములను ఆశ్రయించిన భక్తుల జన్మ దుఃఖ భయమును పోగొట్టు ఆర్తబంధుడా! నా ఈ ఇంద్రియములందలి వ్యామోహముచేత పాంచభౌతికమైన ఈ మానవ శరీరమే ఆత్మ అనే అజ్ఞాన బుద్ధితో పరాత్పరుడవు, పరమేశ్వరుడవు అయిన నిన్ను కూడా

ఇంద్రియలాలసేన మర్త్యే శరీరే ఆత్మదృక్ ఆత్మబుద్ధిః అహం. త్వయి చ పరే పరమేశ్వరే అపత్య బుద్ధిరస్మి తేన అలమలం పర్యాప్తమితి. (19)

శ్లో॥ సూతీగృహే నను జగాద భవానజోనౌ
సంజజ్ఞ ఇత్యనుయుగం నిజధర్మగుప్త్యై ।
నానాతనూర్గగనవద్విదధజ్జహాసి
కో వేదభూమ్న ఉరుగాయ విభూతిమాయాః ॥ 20

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఆకర్ణ్యేదం పితుర్వాక్యంభగవాన్ సాత్వతర్షభః ।
ప్రత్యాహప్రశ్రయానమ్రః ప్రహసన్శ్లక్ష్ణయాగిరా ॥ 21

టీ:- నను కుత ఏవ అహం పరమేశ్వర ఇతి తత్రాహ- సూతీగృహ ఇతి అనుయుగం ప్రతియుగం. యదా సుతపాః పృశ్నిరితియుగం.నౌ

సాధారణ మానవుడవైన నా పుత్రుడని ఇన్నాళ్ళు భ్రాంతి పడితిని. ఈ అజ్ఞానము ఇక చాలును అని వసుదేవుడు బాధపడినాడు. 19

నన్ను పరమేశ్వరుడవని ఎందుకనుచుంటివనే విషయమై చెప్పుచున్నాడు - ఓ విశ్వరూపుడా! పుట్టుకలేని నేను మీ దంపతులకు ప్రతి యుగమున పుత్రుడనై అవతరింతునని మీరు పురుటింట మాకు సెలవిచ్చితిరి. సుతపుడు, పృశ్నులకు మొదటి యుగమున, కశ్యపుడు - అదితికి మలి యుగమున, వసుదేవుడు - దేవకులమైన మాకు ఈ యుగమున జన్మించితివి. నీ ధర్మమును పరిక్షించుటకు ఆకాశమువలె ఏ సంబంధములేని వాడవైనను ఈ భూమి అంతయు వ్యాపించి నీ వైభవమును ప్రకటించు నానావిధరూపములను ధరింతువు, విడుతువు. వాటన్నింటిని ఎవరెరుగగలరు? 20

### శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

ఈ విధముగా తండ్రి వసుదేవుడు చెప్పిన మాటలు విని భగవంతుడైన యాదవశ్రేష్ఠుడు చిరునవ్వు నవ్వుచు తండ్రిని అనునయించుటకై వంగిన వాడై, మెత్తని మాటలతో ఇట్లు బదులు చెప్పెను. 21

ఆవయోః. యదా చ కశ్యపః అదితిశ్చేతి యుగం అధునా చ వసుదేవః దేవకీతియుగం. ఏవంహిప్రతియుగం అజఏవాహం సంజజ్ఞే అవతీర్ణ ఇతి. భవాన్ నను జగాద. నను అన్యో௨సౌ చతుర్భుజో దేవ ఇతి. తత్రాహ–నానాతనూరితి. గగనవదసంగఏవ త్వం. భూమ్నః సర్వగతస్య. విభూతిరూపాః మాయాః. (20–21)

భగవాన్ ఉవాచ

శ్లో॥ వచోవస్సమవేతార్థం తాతైతదుపమన్మ హే ।
యన్నః పుత్రాన్సముద్దిశ్య తత్వగ్రామ ఉదాహృతః ॥ 22

టీ:– వచ ఇతి. ఉపమన్మహే ఉపపన్నం మన్యామహే. సముద్దిశ్య విషయీకృత్య తత్త్వగ్రామః తత్త్వసమూహః. ఉదాహృతః సమ్యక్ నిరూపితః. 22

భగవంతుడు ఇట్లు చెప్పినాడు

ఓ తండ్రీ ! పుత్రులమైన మమ్ము ఉద్దేశించి మీరు ఉదహరించి యుక్తియుక్తముగా చెప్పిన తాత్త్వికవిషయమంతయు చక్కగా నిరూపింపబడినదే. 22

శ్లో॥ అహం యూయమసావార్య ఇమేచద్వారకౌకసః ।
సర్వేప్యేవం యదుశ్రేష్ఠవిమృశ్యాస్సచరాచరమ్ ॥ 23

టీ:– ఇమామేవ దృష్టిం సర్వత్రవిధత్స్వేత్యాహ– అహమితి. ఏవం విమృశ్యాః బ్రహ్మత్వేనైవాన్వేషణీయాః.కించ సచరాచరం. జగదపి. 23

ఓ యదుశ్రేష్ఠా ! మీరు, నేను, ఆర్యుడైన ఈ బలదేవుడు, ఈ ద్వారకావాసులు, ఎల్లజనులు ఈ చరాచర విశ్వమంతటిని బ్రహ్మత్వ బుద్ధి చేతనే అన్వేషించి తెలియవలెను. 23

శ్లో॥ ఆత్మాహ్యేకః స్వయం జ్యోతిర్నిత్యోஉన్యో నిర్గుణో గుణైః ।
ఆత్మసృష్టైస్తత్కృతేషుదేహేషు బహుధేయతే ॥
ఖంవాయుర్జ్యోతిరాపో భూస్తత్కృతేషు యథా శయం ।
ఆవిస్తిరోஉల్ప భూర్యేకనానాత్వం యాత్యసావపి ॥ 24

నానావిధ వికారములు కలిగిన వానికి బ్రహ్మత్వము ఎట్లు కలుగును. అంటే అదికాదు. బ్రహ్మమునందే పెక్కు ఉపాధుల ధర్మములచేత భిన్నత్వప్రతీతి ఉన్నదని దృష్టాంతపూర్వకముగా రెండు శ్లోకములందు చెప్పుచున్నాడు - ఆకాశము మొదలుకొని పంచభూతములు వానివల్ల ఏర్పడిన ఘటాదిపదార్థములందు పుట్టుక నాశనములు కలుగుచున్న విధముగనే ఈ ఆత్మకూడా ఆత్మనిర్మితములైన గుణముల కారణముగ వానివల్ల ఏర్పడిన దేహములందు ఆశ్రయము, ఉపాదులనుబట్టి పెక్కువిధములుగా భావింపబడును. అది పుట్టుట, మరుగునపడుటలనే రూపముగా ఎరుకపడును. అది వాస్తవముగా మాత్రముకాదు. ఎందుకనగా ఒక్కటే పెక్కు విధములైనది. స్వయంప్రకాశత్వముచేత నిత్యమై, అనిత్యమై జగత్తుకంటే భిన్నమైనది. దానితో సమానమైన రెండవ పదార్థము లేనందువల్ల వేరైనది. స్వయముగా గుణరహితమైనను తానే సృష్టించిన గుణాలచేత నిర్మితమైన దేహములందు పెక్కు విధములుగ భాసించుచున్నది. ఆశయమును బట్టి ఈ ఆత్మకూడా కాలము చేత పరిమితమై ఆవిర్భావ, తిరోభావమును పొంది ఏకత్వము, నానాత్వములు రెండింటిని పొందుచున్నది అన్నాడు కృష్ణుడు. 24







### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం భగవతా రాజన్వసుదేవ ఉదాహృతం ।
శ్రుత్వావినష్టనానాధీస్తూష్ణీం ప్రీతమనా అభూత్ ॥ 25

టీ:- నను నానావికారవతాం కుతోబ్రహ్మత్వం. న. బ్రహ్మణ ఏవోపాధిధర్మైర్బహుధా ప్రతీతేరితి సదృష్టాంతమాహ-ద్వాభ్యాం. ఆత్మేతి. యథా ఖాదిభూతాని తత్కృతేషు ఘటాదిషు ఆవిస్తిరోభావాదికం యాంతి. ఏవమసావాత్మాపి ఆత్మసృష్టైర్గుణైః కృత్వా తత్కృతేషు దేహేషు బహుధా ఈయతే పునశ్చ యథాశయం యథోపాధి. ఆవిర్భావతిరోభావాదిరూపేణ ప్రతీయతే. న వస్తుతః కుతః. ఏకః బహుధా. స్వయంజ్యోతిః దృశ్యత్వేన నిత్యః అనిత్యత్వేన. అన్యః అనన్యత్వేన. నిర్గుణః సగుణత్వేనేత్యాది. బహుధా త్వం ప్రపంచనీయం. (24-25)

### శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

ఓ రాజా! వసుదేవుడు శ్రీకృష్ణుడు చక్కగా ఉదహరించి చెప్పిన మాటలువిని సంతుష్టుడై ప్రాపంచిక వ్యామోహములను విడనాడి మిన్నకుండెను. 25

### స్మరోద్గీథాదినామక షడ్గర్భానయనాది కథా ప్రారంభ ఘట్టః

శ్లో॥ అథతత్ర కురుశ్రేష్ఠ దేవకీ సర్వదేవతా ।
శ్రుత్వానీతంగురోః పుత్రమాత్మజాభ్యాం సువిస్మితా ॥ 26

టీ:- అథేతి. సువిస్మితా సతీ. 26

### స్మరోద్గీథాదులనే షడ్గర్భులను తెచ్చిన కథా ఘట్టము

ఓ కురుశ్రేష్ఠా! పిమ్మట అక్కడ సర్వదేవతా స్వరూప అయిన దేవకీదేవి తన పుత్రులైన బలరామకృష్ణులు, గురువైన సాందీపని మృతపుత్రుని పునర్జీవితుని చేసి తీసుకొని వచ్చిన విషయమునువిని మిక్కిలి ఆశ్చర్యమును పొందెను. 26





శ్లో॥ కృష్ణరామౌ సమాశ్రావ్య స్వపుత్రాన్ కంసహింసితాన్ ।
స్మరంతీకృపణం ప్రాహవైక్లబ్యాదశ్రులోచనా ॥ 27

దేవక్యువాచ

శ్లో॥ రామ రామ ప్రమేయాత్మన్ కృష్ణయోగేశ్వరేశ్వర ।
వేదాహం వాం విశ్వసృజామీశ్వరావాదిపూరుషౌ ॥ 28

టీ:- కృష్ణరామావితి. సమాశ్రావ్య సంబోధ్య. (27-28)

శ్లో॥ కాలవిధ్వస్తసత్వానాం రాజ్ఞాముచ్ఛాస్త్రవర్తినామ్ ।
భూమేర్భారాయమాణానామవతీర్ణౌకిలద్య మే ॥ 29

టీ:- కాలేతి. భూమేర్భారాయమాణానాం రాజ్ఞామర్థే తేషాం నిధనార్థం మే మయి కిల అవతీర్ణౌ హే ఆద్య. 29

శ్లో॥ యస్యాంశాంశాంశభాగేన విశ్వోత్పత్తిలయాదయః ।
భవంతి కిల విశ్వాత్మన్ తం త్వాద్యాహం గతిం గతా ॥ 30

ఆమె కంసుడు సంహరించిన తన మొదటి ఆరుగురు కుమారులను గుర్తుకు తెచ్చుకొని పరితపించుచు కంటనీరు పెట్టుకొని బలరామకృష్ణులను ఉద్దేశించి దయనీయముగా ఇట్లు చెప్పినది. 27

దేవకీదేవి ఇట్లు చెప్పినది

తెలియరాని తత్త్వముగల ఓ బలరామా ! యోగేశ్వరేశ్వరుడవైన ఓ కృష్ణా ! జగన్నిర్మాణ కర్తలకు ప్రభువులైన ఆది పురుషులు మీరిరువురని నాకు తెలియును. 28

కాలప్రభావముచేత దుష్టశక్తులు కలిగి అశాస్త్రీయమైన నడవడులతో భూమికి భారమైన రాజుల సముదాయమును నాశనము చేయుటకు ఈ ద్వాపరమున నాకు పుత్రులై అవతరించితిరి. 29

పరమాత్మ యొక్క అంశ పురుషుడు. ఆయన అంశ మాయ. దాని అంశలు సత్త్వము, రజస్సు, తమస్సులనే మూడు గుణములు. వానియొక్క మిక్కిలి చిన్నదైన పరమాణు పరిమాణముగల భాగముతో

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- యస్యేతి. యస్య అంశః పురుషః తస్య అంశః మాయా తస్యాః అంశాః గుణాః తేషాం భాగేన పరమాణు మాత్రలేశేన విశ్వోత్పత్త్యాదయః భవంతిః తం త్వా త్వాం గతిం శరణం గతాస్మి. 30

శ్లో॥ చిరాన్మృతసుతాదానే గురుణా కిల చోదితౌ ।
ఆనిన్యథుః పితృస్థానాద్గురవే గురుదక్షిణామ్ ॥ 31

శ్లో॥ తథా మే కురుతం కామం యువాం యోగీశ్వరేశ్వరౌ ।
భోజరాజహతాన్పుత్రాన్ కామయే ద్రష్టుమాహృతాన్ ॥ 32

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం సంచోదితా మాత్రా రామఃకృష్ణశ్చ భారత ।
సుతలం సంవివిశతుర్యోగమాయాముపాశ్రితౌ ॥ 33

టీ:- చిరాదితి. అనిన్యథుః. అనీతవంతౌ. పితృస్థానాత్ యమసదనాత్. (31-33)

ఈ జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయములు కలుగుచున్నవి. అట్టి ఓ పరమాత్ములారా! ఇప్పుడు మిమ్ము నేను శరణు పొందితిని. 30

చాలాకాలము క్రిందట మరణించిన కొడుకును గురుదక్షిణగా సమర్పించుమని అర్థించిన గురువు సాందీపని కోరికను మన్నించి యమలోకమునుండి ఆయన మృతపుత్రుని తెచ్చి అప్పగించితిరి. 31

ఓ యోగీశ్వరులైన పుత్రులారా! మీరిరువురికంటే ముందు జన్మించి కంసుని చేత హతులైన నా ఆరుగురు కుమారులను చూడవలెనని కోరిక ఉన్నది. మీరు దానిని తీర్చుడని దేవకి రామకృష్ణులను అభ్యర్థించినది. 32

శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

ఓ భరతవీరా ! తల్లి దేవకీదేవి కోరికను మన్నించి బలరామకృష్ణులు యోగమాయతో సుతల లోకమును ప్రవేశించిరని శుకుడు చెప్పినాడు. 33

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తస్మిన్ప్రవిష్టావుపలభ్య దైత్యరా
డ్విశ్వాత్మదైవం సుతరాం తథాత్మనః ।
తద్దర్శనాహ్లాద పరిప్లుతాశయ
స్సద్యస్సముత్థాయ ననామ సాన్వయః ॥ 34

టీ:- తస్మినితి. దైత్యరాట్ బలిః. కథంభూతౌ విశ్వస్యాత్మభూతం దైవం. సాన్వయః సపరివారః. 34

జగత్తునకు ఆత్మీయులైన దైవస్వరూపులు రామకృష్ణులు సుతలాలయమున ప్రవేశించగనే రాక్షసాధిపతి బలిచక్రవర్తి వారి దర్శనమువలన ఆనందముతో పొంగిపొర్లిన మనస్సుతో తన ఆసనముపై నుండిలేచి తనవారందరితో వారికి నమస్కరించినాడు. 34

శ్లో॥ తయోస్సమానీయ వరాసనం ముదా
నివిష్టయోస్తత్ర మహాత్మనోస్తయోః ।
దధారపాదావవనిజ్య తజ్జలం
సబృంద ఆబ్రహ్మ పునద్యదంబు హ ॥ 35

సంతోషముతో వారిని సగౌరవముగా స్వాగతించి ఉన్నతాసనముపై ఆసీనులను చేసినాడు. జగత్తంతయు యాచించి దానిని పవిత్రముగా చేయునట్టి పరమాత్మ స్వరూపములైన రామకృష్ణుల పాదములుకడిగి ఆపవిత్ర జలమును తనశిరస్సున ధరించినాడు. 35

శ్లో॥ సమర్హయామాస మహావిభూతిభి
ర్మహార్హ వస్త్రాభరణానులేపనైః ।
స్రగ్ధూపదీపామృత భక్షణాదిభి
స్స్వగోత్ర విత్తాత్మ సమర్పణేన చ ॥ 36

టీ:- తయోరితి. సబృందః సపరిజనః కథంభూతౌ. పాదావవనిజ్య యదంబు యయోరవనేజనోదకం. ఆబ్రహ్మ బ్రాహ్మణమభివ్యాప జగత్ పునత్ పవిత్రయత్ వర్తతే తౌ. (35-36)

ఆపారవైన సంపదలతో వస్త్రములు, ఆభరణములు, సుగంధాది అనులేపనములు, పూలమాలలు, ధూపదీపములు, నైవేద్యములతో తన గోత్రనామములు (ప్రవర) చెప్పుకొని తన ఐశ్వర్యముతో ఆత్మసమర్పణము చేసుకొని వారికి చక్కగా సేవలు చేసినాడు. 36

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ స ఇంద్రసేనో భగవత్పదాంబుజం
బిభ్రన్ ముహుః ప్రేమవిభిన్నయా ధియా ।
ఉవాచహానందజలాకులేక్షణః
ప్రహృష్టరోమా నృపగద్గదాక్షరమ్ ॥ 37

టీ:- స ఇతి. ఇంద్రసేనో బలిః. ప్రేమ విభిన్నయా ప్రేమార్ద్రయా ధియా బిభ్రత్ ధారయన్. 37

ఈ విధముగా ఆ ఇంద్రసేనుడు(బలి) ప్రేమసాంద్రమైన బుద్ధితో పరమాత్ముని పాదపద్మమును పట్టుకొని మాటిమాటికి ఆనందబాష్పములతో కలిగిన కనులతో, గగుర్పాటుతో గొంతు బొంగురుపోవగా వారితో ఈ విధముగా పలికెను. 37

**బలి రువాచ**

శ్లో॥ నమోఽనంతాయ బృహతే నమః కృష్ణాయవేధసే ।
సాంఖ్యయోగవితానాయ బ్రహ్మణే పరమాత్మనే ॥ 38

టీ:- నమ ఇతి. అనంతాయ శేషాయ బృహతే ఫణైకదేశే విశ్వ ధారణాత్ బృహత్ తస్మై. కృష్ణాయ చ సదానందరూపాయ. వేధసే జగద్విధాత్రే. సాంఖ్యయోగవితానాయేత్యాదిపదత్రయ మైక్యవివక్షయా. 38

శ్లో॥ దర్శనం వాం హి భూతానాం దుష్ప్రాపంచాప్యదుర్లభమ్ ।
రజస్తమస్స్వభావానాం యన్నః ప్రాప్తౌ యదృచ్ఛయా ॥ 39

టీ:- యోగేశ్వరాణామపి దుర్దర్శౌ యువామస్మాభిర్దృష్టావిత్యేతన్నాతి చిత్రమిత్యాహ- దర్శనమితి. దుష్ప్రాపమపి యుష్మత్కృపయా కేషాంచిద

**బలి ఇట్లు పలికెను**

అనంతుడా ! నీ ఫణాగ్రలేశభాగమున విశ్వమును ధరించినవాడా ! సదానందరూపుడవై జగత్తును నిర్మించిన ఓ కృష్ణపరమాత్మా! సాంఖ్య యోగరూపమైన అపార విజ్ఞానఖనులారా! పరమాత్మలైన మీకు నమస్కారము. రజస్సు, తమస్సులనే రెండు గుణాల ప్రభావమునకు లోనై కలతచెందు జీవులకు లభించని పొందరానిదైన మీ దర్శనము మీ అనుగ్రహముతో అప్రయత్నముగా మాకు సిద్ధించినది. (38-39)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

దుర్లభం సులభమపి భవతి తదాహ– రజస్తమస్స్వభావానామితి. నః దర్శనం ప్రాప్తౌ. 39

శ్లో॥ దైత్య దానవ గంధర్వ సిద్ధ విద్యాధరోరగాః ।
యక్షరక్షః పిశాచాశ్చ భూత ప్రమథ నాయకాః ॥ 40

శ్లో॥ విశుద్ధసత్త్వధామ్న్యద్ధా త్వయి శాస్త్రశరీరిణి ।
నిత్యం నిబద్ధవైరాస్తే వయం చాన్యే చ తాదృశాః ॥ 41

శ్లో॥ సాలోక్యం చాపి సారూప్యం సామీప్యమథ సాత్మతామ్ ।
ప్రాప్తాస్తే పుండరీకాక్ష భావో హి భవకారణమ్ ॥ 42

టీ:– అహో విద్విషో వయం సాత్త్వికభక్తేభ్యోఽపి సభాగ్యా ఇత్యాహ– త్రిభిః. దైత్యేతి.(40–42)

శ్లో॥ కేచిదుద్బద్ధవైరేణ భక్త్యా కేచన కామతం ।
న తథా సత్త్వసంరబ్ధాస్సన్ని కృష్టాస్సురాదయః ॥ 43

టీ:– కేచిదితి. ఉద్బద్ధవైరేణ యా భక్తిస్తయా. కేచిదిత్ చైద్యాదయః కామతో భక్త్యా గోప్యాదయో యథా సన్నికృష్టాః త్వదాత్మతాం ప్రాప్తాః తథా సత్తసనంబ్ధాః సత్త్వావిష్టా అపి సురాదయో న సన్నికృష్టా ఇతి. 43

ఆహా! రాజస, తామసిక భావపూరితులమై శత్రువులమైన మేము సాత్త్విక భక్తులకన్నా అదృష్టవంతులమైతిమనే విషయమును మూడు శ్లోకములందు చెప్పుచున్నాడు – ఓ పుండరీకాక్షుడా! దైత్యులు, దానవులు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, నాగులు, యక్షులు, రాక్షసులు, పిశాచులు, భూతములు, ప్రమథగణాల నాయకులము అయిన మేము శుద్ధ సత్త్వముతో, పరిపూర్ణశాంతితో, సర్వశాస్త్రములకు ఆధారరూపుడవైన నీయందు, నిరంతరము తీవ్రమైన శత్రుభావముతో వర్తించే మాకు, మావంటి ఇతరులకు, మీతో సాలోక్యము, సారూప్యము, సామీప్యము, ఏకాత్మత అనే నాలుగు విధాలైన ముక్తులు కలిగినవని భావము. కోరికలే పుట్టుకకు మూలకారణము.(కోరికలు నశించుటయే ముక్తి కారణము). (40–42)

భావతీవ్రతగల శత్రుత్వముతో కొందరు (శిశుపాలాదులు), భక్తి భావముతో నారదాదులు, కామభావముతో గోపికలు భగవంతునికి దగ్గరయినంతగా సత్త్వగుణపూర్ణులైన దేవతలునూ కాలేకపోయిరి. నిత్య సామీప్యముతో భాగ్యవంతులైననూ దేవతలకు పరమాత్మైకత్వమనే అదృష్టము దక్కలేదు అని భావము. 43

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఇదమిత్థమితి ప్రాయస్తవ యోగశ్వరేశ్వర ।
న విదంత్యపి యోగేశా యోగమాయాం కుతోవయమ్ ॥ 44

టీ:- ననుసాత్వికేభ్యోఽపి రాజసాదయః సన్నికృష్టాః ఇతి చిత్రం తత్రాహ- ఇదమితి. స్వరూపతః.ఇత్థమితి. విశేషతశ్చ. 44

సత్త్వగుణపూర్ణులైన వారుకూడా రజస్తమస్సుల ప్రభావమును నివారించలేకపోవుట చాలా ఆశ్చర్యమనే విషయము చెప్పుచున్నాడు - ఓ యోగీశ్వరేశ్వరా! నీ యోగమాయ ప్రభుశక్తిని వశీకృతాచిత్తులైన యోగులు కూడా స్వరూపముతో ఇదిఇట్టిదని తెలియలేరనగా సామాన్యులమైన మావంటివారి విషయముచెప్పవలసినదేమున్నది? 44

శ్లో॥ తన్నః ప్రసీద నిరపేక్ష విమృగ్యయుష్మ
త్పాదారవింద ధిషణాన్య గృహాంధకూపాత్ ।
నిష్క్రమ్య విశ్వశరణాంఘ్ర్యుపలబ్ధవృత్తి
శాంతో యథైక ఉతసర్వసఖైశ్చరామి ॥ 45

టీ:- తదేవం. యదపి వైరభావేనాపి త్వత్ప్రాప్తిర్భవేత్ తథాపి మాం సాత్త్వికం కుర్వితి ప్రార్థయతే - తదితి. తత్ తథా నః ప్రసీద. యథా నిరపేక్షైరాప్తకామైరపి మృగ్యం యుష్మత్పాదారవిందం తదేవ ధిషణ మాశ్రయః. తస్మాదన్యద్యద్గృహం. తదేవాంధకూపః. తస్మాన్నిష్క్రమ్య నిర్గత్య. విశ్వస్య శరణం రక్షితారః వృక్షాః తేషామంఘ్రిషు మూలేషు స్వతఏవ గళితైః.ఫలాదిభిరుపలబ్ధా ప్రాప్తా వృత్తిర్జీవికా యేన సోఽహం. శాంతస్సన్ ఏక ఏవ చరామి.ఉత అథవా సర్వేషాం సఖాయో యే మహాం తస్తైస్సహ యథా చరామీతి. 45

అందువల్ల వైరభావముతో కూడా పరమాత్మప్రాప్తి కలుగుచున్ననూ నన్ను సాత్త్వకునిగా చేయమని ప్రార్థించుచున్నాడు - సర్వకామములు నెరవేరిన నిష్కాములు సైతము అన్వేషించి పొందదగిన నీ దివ్య పాదారవిందమే మా బుద్ధులకు ఆశ్రయము కావలెను. దీనికన్న భిన్నమైన గృహము అనగా సంసారమనే అంధకారమయమైన లోతుబావి నుండి బయటకు వచ్చి ఈ అనంతవిశ్వమునకు రక్షకుడవైన నీ పాదముల దగ్గర శాంతుడనై ఒంటరిగా వృక్షముల పాదమూలమునందే స్వయముగా రాలిపోయిన ఆకులు పండ్లే ఆహారముగా జీవితమును కొనసాగింతును. లేక అందరికీ మిత్రులైన మహాపురుషులతో కలిసి జీవింతును. 45

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ శాధ్యస్మానీశితవ్యేశ నిష్పాపాన్కురునః ప్రభో ।
ప్రమాన్ యచ్ఛ్రద్ధయా తిష్ఠన్ చోదనాయా విముచ్యతే ॥ 46

టీ:- కథమల్పపుణ్యానాం ఏవంభావః సంభవతీతి చేత్తర్హి యథై తద్భవేత్తథాస్మాననుశిక్షయేత్యాహ - శాధీతి. హే ప్రభో. ఈశితవ్యాః సర్వే జీవాః తేషామీశ. యత్తవాను శాసనం ఆతిష్ఠన్ ఆశ్రయన్ చోదనాయాః విధినిషేధలక్షణాయాః సకాశాత్ విముచ్య తేన ఖలుం త్వద్భక్తో విధికింకరస్స్యాదితి భావః. 46

అల్పపుణ్యము కలవారికి ఇంతటి ఉత్కృష్టస్థితి ఎట్లు కలుగును - అని నీవు భావించినచో అట్టి స్థితిని పొందుటకు అవసరమైన శిక్షణను ప్రసాదించుమనే విషయమును చెప్పుచున్నాడు - ఓ ప్రభూ జీవేశ్వరా! విధి (చేయదగినది), నిషేధము, (చేయతగనిది) అనే చోదనాలక్షణము ఉన్న శాసనమును శ్రద్ధతో సాధనచేసి సర్వ బంధములనుండి నీ భక్తుడు విధిని ఆశ్రయించి ముక్తిని పొందుటలేదా? అట్లేమమ్ములను పాపరహితులుగాచేయుమని బలిప్రార్థించినాడు. 46

**శ్రీభగవానువాచ**

శ్లో॥ ఆసన్ మరీచేష్షట్పుత్రాః ఊర్ణాయాం ప్రథమేఽంతరే ।
దేవాః కం జహసుర్వీక్ష్య సుతాం యభితుముద్యతమ్ ॥ 47

టీ:- తదుక్తం సర్వమనుమోద్య స్వాగమనకారణం సప్రపంచం కథయతి పంచభిః - ఆసన్నితి. ఊర్ణాయాం భార్యాయాం. ప్రథమే అంతరే స్వాయంభువమన్వంతరే తే దేవాః సుతాం వాచం. యభితుం యబ్ధుం మైథునేన రమయితుం ఉద్యతం ఉద్యుక్తం. కం ప్రజాపతిం. జహసుః ఉపహసితవంతః. 47

**భగవంతుడిట్లుపలికెను**

బలి చెప్పిన మాటలకు సంతసించి తాను వచ్చిన కారణమును అయిదు శ్లోకములందు కృష్ణుడు చెప్పినాడు-ప్రథమమైన స్వాయంభువ మన్వంతరమున మరీచి మహర్షికి అతని భార్యయైన వర్ణ అనే ఆమెయందు ఆరుగురు దేవతలు పుత్రులై జన్మించిరి. వారు ఒకనాడు - బ్రహ్మదేవుడు తన పుత్రికయైన సరస్వతితో రమించుటకు ప్రారంభించగా పుత్రికాసంభోగము విపరీతమని వారు విరించిని చూచి పరిహసించిరి. 47

శ్లో॥ తేనాసురీమగన్ యోనిమధునావద్యకర్మణా ।
హిరణ్యకశిపోర్జాతాః పుత్రాస్తేయోగమాయయా ॥ 48

టీ:-తేనేతి. తేన అపద్యకర్మణా పాపేన ఆసురీం యోనిమగమన్ అగమన్ అధునా తత్క్షణమేవ హిరణ్యకశిపోర్జాతా ఇత్యర్థః. తే చ యోగమాయయా తతో నీతాస్సంతః. 48

ఆ పాపపు పనివల్ల వారిని రాక్షసగర్భమున జన్మించుడని బ్రహ్మ శపించినాడు. వారు తక్షణమే హిరణ్యకశిపునికి పుత్రులై జన్మించిరి. మరల వారే యోగమాయ వలన దేవకీదేవి గర్భమున జన్మించి కంసుని చేతిలో మరణించిరి. ఓ రాజా ! మా అమ్మ దేవకీదేవి తన అన్న చంపిన తన పుత్రులను తలచుకొని బాధపడుచున్నది. వారందరు ఇప్పుడు నీ సమీపమందున్నారు. (48-49)

శ్లో॥ దేవక్యా ఉదరేజాతా రాజన్ కంసవిహింసితాః ।
సా తాన్ శోచత్యాత్మజాంస్తుత ఇమేఽధ్యాసతేఽంతికే ॥ 49

టీ:- దేవక్యాఇతి. దేవక్యాః ఉదరే జాతాః హేరాజన్ హేబలే. తే చ కంసేన విహింసితాః. సా చ తానాత్మజాన్ మత్వా శోచతి. తేచేమే తవ అద్య అంతికే ఆసతే. 49

శ్లో॥ ఇత ఏతాన్ ప్రణేష్యావో మాతృశోకాపనుత్తయే ।
తతశ్శాపవినిర్ముక్తా లోకం యాస్యంతి విజ్వరాః ॥ 50

టీ:- ఇతఇతి. లోకం దేవలోకం. 50

మా తల్లి దుఃఖమును పోగొట్టుటకై వారిని ఇక్కడ నుండిమా వెంట పంపుము. ఆక్కడనుండి వారు శాపవిముక్తిని పొంది పాపరహితులై తమ లోకమునకు వెళ్ళగలరు. 50

శ్లో॥ స్మరోద్గీథః పరిష్వంగః పతంగః క్షుద్రభూర్ఘృణిః ।
షడేతే మత్ప్రసాదేన పునర్యాస్యంతి సద్గతిమ్ ॥ 51

టీ:- స్మరేతి. స్మరోద్గీథః స్మరసహితః ఉద్గీథః సద్గతిం మోక్షం స్మరస్యైవ పూర్వం కీర్తిమానితినామ. అతః. శ్లో. కీర్తిమంతం ప్రథమజం కంసాయానక దుందుభిః, అర్పయామాసేత్యుక్తం. 51

స్మరుడు, ఉద్గీథుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభూమి, ఘృణి అనే పేర్లుగల ఈ ఆరుగురు నా అనుగ్రహముచేత ముక్తిని పొందగలరు. స్మరునికే పూర్వము కీర్తిమంతుడనే పేరుండి నది – 'కీర్తిమంతం ప్రథమజం కంసాయానక దుందుభిః, అర్పయామాస' అని చెప్పబడినది. 51

శ్లో॥ ఇత్యుక్త్వా తాన్ సమాదాయ ఇంద్రసేనేన పూజితౌ ।
పునర్ద్వారవతీమేత్య మాతుః పుత్రానయచ్ఛతామ్ ॥ 52

అని చెప్పి బలిచక్రవర్తిచేత వారిని పిలిపించి రామకృష్ణులిరువురు ఆయన పూజలందుకొని ద్వారకా నగరమునకు మరలివచ్చి తల్లికి ఆరుగురు పుత్రులను అప్పగించారు. 52

శ్లో॥ తాన్ దృష్ట్వా బాలకాన్ దేవీ పుత్రస్నేహస్నుతస్తనీ ।
పరిష్వజ్యాంకమారోప్యమూర్ధ్న్యజిఘ్రదభీక్ష్ణశః ॥ 53

వారిని చూచి మాతృమూర్తియైన దేవకీదేవికి పుత్రస్నేహముతో స్తనములు పాలనుస్రవించగా తన యిష్టానుసారముగా వారిని కౌగిలించుకొని, తొడలపై నిడుకొని, తలను వాసన చూచి పరవశించినది. 53

శ్లో॥ అపాయయత్ స్తనంప్రీతాపుత్రస్పర్శపరిస్నుతమ్ ।
మోహితామాయయా విష్ణోర్యయా సృష్టిః ప్రవర్తతే ॥ 54

టీ:- ఇతీతి. అయచ్ఛతాం అర్పయామాసతుః. (52-54)

పుత్రస్పర్శలోని పారవశ్యముచేత ప్రీతిచెందినదై స్రవించిన స్తనముల పాలను శిశువులకు త్రాపి సర్వ జగత్తును వ్యామోహింపజేయు విష్ణుమాయ వలన మోహితురాలైనది. 54

శ్లో॥ పీత్వామృతం పయసస్తస్యాః పీతశేషం గదాభృతః ।
నారాయణాంగ సంస్పర్శ ప్రతిలబ్ధాత్మదర్శనాః ॥ 55

టీ:- పీత్వేతి. అమృతత్వే హేతుః. గదాభృతః పీతశేషమితి నారాయణాంగ సంస్పర్శేన ప్రతిలబ్ధం దేవా వయమిత్యాత్మదర్శనం యైస్తే. 55

ఆ ఆరుగురు శిశువులు కృష్ణపరమాత్మ త్రాగి మిగిల్చిన అమృతమయమైన తల్లి ప్రాలను త్రాగి, శ్రీమన్నారాయణుని శరీర స్పర్శతో తాము దేవతలమనే ఆత్మదర్శనమును పొందిరి. 55

శ్లో॥ తే నమస్కృత్య గోవిందం దేవకీం పితరం బలమ్ ।
మిషతాం సర్వభూతానాం యయుర్ధామ విహాయసా ॥ 56

టీ:- త ఇతి. ధామ దేవలోకం. 56

వారు కృష్ణునికి, తల్లి దేవకీదేవికి, తండ్రి వసుదేవునికి, బలరామునికి నమస్కారముచేసి సర్వభూతములు కోరదగిన దేవలోకమునకు ఆకాశమార్గమున వెళ్ళిరి. 56

శ్లో॥ తం దృష్ట్వా దేవకీ దేవీ మృతాగమననిర్గమం ।
మేనే సువిస్మితామాయాం కృష్ణస్య రచితాం నృప ॥ 57

ఓ రాజా ! విచిత్రముగా చనిపోయినపుత్రులు తిరిగి బ్రతికి వచ్చుట, అంతలోనేవారు ఆకాశమార్గమున వెళ్ళిపోవుటలు చూచి దేవకీదేవి ఆశ్చర్యచకితురాలై అదంతయు శ్రీకృష్ణుని మాయగా భావించినది. అతడే మాయతో పుత్రులుగా భాసించినాడని తలచినది. 57

శ్లో॥ ఏవంవిధాన్యద్భుతాని కృష్ణస్య పరమాత్మనః ।
వీర్యాణ్యనంతవీర్యస్య సంత్యనంతాని భారత ॥ 58

టీ:- తమితి. మృతానామాగమనం నిర్గమం చ శ్రీకృష్ణస్య మాయాం మేనే. తేనైవాపత్యాదిరూపేణ రచితాం. (57-58)

ఓ పరీక్షిత్తూ ! ఈ విధముగా అనంతశక్తిమంతుడైన పరమాత్మ శ్రీకృష్ణునిఅద్భుతలీలలు అపారమైనవని-శుకుడు వినిపించినాడు. 58

**శ్రీ సూత ఉవాచ**

శ్లో॥ య ఇదమనుశృణోతి శ్రావయేద్వాமురారే
శ్చరితమమృతకీర్తే ర్వర్ణితంవ్యాసపుత్రైః ।
జగదఘభిదలం తద్భక్తసత్కర్ణపూరం
భగవతి కృతచిత్తో యాతి తత్క్షేమధామ ॥ 59

టీ:- య ఇతి. అమృతం కీర్తిర్యస్య తస్య వ్యాసపుత్రైరితి బహువచనం పూజార్థం. జగతః అఘం భీనత్తీతి తథాతత్. అలం నిశ్శేషం యథా భవతి. తథా న కృచ్ఛ్రాదివదితి. తదేవం మోక్షహేతుత్వం పాపక్షయ హేతుత్వం చోక్తం. తద్భక్తానాం తు సత్కర్ణపూరం పరమసుఖావహం కర్ణాభరణమితి స్వయం సుఖరూపతామాహ - కించ. భగవతి కృతం ఆవేశితం చిత్తం యేన సః. తథా భూత్వా. తస్య క్షేమధామ కాలాదిభయరహితం లోకం యాతీతి. 59

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, పంచాశీతితమోఽధ్యాయః**

**శ్రీ సూతుడు ఇట్లు చెప్పినాడు**

అమృతమయమైన కీర్తిగలిగిన వ్యాసపుత్రుడు శుకమహర్షి కీర్తించిన సర్వజగత్తు పాపమును సంపూర్ణముగా ధ్వంసము చేయునట్టి ఈ మురారి చరితమును విన్నను, వినిపించినను భక్తుల చెవులకు ఆభరణమైన పరమసుఖమును (ముక్తిని) పొందించుననే విషయమును చెప్పుచున్నాడు. భగవంతునియందు ఆవేశపూరితమై నిలిచిన చిత్తము కలవాడు. ఆత్మ సాయుజ్యమును పొంది కాలము మొదలైన పరిచ్ఛేదముల భయములేని పరమాత్మ స్థానమైన లోకమునకు వెళ్ళునని సూతముని ఫలశ్రుతిని వివరించినాడు. 59

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనుబది ఐదవ అధ్యాయముసమాప్తము**

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## షడశీతితమోఽధ్యాయః

శ్లో॥ షడశీతితమే దంభాత్సుభద్రామర్జునోఽహరత్ ।
గత్వా చ మిథిలాం కృష్ణో నృపవిప్రావనందయత్ ॥
పిత్రోస్స్వజ్ఞానమాదిశ్య సుభద్రాం ఫల్గునాయ చ ।
జగామ మిథిలాం కృష్ణస్వభక్త ప్రియకృత్తతః ॥

రాజోవాచ

శ్లో॥ బ్రహ్మన్ వేదితుమిచ్ఛామి స్వసారంకృష్ణంరామయోః ।
యథోపయేమే విజయో యా మమాసీత్పితామహీ ॥ 1

## 86వ అధ్యాయము

ఈ ఎనుబదిఆరవ అధ్యాయమున కపటముతో అర్జునుడు సుభద్రను అపహరించుట, మిథిలలో కృష్ణుడు రాజులను, బ్రాహ్మణులను సంతోషపెట్టుట, తండ్రియైన వసుదేవునికి తత్త్వజ్ఞానమును బోధించి, సుభద్రతో అర్జునునికి వివాహముకావించి తన భక్తులకు ప్రీతిని కలిగించుటకై మిథిలానగరమునకు వెళ్ళుటలు విషయము.

**పరీక్షిత్తు ఈ విధముగా అడిగినాడు**

దేవకీదేవికి మృతపుత్రుల సమాగమమువలె, అర్జునుడు బలరాముని వ్యతిరేకత ఉన్నను సుభద్రను పొందుట అసాధ్యమైన విషయమని భావించి, సందర్భవశమున ఆ విషయమును వివరించుమని పరీక్షిత్తు శుకమహర్షిని అడిగినాడు – ఓ శుకభగవానుడా! శ్రీకృష్ణబలరాముల సోదరి, మాతండ్రి తల్లి (నాయనమ్మ) అయిన సుభద్రాదేవిని మా పితామహుడైన అర్జునుడు వివాహమాడిన విషయమును తెలుపమని అడిగినాడు. 1

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్రీశుక ఉవాచ

శ్లో॥ అర్జునస్తీర్థయాత్రాయాం పర్యటన్ మేదినీం ప్రభుః ।
గతః ప్రభాసమశృణోన్మాతులేయీం స ఆత్మనః ॥ 2

టీ:- దేవక్యాః మృత పుత్రలాభవత్ అర్జునస్య సుభద్రాలాభో௨పిరామ ప్రాతికూల్యాత్ దుర్ఘట ఇతి మన్యమానః ప్రసంగాత్ పృచ్ఛతి - బ్రహ్మన్నితి. (1-2)

శ్లో॥ దుర్యోధనాయ రామస్తాం దాస్యతీతి న చాపరే ।
తల్లిప్సుస్సయతిర్భూత్వా త్రిదండీ ద్వారకామగాత్ ॥ 3

టీ:- కథమశృణోత్ తదాహ - దుర్యోధనాయేతి. అపరే చ వాసుదేవాదయో న దాస్యంతీతి. తల్లిప్సుః తస్యాం మాతులేయ్యాం లిప్సుః. రామం వంచయితుం పూజ్యతమం త్రిదండివేషం విధాయ గత ఇత్యాహ-సయతిరితి. 3

శ్లో॥ తత్రవైవార్షికాన్ మాసానవాసీత్స్వార్థ సాధనః ।
పౌరైస్సభాజితో௨భీక్ష్ణం రామేణా జానతా చ సః ॥ 4

టీ:- తత్రేతి. స్వార్థ సాధనః కన్యాం ప్రేప్సుః . 4

శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

అర్జునుడు సుభద్ర విషయమై ఏమని విన్నాడో చెప్పుచున్నాడు- అర్జునుడు పుడమిలో తీర్థయాత్రలు చేయుచు ప్రభాస తీర్థమునకు వెళ్ళినాడు. అక్కడ తన మేనమామ కూతురైన సుభద్రను పెద్దబావగారైన బలరాముడు దుర్యోధనునకు ఇవ్వదలచుకొన్నాడు. కానీ వసుదేవాదులు సుయోధనునకు సుభద్రనిచ్చి వివాహము చేయుటకు ఇష్టపడుటలేదనే విన్నవారై ఆమెపట్ల మక్కువతో బలరాముని మోసగించుటకై మిక్కిలిగా పూజింపదగిన యతీశ్వరుని వేషమును ధరించి ద్వారకా నగరమునకు వెళ్ళినాడు. (2-3)

సుభద్రను దక్కించుకొనుట అనే తనకోర్కెను నెరవేర్చుకొనుటకై యతి వేషముతో పౌరుల మర్యాదలందుకొనుచు బలరామునికి తెలియకుండ స్వేచ్ఛగా కొన్ని సంవత్సరాలు, నెలలు అక్కడ గడిపినాడు. 4

శ్లో॥ ఏకదా గృహమానీయ ఆతిథ్యేన నిమంత్ర్య తమ్ ।
శ్రద్ధయోపహృతం భైక్షం బలేన బుభుజే కిల ॥ 5

టీ:- ఏకదేతి. తం ఆతిథ్యేన నిమంత్ర్య. గృహమానీయ. బలేన యత్ శ్రద్ధయోపహృతం పరివిష్టం. తద్భైక్షం కిలార్జునో బుభుజ ఇత్యన్వయ్. 5

ఒకసారి బలరాముడు ఆ యతీశ్వరుని ఇంటికి అతిథిగా సగౌరవముగా రప్పించి శ్రద్ధగా సమర్పించిన భిక్షను అర్జునుడు ఆరగించినాడు. 5

శ్లో॥ సోఽపశ్యత్తత్ర తాం తన్వీం యతిః కన్యాం మనోహరామ్ ।
ప్రీత్యుత్ఫుల్లేక్షణాత్తస్యా భావక్షుబ్ధం మనోదధే ॥ 6

టీ:- స ఇతి. భావేన రత్యభి ప్రాయేణ క్షుభితం మనః దధే. 6

అక్కడ యతిరూపమున ఉన్న అర్జునుడు మనోహరమైన కన్య సుభద్రను దర్శించినాడు. ప్రేమతో కలువల వంటి కన్నులుగల ఆమె దర్శనము వలన అతని మనస్సు కామభావనతో తల్లడిల్లినది. 6

శ్లో॥ సాపి తం చకమే వీక్ష్య నారీణాం హృదయంగమమ్ ।
హసంతీ వ్రీడితాపాంగా తన్న్యస్తహృదయేక్షణా ॥ 7

టీ:- సేతి. వ్రీడితాపాంగా సవ్రీడకటాక్షా. తస్మిన్నేవ న్యస్తం హృదయ మీక్షణే. చ యయా. సా. 7

ఆమెకూడా స్త్రీలకు మనోహరుడైన అర్జునుని సిగ్గుతోకూడిన కడగంటి చూపులతో చూచినది. ఒక్కచూపుతోనె ఆమె హృదయము ఆతనిపట్ల ఆకర్షితమై ప్రకాశించినది. (సుభద్రార్జునులు పరస్పరము ప్రేమభావనులైరని భావము) 7

శ్లో॥ తాం పరం సమభిధ్యాయన్నంతరం ప్రేప్సురర్జునః ।
న లేభే శం భ్రమచ్చిత్తః కామేనాతి బలీయసా ॥ 8

సుభద్రనే అధికముగా స్మరించుచు ఆమెను అపహరించుటకై అవకాశమును అన్వేషించుటలో మనస్సు లగ్నముచేసి కామపీడితుడై నందు వలన బలరాముడు మొదలైనవారు చేసే పూజా కార్యక్రమములు అర్జునునికి సుఖము కలిగించలేక పోయినవి. 8

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ మహత్యాం దేవయాత్రాయాం రథస్థాం దుర్గనిర్గతామ్ ।
జహానురానుమతః పిత్రోః కృష్ణస్య చ మహారథః ॥ 9

టీ:- తామితి. అంతరం హర్తుమవసరం ప్రేప్సుః ప్రాప్తుమిచ్ఛుః కామేన భ్రమత్ చిత్తం యస్య సః. శం రామాదిసంమాననిమిత్తం. సుఖం. (8-9)

దేవతల ప్రీతికై జరిగిన ఒక గొప్ప జాతర (యాత్ర)లో రథముపై ద్వారకా నగరమునుండి బయలు వెడలిన సుభద్రను ఆమె తండ్రి వసుదేవుడు, అన్న కృష్ణుని అనుమతితో మహారథుడైన అర్జునుడు అపహరించినాడు. 9

శ్లో॥ రథస్థో ధనురాదాయ శరాంశ్చారుంధతో భటాన్ ।
విద్రావ్య క్రోశతాం స్వానాం స్వభాగం మృగరాడివ ॥ 10

రథమునధిరోహించి ధనువును గ్రహించి అడ్డగించునట్టి భటులను తన బాణములతో - తన ఆహారం కొరకై ఆక్రోశించే కుక్కల గుంపును ఛేదించు సింహమువలె చెండాడినాడు. 10

శ్లో॥ తచ్ఛ్రుత్వా క్షుభితోరామః పర్వణీవ మహార్ణవః ।
గృహీతపాదః కృష్ణేన సుహృద్భిశ్చాన్వ శామ్యత ॥ 11

టీ:- రథస్థ ఇతి. ఆసమంతా ద్రుంధతః ఆవరణం కుర్వతః(10-11)

అర్జునుడు సుభద్రను అపహరించిన విషయమును విని బలరాముడు పున్నమినాటి సముద్రములాగా క్రోధముతో ఎగసి పడినాడు. శ్రీకృష్ణుడు అతని పాదములు పట్టి బ్రతిమిలాడగా, స్నేహితులు అనునయించగా శాంతించినాడు. 11

శ్లో॥ ప్రాహిణోత్పారిబర్హాణి వరవధ్వోర్ముదాబలః ।
మహాధనోపస్కరేభ రథాశ్వవర యోషితః ॥ 12

పిమ్మట సంతోషముతో బలరాముడు వధూవరులకు అపారమైన ధనము, సంభారములు, రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, పరిచారక జనము మొదలైన కట్నకానుకలను ఘనముగా పంపినాడు. 12

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ అభవన్ ప్రీతిసంహృష్టా బాంధవా యదుపాండవాః ।
అథాన్యదపి కృష్ణస్య వాత్సల్యం భక్తయోశ్శృణు ॥ 13

శ్లో॥ కృష్ణస్యాసీత్సఖా కశ్చిచ్ఛృతదేవ ఇతి శ్రుతః ।
కృష్ణైకభక్త్యా పూర్ణార్థశ్శాంతః కవిరలంపటః ॥ 14

టీ:- ప్రాహిణోదితి. పారిబర్హాణి వరవధ్వోః ప్రీతిదేయాని. (12-14)

శ్లో॥ స ఉవాస విదేహేషు మిథిలాయాం గృహాశ్రమీ ।
అనీహయా గతాహార్య నిర్వర్తితనిజక్రియః ॥ 15

టీ:- స ఇతి. అనీహయా అనుద్యమేనైవాగతం యదాహార్యం భోజ్యం తేన నిర్వర్తితాః నిజాః క్రియాః.యేన సః. 15

శ్లో॥ యాత్రామాత్రం త్వహరహర్దైవాదుపనతం చ యత్ ।
నాధికం తావతాతుష్టః క్రియాశ్చక్రే యథోదితాః ॥ 16

టీ:- యత్రామాత్రమితి. యత్రామాత్రం శరీరాదినిర్వాహమాత్రం భోజ్యం నాధికమల్పం ఉపనతం ప్రత్యాగతమితి. 16

యాదవపాండవులు, వారి బంధువులు సంతసించినారు. ఇంకా భక్తుల విషయమై శ్రీకృష్ణునికున్న వాత్సల్య గాథలున్నవి. చెప్పెదను వినుమని శుకుడు చెప్పమొదలిడినాడు. 13

శ్రీకృష్ణునికి శ్రుతదేవుడనే ఒకానొక బ్రాహ్మణ మిత్రుడున్నాడు. ఆయన శ్రీకృష్ణునియందలి అనన్య భక్తితో పరిపూర్ణముగా కోరికలను వీడిన సర్వజ్ఞుడైన ఎట్టి ప్రాపంచిక వ్యామోహములు లేనివాడు. 14

ఆయన విదేహ రాజ్యమందలి మిథిలా నగరమున గృహస్థాశ్రమమును నిర్వహించుచు ప్రయత్నరహితముగా కోరకనే సిద్ధించిన ఆహారముతో తృప్తిచెంది తన విధ్యుక్త ధర్మమును ఆచరించు చుండినాడు. 15

ప్రతిదినము శరీర పోషణకు అవసరమైనంతవరకు మాత్రమే హెచ్చుతగ్గులు లేకుండా లభించిన ఆహారముతో సంతోషపడి ఆశ్రమ ధర్మములందు చెప్పిన విధముగా ఆయాకార్యక్రమములను కొనసాగించి నాడు. 16

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తథాతత్రాద్రాష్ట్రపాలో௨ంగ బహుళాశ్వ ఇతిశ్రుతః ।
మైథిలో నిరహంమాన ఉభావప్యచ్యుతప్రియౌ ॥ 17

టీ:- తథేతి. మిథిలస్య జనకస్య వంశ్యో మైథిలః. 17

అప్పుడు మిథిలా నగరమున జనకుని వంశమునకు చెందిన బహుళాశ్వుడను రాజు స్వార్థము, అహంకారములు లేనివాడై పాలించుచుండెను. ఈ శ్రుతదేవ, బహుళాశ్వురిరువురు శ్రీకృష్ణునికి ప్రీతిపాత్రులైన భక్తులు. 17

శ్లో॥ తయోః ప్రసన్నో భగవాన్ దారుకేణాహృతరథమ్ ।
ఆరుహ్యా సాకం మునిభిర్విదేహాన్ ప్రయయౌ ప్రభుః ॥ 18

టీ:- తయోరితి. ప్రభురేవ స్వయం విదేహాన్ దేశాన్ప్రయయౌ. 18

శ్లో॥ నారదో వామదేవో௨త్రిః కృష్ణోరామో௨సితోరుణః ।
అహం బృహస్పతిః కణ్వోమైత్రేయశ్చ్యవనాదయః ॥ 19

తాను ప్రభువై ఉండికూడా వారిరువురి పట్ల అభిమానము కలవాడైన కృష్ణుడు దారుకుడు సిద్ధము చేసిన రథముపై నారదుడు, వామదేవుడు, అత్రి, వ్యాసుడు (కృష్ణుడు), పరశురాముడు (రాముడు), అసితుడు, అరుణుడు, శుకుడు (నేను), బృహస్పతి, కణ్వుడు, మైత్రేయుడు, చ్యవనుడు మొదలైన మునీశ్వరులతో కూడిన వాడై మిథిలా నగరమునకు వెళ్ళినాడు. (18-19)

శ్లో॥ తత్ర తత్ర తమాయాంతం పౌరజానపదా నృపాః ।
ఉత్థస్తుస్సార్ఘ్యహస్తాస్తే లోకాస్సూర్యమివోదితమ్ ॥ 20

టీ:- నారద ఇతి. కృష్ణో వ్యాసః రామః పరశురామః అహం శ్రీశుకః. ఏవమాదిభిస్సహ. (19-20)

మనోహరమైన చిరునవ్వు, మృదువైన చూపులతో కూడిన పద్మమువంటి ముఖముతో రాచవేషమున వచ్చునట్టి శ్రీకృష్ణునికి మార్గమధ్యమునందలి ఆనార్తము, ధన్వము, కురు, జాంగలము, వంగ, మత్స్య, పాంచాలము, కుంతీ, మధు, కేకయ, కోసల,అర్ణము మొదలైన ఇంకా పెక్కు దేశములందలి పౌరులు, జానపదులు, రాజులు, స్త్రీ పురుషులందరు తమ చూపులతో ఉదయించే సూర్యునికి అర్ఘ్యము సమర్పించినట్లుగా ఆనందబాష్పములతో అర్ఘ్యమిచ్చిరి. (20-21)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఆనర్తధన్వకురుజాంగల వంగమత్స్య
పాంచాల కుంతిమధుకేకయ కోసలార్ణాః ।
అన్యే చ తన్ముఖసరోజముదారహాస
స్నిగ్ధేక్షణం నృపపపుర్దృశిభిర్నృనార్యః ॥ 21

టీ:- ఆనర్తేతి. ఆనర్తాద్యర్ణాం తాస్తద్దేశవర్తిన్యః. నృనార్యః పురుషా నార్యశ్చఉదారహాసః. స్నిగ్ధమీక్షణం చ యస్మిన్ తత్‌దృశిభిః నేత్రైః21

శ్లో॥ తేభ్యస్స్వవీక్షణవినష్టతమిస్రదృగ్భ్యః
క్షేమం త్రిలోక గురురర్థదృశం చ యచ్ఛన్ ।
శృణ్వన్ దిగంతధవళం స్వయశోఽశుభఘ్నం
గీతం సురైర్నృభిరగాచ్ఛనకైర్విదేహాన్ ॥ 22

టీ:- తేభ్య ఇతి. స్వవీక్షణేనైవ వినష్టతమిస్రాదృశో యేషాం తేభ్యః. క్షేమం అభయం. అర్థదృశం తత్త్వజ్ఞానం చ. 22

శ్లో॥ తేఽచ్యుతం ప్రాప్తమాకర్ణ్య పౌరజానపదా నృపాః ।
అభీయుర్ముదితాస్తస్మై గృహీతార్హణ పాణయః ॥ 23

టీ:- త ఇతి. అభీయుః ప్రత్యుజ్జగ్ముః . 23

త్రిలోకగురుడైన శ్రీకృష్ణుడు మార్గమధ్యమందలి భక్తులకు తన చూపులతోనే వారి సమస్త పాపములను నాశనము చేసి, వారికి భయరహితమైన (పునర్జన్మలేని) తత్త్వజ్ఞానమును ప్రసాదించుచు, దిక్కులందు వ్యాపించిన తన శుభ్రమైన (అశుభమును నాశనము చేయు) కీర్తిని గురించి ఆలపించిన దేవతలు, మనుష్యుల గీతములను ఆలకించుచు క్రమముగా మిథిలా నగరమునకు వెళ్ళినాడు. 22

శ్రీకృష్ణుడు తమ మిథిలా నగరమునకు వచ్చినాడనే మాట విని పౌరులు, జానపదులు, రాజులు మహా సంతోషముతో ఆయనకు స్వాగతసత్కారములు చేయుటకై హస్తములందు పూజాద్రవ్యముల పాత్రలు స్వీకరించి ఎదురేగిరి. 23

శ్లో॥ దృష్ట్వాతముత్తమశ్లోకం ప్రీత్యుత్ఫుల్లాననాశయాః ।
కైర్ధృతాంజలిభిర్నేముశ్రుతపూర్వాంస్తథా మునీన్ ॥ 24

ఉత్తమ చరిత్ర కలిగిన శ్రీకృష్ణపరమాత్మను చూచి ప్రీతితో వికసించిన ముఖము, అంతరంగములతో తలలు వంచి నమస్కరించిరి. అట్లే అతిథులుగా వచ్చిన ఆ మునీశ్వరులందరికీ శిరస్సులు వంచి నమస్కరించిరి. 24

శ్లో॥ స్వానుగ్రహాయ సంప్రాప్తం మన్వానౌ తం జగద్గురుమ్ ।
మైథిలశ్ర్శుతదేవశ్చ పాదయోః పేతతుః ప్రభోః ॥ 25

తమను అనుగ్రహించుటకే పరమాత్మ కృష్ణుడు మిథిలా నగరమునకు వచ్చినాడని భావించి శ్రుతదేవుడు, బహుళాశ్వుడు ఆ మహనీయుని పాదములపై పడిరి. 25

శ్లో॥ న్యమంత్రయేతాందాశార్హమాతిథ్యేన సహద్విజైః ।
మైథిలశ్ర్శుతదేవశ్చ యుగపత్సంహతాంజలీ ॥ 26

టీ:- దృష్ట్వేతి. ప్రీత్యా ఉత్ఫుల్లాని ఆననాని ఆశయాః అంతఃకరణాని చ యేషాం తే. కైః శిరోభిః. (24-26)

వారిరువురు ఒకేసారి బ్రాహ్మణ సహితుడైన శ్రీకృష్ణుని తమ ఇంటికి ఆతిథ్యము స్వీకరించుటకు రమ్మని చేతులు జోడించి ప్రార్థించిరి. 26

శ్లో॥ భగవాంస్తదభిప్రేత్యతయోః ప్రియచికీర్షయా ।
ఉభయోరావిశద్గేహముభాభ్యాం తదలక్షితః ॥ 27

భగవంతుడైన కృష్ణుడు వారి కోరికను మన్నించి వారికి ప్రీతిని కలిగించుటకై వారిరువురి ఇండ్లకు ఒకేసారి - కృష్ణుడు తమ ఇంటికి తప్ప వేరే ఇంటికి వెళ్ళిన విషయమును తెలియరాకుండా రెండు రూపములతో ప్రవేశించినాడు. 27

శ్లో॥ శ్రోతుమప్యసతాందూరాన్ జనకస్స్వగృహాగతాన్ ।
ఆనీతేష్వాసనాగ్ర్యేషు సుఖాసీనాన్ మహామనాః ॥ 28

టీ:- భగవానితి.తత్ అభిప్రేత్య అంగీకృత్య. తత్తదా. ఉభాభ్యామపి తాభ్యాం మద్గృహాదన్యస్య గేహం యా తీత్యలక్షితః అవిదితః. యద్వా. ఉభాభ్యాం రూపాభ్యాం తదలక్షితః తాభ్యామలక్షిత ఇతి. (27-28)

శ్లో॥ ప్రవృద్ధభక్తిరుద్ధర్ష హృదయోఽస్రావిలేక్షణః ।
నత్వా తదంఘ్రీన్ప్రక్షాళ్య తదపో లోకపావనీః ॥ 29

టీ:- ప్రవృద్ధేతి. ఉద్ధర్షం ఉద్గతహర్షం హృదయం యస్య అస్రైరావిలే క్లిన్నే ఈక్షణే యస్య. 29

శ్లో॥ సకుటుంబోఽవహన్మూర్ధ్నా పూజయాంచక్రీ ఈశ్వరన్ ।
గంధమాల్యాంబరాకల్ప ధూపదీపార్ఘ్యగోవృషైః ॥ 30

టీ:- సకుటుంబ ఇతి. ఈశ్వరాన్ ఈశ్వరం తత్తుల్యాంశ్చేత్యర్థః. 30

శ్లో॥ వాణ్యామధురయా ప్రీణన్నిదమాహన్నతర్పితాన్ ।
పాదావంకగతౌ విష్ణోస్సంస్పృశన్ శనకైర్ముదా ॥ 31

టీ:- వాణ్యేతి. ప్రీణన్ ప్రీణయన్. సంస్పృశన్ సంమర్దయన్. 31

దుష్టులు వారిని గురించి వినుటకు కూడా సాధ్యము కాక దూరమున ఉన్నవారు ( దుష్టులు దరిజేర సాధ్యము కాని వారు), తన ఇంటికి స్వయముగా వచ్చినవారు అయిన కృష్ణుని, మునీశ్వరులను బహుళాశ్వుడు సాదరముగా ఆహ్వానించి గౌరవాసనము లందు సుఖముగా ఆసీనులను చేసి ఆ మహనీయులకు అధికమైన భక్తి భావముతో, మిగుల ఆనందించిన హృదయముతో ఆనందబాష్పములతో కలతచెందిన కన్నులు కలవాడై నమస్కరించి వారి పాదములు కడిగి లోకపవిత్రమైన ఆ నీటిని తన కుటుంబసహితముగా శిరస్సున ధరించినాడు. జగదీశ్వరులైన వారిని గంధములు, పూలమాలలు, వస్త్రములు, ధూపదీపములు, అర్ఘ్యములు, గోవత్సములను సమర్పించి పూజించినాడు. (28-30)

మధురమైన వాక్కులతో వారిని తృప్తి పరచి తృప్తులైన వారి పాదపద్మములను తన తొడలపై నిడుకొని వత్తుచూ సంతోషముతో మెల్లగా ఇట్లు చెప్పినాడు. 31

బహుళాశ్వ ఉవాచ

శ్లో॥ భవాన్హి సర్వభూతానామాత్మా సాక్షే స్వదృక్ప్రభో ।
అథనస్త్వత్పదాంభోజం స్మరతాం దర్శనంగతః ॥ 32

టీ:- భవానితి. ఆత్మా చేతయితా సాక్షీ ప్రకాశకః. స్వదృక్ స్వప్రకాశః అథ అతః కారణాత్. 32

శ్లో॥ స్వవచస్తదృతం కరయ్తుమస్మద్దృగ్గోచరో భవాన్ ।
యదాత్థైకాంత భక్తాన్మే నానంత శ్రీరజః ప్రియః ॥ 33

శ్లో॥ కోను త్వచ్చరణాంభోజమేవం విద్విసృజేత్పుమాన్ ।
నిష్కించనానాం శాంతానాం మునీనాం యత్త్వమాత్మదః ॥ 34

టీ:- స్వవచఇతి. అనంతో బంధురపి, శ్రీర్భార్యాపి అజః పుత్రోపి. (33-34)

శ్లో॥ యోఽవతీర్య యదోర్వంశే నృణాం సంసరతామిహ ।
యశో వితేనే తచ్ఛాంత్యై త్రైలోక్యవృజినాపహమ్ ॥ 35

బహుళాశ్వుడు ఇట్లు చెప్పినాడు

ఓ ప్రభూ! సర్వజీవులకు చైతన్యము కలిగించువాడవు, సమస్తమును ప్రకాశింపజేయు వాడవు నీవు. నీ స్వయం ప్రకాశత్వమే దీనికి కారణము. నీ పాదపద్మాలను ధ్యానించేవారికి దర్శనము కలిగించితివి. 32

నాపట్ల అనన్య భక్తి కలిగిన పరమ భక్తుల కంటే బంధువైన ఆదిశేషుడుకానీ, భార్యయైన లక్ష్మికానీ, పుత్రుడైన బ్రహ్మకానీ నాకు ప్రియమైన వారు కారు అన్న నీ మాటను సార్థకము చేయుటకై నేడు మీరు నా కన్నులకు సాక్షాత్కరించితిరి. 33

శాంతులు, మునీశ్వరులు, ఏమీపొందలేని దరిద్రులకునూ నిన్ను నీవే ఆత్మసమర్పణ చేసుకొందువు. అట్టి నీ పాదపద్మములను ఎవరు విడుతురు? (విడువరని అర్థము) 34

మానవులు సంసార వ్యామోహమున పడి కొట్టుమిట్టాడు చుండగా వారి ప్రాపంచిక సంకటాలను ఉపశమింపజేయుటకై, యాదవ వంశమున ఆవిర్భవించి ముల్లోకాల పాపములను పోగొట్టిన వాడివనే కీర్తిని పొందితివి. 35

శ్లో॥ నమస్తుభ్యం భగవతే కృష్ణాయాకుంఠమేధసే ।
నారాయణాయ ఋషయే సుశాంతతప ఈయుషే ॥ 36

టీ:- య ఇతి. తచ్ఛాంత్యై సంసారోపశమాయ. (35-36)

ఓ భగవంతుడా! కృష్ణా! మొక్కవోని మేధాసంపత్తి కలవాడా, నారాయణ, ఋషీశ్వరా, మిక్కిలి ప్రశాంతమైన తపస్సుచే పొందదగిన వాడా నీకు నమస్కారము. 36

శ్లో॥ దినాని కతిచిద్భూమన్ గృహాన్నో నివసన్ద్విజైః ।
సమేతః పాదరజసా పునీహీదం నిమేఃకులమ్ ॥ 37

ఓ పరమాత్మా! కొన్ని దినములు మాయింట బ్రాహ్మణ సముదాయముతో కలిసి ఉండి నీ పాదధూళితో మా వంశమును పావనము చేయుమని బహులాశ్వుడు ప్రార్థించినాడు. 37

శ్లో॥ ఇత్యుపామంత్రితో రాజ్ఞా భగవాన్ లోకపావనః ।
ఉవాసకుర్వన్ కల్యాణం మిథిలానరయోషితామ్ ॥ 38

టీ:- దినానీతి. గృహాన్ గృహేష్విత్యర్థః. (37-38)

ఈ విధముగా రాజు ప్రార్థించగా ఆయన ప్రార్థనను మన్నించి లోకపావనుడైన పరమాత్మ కృష్ణుడు మిథిలానగర వాసులకు శుభపరంపరను కలిగించుచు కొంతకాలముండినాడు. 38

శ్లో॥ శ్రుతదేవోఽచ్యుతం ప్రాప్తం స్వగృహాన్ జనకో యథా ।
నత్వా మునీంశ్చ సంహృష్టో ధూన్వన్వాసో ననర్తహ ॥ 39

టీ:- శ్రుతదేవ ఇతి. ధూన్వన్ పరిభ్రామయన్. 39

శ్రుతదేవుడు కూడా జనక చక్రవర్తి బహులాశ్వుని వలెనే శ్రీకృష్ణుడు తన ఇంటికిరాగా ఆయనకు, మునీశ్వరులకునమస్కరించి ఆనందముతో అంగవస్త్రమును గాలిలో వీచుచునాట్యమాడినాడు. 39

శ్లో॥ తృణపీఠబ్రుసీష్వేతానాసనేషూపవేశ్య సః ।
స్వాగతే నాభివంద్యాంఘ్రీన్ సభార్యోవనిజే ముదా ॥ 40

నియమవంతులైన ఋషులను దర్భచాపలపై ఆసీనులను చేసి వారికి స్వాగతపూర్వకముగా నమస్కరించి ఆనందముతో భార్యా సహితుడై వారి పాదములు కడిగినాడు. 40

శ్లో॥ తదంభసా మహాభాగ ఆత్మానం సగృహాన్వయమ్ ।
స్నాపయాంచక్రే ఉద్ధర్షో లబ్ధసర్వమనోరథః ॥ 41

ఓ మహాత్మా! వారి పాదజలమును తనపై, తనకుటుంబీకులపై, తన ఇల్లంతయు చల్లుకొని సమస్తమైన కోరికలు తీరినవాడై అపారమైన ఆనందమును అనుభవించినాడు. 41

టీ:- తృణేతి. అవనిజే అవనినిజే ప్రక్షాళితవాన్. (40-41)

శ్లో॥ ఫలార్హణోశీరశివామృతాంబుభి
ర్మృదా సురభ్యాతులసీ కుశాంబుజైః ।
ఆరాధయామాసయథోపపన్నయా
సపర్యయాసత్త్వవివర్ధ నాంధసా ॥ 42

అర్హములైన ఉసిరిక మొదలైన ఫలములు, సువాసనలతో కూడిన దుంపలు మొదలైనవి, అమృతము వంటి జలములు, పరిమళభరితములైన కస్తూరి, తులసి, దర్భలు మొదలైన తనకు లభించిన వస్తుజాలముతో, ఇతర జీవరాశికి కష్టము కలిగించక అనాయాసముగా లభించిన ఆహారముతో ఆ ఋషి సముదాయమును పూజించినాడు. 42

టీ:- ఫలేతి. ఫలైః అమలకాదిభిః. అర్హణేన ఉశీరైః. తృణవిశేషమూలైః సువాసితైః శివైః అమృతవత్స్వాదుభిరంబుభిః. సురభ్యా మృదాకస్తూరి ప్రముఖయాసపర్యయా పూజయా. యథోపపన్నయా అనాయాసేన సంపన్నయా భూతానుపద్రవలబ్ధత్వాత్ సత్త్వవివర్ధనం యత్ అంధః అన్నం తేన చ. 42

శ్లో॥ సతర్కయామాసకుతో మమాన్వభూ
ద్గృహాంధకూపే పతితస్య సంగమః ।
యస్సర్వతీర్థాస్పద పాదరేణుభిః
కృష్ణేన చాస్యాత్మనికేత భూసురైః ॥ 43

టీ:- స ఇతి. అస్యకృష్ణస్య ఆత్మామూర్తిస్తస్య నికేతైః. భూసురైశ్చ. సర్వతీర్థాస్పదపాదరేణుభిః కృష్ణాదిభిః. యః సంగమః. సః మమ కుతోऽన్వభూదితి. అన్వితి విస్మయే. యద్వా. అఇతి.వితర్కే, ను ఇతి విస్మయే. 43

"ఈ కృష్ణపరమాత్మ, ఆయన రూపమునకు స్థానమైన బ్రాహ్మణులు, సర్వతీర్థములకు నెలవులైన వారి పాదధూళి", ఇల్లనే చీకటిబావిలో పడిన నాకు ఎట్లు లభించగలదని ఆశ్చర్యముతో శ్రుతదేవుడు తర్కించుకున్నాడు. 43

శ్లో॥ సూపవిష్టాన్కృతాతిథ్యాన్ శ్రుతదేవ ఉపస్థితః ।
సభార్య స్వజనాపత్య ఉవాచాంఘ్ర్యభిమర్శనః ॥ 44

టీ:- సూపవిష్టానితి. ఉపస్థితః సమీపే ఉపవిష్టః భార్యాః భర్తవ్యాః స్వజనాః అపత్యాని చ తైస్సహితః.శ్రీకృష్ణస్య. అంఘ్రీ అభిమృశతి సంమర్దయతీత్యంఘ్ర్యభిమర్శనః. 44

భోజనానంతరము వారందరిని సుఖాసీనులను చేసి తన బంధువులు, భార్య, పిల్లలతో వారి సమీపమున కూర్చొని వారి పాదములు వత్తుచూ ఈ విధముగా అన్నాడు. 44

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

**శ్రుతదేవ ఉవాచ**

శ్లో॥ సోऽద్య నో దర్శనం ప్రాప్తః పరం పరమపూరుషః ।
యర్హీదం శక్తిభిస్సృష్ట్వా ప్రవిష్టోన్యాత్మ సత్తయా ॥ 45

టీ:- స ఇతి. యర్హీదం ప్రవిష్టః తదైవ దర్శనం ప్రాప్త ఇతి. సఏవ సన్మాత్రః నాద్యతనీభూతస్త్వమిత్యర్థః. యద్వా. సః అస్మాన్. అద్యైవ ప్రాప్త ఇతి. న. కింతు తదైవ ప్రాప్తః. యర్హీదం విశ్వం శక్తిభిః సత్త్వాదిభిః సృష్ట్వా ఆత్మసత్తయా అనుప్రవిష్టః. త్వం. దర్శనం పరం కేవలమద్యైవ ప్రాప్తఇతి. 45

**శ్రుతదేవుడు ఇట్లు చెప్పినాడు**

ఓ పరమాత్మా! ఈ జగత్తును నీ సత్త్వాది శక్తులచేత నిర్మించి, నీ ప్రకాశముతో నీవే అందులో ప్రవేశించితివి. అట్టి నీ సర్వోత్కృష్ట దర్శనము నాకీనాడు లభించినది. 45

శ్లో॥ యథాశయానః పురుషోమనసాచాత్మమాయయా ।
సృష్ట్వాలోకం పరం స్వాప్నమనువిశ్యావభాసతే ॥ 46

టీ:- మాయాసృష్టి ప్రవేశయోర విద్యాసృష్టి ప్రవేశౌదృష్టాంతతయాహ - యథేతి. ఆత్మమాయయా స్వావిద్యయేత్యర్థః. యద్వా. ఆత్మనస్తవ మాయయేతి. 46

మాయా సృష్టి ప్రవేశములకు, అవిద్యా సృష్టి ప్రవేశములకు దృష్టాంతముగా చెప్పుచున్నాడు - నిద్రించిన మనుష్యుడు తన (ఆత్మ) మాయచేత అనగా తన అవిద్యతో లేక పరమాత్మ మాయతో స్వప్న జగత్తును పుట్టించి అందులో తానే తైజసుడై ప్రవేశించి ప్రకాశించినట్లుగా నీవే ఈజగత్తును సృష్టించి అందులో నీవే ప్రవేశించితివి. 46

శ్లో॥ శృణ్వతాం గదతాం శశ్వదర్చతాం త్వాభివందతామ్ ।
నృణాం సంవదతామంతర్హృది భాస్యమలాత్మనామ్ ॥ 47

నిత్యము శ్రవణము, కీర్తనము, అర్చనము, వందనములు చేసే నిర్మలమైన మనస్సుగల భక్తుల హృదయములందే నీవు ప్రకాశింతువు.

టీ:- కిం చ శృణ్వతామితి. నిత్యం శ్రవణకీర్తనాదిపరాణాం అమలాత్మనామపి హృద్యేవ త్వం భాసి. మమతు లోచనగోచరస్త్వం అహో భాగ్యమితి భావః . 47

శ్లో॥ హృదిస్థోஉప్యతి దూరస్థః కర్మవిక్షిప్త చేతసామ్ ।
ఆత్మశక్తిభిరగ్రాహ్యోప్యంత్యుపేతగుణాత్మనామ్ ॥ 48

టీ:- నను సర్వేషాం హృదిస్థితః కథం కేషాంచిదేవ హృది భాతి. మేఘైః సూర్యవత్ జీవోపాధిభిరంతరితత్వాదితి. యద్యుచ్యతే తర్హి న కస్యాపి భాయాదిత్యత ఆహ-హృదిస్థ ఇతి. కర్మభిః. విక్షిప్తం చేతో యేషాం తేషాం ఆత్మశక్తిభిః అహంకారాదిభిః అగ్రాహ్యః వ్యవహితోஉపి ఉపేతగుణః ప్రాప్తశ్రవణకీర్తనాది సంస్కారః ఆత్మాఅంతఃకరణం యేషాం తేషాం. అంతి సమీపే. అవ్యవహితస్త్వమిత్యర్థః. 48

శ్లో॥ నమోస్తుతేஉధ్యాత్మవదాం పరాత్మనే
హ్యనాత్మనే స్వాత్మవిభక్తమృత్యవే ।
సకారణాకారణలింగ మీయుషే
స్వమాయయా సంవృతరుద్ధ దృష్టయే ॥ 49

కానీ నీవు నా లౌకిక నేత్రములకే సురూపముతో గోచరించితివి. నా అదృష్టమేమని చెప్పుదునని భావము. 47

అందరి హృదయములందున్న నీవు కేవలము కొందరి హృదయములలోనే ఎందుకు ప్రకాశింతువు. మేఘములు సూర్యుని కప్పివేసి నట్లు జీవుల ఉపాధుల మరుగున పరమాత్మ ఎరుగ రాకుండ ఉండును. అయితే భగవంతుడు ఎవరి హృదయములలోనూ భాసించడా అనే విషయమై చెప్పుచున్నాడు - ఎల్లరి హృదయములందు పరమాత్మ ఉన్ననూ ప్రాపంచిక కర్మలతో చంచలమైన మనస్సుకల సామాన్యులు ఆత్మశక్తులైన అహంకారము మొదలైన వానివల్ల తమలోని పరమాత్మను గ్రహించలేరు. తమలోని ఆత్మతత్త్వమే వారికి దూరముగా ఉండునని భావము. అయితే గుణములను సమీకరించుకొని, శ్రవణ కీర్తనాదుల సంస్కారమును పొందిన అంతఃకరణము కలవారికి అత్యంత సమీపమున పరమాత్మ ఎడబాటు లేక నిలుచును. 48

ఈ విషయమునే వివరించుచున్నాడు - నాదేహము, నేను అనే భావములను వదిలిపెట్టిన అధ్యాత్మవేత్తలకు మోక్షప్రదుడవై పరమాత్మ రూపముతో ప్రకాశింతువు. శరీరము, భార్యాపుత్రులు,

టీ:- ఏతదేవ ప్రపంచయన్నమస్యతి - నమఇతి. తే తుభ్యం నమో౽స్తు. అధ్యాత్మవిదాం నివృత్తదేహాద్యహంకారాణాం. పరమాత్మనే పరమాత్వత్వేన ప్రకాశమానాయ మోక్షప్రదాయేత్యర్థః. అనాత్మనే దేహాద్యభిమానినే జీవాయ. పరత్వేనా ప్రకాశమానత్వాత్. స్వాత్మనస్స కాశాత్ విభక్తః సమర్పితః మృత్యుః సంసారో యేన తస్మై. కుత ఏతత్తత్రాహ - సకారణం మహదాదికార్యం. అకారణం ప్రకృతిః తదుభయలింగం ఉపాధిం. నియంతృనియమ్యతయా ఈయుషే ప్రాప్తవతే. అతః ఉభయనియంతుః స్వస్మాత్సకాశాత్ తదుభయ వంశ్యాయ జీవాయ విభక్తమృత్యవ ఇత్యర్థః. నియంతృనియమ్యత్వే కారణం వదన్నాహ - స్వమాయయా అసంవృతేతి. అతః అలుప్తైశ్వర్య త్వాత్ తన్నియంత్రే తుభ్యం నమః. కించ రుద్ధదృష్టయే మాయావిత్వాదేవ అన్యేషాం రుద్ధా ఆవృతా దృష్టిర్యేన తస్మై యద్వా స్వమాయయా స్వస్య అసంవృతా అన్యేషాం చ రుద్ధా దృష్టిర్యేన తస్మై ఇత్యేకం పదం. 49

సంపదలు మొదలైన వానియందు అభిమానము కలిగిన వారికి పరమాత్మతత్త్వముతో ప్రకాశించవు. ఆత్మకంటే వేరుగా విడివడిమృత్యువుతో కూడిన ప్రాపంచిక వ్యామోహములున్న వారికి ఆత్మతత్త్వము తెలియదు. ఇదంతా ఎందుకు అనే విషయమై చెప్పుచున్నాడు - కారణము కలవి మహదాది కార్యములు (సకారణములు), కారణములేనిది ప్రకృతి (అకారణము). ఈ రెంటి సమన్వయ లక్షణమైన ఉపాధిని (దేహమును) నియంత (నియమించిన వాడు) గా, నియమింపబడు శరీరముగా నీవే పొందితివి. అందువల్ల సకారణమైన మహదాదులను, ఆకారమైన ప్రకృతిని నియమించుచు ఆ రెండింటివల్ల జన్మించిన జీవునికి వేరుగా మృత్యువు కూడా నీవే. నియమించుట, నియమింపబడుటలు రెండుండుటకు కారణము చెప్పుచున్నాడు - పరమాత్మ తన మాయచేత కప్పబడనందువలన అఖండైశ్వముతో జగత్తును నియమించు వాడైనాడు. అట్టి పరమాత్మకు నమస్కారము. కానితనమాయతో ఇతరుల దృష్టిని కప్పినవాడు లేక తనమాయతో తనదృష్టి కప్పబడక ఇతరుల దృష్టిని కప్పినవాడు పరమాత్మ. అట్టి ఆయనకు నమస్కారము. 49

శ్లో॥ సత్వం శాధిస్వభృత్యాన్నః కిన్వీశకరవామ తే ।
ఏతదంతో నృణాం క్లేశో యద్భవానక్షి గోచరః ॥ 50

ఓ పరమేశ్వరా! ఇంత (అనంతమైన) శక్తిగల నీవు నీ భృత్యులమైన మమ్ములను నీ కొరకు ఏమిచేయవలెనో శాసించుము.








మానవులకు నీవు కన్నులకు కనపడు (పరమాత్మతత్త్వము అవగతము) నంతవరకే ఈ ప్రాపంచికసంకటములుండును. ఆత్మదర్శనానంతరము ఏ విధమైన కష్టములకూ తావుండదనిభావము. 50

### శ్రీశుక ఉవాచ

శ్లో॥ తదుక్తమిత్యుపాకర్ణ్య భగవాన్ప్రణతార్తిహా ।
గృహీత్వాపాణినా పాణిం ప్రహసంస్తమువాచ హ ॥ 51

టీ:- స ఇతి. సః ఏవంభూతః పరమేశ్వరః త్వం నః అస్మాన్ స్వభృత్యాన్ శాధి శిక్షయ. (50-51)

### శ్రీశుకుడు ఇట్లు చెప్పినాడు

ఈ విధముగా శ్రుతదేవుడు చెప్పిన విషయమును విని భక్తుల సంకటములను దూరముచేయువాడై భక్తునిచేతిని తనచేతితో పట్టుకొని చిరునవ్వు నవ్వుచు ఆదరముతో ఈ విధముగా చెప్పినాడు. 51

### శ్రీ భగవానువాచ

శ్లో॥ బ్రహ్మంస్తేనుగ్రహార్థాయ సంప్రాప్తాన్విద్ధ్యమూన్ ద్విజాన్ ।
సంచరంతి మయాలోకాన్పునంతః పాదరేణుభిః ॥ 52

టీ:- స్వస్మిన్నాదరమధికం బ్రాహ్మణేషు చ మందమివాలక్ష్య లోకసంగ్రహపరో భగవాన్ మత్తోఽపి బ్రాహ్మణేషు శ్రద్ధాతిరేకం కుర్విత్యేవం తమనుశాస్తి సప్తభిః- బ్రహ్మన్నితి. మయాహృదిస్థేన. 52

### శ్రీ భగవానుడు ఇట్లు చెప్పినాడు

నాయందు ఆదరభావము అధికముగా కలిగిన బ్రాహ్మణులందు ఇతడు మూర్ఖుడని భావించి లోక సంగ్రహమందు దృష్టిగల భగవంతుడు నాకంటే బ్రాహ్మణులయందే అధికమైన శ్రద్ధను ప్రదర్శించుమని ఈ విధముగా అతనికి ఏడు శ్లోకములందు ఉపదేశము చేయుచున్నాడు - ఓ బ్రాహ్మణోత్తమా! నిన్ను అనుగ్రహించుటకే వచ్చినారు. వీరందరు నన్నే హృదయమున భావించుచు తమ పాద రేణువులతో లోకములకు పావనము చేయుచు తిరుగుచున్నారు. 52




శ్లో॥ దేవాః క్షేత్రాణి తీర్థాని దర్శనస్పర్శనార్చనైః ।
శనైః పునంతి కాలేన తదప్యర్హత్తమేక్షయా ॥ 53

టీ:- మమ దేవాదిభ్యోఽపి బ్రాహ్మణాః శ్రేష్ఠా ఇత్యాహ - దేవా ఇతి. తే శనైః పునంతి ఏతే తు సద్యః కించ. దేవాదీని యత్పునంతి తదప్యర్హ త్తమానామీక్షయా. 53

శ్లో॥ బ్రాహ్మణో జన్మతశ్శ్రేయాన్సర్వేషాం ప్రాణినామిహ ।
తపసా విద్యయా తుష్ట్యా కిము మత్కలయా యుతః ॥ 54

టీ:- బ్రాహ్మణఇతి. మమ కలాపరికలనంఉపాస్తిఃతయా యుతః. 54

శ్లో॥ న బ్రాహ్మణాన్మే దయితం రూపమేతచ్చతుర్భుజమ్ ।
సర్వవేదమయో విప్రస్సర్వదేవమయోహ్యహమ్ ॥ 55

టీ:- కించ బ్రాహ్మణారాధనమేవ మమ ప్రేష్ఠమిత్యాహ - నేతి. హేతుమాహ - సర్వవేదమయో విప్ర ఇతి. ప్రమాణాధీనత్వాత్. ప్రమేయస్య.వేదమయో విప్రో దేవ మయాదస్మద్రూపాత్ ప్రేష్ఠ ఇత్యర్థ. 55

నాకన్నా, దేవతలకన్నా, తీర్థయాత్రాదులకన్నా బ్రాహ్మణులే శ్రేష్ఠులని చెప్పుచున్నాడు - పుణ్యక్షేత్రములను దర్శించుట, పవిత్ర తీర్థములను స్పర్శించుట, దేవతలను సేవించుట వలన అవి వారివారి అర్హతలను బట్టి ఎప్పుడో అవసరమైన అనువును (కాలమును) బట్టి మాత్రమే మెల్లమెల్లగా తరింపజేయుము. 53

సహజముగా పుట్టుకతోనే బ్రాహ్మణుడు సర్వప్రాణులకంటే శ్రేష్ఠమైనవాడు. ఇక తపస్సుతో(లోకదుఃఖమునకై తపించుటతో), విద్యతో (లోకసంకటమును తొలగించగల జ్ఞానముతో), తృప్తితో (జగత్కల్యాణమును కలిగించి జనులను తృప్తిపెట్టుటతో), నన్ను ఉపాసించుటతో(మత్కలమాయుతః)కూడిన బ్రాహ్మణుని విషయ మేమని చెప్పవచ్చును, అట్టివాడు సర్వోత్కృష్టుడని భావము. 54

బ్రాహ్మణులనుఆరాధించుటయే నాకు మిక్కిలి ప్రీతిని కలిగించునని చెప్పుచున్నాడు - బ్రాహ్మణునికంటే నాకు నాలుగు భుజములతో కూడిన సహజమైన నా విష్ణురూపధారణ కూడా ఇష్టమైనదికాదు. ఎందుకనగా ప్రమాణమునకు (వేదమునకు) అధీనమైనది ప్రమేయము (పరమాత్మ). అందువల్ల ప్రమాణరూపమైన వేదము బ్రాహ్మణుని ఆధీనమైనది. అనగా సర్వవేదమయుడు

శ్లో॥ దుష్ప్రజ్ఞా అవిదిత్వైవ మవజానంత్య సూయవః ।
గురుం మాం విప్రమాత్మానమర్చాదావిజ్యదృష్టయః ॥ 56

టీ:- దుష్ప్రజ్ఞా ఇతి. అసూయవః దోషదృష్టయః ఇజ్యదృష్టయః పూజ్యబుద్ధయః. 56

శ్లో॥ చరాచరమిదం విశ్వం భావా యేచాస్యహేతవః ।
మద్రూపాణీతి చేతస్యాధత్తే విప్రోమదీక్షయా ॥ 57

బ్రాహ్మణుడని సారాంశము. ప్రమాణాధీనమైన ప్రమేయరూపుడనైన నేను సర్వదేవమయుడను. ప్రమాణము లేనిది ప్రమేయమును గ్రహించుటకు వీలులేదు. కనుక నా చతుర్భుజ రూపముకంటే బ్రాహ్మణుడే నాకు ప్రీతిపాత్రుడు. 55

ఈ విషయము తెలియక పూజాదికములందు పవిత్రదృష్టి ఉన్నవారైనప్పటికీ కొందరు వక్రమైన శాస్త్రజ్ఞానముతో, దోషదృష్టి గలవారై గురుడనైన నన్ను, బ్రాహ్మణుని, తమనుతాము అవమానించు కొనుచున్నారు. 56

చరాచరమైన ఈ అనంతవిశ్వము, దానికి కారణములైన మహదాది సర్వభావములు నా (పరమాత్మ) స్వరూపములే అనే భావనతో అన్నింటియందు నన్నే దర్శించుటకై బ్రాహ్మణుడు మనస్సున స్వీకరించుచున్నాడు. 57

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తస్మాద్బ్రహ్మఋషీనేతాన్బ్రహ్మద్ధయార్చయ నిత్యశః ।
ఏవం చేదర్చితోஉస్మ్యద్ధా నాన్యథా భూరిభూతిభిః ॥ 58

అందువలన ఈ బ్రహ్మర్షులందరినీ నిత్యము శ్రద్ధగా సేవించుము. బ్రాహ్మణారాధనమే నన్ను ఆరాధించుట అగును. అంతేగానీ ఎంతోసంపదలు వెచ్చించి అట్టహాసముగా పూజలు చేయుట వ్యర్థమే. 58

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ స ఇత్థం ప్రభుణాదిష్టస్సహ కృష్ణాన్ ద్విజోత్తమాన్ ।
ఆరాధ్యైకాత్మభావేన మైథిలశ్చాపసద్గతిమ్ ॥ 59

శ్రీశుకుడు ఇట్లు చెప్పినాడు

శ్రుతదేవుడు ఈ విధమైన పరమాత్ముని ఆదేశముతో శ్రీకృష్ణ సహితులైన బ్రాహ్మణ శ్రేష్ఠులను ఆరాధించి సద్గతిని (ముక్తిని) పొందినాడు. మిథిలాపతియైన బహులాశ్వునికిని ముక్తి కలిగినది. 59

శ్లో॥ ఏవం స్వభక్తయో రాజన్ భగవాన్ భక్త భక్తిమాన్ ।
ఉషిత్వాదిశ్య సన్మార్గం పునర్ద్వారవతీమగాత్ ॥ 60

ఓ రాజా! భగవంతుడీవిధముగా భక్తులకు భక్తుడై, తన భక్తులైన శ్రుతదేవ, బహులాశ్వులింట కొన్ని దినములుండి వారికి సన్మార్గమును (మోక్షమార్గమును) ఉపదేశించి మరల ద్వారకా నగరమునకు వెళ్ళినాడు. 60

టీ:- చరాచరమితి. అస్య విశ్వస్య హేతవో భావా మహదాదయః. మదీక్షయా మమైవ సర్వత్ర ఈక్షయా. (57-60)

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, షడశీతితమోஉధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు ఎనుబది ఆరవ అధ్యాయముసమాప్తము**

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## సప్తాశీతితమోऽధ్యాయః

శ్లో॥ సప్తాశీతితమే నారాయణ నారదవాదతః ।
వేదైస్స్తుతిర్గుణాలంబా నిర్గుణా చ తథోచ్యతే ॥

శ్లో॥ వాగీశా యస్య వదనే లక్ష్మీర్యస్య చ వక్షసి ।
యస్యాస్తే హృదయే సంవిత్తం నృసింహమహంభజే ॥

శ్లో॥ సంప్రదాయ విశుద్ధ్యర్థం స్వీయనిర్బంధయంత్రితః ।
శ్రుతిస్తుతిమితాం వ్యాఖ్యాం కరిష్యామి యథామతి ॥

శ్లో॥ శ్రీమద్భాగవతం పూర్వైస్సారతస్సన్నిషేవితం ।
మయా తు తదుపస్పృష్టముచ్ఛిష్టముపచీయతే ॥

## 87వ అధ్యాయము

ఎనుబది ఏడవ అధ్యాయమున శ్రీమన్నారాయణుడు- నారదుల సంభాషణ వలన- పరమాత్మని గుణాశ్రయుడుగను, నిర్గుణుడుగను వేదములు స్తుతించిన విషయము చెప్పబడును.

(ఇక్కడ ఈ అధ్యాయమునకు శ్రీధరాచార్యుడు ప్రత్యేకముగా ఇష్టదేవతా ప్రార్థనను నిబంధించి వ్యాఖ్యానించినాడు. విశేషముగా శ్రుతిగీతలందలి ఇరువది ఎనిమిది శ్లోకములకు ఒక్కొక్కదాని వ్యాఖ్యాన పరిసమాప్తిలో వ్యాసమునీంద్రుని భావనను అనుసరించి ఒక్కొక్క అను శ్లోకమును రచించినాడు)

బ్రహ్మదేవుని ముఖమున, లక్ష్మీదేవిని రొమ్మున, పరిపూర్ణ జ్ఞానమును హృదయమున వహించిన శ్రీ నరసింహస్వామిని నేను సేవింతును.

సంప్రదాయపరిశుద్ధికొరకు, నా పట్టుదలకు కట్టువడి వేదస్తుతి వలన తెలియదగిన వ్యాఖ్యానమును యథాశక్తిగా చేయుదునని శ్రీధర పండితుడు వినమ్రముగా విన్నవించుకొన్నాడు.

శ్రీమద్భాగవత పురాణమును పూర్వులు మిక్కిలి సారభూత మైనదిగా అనుభవపూర్వకముగా ఆచరించి, సేవించినారు. నేనుకూడా వారు చెప్పిన విషయమునే మరల చర్వితచర్వణముగా సమీకరించు చున్నాను.

రాజోవాచ

శ్లో॥ బ్రహ్మన్ బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణే గుణవృత్తయః ।
కథం చరంతి శ్రుతయస్సాక్షాత్సదసతః పరే ॥ 1

టీ:- పూర్వాధ్యాయాంతే. శ్లో. "ఏవం స్వభక్తయో రాజన్ భగవాన్ భక్తభక్తిమాన్, ఉషిత్వాదిశ్య సన్మార్గం పునర్ద్వారవతీమగా" దిత్యత్ర సన్మార్గం సతాం స్వతః ప్రమాణభూతానామ ప్రామాణ్య కారణ రహితానాం వేదానాం మార్గం బ్రహ్మపరత్వముపదిశ్య భగవానగాది త్యుక్తం తత్ర వేదానాం బ్రహ్మపరత్వమఘటమానం మన్వానః పృచ్ఛతి - బ్రహ్మన్నితి. తత్రతావన్ముఖ్యలక్షణా గుణభేదేన త్రిధా శబ్దప్రవృత్తిః. యథా. ముఖ్యాపి రూఢియోగ భేదేన ద్విధా రూఢిశ్చ స్వరూపేణ జాత్యా గుణేన వా. నిర్దేశార్హే వస్తుని సంజ్ఞాసంజ్ఞి సంకేతేన ప్రవర్తతే. యథాడిత్థః గౌః శుక్ల ఇతి. లక్షణా చ తేనైవ సంకేతేనాభిహితార్థసంబంధినీ. యథా గంగాయాం ఘోషః ప్రతివసతీతి. గౌణీ చాభిహితార్థలక్షిత గుణయుక్తే తత్సదృశే. యథా సింహో దేవదత్త ఇతి. యథాహుః. శ్లో. "అభిధేయా వినాభూతే ప్రవృత్తి ర్లక్షణేష్యతే, లక్ష్యమాణగుణై ర్యోగాద్వృత్తేరిష్టా తు గౌణతే" తి. యోగవృత్తిస్తు ఏత త్రివిధవృత్తి ప్రతిపాదిత పదార్థయోః ప్రకృతి ప్రత్యయార్థయోర్వా యోగేన. యథా పంకజం ఔపగవః పాచక ఇత్యాది. తత్ర తావత్ బ్రహ్మణి రూఢివృత్తిర్న సంభవతీత్యాహ -

పూర్వ అధ్యాయము చివర భక్తులకు భక్తుడైన భగవంతుడు శ్రీకృష్ణుడు తన భక్తులకు సన్మార్గమును ఉపదేశించి ద్వారకకు వెళ్ళినాడు. అని చెప్పుటలో- స్వయముగా ప్రమాణరూపమైనవి, ఇవి ప్రమాణములుకాదు అని చెప్పగల కారణమే లభించనివి అయిన వేదములు ప్రతిపాదించిన పరబ్రహ్మతత్త్వమును సత్పురుషులకు ఉపదేశించి ద్వారకకు వెళ్ళినట్లు చెప్పబడినది.

### పరీక్షిత్తు శుకమహర్షిని ఇట్లు అడిగినాడు

వేదములకు బ్రహ్మపరత్వము సిద్ధించదు కదా అని భావించి పరీక్షిత్తు ఇట్లడిగినాడు.- ఓ పరమాత్మా! బ్రహ్మము ఇట్టిదని నిర్దేశించుటకు వీలులేనిదై, గుణరహితమై, సత్తు-అసత్తు లకంటే వేరై ఉండగా గుణవృత్తులు కలిగిన శ్రుతులు పరమాత్మ యందు సాక్షాత్తుగా ఎట్లువర్ణించగలవు.- అని అడిగినాడు.

ముఖ్యము, లక్షణ, గుణము అని శబ్దప్రవృత్తి, శక్తి, మూడు విధములు. శబ్దమునకున్న శక్తులవల్ల ముఖ్యార్థము, లక్ష్యార్థము, గుణార్థము అనే మూడు అర్థములు కలుగును. ముఖ్యార్థము యోగము, రూఢిఅని మరల రెండు విధములు. వీనిలో రూఢి మరల స్వరూపము, జాతి, గుణభేదములతో మూడువిధములు. ముఖ్యార్థము నిర్దేశింపదగిన వస్తువు నందు నామము (సంజ్ఞ-పేరు), దాని రూపము(సంజ్ఞి-వస్తువు)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

సాక్షాత్కథం చరంతీతి. తత్ర హేతుః అనిర్దేశ్య ఇతి. అనిర్దేశ్యత్వేఽసి హేతుం వదన్ గుణవృత్తిం నిరాకరోతి. నిర్గుణే గుణవృత్తయ ఇతి. గుణైర్వర్తమానా అపి నిర్గుణే కథం చరంతీత్యర్థః. నిర్గుణత్వే చ హేతుం వదన్ లక్షణాం యోగం చ నిరాకరోతి. సదసతః పర ఇతి. కార్యకారణాభ్యాం పరస్మిన్ అసంగే కేనచిదపి సంబంధాభావాన్న లక్షణాయోగవృత్తీ సంభవత ఇత్యర్థః. ఏవం పదార్థత్వాయోగాదపదార్థస్య చ. వాక్యార్థత్వాయోగాన్నా శ్రుతిగోచరత్వం బ్రహ్మణ ఇత్యభిప్రాయః. (1)

అనే సంకేతము చేత వర్తించును. (దీనికే సంకేతితార్థము, వాచ్యార్థము అని వ్యవహారములు) బాలుడు, గోవు, తెలుపు మొదలైనవి వాచ్యార్థరూపములు. లక్షణార్థముకూడా ఆ సంకేతముతో అర్థ సంబంధము కలిగినదే. 'గంగలో గొల్ల పల్లె ఉన్నది' అనుటలో గంగాతీరమందలి గొల్లపల్లె అని సంబంధముతో అర్థము చెప్పినచో అది సంబంధలక్ష్యార్థమగును.(ఈ పల్లెకు చల్లదనము, పవిత్రతలు ప్రయోజనములు). వాక్యార్థముచేత లక్షితమైన (బహిర్గతమగునట్టి) గుణముతో కూడినది గౌణి అని అర్థము. దేవదత్తుడు సింహము అనుటలో దేవదత్తుడు సింహమువంటి పరాక్రమము కలవాడని వాచ్యాసార్థ గుణలక్షముచేత చెప్పవలెను. వాచ్యార్థమునందలి గుణములవంటి గుణములతో కూడినందువలన వర్తించే వృత్తిని గౌణత్వమందురు. వాచ్యము, సంబంధము, గుణములు అనేమూడు వృత్తులచేత ప్రతిపాదింపబడిన పదార్థములకుగానీ, ప్రకృతి-ప్రత్యయము అర్థ సంబంధము వలనగానీ వర్తించునది యోగవృత్తి. పంకజము- బురదయందు పుట్టినది- పద్మము అని అర్థము చెప్పినట్లుగా 'బ్రహ్మము' నందు రూఢివృత్తి కలుగదు అనే విషయముగా- శ్రుతులు సాక్షాత్తుగా పరమాత్మయందు ఎట్లు చరించగలవని అడుగుచున్నాడు. బ్రహ్మము ఇట్టిదని నిర్దేశించుటకు వీలులేనిది కనుకనే ఈ శంకలిగినది. బ్రహ్మము నిర్ధేశింప వీలులేదనుటకు హేతువును

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ బుద్ధీంద్రియ మనః ప్రాణాన్ జనానామసృజత్ప్రభుః ।
మాత్రార్థంచ భవార్థం చాత్మనే కల్పనాయ చ ॥ 2

టీ:- ఉత్తరమాహ - బుద్ధీతి. బుద్ధ్యాదీన్. ఉపాధీన్. జనానాం అనుశాయినాం మాత్రాద్యర్థం ప్రభుః ఈశ్వరః అసృజత్. మీయంత

చెప్పి గుణవృత్తిని కూడా తిరస్కరించు చున్నాడు. నిర్గుణుడైన పరమాత్మయందు గుణములతో వర్తించు వేదములెట్లు వర్తించగలవని తిరస్కారము. గుణములందు వర్తించు వేదము నిర్గుణుడైన బ్రహ్మయందుండలేవని అర్థము. పరమాత్మ సత్తు, అసత్తు అనే రెండింటి కంటే వేరైనదనే కారణమును చెప్పి లక్షణను, యోగమును రెండింటిని తిరస్కరించినాడు. కార్యము కారణములు రెండింటితో పరమాత్మకు సంబంధము లేనందు వలన లక్షణా యోగవృత్తులు రెండునూ సంభవించినవని అర్థము. పదార్థమునకు అపదార్థముతో(పదార్థము కానిదానితో)- (శూన్యములాంటి దానితో) కలయిక లేనట్లే వాక్యార్థత్వము లేనందువల్ల బ్రహ్మకు శ్రుతిగోచరత్వము (వేదములకు బ్రహ్మము తెలియుట) అనునది లేదని అభిప్రాయము. (1)

### శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

పరమాత్మ శబ్దస్పర్శాది మాత్రలను ఇహలోకమును తెలియుట కొరకు, తనకొరకు, ఆత్మజ్ఞానమును పొందుటకొరకు, జగద్వ్యాపారమును నిర్వహించుటకొరకు, ప్రాణులకు బుద్ధి, ఇంద్రియములు, ప్రాణము మొదలైన వానిని కల్పించినాడు. పరీక్షిత్తు అడిగినదానికి శుకుడిట్లు సమాధానము చెప్పుచున్నాడు. బుద్ధిమొదలైన ఉపాధులను శరీరధారులైన జీవులకు మాత్రార్థం- శబ్దాది తన్మాత్రలను అనగా



ఇతి మాత్రాః విషయాః తదర్థం. భవార్థం భవో జన్మలక్షణం యత్ కర్మ తత్ప్రభృతి కర్మకరణార్థమిత్యర్థః. ఆత్మనే లోకాంతరగామినే ఆత్మన స్తత్తల్లోక భోగాయేత్యర్థః. అకల్పనాయ కల్పనా నివృత్తయే ముక్తయ ఇత్యర్థః. అర్థధర్మకామమోక్షార్థమితి. క్రమేణ పదచతుష్టయ స్యార్థః. జనానామితి వదన్ జీవార్థమీశ్వరస్య సృష్ట్యాదిషు ప్రవృత్తిం దర్శయతి – ప్రభురితి. ఈశ్వరస్య ఉపాధివశ్యత్వాభావేన నిత్యముక్తతాం దర్శయతి. అయమభిప్రాయః .యద్యప్యుక్తరీత్యా కాపి ప్రవృత్తిర్నసంభవతి. తథాపి. పరంపరయా సాక్షాద్వా సర్వాసాం శ్రుతీనాం బ్రహ్మణి పర్యవసానం. కించ ఈశ్వరో జీవానాం మోక్షార్థమేవ సృష్టిం కరోతి. న చ స్వరూపోపపాదనమంత రేణోపపద్యతే. అతో యోగ్యా కాచన వృత్తిర్విచారణీయేత్యుత్తరం. సగుణమేవ గుణైరనభిభూతాం సర్వజ్ఞం సర్వశక్తిం సర్వేశ్వరం సర్వనియంతారం సర్వోపాస్యం సర్వకర్మఫలప్రదా తారం సమస్తకళ్యాణగుణనిలయం సచ్చిదానందం భగవంతం శ్రుతయః ప్రతిపాదయంతి. శ్రు. "యస్సర్వజ్ఞస్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః , సర్వస్య వశీ సర్వస్యేశానః యః పృథివ్యాం తిష్ఠన్ పృథ్వీమంతరః సోऽకామయత బహుస్యాం ప్రజాయేయేతి స ఈక్షత లోకాన్న సృజేయా"ఇతి. "తదైక్షత. తత్తేజో అసృజత. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మే" త్యాద్యాః. తథాభూతేశ్వరతాం చ తావత్సంసారిణో జీవస్య తన్నివృత్తయే తత్త్వమసీత్యాదివాక్యాని బోధయంతి. తత్ర చ తత్త్వం

విషయములను గ్రహించుటకై సర్వేశ్వరుడే ఏర్పరచినాడు. భవార్థం– జన్మలక్షణమైన కర్మ మొదలైన వానిని నిర్వహించుటకని అర్థము. ఆత్మనే– తాను ఆయా భోగములను అనుభవించుటకు, అకల్పనాయ– ఆకర్మ భోగములనుండి ముక్తిని పొందుటకు ఇంద్రియాదులు ఏర్పడినవి.(అనగా ధర్మార్థ కామ మోక్షా లనే పురుషార్థములను అనుభవించుటకుకని భావము.) మాత్రార్థం, భవార్థం, ఆత్మనే, కల్పనాయ అనే పదములకు క్రమముగా అర్థ, ధర్మ, కామ, మోక్షములని అర్థము. జీవులకు ప్రాణాదులను కల్పించినాడని చెప్పుచు జీవుని కొరకు సృష్టి,స్థితి నాశనములందు పరమేశ్వరుని ప్రవృత్తిని చూపుచున్నాడు– పరమాత్మకు ఉపాదికి (దేహమునకు) వశమైయుండుట అనేది లేనందువల్ల ఆయన నిత్యముక్తుడు, (దేని సంబంధము లేనివాడు) అని చూపుచున్నాడు. ప్రాణాదులలో పరమాత్మకు ఏవిధమైన వ్యవహారము కలుగదు. అయినప్పటికి పరంపరచేతకానీ,సాక్షాత్తుగాగానీ అన్ని వేదములు పరమాత్మయందే ముగింపు (పర్యవసానమును) పొందుచున్నవి. అనేది చిట్టచివరి నిర్ణయము. పరమాత్మనే అన్నిటికినీ తాత్పర్యస్థానమని భావము. ఈశ్వరుడు జీవులకు ముక్తిని ప్రసాదించుటకే సృష్టికార్యము నిర్వహించుచున్నాడు. పరమాత్మ సృష్టి కార్యమును నిర్వహించనిచో ముక్తిని ప్రసాదించ వీలులేదని యుక్తియుక్తముగా సమర్థించి ప్రతిపాదింపబడుచున్నది. దానికి అర్థమైన

పదయో స్సామానాధికరణ్యం ప్రతీయతే. తచ్చ ప్రకారాంతరేణా ఘటమానం బ్రహ్మణి పర్యవసానం గమయతి. తథా హి న తావత్ వైశ్వదేవ్యామిక్షేతి వదుభయోరేకార్థాభిధానేన సామానాధికరణ్యం ఘటతే యథోక్తం. శ్లో."ఆమిక్షాం దేవతా యుక్తాం వదతేవైష తద్ధితః, ఆమిక్షాపదసాన్నిధ్యాత్త స్యైవ విషయార్పణమి"తి. కుతః భిన్నార్థత్వాత్. న చా జహత్స్వార్ధ యోర్ని రూఢలక్షణయా విశేషణ విశేష్య భావేన నీలముత్పలమితి వత్. యథోక్తం శ్లో. స్వ బుద్ధ్యా రజ్యతే యేన విశేష్యం తద్విశేషణమిత్యాది. కుతః విరుద్ధార్థత్వేన తదయోగాత్. న చ జహత్స్వార్థత్వేన సంబంధ లక్షణయా కుసుమితద్రుమా గంగేతివత్. కుతః ఏకార్థత్వస్య వివక్షితత్వాత్. అతః జహదజహత్స్వార్థలక్షణయా సోఽయం దేవదత్త ఇతివద్విరుద్ధాంశత్యాగేనానుగతచిదంశేనై కార్థసామానాధికరణ్యేన నిర్గుణే పర్యవసానం. అస్థూలాదివాక్యానాం తు సాక్షాదుపాధినిషేధేన తత్పదార్థ శోధన ఉపయోగాన్నిర్గుణ ఏవ పర్యవసానం. తథా చాత్రైవో పక్రమే. శ్లో. స్వసృష్టమిదమాపీయేత్యాదినా విశిష్ట మాలాంబనం వక్ష్యతి. అంతే చ శ్లో."శ్రుతయః త్వయి హి ఫలంత్యతన్నిరసనేన భవన్నిధనా" ఇత్యుపసంహరిష్యతి. ఉపాసనాది వాక్యానాం అన్యార్థప్రవృత్త్యా సృష్ట్యాద్యవలంబనత్వేన జ్ఞాన సాధన విధానేన తత్పరత్వమిత్యేషా దిక్ . (2)

(యోగ్యమైన) ఒకానొక సంబంధశక్తి (వృత్తి) ని గురించి విచారణ చేయుటయే దానికి సమాధానము. గుణములను తిరస్కరించని సగుణముగనే సర్వజ్ఞుడు, సమస్త శక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సర్వమును శాసించువాడు, ఎల్లరు ఉపాసింపదగినవాడు, సమస్త కర్మఫలమును ప్రసాదించువాడు, సర్వమంగళ గుణములకు నిలయుడు, సచ్చిదానందుడు అయిన వాడుగా భగవంతుని వేదములు ప్రతిపాదించుచున్నవి – 'యస్సర్వజ్ఞస్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః , సర్వస్య వశీ సర్వస్యేశానః యః పృథివ్యాం తిష్ఠన్ పృథ్వీమంతరః. సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి స ఈక్షత లోకాన్నసృజేయా'. 'తదైక్షత. తత్తేజో అసృజత'. సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ' అని శ్రుతులు. అంతటి సర్వభూతేశ్వర త్వమున్న పరమాత్మతత్త్వమును ప్రతిపాదించి ప్రాపంచిక వ్యామోహమున ఉన్న జీవునికి ఈ సంసార బాధలు తొలగించుటకై 'తత్త్వమసి' – ఆ పరమాత్మవే నీవని వేదాలు బోధించుచున్నవి. ఇక్కడ తత్, త్వం అనే పదాలకు సమాన సామర్థ్యమే (అధికారమే) తెలియుచున్నది. అదికూడా వేరే విధముగా సిద్ధించని బ్రహ్మమునందే ముగింపును పొందుచున్నది. విశ్వదేవతలకుచెందిన యాగసంబంధమైన పాలవిరుగుడు (ఆమిక్ష) వలె రెండింటికి ఒకే అర్థము, ఒకే పేరుతో సమాన శక్తి కలదికాదు 'ఆమిక్షాం దేవతాయుక్తాం వదత్యేవైష తద్ధితః,ఆమిక్షాపదసాన్నిధ్యాత్త

స్యైవ విషయార్పణమ్' (గాలికి ఎగిరిపోయిన పేలపిండిని కృష్ణార్పణం అనుకొన్నట్లుగా వైశ్వదేవము కొరకు ఉద్దేశించిన పాలు పగిలిపోయినను అది విశ్వదేవతలకే చెందినట్లు భావించుట – వంటిది కాదు జీవేశ్వరుల స్వరూపము. ఎందుకంటే ఈ రెండింటికి భిన్నార్థములున్నవి. స్వార్థమును వీడని (అజహత్స్వార్థ) రెండింటికి మధ్య సంకేత సిద్ధి కలిగిన లక్షణ చేత విశేషణ విశేష్యభావముచేత చెప్పబడు నీలోత్పలము వంటిది ఇదికాదు. నీలమనే విశేషణము ఉత్పలమనే విశేష్యములు రెండునూ ఒక్కటే. ఆమీక్ష, దేవతాయుక్తతలు అర్థ భేదముచేత భిన్నమైనందువలన ఇది కుదరదు. స్వార్థమును వీడిన సంబంధ లక్షణచేత 'గంగలోని పుష్పించిన వృక్షము' వంటిది కూడాకాదు. పుష్పించిన వృక్షము గంగయందుండుట అనే స్వార్థమును వీడి గంగాతీరమందలిది అనే సంబంధ లక్షణాలను స్వీకరించినది. ఇక్కడ గంగ, వృక్షములు రెండునువేరైనను సంబంధము చేత ఏకార్థమును చెప్పబడినది. అందువలన జహదజహత్స్వార్థ లక్షణచేత 'సోఽయం దేవదత్తః' అనే దానివలె విరుద్ధాంశములను విడిచి, అనుసరించిన జ్ఞానమనే అంశచేత – ఆ దేవదత్తుడే ఇతడని ఏకార్థమునందే స్వార్థముండుట చేత నిర్గుణమునందే పర్యవసించును. (ఎన్నడో గురుకులమందలి చిన్ననాటి మిత్రుడు దేవదత్తుడు ఆ కాలము, ప్రదేశము, అప్పటి వయః స్థితులను విడిచిపెట్టి, ఏబదిఏండ్ల తర్వాత

శ్లో॥ సైషాహ్యుపనిషద్బ్రాహ్మీ పూర్వేషాం పూర్వజైర్ధృతా ।
శ్రద్ధయా ధారయేద్యస్తాం క్షేమం గచ్ఛేదకించనః ॥ 3

టీ:- అత్ర చానాదివిశిష్ట పరంపరాగతత్వాన్న సందేహో యుక్త ఇత్యాహ - సేతి. సైషా యథో క్తలక్షణా యథోక్తాలంబనా వా బ్రాహ్మీ బ్రహ్మాపరా. శ్రద్ధయా ఆదరేణ వైతండిక తర్కానభినివేశేన యః

కలిసినను వ్యక్తి మాత్రముచేత ఆ దేవదత్తుడే ఇతడని (ఆజహత్స్వార్థా) గుర్తించుట జరుగుచున్నది. అట్లే తటస్థమైన విరుద్ధ లక్షణములు వీడిన ఏకమైన జ్ఞానలింగమనే స్వరూప లక్షణముతో సమానాధి కరణ్యముచేత నిర్గుణమునందే పర్యవసించును. పరమాత్మ స్థూలముకాదు, సూక్ష్మముకాదు అని చెప్పబడిన వాక్యాలకు సాక్షాత్తుగా ఉపాధి రహితమైన తత్పదార్ధమును అన్వేషించుట అనే ఉపయోగము వలన నిర్గుణమునమందే పర్యవసించును. ఆ విషయమును ఈ శ్రుతి గీతలందే - 'స్వసృష్టమిదమాసీత్' అను శ్లోకముతో మొదలై 'శ్రుతయః త్వయి హి ఫలంతి' అని ముగించుటతో చెప్పబడినది. భగవదుపాసనకు సంబంధించిన వాక్యములకు వేరేవిధముగా అర్థముకల్పించుటతో సృష్ట్యాదుల ఆశ్రయత్వముతో జ్ఞానసాధన విధానముతో వేదములు పర్యవసించుననుట సూచితము. 2

పూర్వపూర్వులందరూ ఆచరించిన ఉపనిషత్తులందలి జ్ఞానమిదే. దీనిని శ్రద్ధగా అనుసరించుము. దానివల్ల నీవు ఏ విధమైన బాధలు పొందకుండా క్షేమమును (ముక్తిని) పొందుదువు. ఈ విషయము ప్రాచీన కాలమునుండి సత్పురుషుల పరంపరచేత సంక్రమించినందు వలన దీనియందు సంకోచము అవసరములేదు అనే విషయము చెప్పుచున్నాడు - ఈ విధమైన జహదజహద్రూప లక్షణతో కానీ,

శ్రవణాదినా ధారయేత్. సః ఆకించినః నిరస్తదేహాద్యుపాధి, స్సన్ తతః పరం పదం ప్రాప్నుయాదితి. 3

పూర్వము చెప్పిన ఆలంబనముతో కానీ కలిగిన జ్ఞానము పరమాత్మ పరమైనది. వితండవాదరూపమైన తర్కమును విడనాడి పట్టుదలతో (శ్రద్ధగా) శ్రవణమననాదులతో ఆత్మభావనను అవలంబించుము. ఈ విధమైన ఆచరణ కలవాడు ఏ విధమైన ప్రాపంచిక బంధములను అంటక దేహాది ఉపాధులను తిరస్కరించినవాడై దాని తర్వాత అనగా దేహాంతమున పరమపదమును పొందగలడు. 3

శ్లో॥ అత్ర తే వర్ణయిష్యామి గాథాం నారాయణాన్వితామ్ ।
నారదస్య చ సంవాదమృషేర్నారాయణస్య చ ॥ 4

ఈ విషయమునే సర్వవేదముల అర్ధనిరూపణతో వివరించుటకై ఒకానొక కథను చెప్పుచున్నాడు – ఈ విషయమై నారద మహర్షికి నారాయణ మహర్షి చెప్పిన గాథను వినిపింతును వినుమని పరీక్షిత్తుకు శుక మహర్షి వినిపించినాడు. 4

శ్లో॥ ఏకదా నారదో లోకాన్ పర్యటన్ భగవత్ప్రియః ।
సనాతనమృషిం ద్రష్టుం యయౌ నారాయణాశ్రమమ్ ॥ 5

ఒకసారి భగవంతునికి ఇష్టుడైన నారద మహర్షి లోకములు తిరుగుచు ప్రాచీనఋషియైన నారాయణుని దర్శించుటకై బదరికాశ్రమమైన నారాయణుని స్థానమునకు వెళ్ళినాడు. 5

శ్లో॥ యా వై భారతవర్షేఽస్మిన్ క్షేమాయ స్వస్తయే నృణామ్ ।
ధర్మజ్ఞాన శమోపేత ఆకల్పాదాస్థిత స్తపః ॥ 6

ఆ నారాయణుడు ఈ భరతవర్షమునందలి మానవులకు క్షేమము, శుభములు కలుగుట కొరకు ధర్మము, జ్ఞానము శాంతులు కలుగుట కొరకు కల్పాంతము వరకు తపస్సు చేసినాడు. 6

శ్లో॥ తత్రోపనిష్టమృషిభిః కలాపగ్రామవాసిభిః ।
పరీతం ప్రణతోఽ పృచ్ఛదిదమేవ కురూద్వహ ॥ 7

ఓ కురుశ్రేష్ఠా ! ఆ బదరికాశ్రమమున కలాపగ్రామవాసులైన ఋషులు పరివేష్టించి ఉండగా ఆసీనుడైన నారాయణఋషి ఆ మునీశ్వరుల నతులందుకొని ఈ విషయమునే చెప్పినాడు. 7

శ్లో॥ తస్మా అవోచద్భగవానృషీణాం శృణ్వతామిమమ్ ।
యోబ్రహ్మవాదః పూర్వేషాం జనలోకనివాసినామ్ ॥ 8

టీ:- ఏతదేవ సర్వశ్రుత్యర్థ నిరూపణేన ప్రపంచయితుమితిహాస మవతారయతి.- అత్రేతి. నారాయణాన్వితాం నారాయణః ప్రవక్తృత్వేన అన్వితో యస్యాం తాం గాథామితిహాసం. (4-8)

జనలోకవాసులైన పూర్వఋషుల మధ్యజరిగిన పరమాత్మ సంబంధమైన చర్చను వినుడని భగవంతుడైన నారాయణఋషి కలాపగ్రామవాసులైన ఋషులకు చెప్పిన విషయమును శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పినాడు. 8

**శ్రీభగవానువాచ**

శ్లో॥ స్వాయంభువబ్రహ్మసత్రం జనలోకేఽ భవత్పురా ।
తత్రత్యానాం మానసానాం మునీనామూర్ధ్వరేతసామ్ ॥ 9

టీ:- స్వాయంభువేతి. బ్రహ్మసత్రమితి యథా యజమానా ఏవ సమానాఋత్విగాది రూపేణ యత్ర కర్మ కుర్వంతి తత్కర్మసత్రం ప్రసిద్ధం. తథా యత్ర సమానా ఏవ వక్తృశ్రోతృభావేన బ్రహ్మమీమాంం సంతే తద్బృహ్మ సత్రం. 9

**భగవంతుడైన నారాయణఋషి ఇట్లు చెప్పినాడు**

పూర్వము స్వాయంభువమన్వంతరమున జనలోకమునందు అక్కడున్న జన్మాదిగా జితేంద్రియులు, బ్రహ్మమానస పుత్రులు అయిన సనకాదుల మధ్యన చర్చారూపముగా బ్రహ్మయాగము జరిగినది. (యజమాని) గృహస్థుడు ఋత్త్విక్కులరూపముతో వారితో సమానముగా యజ్ఞముచేయుట అనేది కర్మసత్రమని ప్రసిద్ధము. అట్లే వక్త, శ్రోతలు సమానముగా అనగా చెప్పేవ్యక్తి ఎక్కువ తెలివిగలవాడు, వినేవ్యక్తి తెలివిలేనివాడు అనేభేదములేకుండా అనగా సమానమైనయోగ్యత, జ్ఞానములుగలవారినడుమ చర్చారూపముగాజరిగిన బ్రహ్మమీమాంసను (జ్ఞానరూపమైన సంభాషణను) బ్రహ్మసత్రమందురు. 9

శ్లో॥ శ్వేతద్వీపం గతవతి త్వయి ద్రష్టుం తదీశ్వరమ్ ।
బ్రహ్మవాదస్సంప్రవృత్తః శ్రుతయో యత్ర శేరతే ॥ 10

అయ్యో ! అట్లయినచో నాకెట్లు ఆ బ్రహ్మయాగ విషయము తెలియకపోయినదని నారదుడు భావించకుండునట్లుగా ఇట్లు చెప్పుచున్నాడు - ఓ నారదా! నీవు అనిరుద్ధమూర్తితో ఉన్న నా రూపమును దర్శించుటకై శ్వేతద్వీపమునకు వెళ్ళిన సమయమున సనకాదులకు వేదములకు విశ్రాంతి స్థానమేది? (తాత్పర్యమేమి?) అనే విషయమై బ్రహ్మజ్ఞానరూపమైన చర్చ జరిగినది. 10

శ్లో॥ తత్ర హాయమభూత్ప్రశ్నస్త్వం మాం యమనుపృచ్ఛసి ।
పరిహారాంశ్చ తాన్సర్వాన్వక్ష్యేఽహం శృణు తేఽనఘ ॥ 11

టీ:- అహో తర్హి మయా కథం తత్సత్రం నాజ్ఞాతమిత్యత ఆహ - శ్వేతద్వీపమితి. తదీశ్వరం తత్రస్థం మామేవానిరుద్ధమూర్తిం.(10-11)

'హ' అనేది ఆశ్చర్యమందుకానీ, ఆనందమందుకానీ వర్తించును. ఓ నారదా ! ఆ బ్రహ్మయాగమందు కూడా ఋషులమధ్య ఇప్పుడు నీ వడిగిన ప్రశ్నయే ఉత్పన్నమైనది. ఓ పుణ్యాత్ముడా! అక్కడ చర్చలో కలిగిన ప్రశ్నలు, వాని పరిహారములు (సమాధానములు) నీకు వినిపించెదను వినుమని చెప్పినాడు. 11

శ్లో॥ తుల్య శ్రుతతపశ్శీలాస్తుల్యస్వీయారిమధ్యమాః ।
అపి చక్రుః ప్రవచన ఏకం శుశ్రూషవో పరే ॥ 12

టీ:- ననుసర్వజ్ఞాస్తే. కస్తత్ర వక్తా ప్రష్టావా? తత్రాహ - తుల్యశ్రుతాదిభిరవిశేషాః. అరిమిత్రోదాసీనతుల్య త్వేన నిరుపమ కరుణాః అతస్సర్వే ప్రవచనయోగ్యా. అపి కేనాఽపి. కౌతుకేన ఏకం

అందరూసర్వజ్ఞులే అయినప్పుడు ప్రశ్నించేవారెవరు? సమాధానము చెప్పేవారెవరు? అనే విషయము చెప్పుచున్నాడు - సనకాదులందురు శాస్త్రవిజ్ఞానము, తపస్సు, నడవడులందు సమాన ప్రజ్ఞ కలవారు, నిరుపమానులు. అందరును శత్రుమిత్రులందు ఉదాసీనులు. అనగా తనపరభేదములేని సమదృష్టి కలవారు. అపారమైన దయగల వారై అందరును ఉపదేశ సామర్థ్యముగల గురువులే. అందరికి అన్ని

ప్రవక్తారాం కృత్వా అన్యే పప్రచ్ఛురిత్యర్థః. 12

సనందన ఉవాచ

శ్లో॥ స్వసృష్టమిదమాపీయ శయానం సహశక్తిభిః ।
తదంతే బోధయాంచక్రుస్తల్లింగై శ్రుతయః పరమ్ ॥ 13

టీ:- స్వయం నిర్మితమిదం విశ్వం ప్రళయసమయే ఆపీయ సంహృత్య. శయానం యోగేన నిద్రాణమివ వర్తమానం. తదంతే ప్రళయాంతే. తల్లింగైస్తత్ప్రతిపాదకైర్వాక్యైః. పరం ఈశ్వరం సృష్టిసమయే ప్రథమనిఃశ్వాస ప్రసూతాః శ్రుతయః. ప్రబోధయామాసుః. 13

శ్లో॥ యథా శయానం సమ్రాజం వందినస్తత్పరాక్రమైః ।
ప్రత్యూషేఽభ్యేత్య సుశ్లోకైర్బోధయంత్యనుజీవినః ॥ 14

టీ:- యథేతి. సుశ్లోకైః శోభనాః శ్లోకాః కీర్తయో యేషు తైః. పరాక్రమైః 14

విషయములు తెలిసినప్పటికీ ఉత్సాహముతో ఒక్కరు ప్రశ్నించగా మరొకరు దానికి సమాధానమిచ్చినారని అర్థము. 12

సనందనుడు ఇట్లు చెప్పినాడు

పరమాత్మ స్వయముగా ఈ అనంత విశ్వమును నిర్మించి ప్రళయకాలమున మరల తానే తనలో లీనముచేసుకొనును. ఆ సమయమున యోగనిద్రలో పరమాత్మ తనశక్తులను సమీకరించుకొని ముడుచుకొని ఉండును. ప్రళయకాలము ముగిసిన పిమ్మట ఆయా విషయములను ప్రతిపాదించు వాక్యములతో మేలుకొనును. ఆ విధముగా ప్రతిపాదకములైన వాక్యముల సముదాయమే వేదము. అందువలన సృష్టికాలమునాటి పరమాత్మను మొదటి నిఃశ్వాసమునుండి ప్రభవించిన వేదములు పరమాత్మను మేలుకొల్పినవి. 13

నిద్రించిన చక్రవర్తిని అతని ఆశ్రితులైన వందిమాగధులు ఉదయముననే ఆ ప్రభువు శయనమమదిరమును చేరి అతని పరాక్రమము, కీర్తిని గురించిన స్తోత్రగీతములతో మేల్కొల్పిన విధముగా వేదములుకూడా పరమాత్మను సృష్టి కాలమున మేల్కొల్పుచున్నవి. 14

### శ్రుతో ఉవాచ

శ్లో॥ జయ జయ జహ్యాజామజితదోషగృభీతగుణాం
త్వమసియదాత్మనా సమవరుద్ధసమస్త భగః ।
అగజగదోకసామఖిలశక్త్యవబోధక తే
క్వచిదజయాత్మనాచ రుతోఽను చరేన్నిగమః ॥ 15

టీ:- జయజయేతి. భో అజితజయ జయ ఉత్కర్షమావిష్కురు ఆదరే వీప్సా. కేన వ్యాపారేణ. అగజగదోకసాం అగాని స్థావరాణి జగంతి జంగమాని చ ఓకాంసి శరీరాణి యేషాం జీవానాం తేషాం. అజాం. అవిద్యాం జహి నాశయ. నను కిమితి గుణవతీ హంతవ్యేత్యత ఆహ – దోషగృభీతగుణాం దోషాయ ఆనందాద్యావరణాయ గృభీతాః గృహీతాః గుణాః యయా తాం గృహేర్భశ్ఛందసీతి భకారః. ఇయం హి స్వైరిణీవ సర్వ ప్రతారణాయ గుణాన్ గృహ్ణాతి. అతః హంతవ్యేతి. తర్హి మయ్యపి దోషమావహేదితి మమాప్యవిద్యాదమనే కాశక్తిస్స్యాదత ఆహ – త్వమితి. యత్ యస్మాత్. త్వం ఆత్మనా స్వరూపేణైవ సమవరుద్ధసమస్తభగః సంప్రాప్తసమస్తైశ్వర్యోఽసి వశీకృతమాయత్వా దితి భావః. నను స్వయమేవ తే జ్ఞానవైరాగ్యాదినా కిం న హన్యురితి తత్రాహ – అఖిలశక్త్యవబోధకేతి. తేషాం త్వమేవాంతర్యామీ సర్వ శక్త్యుద్బోధకః అతః న తే జ్ఞానాదౌ స్వతంత్రా ఇతి భావః. నను

### శ్రుతులు పరమాత్మను ఈ విధముగా స్తుతించినవి

వేదపురుషుడైన పరమాత్మ ముఖమునుండి వెలువడిన ఇరువది ఎనిమిది శ్లోకములను చెప్పుచున్నాడు – ఓ అజితుడా! జయజయ నీకు నమస్కారము. ఆ పరమపురుషుని ఉత్కర్షను ఆవిష్కరిమచుటకు ఆదారార్థము 'జయజయ' అని రెండు మాటలు చెప్పుట జరిగినది. స్వభావము చేతనే మరేది సమానమైనది కానీ అధికమైనది కానీ లేదని పరమాత్మ పొందలేనిదిలేదు.

స్థావరములు (చలనములేక స్థిరముగా ఒకేచోట ఉండునట్టి వృక్షాదులు) జంగమములు (చలనము కలిగిన పశుపక్ష్యాదులు) మొదలైన శరీరములందున్న అజ్ఞానమును నశింపజేయుము. ఆయా జీవులందలి ఆయా గుణములను నశింపజేయవలెనా ఏమి? అనే విషయమును చెప్పుచున్నాడు – దోషముచేత స్వీకరించిన గుణములు దోషముల కొరకై ప్రవర్తించును. అయితే ఈ దోషగుణములన్నియు ఆనందమునిచ్చునవే అనే ఆచ్ఛాదనతో స్వీకరింపబడినవి. అనగా ఈ దోషగుణములు ఆరంభమున ఆనందము కలిగించినను పర్యవసానమున దుఃఖమునే మిగుల్చునని భావము. దోషములను స్వీకరించునట్టి వృత్తి వ్యాపారము విచ్చలవిడిగా అందరినీ మోసగించుటకే గుణములను స్వీకరించును. అందువలననే వీనిని నాశనము చేయవలెనని చెప్పుట జరిగినది. ఒకవేళ నాయందు కూడ

అహమకుంఠజ్ఞానైశ్వర్యాది గుణః జీవానాం కర్మ జ్ఞానాదిశక్త్యవ బోధనేన అవిద్యాం హన్మీత్యత్ర కిం ప్రమాణమితి చేదహమేవ ప్రమాణమిత్యాహ– నిగమః వేదః. నను ఏవం భూతే మయి కథం శ్రుతీనాం ప్రవృత్తిస్తత్రాహ – క్వచిదితి. క్వచిత్ కదాచిత్ సృష్ట్యాదిసమయే. అజయా మాయయా. చరతః క్రీడతః నిత్యం చాలుప్త భగతయా సత్యజ్ఞానానందైకరసేన ఆత్మనాచ చరతో వర్తమానస్య తవ నిగమః అనుచరేత్ ప్రతిపాదయేత్ కర్మణిషష్టీ. శ్రు. 'యతో వా ఇమాని భూతాని జాయంతే. యో బ్రాహ్మణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై. తము హ దేవమాత్మబుద్ధి ప్రకాశం ముముక్షుర్వైశరణమహం ప్రపద్యే. య ఆత్మని తిష్ఠన్. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. యస్సర్వజ్ఞస్సర్వవి" దిత్యాదీనిగమకదంబః త్వాం ఏవం భూతం ప్రతిపాదయతీత్యర్థః. శ్లో. జయ జయాజిత జహ్యగజంగమావృతి మజాముపనీతమృషాగుణామ్, న హి భవంతమృతే ప్రభవంత్యమీ నిగమగీత గుణార్ణవతానవ. నను కథం మామేవ ప్రతిపాదయంతి. 15

దోషములు న్నందున వానికి ఆలంబమైన అవిద్య (అజ్ఞానము)ను నశింపజేయుటకు నాకు అవసరమైన శక్తిఏది? అనే (పరమాత్మ) శంకకు ఆస్కారములేదనే విషయమై చెప్పుచున్నాడు – నీవు (పరమాత్మ) స్వరూపము చేతనే గుప్తమైన సమస్త ఐశ్వర్యమును (ఈశ్వరభావమును) కలవాడవు. నీవు మాయను వశముచేసుకొన్నందువలన అనంతమైన ఐశ్వర్యముకల వాడవని అర్థము. అయితే మాయ(అవిద్య)ను జ్ఞానము, వైరాగ్యము మొదలైన స్వరూపమును గ్రహించగల భావములతో నీకైనీవే (జీవుడే) స్వయముగా నాశనము చేసుకొనలేవా అని మరల పరమాత్మ శంక దాని విషయమై చెప్పుచున్నాడు – సమస్త శక్తులకు ప్రేరకుడు పరమాత్ముడే. సమస్త ప్రాణాది వృత్తులందంతట సంచరించు అంతర్యామి, సర్వశక్తుల ప్రేరకుడవు నీవే (పరమాత్మ) కనుక నీ జ్ఞానము మొదలైన వానియందు మేము (జీవులము) స్వతంత్రులముకామని భావము. నీచే (పరమాత్మ) అఖండమైన జ్ఞానము, ఐశ్వర్యము మొదలైన గుణములు కలిగి జీవులయొక్క కర్మ, జ్ఞానము మొదలైన శక్తులను ప్రేరేపించుటతో అవిద్యను (అజ్ఞానమును) నాశనము చేయుటకు ప్రమాణమేది? అను శంకకు నేనే (వేదమే) ప్రమాణము అని చెప్పుచున్నాడు – నేను అనగా భగవంతుడు వేదమే ప్రమాణమని సిద్ధాంతము అయితే అఖండ జ్ఞానైశ్వర్యములు కలిగిన పరమాత్మకు వేదాల ఆవశ్యకత ఎందుకు అనే విషయమై చెప్పుచున్నాడు–క్వచిత్

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

-ఒకప్పుడు-సృష్టి ప్రారంభకాలమున మాయతో (అజయా) క్రీడించుచూ పరిపూర్ణమైన ఐశ్వర్యముతో సత్యము, జ్ఞానము, ఆనందము అనేవానితో నిండిన ఏకరసముగల ఆత్మతో సంచరించుచున్న నీ (మార్గమును) (తత్త్వమును) _'యతో వా ఇమాని భూతాని జాయంతే. యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాశ్చ ప్రహిణోతి తస్మై. తముహ దేవమాత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే. య ఆత్మనితిష్ఠన్. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. యస్సర్వజ్ఞస్సర్వవిత్'-పరమాత్మ వల్లనే ఈ సర్వభూతములు పుట్టినవి. పూర్వము బ్రహ్మను సృష్టించి అతనికి వేదములను ప్రసాదించినాడు. ఆత్మబుద్ధిని ప్రకాశింపజేయు దేవునికి మోక్షకాంక్షనై శరణు పొందుచున్నాను. ఆత్మయందున్నవాడు సత్యం, జ్ఞానం, అనంతం అనే స్వరూప లక్షణములు కలవాడు. సర్వజ్ఞుడు, సర్వము తెలిసినవాడు అని ఈ విధముగా పరమాత్మ తత్త్వమును ప్రతిపాదించుటకు వేదములు అవసరమని సమాధానము.

జయ జయాజిత జహ్యగజంగమా
వృతిమజాముపనీతమృషాగుణామ్ ।
న హి భవంతమృతే ప్రభవంత్యమీ
నిగమగీత గుణార్ణవతానన ॥ (శ్రీధరీయము)

ఓ విజయుడా! నీకు జయము (నమస్కారము). నీవులేక ఈ

శ్లో॥ బృహదుపలబ్ధమేతదవయంత్యవ శేషతయా
యత ఉదయాస్తమయౌ వికృతేర్మృదివావికృతాత్ ।
అత ఋషయో దధుస్త్వయి మనో వచనాచరితం
కథమయథా భవంతి భువి దత్తపదాని నృణామ్ ॥ 16

టీ:– శ్రు."ఇంద్రో యాతోఽసి తస్యరాజే " త్యాది ఇంద్రః యాతః జంగమస్య అవసితస్య స్థావరస్య చ. రాజేతి. ప్రతిపాద్యతే తథా. శ్రు. అగ్నిర్మూర్ధా దివః కకుది" త్యాదిభిశ్చైవం భూవం భూతత్వేన అగ్న్యాదీనాం ప్రతిపాదనాచ్చేతి తత్రా – బృహదితి. అయమర్థః. ఏతదుపలబ్ధం దృష్టమింద్రాది సర్వం బృహత్ బ్రహ్మేత్యేవ అవయంతి జానంతి. కథం బృహత ఏవ అవశేషతయా అవశిష్యమాణత్వేన కుతః యతో బృహతః సర్వస్య ఉదయాస్తమయౌ ఉత్పత్తిలయౌ సర్వోపాదానత్వాత్. తర్హి కిం వికారిత్వం బృహతః న అవికృతాత్ వివర్తాధిష్ఠాన త్వేన అవికారాదిత్యర్థః అత్ర వా శబ్దః ఉపమానార్థః. యథా ఘటాదేర్వికృతేర్మృది ఉదయాస్త

అనంత సృష్టి కలుగదు. వేదములచేత స్తుతింపబడిన గుణసముద్రత్వ ముతో కాపాడే ఓ పరమాత్మా ! సమస్త జీవరాశులకు పునర్జన్మ కారకమై దోషగుణములను స్వీకరించు వృత్తిగల మాయను నాశనము చేయుము. 15

వేదములు నన్నే ఎందుకు ప్రతిపాదించుచున్నవి. 'ఇంద్రో యాతోఽవసితస్య రాజా' ఇంద్రుడు– పరమాత్మ జంగమములు (యాతములు) , స్థావరములు (అవసితములు) అనగా చరాచరమైన సృష్టికి రాజు. అని శ్రుతులు ప్రతిపాదించినవి. అట్లే 'అగ్నిర్మూర్ధా దివః కకుత్' మొదలైన శ్రుతులు– అగ్ని, శిరస్సు, స్వర్గము, దిక్కులందు పరమాత్మవ్యాపించినట్లు ప్రతిపాదించుట వల్లకూడా ఇదంతయు నీవే అని తెలియుచున్నది. ఈ కనపడే చరాచర జగత్తంతయు, ఇంద్రాదులందరితోకూడిన ఈ కనపడే గొప్పదంతయు(బ్రహ్మాండము) బ్రహ్మమే అని తెలియును. 'గొప్పది' అనుట ఎందుకనగా ఈ అంతటికి చిట్టచివర అవశేషముగా(ఆత్మ) మిగులునని అర్థము. ఈ సమస్త బ్రహ్మాండము, ఉదయాస్తమానములు, ఉత్పత్తి నాశములు మొదలైన అన్నింటికి అవశేషరూపమైనదే ప్రధానకారణము. బృహత్తుకు వికారిత్వము ఎందుకులేదనగా వికారరహితముగా అంతటిని ఆక్రమించి యుండుటచేత అది వికృతి కాదని అర్థము.(ఇక్కడ 'వా'

మయౌ తద్వత్. శ్రు."వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం సర్వం ఖల్విదం బ్రహ్మే" త్యాదిభిస్తథా ప్రతిపాదనాదిత్యర్థః. అతః కారణాదృషయో మంత్రాస్తద్ద్రష్టారో వా. త్వయ్యేవ మనోవచనా చరితం దధుః మనసా ఆచరితం తాత్పర్యం వచనాచరిత మభిధానం చ ధృతవంతః మనసా త్వమేవ ధ్యాయంతి వచసా త్వామేవ త్వామేవ నిరూపయంతీత్యర్థః. న పృథగ్వికారేష్వితి భావః. అత్ర నిదర్శనం కథమయతేతి. నృణాం భూచరాణాం యత్ర కుత్రాపి దత్తాని నిక్షిప్తాని పదాని భువి కథమయథా భవంతి. అదత్తాని భవంతి. అతో యథా మృత్పాషాణేష్ట కాదిషు దత్తాని పదాని భువం న వ్యభిచరంతి తథా యత్కిమపి వికారిజాతం వదంతో వేదాస్త్వామేవ సర్వకారణం పరమార్థభూతం ప్రతిపాదయంతీత్యర్థః. శ్లో. "ద్రుహిణవహ్ని రవీందు ముఖాత్మనా జగదిదం న భవేత్పృథగుత్థితం, బహుముఖైరపి మంత్రగణై రజత్వమురుమూర్తిరతో వినిగద్యసే. 16

అనే శబ్దమునకు ఉపమానార్థము). 'మన్ను' అనే దానికి – కుండలు, కడవలు వికారములైనట్లే ఉదయాస్తమానములు కూడా అట్టి వికార రూపములే. 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం సర్వం ఖలిద్వం బ్రహ్మేతి' –వాక్కుతో కూడిన నామధేయములైన కడవ, కుండ అనే పేర్లు వికారమాత్రములే. మట్టి మాత్రమే వాస్తవముగా సత్యమైనది. అట్లే ఈసమస్తమూ బ్రహ్మమే. అనేవిషయమును శ్రుతులు ప్రతిపాదించినవి. ఈకారణమువలన మంత్రద్రష్టలు, ఋషులు నీయందే–మనస్సు, మాట,ఆచరణలు (త్రికరణములు) లగ్నము చేసినారు. మనస్సుచేత ఆచరించునది– తాత్పర్యము. మాటచేత ఆచరించునది. – పేరు(నామము). ఈ రెండింటిని ధరించి మనస్సులో నిన్నే ధ్యానించుచున్నారు. మాటతో నిరూపించుచున్నారు. (నారాయణుడు–మాట–పేరు), చతుర్భుజుడు, సృష్టికర్త, లక్ష్మీపతి మొదలైనవి అర్థము–తాత్పర్యము) అంతేగాని నీ కన్న వేరుగా ఉన్న వికారమును (జగత్తును) ద్యానించరని భావము. మానవుల, జంతువుల–భూమిపై పడిన అడుగుజాడలు అసత్యము కానట్లుగా (అనగా సంచరించిన మృగాదులను ప్రత్యక్షముగా చూడకపోయిననూ ఇవి ఫలాని పులి, మనిషి ఇంతకుముందు ఇక్కడ సంచరించినట్లు వారి అడుగుజాడలను బట్టి గుర్తించినట్లు) మట్టి, రాయి, ఇటుక మొదలైన వికారములు మట్టికి కలిగినను భూమికి వికారములేనట్లుగా

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఇతి తవ సూరయస్త్ర్యధిపతే௨ఖిల లోక
మలక్షపణకథామృతాబ్ధి మవగాహ్య తపాంసి జహుః ।
కిముత పునస్స్వధామ విధుతాశయ కాలగుణాః
పరమభజంతి యేపదమజస్ర సుఖానుభవమ్ ॥ 17

ఈ జగత్తునందలి సర్వపదార్థములు వికారములే అని చెప్పుచునే వేదాలు వీటన్నిటికి నీవే సర్వకారణుడవు, పరమాత్మ రూపుడవు అని ప్రతిపాదించినవి.

ద్రుహిణవహ్ని రవీందు ముఖాత్మనా
జగదిదం న భవేత్పృథగుత్థితం ।
బహుముఖైరపి మంత్రగణై రజ
త్వమురుమూర్తిరతో వినిగద్యసే ॥

బ్రహ్మ,అగ్ని,సూర్యుడు,చంద్రుడు మొదలుగాగల ఈజగమంతయు నీవే.ఇది నీకంటేవేరుగా పుట్టినదికాదు.అనంతవిధముగా సృష్టిలో నీవు బహిర్గతమైనప్పటికీ నీవువేదాలలో పుట్టుకలేనివాడు బ్రహ్మాండమైన రూపము కలవాడు అని అందువలననే కీర్తింపబడితివి. 16

నీవే సర్వవేదములకు గోచరుడవని సత్పురుషుల ఆచరణచేత దృవపరచుచున్నాడు–నీవే సర్వకారణత్వముచేత (కారణములకును కారణుడగుట వలన) పరమార్థుడవు అనే నిర్ణయముచేత ఓ మూడు గుణములకు అధిపతీ ! నీవు త్రిగుణాత్మకమైన మాయ అనే నటిని ఆడించువాడవని వివేకవంతులైన పండితులు సర్వలోకముల మలమును(పాపమును) పోగొట్టునట్టి నీ కథలనే అమృత సముద్రము నందు సకల దుఃఖములను తొలగించుకొనుటకై ఓలలాడుచు

టీ:- త్వమేవ సర్వనిగమగోచర ఇతి సతాం ప్రవృత్త్యా ద్రఢయతి - ఇతీతి. త్వమేవ సర్వకారణత్వేన పరమార్థ ఇతి కృత్వా. భో(త్ర్యధిపతే త్రిగుణమాయానటీనర్తక సూరయో వివేకి నస్తవాఖిల లోకమల క్షపణకథామృతాబ్దిం సకలజన వృజిననిరసన హేతుం కీర్తుసుధా సింధుం. అవగాహ్య నిషేవ్య తపంతీతి తపాంసి పాపాని దుఃఖాని వా. జహుఃత్యక్తవంతః. త్వదీయకథామాత్రేణ యదా పాపత్యాగః. తథా కిము వక్తవ్యం యే పునః స్వధామవిధుతాశయకాలగుణాః స్వధామ్నా స్వరూపస్ఫురణేన విధుతాః త్యక్తాః ఆశయగుణాః అంతఃకరణధర్మాః రాగాదయః కాలగుణాః జరాదయశ్చ యైస్తే తథా. హే పరమ. తావా(స్ర సుఖానుభవం అఖండానందానుభవం పదం స్వరూపం భజంతి సేవంతే. తథా భూతాః దుఃఖాని త్యజంతీతి. శ్రు. "తద్యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యంత ఏవమేవైనం విధుతపాపం కర్మ న శ్లిష్యతే. న కర్మణా లిప్యతే. పాపకేన. తత్సుకృతదుష్కృతే. ధూనుతే. ఏతగ్ం హవావనతపతికిమహం సాధుకరవం కిమహం పాపమకరవ" మిత్యాది శ్రుతేరిత్యర్థః. శ్లో. సకల వేదగణేరిత సద్గుణ స్త్వమితి సర్వమనీషిజనా ముహుః, త్వయి రమంతి గుణశ్రవణాదిభిస్తవ పదస్మరణేన గతక్లమాః(17)

తపస్సుచేయుచున్నాడు నీ కథలను విన్నమాత్రముతోడనే సర్వపాపములు తొలగి పోవుచున్నవి. అట్టి నీగురించి ఇంకను విశేషముగా చెప్పుటకు ఏమున్నది? నీ స్వరూప భావనాలేశమాత్రము చేతనే సమస్తములైన అనురాగము, ద్వేషము మొదలైన అంతఃకరణములు, ధర్మములు, వార్ధక్యము, మరణము అనే కాలగుణములు నాశనము పొందును. ఓ పరమాత్మా! నీయొక్క అఖండ ఆనాందానుభవ స్థానమైన స్వరూపమును సేవించినవారికి సర్వ దుఃఖములు తొలగిపోవును. 'తద్యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవమేవైనం విధుతపాపం కర్మ న శ్లిష్యతే. న కర్మణా లిప్యతే. పాపకేన. తత్సుకృతదుష్కృతే. ధూనుతే. 'ఏతగ్ం హవావ న తపతి కిమహం సాధుకరవం కిమహం పాపమకరవమ్'- అదిఎట్లనగా తామరాకుమీది నీటి బిందువు ఆకునకు అంటి అంటనట్లుగా ఉండునో పాపరహితుడైన పరమాత్మకు ఎట్టి కర్మ అంటదు. అతడు కర్మలతో సంబంధమును పొందడు. అట్లే పాపముతోను అతనికి సంబంధములేదు. ఆయన చేసిన సుకృతదుష్కృతములు సమస్తము తొలగిపోవును. అట్లే బ్రహ్మతత్త్వమును తెలిసిన విద్వాంసుడు దేనికినీ భయపడడు. అతనికి (మరణ సమయమున) నేను పుణ్యకర్మలను ఎందుకు చేయకపోయితిని, పాపకర్మలెందుకు చేసితిననెడు చింత, ఆవశ్యకత లేదు. బ్రహ్మవేత్తను సంకటపెట్టునది ఏదిలేదు.

శ్లో॥ దృతయ ఇవ శ్వసంత్యసుతృపో యది తేనువిధా
మహదహమాదయోండమసృజన్ యదనుగ్రహతః ।
పురుషవిధోన్వయోऽత్ర చరమోన్నమయాదిషు
యస్సదసతః పరం త్వమథయదేష్వ వశేషమృతమ్ ॥ 18

టీ:- శ్రు. "అసుర్యానామతేలోకా అంధేన తమసావృతాః, తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛతి యే కే చాత్మహనో జనాః." తథా. నచేదిహావేదీన్మహతీ వినష్టిః అసుర్యేతి శ్రుతేరర్థః. తే ప్రసిద్ధాః లోకాః కర్మఫలభూతదేవ తిర్యఙ్నరాదిదేహాః అసుర్యాః అసుషు రమంత ఇతి వ్యుత్పత్త్యా అసురాణాం దేహాభిమానినాం సంబంధినః ప్రాప్యా ఇత్యర్థః. తే కీదృశ్యాః

సకల వేదగణేరిత సద్గుణ
స్త్వమితి సర్వమనీషిజనా ముహుః ।
త్వయి రమంతి గుణశ్రవణాదిభి
స్తవ పదస్మరణేన గతక్లమాః ॥ (శ్రీధరీయము)

సమస్త వేదములు నీవే సకల సద్గుణములుకలవాడవని కీర్తించినందువలన సత్పురుషులెల్లరు మాటిమాటికి నీ గుణములను శ్రవణ మననాదులు చేయుచు నీ పాదపద్మములను స్మరించుచు సర్వదుఃఖములుతొలిగినవారై నీయందేఆనందమునుఅనుభవించుచున్నారు. 17

అసుర్యా నామ తేలోకా అంధేన తమసా వృతాః ।
తాగ్ం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో జనాః ॥

ఆత్మజ్ఞానములేని మానవులకు అపారమైన నష్టము కలుగును అని ఈ శ్రుతికి అర్థము. అసువులు అనగా ప్రాణములు. వానియందు రమించువారు (వర్తించువారు) అసురులు, అనగా దేహమునందు అభిమానము కలవారు. అట్టివారు వారి వారి కర్మ ఫలితముగా దేవతలు, పశుపక్ష్యాదులు, నరులు మొదలైన ప్రసిద్ధమైన దేహములను పొందినవారిలో కొందరు దట్టమైన చీకటితో కప్పబడినవారై ఆత్మను అనగా పరమాత్మ (తమ) స్వరూపమైన సత్యము, జ్ఞానము, ఆనందము అనే లక్షణములను తెలియలేక దుఃఖమును పొందుచున్నట్లు భావించి

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

అంధేన దృఢేన తమసా ఆచ్ఛాదితాః యే కే చ యే కేచిత్, ఆత్మానం తత్స్వరూపభూతసత్యజ్ఞానానందతిరస్కారేణ దుఃఖిత్వాద్యారోపణేన చ ఘ్నంతి హింసతీత్యాత్మనః అవిద్వాంస స్తే జనాః. తాన్ లోకాన్ అభిగచ్ఛంతి ప్రాప్నువంతి కర్మానుసారేణ చేద్యది ఇహ మనుష్య జన్మని పురుషః నావేదీత్ తర్హి మహతీ వినష్టిః వినాశః జన్మ మరణపరంపరాఽవిచ్ఛేదలక్షణా సంసారగతిః. ఇత్యాద్యాః శ్రుతయః పూర్వశ్లోకోక్తోభయ విధజనహీనాన్నిందంతి. దృతయ ఇతి. అసుతృపః నరాః యదితే అనువిధాః అనువిదధతీత్యనువిధాః అనువర్తినః భక్తా ఇతి యావత్. తర్హి శ్వసంతి జీవంతి సఫలజీవనా భవంతి ఇతరథా దృతయ ఇవ భస్త్రా ఇవ వృథాశ్వాసా భవంతీత్యర్థః. నన్వభక్తానామపి కామాదిఫల మస్త్యేవ నః కార్యకారణాను గ్రాహకత్వేన జీవనహేతోస్తవా భజనే కృతఘ్నానాం తదపి న సిద్ధ్యేత్యాశయేనాహ – మహదహమాదయ ఇతి. మహానహంకారశ్చ ఆదిర్యేషాం తే. యదనుగ్రహతః యస్య తవ అనుగ్రహతః అనుప్రవేశేన లబ్ధసామర్థ్యాస్సంతః అండం దేహం సమష్టివ్యష్టిరూపం సృష్టవంతః. తత్ర చ పంచాపి కోశానన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానంద మయానావిశ్య తత్తదాకారస్సన్ యః చేతయతే సత్వం తదాహ – పురుషవిధ ఇతి పురుషస్యాన్న మయాదేర్విధేవ విధా ఆకారో యస్య సః. తథా. నను చిదేకరసస్య కథం తు తత్తదాకారతా అత ఆహ – అన్వయోఽత్రేతి. అత్ర

నశించుచున్నారు. ఇట్టివారు ఆత్మహనులు (తమనుతామే చంపుకొనువారు) అజ్ఞానులు. తమ కర్మలను అనుసరించి ఆయా లోకములు పొందునట్లయినచో ఈ లోకములో మానవ జన్మపొంది కూడా పరమాత్మను తెలియలేక పోయినచో అపారమైన నష్టము అనగా ఎడతెగని జననమరణములు కలిగించు సంసారమే (ప్రాపంచిక దుఃఖములే) వారికి సిద్ధించును అని వేదములు ఇహ పరములకు చెడిన జనులను నిందించుచున్నవి. ప్రాణాభిమానముగల నరులు ఒకవేళ పరమాత్మను అనుసరించిన భక్తులు కాగల్గినచో వారిజీవనము సఫలమగును. లేనిచో ఏనుగునకు అలంకరించిన వస్త్రములవలె నిష్ప్రయోజనమై వ్యర్థముగా శ్వాసగలవారు అనగా బ్రతికియున్నను ప్రయోజన రహితమైన జీవచ్ఛవములగుదురని అర్థము. భక్తులు కానివారికి కూడా కామము, అర్థము మొదలైన ఫలములున్నవికదా. మాకు జీవన కారణమైన కార్యకారణములను అనుగ్రహించిన నిన్ను సేవించని దుష్టులకు అవి సిద్ధించవా అనే విషయమై చెప్పుచున్నాడు మహత్తు, అహంకారములు ముందుగల తత్త్వములు నీ అనుగ్రహముచేతనే దేహమునందు(అండం) ప్రవేశించి ప్రాణాది సామర్థ్యమును పొంది సమష్టి, వ్యష్టిరూపములైనవి. వానిలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనెడు అయిదు కోశములను పొంది ఆయా ఆకారములు కలిగి వీనిని

ఏష్వన్నమయాదిషు అన్వేతీత్యన్వయః. అతః తదాకారతేతి. ఏవం తర్హి సత్యత్వమనంతత్వం చ కథం తత్రాహ – చరమోన్నమయాదిషు య ఇతి అన్నమయాదిషూపదిశ్యమానేషు యశ్చరమః బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠేతి పుచ్ఛత్వేనోక్తః. స త్వమితి సంబంధః. నను తథాప్యన్నమయాది ష్వన్వితత్వే అసంగత్వవ్యాహతి రేవ స్యాత్తత్రాహ – సదసతః పరం త్వమథ యదేష్వవశేషమృతమితి. సదసతస్థూలసూక్ష్మాత్ అన్నమయాదేః పరం వ్యతిరిక్తం తత్సాక్షీభూతం అవశేషం అవశిష్యత ఇత్యవశేష మబాధ్యం అథ అత ఏవఋతం సత్యం తత్త్వం తర్హి కిమర్థం తేష్వన్వయ ఉక్తః శాఖా చంద్రవచ్ఛుద్ధస్వరూపలక్షణార్థం. తథా హి శ్రు.“ సవా ఏష పురుషోన్నరసమయః తస్యేదమేవ శిర” ఇత్యాదినా స్థూల సూక్ష్మక్రమేణ పంచకోశానుపదిశ్య. శ్రు.“తస్య పురుషవిధతాం అన్వయం పురుషవిధ ” ఇతి పునః పునస్తత్తదన్వితత్వేనా వేద్య.శ్రు. ” బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠే ’’ తి. సర్వసాక్షిణః శుద్ధసత్త్వస్వరూపనిరూపణమిత్యనవద్యం’ శ్లో. నరవపుః ప్రతిపద్య యది త్వయి శ్రవణవర్ణనసంస్మరణాదిభిః, నరహరే న భజంతి నృణామిదం దృతివదుచ్ఛ్వసితం విఫలం తతః(18)

నడిపించువాడెవరనే విషయమును చెప్పుచున్నాడు. పరమాత్మనే అన్నమయాది ఆకారమును పొందినాడు. అట్లయినచో సంపూర్ణమైన జ్ఞానస్వరూపమై తనకన్న వేరేదేదా లేకుండా తనకైతానే అనుభవమును పొందు (ఏకరసుడు) పరమాత్మ ఆయా ఆకారములను పొందుట ఎందుకు? అనేశంక విషయమై చెప్పుచున్నాడు–అన్నమయాదులను అనుసరించే ఉన్నాడు అని సమాధానము. అన్నమయాది ఆకారములు పొందినవారికి సత్యత్వము, అనంతత్త్వము కలుగునని మరల శంక విషయమై చెప్పుచున్నాడు–అన్నమయాదులని ఈ చెప్పబడిన వాటన్నిటికంటే చివరగా పరిశేషరూపముగా తోకవలె పరమాత్మ ఉన్నదని చెప్పబడినది. ఇక్కడ పుచ్ఛమనగా ప్రతిష్ఠ అని అర్థము. అనగా సృష్టిలోని అన్నిటికంటే చిట్టచివరగా మిగులునది బ్రహ్మప్రతిష్ఠ అని సంబంధము. అయినప్పటికి అనిత్యములైన అన్నమయాదులతో కలసినందువలన పరమాత్మ వ్యర్థమగునే అని మరల శంక. దీని విషయమై చెప్పుచున్నాడు–పరమాత్మ సత్తు (దృశ్యము) అసత్తు (అజ్ఞాతము, నిరాకారము) లకంటే వేరుగా నీవు (పరమాత్మ) వీనిలో సత్యముగా (ఋతముగా) మిగిలితివి. సదసత్తులు – స్థూల సూక్ష్మము లకంటే, అన్నమయాదులకంటే పైన వేరుగా క్షతిలేక వీటన్నింటికి సాక్షిగా మిగిలినందువల్ల ఇది (పరమాత్మ) ఋతము –సత్యమైనది. అట్లయినచో వాటన్నిటియందు అనుసూత్యముగా ఉన్నది ఎందుకంటే

శాఖాచంద్రునివలె అని సమాధానము. (పాడ్యమినాటి చంద్రకళ సామాన్యముగా కనపడదు. తెలియనివానికి చెట్టుకొమ్మ గుర్తును తటస్థలక్షణముగా చూపినట్లు) అనగా స్వరూపలక్షణములను నిర్ధారించుటకే తటస్థ లక్షణములని భావము. 'సవా ఏష పురుషోన్న రసమయః తస్యేదమేవ శిరః' అంటూ స్థూల, సూక్ష్మ క్రమములలో అన్నమయాది పంచకోశములను ఉపదేశించి, ' తస్య పురుషవిధతాం అన్వయం పురుషవిధః ' అని శ్రుతి మరల మరల వాని వాని యందు కూడియుండుటను తెలిపి ' బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' అంటూ శ్రుతి వీటన్నిటిలో చిట్టచివరిగా మిగులునది పరమాత్మ (శుద్ధసత్త్వ రూపమే) అని నిరూపించుట నింద లేనిదని సారాంశము.

నరవపుః ప్రతిపద్య యది త్వయి
శ్రవణవర్ణనసంస్మరణాదిభిః ।
నరహరే నభజంతి నృణామిదం
దృతివదుచ్ఛ్వసితం విఫలం తతః ॥

ఓ నృసింహస్వామీ ! పూర్వజన్మ సుకృతంచేత ఉత్తమమైన మానవజన్మ పొందికూడా శ్రవణము, కీర్తనము, మననము మొదలైన వానిచేత నిన్ను సేవించని మానవులకు శ్వాసించుట (అనగా జీవించుట) కొలిమితిత్తి ఊదిన గాలివలె నిష్ప్రయోజనము. 18





శ్లో॥ ఉదరముపాసతే య బుషివర్త్మసు కూర్పదృశః
పరిసరపద్ధతిం హృదయమారుణయోదహరమ్ ।
తత ఉదగాదనంత తవ ధామ శిరః పరమం
పునరిహ యత్సత్యమేత్య న పతంతి కృతాంత ముఖే ॥ 19

టీ:- ఏవం తావత్సర్వాత్మకే పరమేశ్వరే సర్వశ్రుతిసమన్వయేన సద్భజనీయత్వముక్త్వా అభక్తనిందయా చ తదేవ దృఢీకృత్య ఇదానీమనవగాహ్యమహిమ్నః ప్రథమం తావదుపాధ్యాలంబన ముపాసనం. శ్రు. "ఉదరం బ్రహ్మేతి శార్కరాక్షా ఉపాసతే హృదయం బ్రహ్మేత్యారుణయో బ్రహ్మవైత ఊర్ధ్వం త్వేవోదసర్పత్తచ్ఛిరోశయతే" త్యాద్యాశ్శ్రుతయః విదధతీత్యాహుః - ఉదరమితి. బుషివర్త్మసు బుషీణాం సంప్రదాయమార్గేషు. యేకూర్పదృశః తే ఉదరాలంబనం మణిపూరకస్థం బ్రహ్మ ఉపాసతే ధ్యాయంతి. శార్కరారక్షా ఇతి శ్రుతిపదస్య ప్రతిపదం కూర్పదృశ ఇతి కూర్పం శర్కరాజః విద్యతే దృక్షు అక్షిషు యేషాం తే తథా రజః పిహితదృష్టయః స్థూలదృష్టయ ఇతి. యావత్. ఉదరస్య హృదయాపేక్షయా స్థూలత్వాత్. యద్వా - కూర్పం సూక్ష్మం సూక్ష్మదృశ ఇత్యర్థః. తదా హృదయస్థం సూక్ష్మమేవాలక్ష్య తత్ప్రవేశాయ ప్రథమం ఉదరస్థముపాసత ఇతి భావః. అరుణయస్తు సాక్షాత్ హృదయస్థం దహరం సూక్ష్మం

ఈ విధముగా పరాత్పరుడైన పరమేశ్వరునియందు సర్వవేదముల సమన్వయముగా సత్పదార్థమైన పరమాత్మనే సేవించుట అవశ్యకమైనదని చెప్పి భక్తులు కానివారిని నిందించుచు ఆ విషయమునే గట్టిగా సమర్థించి ప్రస్తుతము తెలియరాని అపారమైన మహిమగల ఆత్మతత్త్వమునకు మొట్టమొదట ఉపాధిని ఆశ్రయించిన ఉపాసనను- 'ఉదరం బ్రహ్మేతి శార్కరాక్షా ఉపాసతే హృదయం బ్రహ్మేత్యారుణయో బ్రహ్మవైత ఊర్ధ్వం త్వేవోదసర్పత్తచ్ఛిరోశ్రయతే' -మొదలైనశ్రుతులు ఏర్పరచినవని చెప్పుచున్నాడు-బుషులు సంప్రదాయమార్గములందు కూర్పదృష్టి కలవారు. ఉదరము ఆలంబన ముగా మణిపూరక చక్రమందున్న బ్రహ్మను ఉపాసింతురు. 'శార్కరాక్ష' అనే పై శ్రుతియందలి ప్రతిపదము కూర్పదృష్టులని చెప్పుటలో కూర్పమనగా చక్కెరపిండి రేణువు. దానిని దర్శించగల చూపుగలవారు స్థూలదృష్టులు. ఉదరము హృదయముకన్నా పెద్దదై నందువలన స్థూలమనే చెప్పబడినది. లేక కూర్పమనగా సూక్ష్మమైనది. దానిని దర్శించగలవారు సూక్ష్మదృష్టులు. అప్పుడు సూక్ష్మమై హృదయగతమైన పరాత్పరుని దర్శించగలుగు సౌకర్యమునకై స్థూలమైన ఉదరమును ఉపాసించవలెనని భావము. (స్థూలమైనదే కనబడనివారికి సూక్ష్మదృష్టి అలవడదని భావము) అరుణదృష్టి కలవారు హృదయమందున్న సూక్ష్మమైన (దహరం) అనాహతచక్రమందలి పరమాత్మనే

అనాహతచక్రస్థమేవోపాసతే. హృదయవిశేషణం పరిసరపద్ధతిమితి. పరితః సరంతి ప్రసర్పంతీతి. పరిసరానాద్యః తాసాం పద్ధతిం మార్గం ప్రసరణస్థాన మిత్యర్థః. విశేషణస్య ఫలమాహ – తత ఇతి. తతో హృదయాత్ భో అనంత తవ ధామ ఉపలబ్ధిస్థానం సుషుమ్నాఖ్యం పరమం శ్రేష్ఠం జోతిర్మయం శిరః మూర్ధానం ప్రతి ఉదగాత్ ఉదసర్పత్. మూలాధారాదారభ్య హృదయమధ్యాత్ బ్రహ్మరంధ్రం ప్రతి ఉద్గత మిత్యర్థః కథం భూతం ధామ. యత్ సమేత్య ప్రాప్య పునరిహ కృతాంతముఖే మృత్యుముఖే సంసారే న పతంతి తథా చ. శ్రు."శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విషఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతీ"తి. అస్యాఃశ్రుతేరర్థః. శతం శతసంఖ్యాకాః ఏకా చ సుషుమ్నా నామ పురుషస్య హృదయాద్వినిస్సృతాః నాడ్యః సిరాః తాసాం మధ్యే మూర్ధానం భిత్వా అభినిస్సృతా సుషుమ్నా నామ. తయా అంతకాలే ఆత్మానం వశీకృత్య. యో జపేత్ తయా నాడ్యా ఊర్ధ్వముపరి ఆయన్ గచ్ఛన్ ఆదిత్యద్వారేణ.అమృతత్వం ఏతి ప్రాప్నోతి. విష్వఙ్నానావిధ గతయః అన్యా నాడ్యః ఉత్క్రమణే నిమిత్తం భవంతి. శ్లో. ఉదరాదిషు యః పుంసాం చింతితో మునివర్త్మభిః, హంతి మృత్యుభయం దేవో హృద్గతం తముపాస్మహే. 19

ఉపాసింతురు. అంతటావ్యాపించునది అని హృదయమునకు విశేషణము. వ్యాపించునవి–నాడులు వానియొక్క పద్ధతి– మార్గము అనగా నాడులు ప్రసరించు స్థానమని అర్థము. ఈ విశేషణ ఫలమును చెప్పుచున్నాడు – ఆ హృదయమునుండి ఓ అనంతుడా! నీవు లభించు స్థానమైన సుషుమ్న అనేనాడి పరమశ్రేష్ఠమై కాంతివంతమైన శిరస్సు వైపునకు (పైకి) వెళ్ళును. మూలాధారము మొదలుకొని మధ్యనున్న హృదయ కోశమును (అనాహతచక్రమును) దాటి బ్రహ్మరంధ్రమునకు (సహస్రారచక్రమునకు) పైకి చేరునని అర్థము. నీస్థానమునుపొంది మరల ఈలోకమున యముని ముఖమున పడునట్టి (జననమరణ చక్రమున పడునట్టి) సంసారమున (ప్రాపంచిక లంపటమున) అట్టిసాధనచేసిన సాధకుడు పడడని భావము. 'శతంచైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా, తయోర్ధ్వమా యన్నమృతత్త్వమేతి. విశ్వఙ్ఙన్యాఉత్క్రమణే భవతి' అంటూశ్రుతి ఈ విషయమున నిర్ధారించినది. ఈ శ్రుతివాక్యమునకు అర్థము – నూర్లసంఖ్యలో ఉన్ననాడులలో సుషుమ్నఅనే ఒకేఒకనాడి పురుషుని హృదయము నుండి బయలుదేరి నాడులు, సిరలు మొదలైన వాని మధ్యన మూర్ధమును (తలను) ఛేదించి (దాటి) ముందున్న సహస్రారమును చేరును. ఆసుషుమ్న మరణ సమయమున–ఆత్మను వశపరచుకొని జపించువాడు ఆనాడిచేత పైకి (ఊర్ధ్వముఖముగా)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ స్వకృత విచిత్ర యోనిషు విశన్నివ హేతుతయా
తరతమతశ్చకాస్యనలవత్స్వకృతానుకృతిః ।
అథ వితథా స్వమూష్వ వితథం తవ ధామ సమం
విరజధియోఽన్వయం త్వ భివిపన్యవ ఏకరసమ్ ॥ 20

టీ:- నను ఈశ్వరస్యాపి తర్హి జీవవత్ ఉదరహృదయాదిసంబంధే తదనుప్రవిష్టస్య చ తారతమ్యే సతి కేన విశేషేణోపాస్యత్వమితి ఇమామాశంకాం పరిహరంత్యః. శ్రు. “ ఏకో దేవస్సర్వభూతేషు

పయనించి సూర్యుని ద్వారా అమృతత్త్వమును పొందును. విష్వక్కులైన (అంతటా వ్యాపించునట్టి) ఇతరనాడులన్నియు ప్రాణము దేహమునుండి వెడలుటకు మాత్రమే కారణములగును.

ఉదరాదిషు యః పుంసాం చింతితో మునివర్త్మభిః ॥
హంతి మృత్యుభయం దేవో హృద్గతం తముపాస్మ హే ॥

పురుషుల ఉదరములందు స్థూలరూపమున (మణిపూరక చక్రస్థానమున) ఉన్న పరమాత్మను ఉపాసించుచు ఋషుల సంప్రదాయ మార్గములతో హృదయ కుహరమున (అనాహతచక్రమున) వెలసి మృత్యుభయమును నాశనము చేయునట్టి (జన్మరాహుత్యమును కలిగించునట్టి) ఆ పరాత్పరుని ఉపాసింతును. 19

ఈశ్వరునికి కూడా జీవునివలెనే ఉదరము, హృదయము మొదలైన వాని సంబంధముతో శరీరము నందు ప్రవేశించినందువల్ల తారతమ్యము (హెచ్చుతగ్గులు) ఉండగా ఏ ప్రత్యేకతవలన ఆయనను ఉపాసించవలెనను శంకను నివారించుచున్నాడు. ‘ఏకోదేవ స్సర్వ భూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్షస్సర్వభూతాది వాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ’- ఒకే పరమాత్మ సర్వభూతములందు తెలియరాని విధముగా, అంతటా వ్యాపించి ఆత్మగా, సర్వకర్మల నియామకుడుగా అన్ని భూతములందు నివసించి, సాక్షిగా,

గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్షస్సర్వభూతాదివాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చే" త్యాద్యాశ్రుతయః స్తువంతీత్యాహ – స్వకృతేతి. స్వయం కృతాసు విచిత్రాసు ఉచ్చనీచమధ్యమాసు యోనిషు అభివ్యక్తిస్థానేషు కార్యేషు దేహాదిషు. హేతుతయా ఉపాదానతయా ప్రాగేవ విద్యమానత్వేన ముఖ్యప్రవేశాసంభవాత్ విశన్నివ వర్తమానః. తరతమతః న్యూనాధికభావేన చకాసి అవభాసనే స్వకృతాః యోనీరను కరోతీతి స్వకృతానుకృతిః అనలవత్ అగ్నిర్యథా స్వతస్తారతమ్యహీనోఽపి కాష్ఠానుసారేణన్యూనాధిక ఇవ తథా తథా ప్రకాశతే యథో త్తమ ప్రకాశస్సవితా ద్యుమండలమేకరూపేణ ప్రకాశేనాపూరయన్నపి వర్షాసు నికృష్టప్రకాశ ఇవ ప్రతీయతే శరది ప్రకృష్టప్రకాశ ఇవ తద్వత్. అథ అతః వితథాసు మిథ్యాభూతాసు అమూషు యోనిషు అవితథం సత్యం. యతః సమం అవిశేషం అతః సత్యం తవ ధామ స్వరూపం. విరజధియో నిర్మలమతయః అన్వయంతి జానంతి. అను ఇతి పృథక్పదం వా. అత్ర హేతుః. అభివిపన్యవ ఇతి. అభితో విగతవ్యవహారాః పనవ్యవహార ఇత్యస్య రూపం. పన్యురితి ఐహికాముష్మిక కర్మఫలరహితా ఇత్యర్థః. అవిశేష త్వాదేవ ఏకరసం సన్మాత్రం అతస్తవోపాధికృతతారతమ్యాభావా దప్రచ్యు తైశ్వర్యస్యో పాస్యత్వమితి భావః. శ్లో. " స్వ నిర్మితేషు కార్యేషు తారతమ్య వివర్జితం, సర్వానుస్యూతసన్మాత్రం భగవంతం భజామహే." (20)

చైతన్యముతో, ఒక్కటిగా, గుణరహితముగా వెలుగుచున్నాడు. – అంటూ ఉన్న శ్రుతులను ప్రస్తావించి చెప్పుచున్నాడు. – తానే నిర్మించిన విచిత్రములైన ఉత్తమ,మధ్యమ,అధమములైన యోనులనే (ఉత్తమము మొదలుకొని అతి నీచమైన జన్మస్థానములే) బైటకు కనబడే(అభివ్యక్త మగు) స్థానములై, కార్యరూపములైన శరీరములందు (తాను– కారణము, జీవులు– కార్యము) ఉండుట వలన జీవులందు ముఖ్య ప్రవేశము లేకనే అనగా ఔపచారికముగా మాత్రమే ప్రవేశము పొందు వానివలె(పుట్టిన వానివలె)ఉన్నాడనిసారాంశము. తారతమ్యముచేత అల్పము, అధికము అనేభావముతో ప్రకాశించుచున్నాడు. తాను చేసిన యోనులను అనుసరించుచున్నాడు. ఆ అనుకరణ అగ్నివలె చేయుచున్నాడు. అగ్ని యందు సహజముగా తారతమ్యము లేకపోయినను కట్టెల (ఇంధనము) పరిమాణము, దహన శక్తిని బట్టి హెచ్చుతగ్గులుగా ప్రకాశించునట్లు, ఒకే సూర్యుడు తన ఉత్తమమైన ప్రకాశనశక్తితో ఆకాశమండలమునంతయూ ఒకేవిధముగా ప్రకాశముతో నింపి నట్లయినప్పటికీ వర్షాకాలమున ప్రకాశము క్షీణించిన వానివలె కనపడును. అట్లేపరమాత్మ కూడా అసత్యములైన ఈభూత సముదాయ మున సత్యమై నిలచును. అన్నిటిముందు పరమాత్మ ప్రకాశించుటవలన ఆయన స్వరూపము సత్యమైనది అని ఎట్టి మాలిన్యములేని బుద్ధిగలవారు ఈ విషయమును తెలియగలుగు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ స్వకృతపురేష్వమీష్వ బహిరంతర సంవరణం
తవ పురుషం వదంత్యఖిల శక్తిధృతోఽంశకృతమ్ ।
ఇతి నృగంతి వివిచ్య కవయో నిగమావపనం
భవత ఉపాసతేఽంఘ్రిమభవం భువి విశ్వసితాః ॥ 21

చున్నారు. లేక వీటన్నింటి కంటే అనగా ఈ దృశ్యమాన జగత్తు కంటే వేరైనదని తెలియుచున్నారు. దీనికి కారణము చెప్పుచున్నాడు– అంతటా కర్మాది బంధముల వ్యవహారములేనిది పరమాత్మ. అనగా ఈలోకసంబంధమైనవి కానీ, పరలోక సంబంధమైనవికానీ,అయిన ఫలములను ఏమాత్రమూ ఆశించనిదని అర్థము. వీటన్నింటికంటే పూర్తిగా విశేషమైనందున ఏకరసము, నిత్యమూఉండుట పరమాత్మ అని సిద్ధాంతము. అందువల్ల ఉపాధులందుగల తారతమ్యము లేనందువలన అఖండైశ్వర్య పూర్ణుడవై నందువలన నిన్ను ఉపాసించవలెనని భావము.

స్వనిర్మితేషు కార్యేషు తారతమ్యవివర్జితం ।
సర్వానుస్యూతసన్మాత్రం భగవంతం భజామహే ॥(శ్రీధరీయము)

పరమాత్మ తానే నిర్మించిన కార్యరూపములైన భూతములందు ఎట్టి భేదము లేకుండా అన్నిటియందు పూసలలోదారమువలె ఆంతరంగికముగా సత్తామాత్రముగా వెలసిన పరమాత్మని సేవింతుము. 20

భగవంతుని విషయమై ఈ అనుమానమెందుకు కలిగింది అంటే భగవంతునికి కూడా దేహాది ఉపాధులవల్ల కలిగిన దోష ప్రసంగము ఏర్పడినందువల్ల అని అర్థము. అవిద్య(అజ్ఞానము) చేత కామ్యకర్మలతో

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- అపి చ కుతోఽను ఇయమాశంకా స్యాత్ భగవతో దేహాద్యుపాధి కృతదోషప్రసంగ ఇతి. యతః అవిద్యా కామకర్మభిః సంసరతో జీవస్యాపి భగవద్భావం లక్షణయా భోధయంత్యస్తం దోషం నిషేధంతి. శ్రు. "సయశ్చాయం పురుషే. యశ్చాసావాదిత్యే, స ఏకః. తత్త్వమసీ" త్యాద్యాః శ్రుతయః. నను క్రత్వర్థస్యాత్మనః స్తుతిరియమీశ్వరత్వేన క్రియతే న తు తస్యేశ్వరత్వం బోధ్యతే. నైతదుచ్యతే. యతస్తత్ర శ్రు. "యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మన" ఇత్యాద్యాః శ్రుతయః. కృతావతారస్య భగవతశ్చరణాం భోజసేవోపాయం వదంతీ త్యాహ - స్వకృతేతి. స్వకర్మోపార్జితేషు పురేషు దేహేషు అమీషు నరాదిషు భోక్త ృత్వేన వర్తమానం పురుషం. అఖిలశక్తిధృతః సర్వశక్త్యాశ్రయస్య పూర్ణస్య తవాంశకృతం వదంతి. అంశ ఇవ అంశః కృత ఇవ కృతః త్వద్రూపం వదంతీ త్యర్థః. నను కార్యకారణ సంవృతస్య కుత ఏవంభూతత్వం తత్రాహ - అబహిరంతర సంవరణమితి. బహిః కార్యం. అంతరం కారణం. వస్తుత స్తదావరణ శూన్యం తయోః లింగస్థూలయోరసత్వాదిత్యర్థః ఇతి ఏవం. నృగతిం నుః జీవస్య గతిం తత్త్వం వివిచ్య విశోధ్య కవయః భజనం వినా ఇదం న ప్రాప్యత ఇతి జానంతః. నిగమావపనం నిగమోక్త కర్మణామావపనం. అసమంతాదుప్యంతేఽస్మిన్నిత్యావపనం క్షేత్రం సర్వకర్మార్పణ విషయ మిత్యర్థః. యత్రార్పితాని కర్మాణి ముక్తిఫలం

(తనకోర్కెలను తీర్చుకొనవలెనని చేయు పనులతో) జీవునికి కూడా భగవంతత్వము అనగా తాముకూడా భగవంతుడే అనే భావమును లక్షణతో(జహదజహల్ల క్షణాశక్తితో) బోధించును. ఆజీవుని దోషమును తొలగించుచున్నాడు.'సయశ్చాయం పురుషే. యశ్చాసావాదిత్యే స ఏకః . తత్త్వమసి' మొదలైన శ్రుతులు వాడేవీడని- భగవంతుడే జీవుడని చెప్పుచున్నవి. సామర్థ్యమనే అర్థము గల ఆత్మకు ఈశ్వరత్వము చేతనే స్తుతించుట జరిగినది. కానీ దానికి (జీవునికి) ఈశ్వరత్వమున్నదని కాదు. ఇది కుదరదు. ఎందుకంటే "యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః" మొదలైన శ్రుతులు పరమాత్మయందే సరోత్కృష్టమైన భక్తి ఉండవలెను. దేవునియందు వలెనే గురువునందు కూడా భక్తి అనివార్యము. అట్టి మహాత్ములైన పురుషులకే ఇంతకు ముందు చెప్పిన అర్థములన్నియు ప్రకాశించును అని ఈవేదవాక్యమునకు అర్థము. అవతార రూపముగా ఆవిర్భవించిన భగవంతుని పాదసరోజము ఉపాసించుటయే సంసార తరణమునకు ఉపాయము అని చెప్పుచున్నాడు- తమ కర్మలవలన పొందిన మానవుడు మొదలైన శరీరములందు భోక్తగా ఉన్న పురుషుని (జీవుని) సర్వశక్తులకు అశ్రయుడవై పరిపూర్ణుడవైన నీ (పరమాత్మ) అంశచేత ఏర్పడినదని చెప్పుచున్నాడు. అంశవంటి అంశ చేయబడినది అనగా సంపూర్ణముగా నీ రూపమే అని చెప్పుచున్నారని అర్థము.

ఫలంతి తం భవతః అంఘ్రిం అభవం భవనివర్తకం విశ్వసితాః కృతవిశ్వాసాః ఉపాసతే అర్చనవందనాదిభిః సేవంతే. భువీతి మర్త్యలోకే ఇదమేవోచితమితి దర్శయంతి. శ్లో." త్వదంశస్య మహేశాన త్వన్మాయాకృతబంధనమ్, త్వదంఘ్రిసేవామాదిశ్య పరానందనివర్తయ."
21

కార్యకారణ పరివృత్తుడైన పరమాత్మ ఎందుకిట్లు అయినాడు అనే దానికి చెప్పుచున్నాడు- బహిరంతరములందు ఆవరణము లేనందువల్ల అని అర్ధము. బాహిరమైనది- కార్యము. ఆమతరము-కారణము. వాస్తవముగా పరమాత్మకు ఎట్టి ఆవరణములు(ఉపాధులు) లేవు. కానీ లింగము(జీవుడు), స్థూలము, అనే వానికి ఉపాధి(ఆవరణము) లేనిచో సత్వము- ఉండుట అనేది-సత్తకలుగదని భావము.(లోపలకనపడని సూక్ష్మమైన లింగము- జీవుడు అనేకారణము బైటకనపడునట్టి స్థూల మైన రూపముఅనే కార్యములు రెండింటికి ఆవరణము-ఉపాధి అని వార్యమని భావము).ఇట్లుండగా మానవ రూపము పొందిన జీవుని తత్త్వమును (గతిని) పరిశీలించి విజ్ఞానవంతులైనవారు (కవులు) పరమాత్మ భజన లేనిచో మానవ శరీరత్వము కలుగదని తెలిసినవారై వేదమునందు చెప్పిన కర్మల యొక్క ఫలితములను పరమాత్మకే అర్పింతురు. ఉరమాత్మకు అర్పించిన కర్మలు ముక్తి ఫలమును ఫలింపచేయును. పునర్జన్మబాధను నశింపచేయునట్టి నీపాదమును భక్తులు విశ్వాసముతో ఉపాసించు చున్నారు. అర్చనవందనాదులతో సేవించుచున్నారు. ఈభూలోకమున హరిపాదసేవయే ఉచితమని రుజువులతో ప్రదర్శించుచున్నారు.

త్వదంశస్య మహేశాన త్వన్మాయాకృతబంధనమ్ ।
త్వదంఘ్రిసేవామాదిశ్య పరానంద నివర్తయ ॥(శ్రీధరీయము)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ దురధిగమాత్మతత్త్వనిగమాయతవాత్తతనో
శ్చరితమహామృతాబ్ధి పరివర్త పరిశ్రమణాః ।
న పరిలషంతి కేచిదపవర్గమపీశ్వర తే
చరణసరోజ హంసకులసంగవిసృష్ట గృహాః ॥ 22

టీ:- భక్తిరత్యంతసాధనమితి వచనం ఉచితమివ మన్వానో భక్తిం గురూకరోతి దురుధిగమేతి. భోహే ఈశ్వర. దుర్బోధం యదాత్మతత్త్వం తస్య నిగమాయ జ్ఞాపనాయ, తవ ఆత్తతనోః అవిష్కృతమూర్తేః చరిత మహామృతాబ్ధి పరివర్త పరిశ్రమణాః చరితమేవ మహాన్ అమృతాబ్ధిః తస్మిన్ పరివర్తః అవగాహః తేన పరిశ్రమణాః పరీతివర్జనార్థః. శ్రమణం శ్రమః గతశ్రమా ఇత్యర్థః. అపవర్గమపి కేచిన్న పరిలషంతి నేచ్ఛంతి కుతోఽన్యత్. కేచిదితి. ఏవం భూతాః భక్తిరసికాః విరళా ఇతి దర్శయతి - న కేవలమన్యన్నేచ్ఛంతి కింతు తేనైవ సుఖేన పూర్ణాస్సంతః పూర్వసిద్ధగృహాదిసుఖమపి ఉపేక్షంత ఇత్యాహ - తవ చరణసరోజ

ఓ పరమానందరూపుడా ! మహేశ్వరా ! నీ అంశలమైన మాకు నీ మాయలవల్ల కలిగిన బంధనము(శరీరధారణ) ను నీపాదపద్మాలపట్ల సేవాభావమును ఉపదేశించి తొలగించుము. 21

భక్తి గొప్ప సాధనమనే మాట ఉచితముగా భావించేవారికి భక్తిని గొప్పదిగా చెప్పుచున్నాడు- ఓ పరమేశ్వరా! ఆత్మతత్త్వము గ్రహించుటకు కష్టమైనదనే విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనుటకై శరీరమును స్వీకరించిన నీ ఆవిష్కృతమూర్తి (అవతారములయొక్క) చరితలు (లీలలు) అనే గొప్పదైన అమృత సముద్రమున ఓలలాడుటచేత శ్రమను (అనగా ప్రాపంచిక సంకటములను) తొలగించుకొని కొందరు మోక్షమును కూడా కోరక తిరస్కరింతురనగా ఇతర విషయములతో పనిఏమి? కొందరు అనుటలో అంతటి పారవశ్యమును అనుభవించగల భక్తులు చాలాతక్కువగా ఉందురని చూపుచున్నాడు- కేవలము వేరే వాటిని కోరక పోవుటయేకాక పరమాత్మా నందముతో నిండిన వారై మొదటినుండి ఉన్నట్టిగృహదారాది సుఖములను కూడా ఉపేక్షింతురని చెప్పుచున్నాడు- నీ పాదపద్మములందు రమించు హంసలవంటి భక్తుల సాహచర్యముతోకోరికలు నశించినవారై భార్యా పుత్రాదులపట్ల వ్యామోహము లేకుండా శ్రవణ కీర్తనాదులయందు వర్తింతురు. వేదము కూడా ముక్తికంటే ఆధిక్యము భక్తికి చెప్పుచున్నది.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

హంసకులసంగవిసృష్టగృహా ఇతి తవ చరణసరోజే హంసా ఇవ రమమణాః యే భక్తాస్తేషాం కులం తేన సంగః తేన విసృష్టాః గృహాః యైస్తే తథా అనేన శ్రవణ కీర్తనే దర్శితే. శ్రుతిశ్చ ముక్తేరప్యాధిక్యం భక్తేర్దర్శయతి. శ్రు. "యం సర్వే దేవా నమంతి ముముక్షవో బ్రహ్మ వాదినశ్చే"తి వాఖ్యాతం చ సర్వజ్ఞైర్భాష్య కృద్భిః ముక్తా అపి లీలయా విగ్రహం కృత్వా భజంత ఇతి. శ్లో." త్వత్కథామృతపాథోధౌ విహరంతో మహాముదః, కుర్వంతి కృతినః కేచిచ్చతుర్వర్గం తృణోపమమ్." 22

'యం సర్వే దేవా నమంతి ముముక్షవో బ్రహ్మావాదినశ్చ' – అని శ్రుతి వ్యాఖ్యానించినది. సర్వజ్ఞులైన శంకరాచార్యాది భాష్యకారులు ముక్తులై కూడా పరమాత్మ లీలా విలాసమును– విగ్రహముగా(ప్రతీక–ప్రతిమగా) భావించి సేవించినారు.

త్వత్కథా మృతపాథోధౌ విహరంతో మహాముదః ।
కుర్వంతి కృతినః కేచిచ్చతుర్వర్గం తృణోపమం ॥ (శ్రీధరీయము)

నీ కథామృత సముద్రమున అపారమైన ఆనందముతో విహరించు కొందరు పుణ్యాత్ములు మోక్షమునుకూడా గడ్డి పరకగా తిరస్కరింతురు. 22

శ్లో॥ త్వదనుపథం కులాయమిదమాత్మ సుహృత్ప్రియవ
చ్చరతి తథోన్ముఖే త్వయి హి తేప్రియ ఆత్మని చ ।
న బత రమంత్యహో అసదుపాసనయాత్మహనో
యదనుశయాభ్రమంత్యురుభయే కుశరీరభృతః ॥ 23

టీ:– శ్రు. " ఆరామమస్య పశ్యంతి న తం పశ్యతి కశ్చన, న తం

"ఆరామమస్య పశ్యంతి నతం పశ్యతి కశ్చన, నతం విదాధ య ఇదం జజానాన్యద్యుష్మాకమంతరం భవాతినీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరంతీ"– పరమాత్మ యొక్క మనోహరమైన సృష్టిని అందరూ చూచుచున్నారు. కానీ ఆత్మనుచూడగలవారులేరు. ఆత్మ ఇట్టిదని తెలియగల జ్ఞానము లేదు. సర్వమూ ఆయన యందే యున్నది. దట్టమైన మంచుతో ఆవరించబడి దేహధారులు ఆయన శాసనము వలననే చరించుచున్నారు. మొదలైన శ్రుతులు ఆక్రోశించుచు

విదాధ య ఇదం జజానాన్యద్యుష్మాకమంతరం భవాతి నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరంతీ” త్యాద్యాః శ్రుతయః అనుక్రోశంత్యో జగదాత్మనీశ్వరే రతిముపదిశంతీత్యాహ - త్వదనుపథమితి. త్వదనువర్తిత్వాత్ త్వత్సేవౌపయికం ఇదం కులాయం కౌ భువి లీయత ఇతి కులాయం శరీరః. ఆత్మవత్ సుహృద్వత్ ప్రియవత్ ఆత్మా చ సుహృచ్చ ప్రియశ్చ తద్వత్. చరతి స్వాధీనతయా వర్తత ఇత్యర్థః. తథాపి త్వయి ఉన్ముఖే హితే ప్రియే ఆత్మని చ అప్యర్థే చకారః ఏవంభూతే సుసేవ్యేఽపి త్వయి బత అహో కష్టం న రమంతి న భజంతి అసదుపాసనయా దేహాద్యుపలాలనేన ఆత్మహనః ప్రమాదినః కుతః యదనుశయాః యస్యామసదుపాసనాయాం అనుశయో వాసనా యేషాం తే కుశరీరభృతస్సంతః ఉరుభయే సంసారే భ్రమంతి పరివర్తంతే అతః ఆత్మహన ఇతిభావః. శ్లో.“ త్వయ్యాత్మని జగన్నాథే మన్మ నోర మితామిహ, కదా మమేదృశం జన్మ మానుషం సంభవిష్యతి.” 23

(గట్టిగా) జగదాత్ముడైన ఈశ్వరునియందు ప్రీతిని ఉపదేశించినవని చెప్పుచున్నాడు- నీవే ఈశరీరమందు వర్తించుటచేత నీసేవకొరకే ఉపయోగపడుటకై(వినియోగపడుటకై) ఈశరీరమనే గూడు (కులాయము-కౌ- భూమిలో,లీయతే-కలిసిపోవునది- మట్టిలో కలియునది శరీరము) తనకు తన మీది వలె, స్నేహితుని వలె, ప్రియురాలివలె ఇష్టము కలుగునో అట్లే ఆత్మ కూడా స్వాధీనమై వర్తించును. ఆత్మ (పరమాత్మ) కూడా ఇంతటి ప్రేమ పాత్రమైయుండగా దానిని అవశ్యముగా సేవించవలసి ఉండగా అయ్యో మానవుడు (జీవుడు) తనలోని పరమాత్మవిషయమై ఆనందించక (రమించక) సేవించుటలేదు. అసత్యమైన దేహాదులను లాలించుటలో ఆత్మను నాశనము చేయుచు ఆత్మహనులై తమను తామే చంపుకొనుచున్నారు. అంతఃకరణముతో అసత్తులైన శరీరాదులను ఉపాసించుటలో ఇష్టముకలవారై దుష్టమైన శరీరములతో భయంకరమైన సంసారమందు భ్రమించుచున్నారని భావము.

త్వయ్యాత్మని జగన్నాథే మన్మనో రమతామిహ ।
కదా మమేదృశం జన్మ మానుషం సంభవిష్యతి ॥(శ్రీధరీయము)

ఓ జగన్నాథుడా ! ఈ లోకమున నాకెప్పుడు మానవజన్మ కలిగినను పరమాత్మవైన నీయందే నామనస్సు లగ్నమై ఆనందమును పొందుగాక. 23

శ్లో॥ నిభృతమరున్మనోక్షదృఢయోగయుజో హృదియ
న్మునయ ఉపాసతే తదరయోఽపి యయుస్స్మరణాత్ ।
స్త్రియ ఉరగేంద్ర భోగభుజదండవిషక్తధియో
వయమపి తే సమాస్సమదృశోఽంఘ్రి సరోజసుధాః ॥ 24

టీ:- ఇదానీం. శ్రు.''ఆత్మావరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" ఇత్యాదాః శ్రుతయః ధ్యానమంగత్వేనోపదిశంతీత్యాహ – నిభృతేతి. మరుత్ ప్రాణః మనశ్చ అక్షాణీంద్రియాణి చ నిభృతాని సంయమితాని యైః తే చ దృఢం యోగం యుంజంతీతి దృఢయోగ యుజస్తే తథా భూతా మునయః హృది యత్తత్త్వముపాసతే తదేవారయోఽపితవస్మరణాత్ యయుః ప్రాపుః స్త్రియోఽపి కామతః ఉరగేంద్రభోగభుజదండ విషక్తదియః అహీంద్ర దేహసదృశయోర్భుజ దండయోర్విషక్తా ధీర్యాసాం తాః పరిచ్ఛిన్నదృష్టయః సమదృశః సమమచ్ఛిన్నం త్వాం పశ్యంత్యో వయం శ్రుత్యభిమానిన్యో దేవతా ఆపి తే సమా ఏవ కృపావిషయతయా అంఘ్రిసరోజసుధాః అంఘ్రి సరోజం సుష్ఠు ధయంత్యః. అయం భావః–ఇత్థంభూతస్తవస్మరణాను భావః, యే యోగినస్త్వాంహృద్యాలంబేన ఉపాసతే, యాశ్చవయం త్వాం సమం పశ్యామః యాశ్చ స్త్రియః కామతః పరిచ్ఛిన్నం ధ్యాయంతి యే చ ద్వేషేణ. తాన్ సర్వానపి త్వామేవ ప్రాపయతీతి. శ్లో. "చరణస్మరణం

ఇప్పుడు "ఆత్మా వారే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః''. ఈ మొదలైన శ్రుతులు ధ్యానమును అంగత్వముగా ఉపదేశించుచున్నవి. మరుత్తు ప్రాణములు, మనస్సు, ఇంద్రియములు మున్నగు వానిని పరిపరి విధములుగా పోకుండా నిగ్రహించిన వారు, గట్టిగా యోగమును (పరమాత్మతో అనుసంధానము) పొందినవారు (ధ్యానాభ్యాస వశీకృతచిత్తులు అయినవారు) మునీశ్వరులు ఉపాసించిన దానినే భక్తులు నీ నిరంరత స్మరణవలన కూడా పొందగలరు. స్త్రీలు(గోపికలు) కూడా కామముతో ఆ అనంతశయనుని యందు నిలిపిన బుద్ధులతో, సమదృష్టితో నిన్ను దర్శించుచున్నారు. మేము వేదమునందు అభిమానముకల దేవతలమైననూ వారితో సమానమై నీ పాదపద్మ మకరందమును చక్కగా పొందినాము. అనగా అఖండ భావనతో మానసికముగా ఉపాసించునట్టి యోగులు పొందునట్టి పరతత్త్వమునే- వేదములమైన మేము పొందినదానినే గోపికలు కామభావనతో, మరికొందరు హిరణ్యకశపు, శిశుపాలాదులు ద్వేషభావనతో, ఇలాగే తీవ్రమైన పెక్కుభావనలతో పలువురు నిన్ను సమముగా పొందుచున్నారు. నీదయా విషయమై అందరూ నీపాదపద్మ మకరందమును సమృద్ధిగా పొందుచున్నారని భావము.

చరణస్మరణం ప్రేమ్ణా తవ దేవ సుదుర్లభం ।
యథా కథంచిన్నృహరే మమభూయాదహర్నిశమ్ ॥

ప్రేమ్ణా తవ దేవ సుదుర్లభం, యథా కథం చిన్నృహరే మమ భూయాద హర్నిశమ్." 24

శ్లో॥ క ఇహ ను వేద బతావర జన్మలయోగ్రసరం
యత ఉదరగాదృషిర్యమను దేవగణా ఉభయే ।
తర్హి న సన్న చాసదుభయం న చ కాలజవః
కిమపి న తత్ర శాస్త్రమపకృష్య శయీత యదా ॥ 25

టీ:- శ్రు."యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్. కుత అజాతా కుత ఇయం విసృష్టిః. అర్వాగ్దేవా అస్య విసర్జనాయ అథా కోవేద యత ఆబభూవ. అనేజదేకం మనసో జవీయోనైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్. తద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠన్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతీ" త్యాద్యాః శ్రుతయః.భగవత్తత్వం దుర్జ్ఞేయం వదంత్యః భక్తిమేవోరరీకుర్వంతీ త్యాహ - క ఇతి. బత అహో హే భగవన్. ఇహ జగతి అగ్రసరం పూర్వమేవ సిద్ధం త్వాం అవరజన్మలయః ఆర్వాచీనోత్పత్తినాశవాన్ కోను పుమాన్ వేద జానాతి. ఈశ్వరస్య పూర్వసిద్ధావన్యస్య చార్వాచీన్వతే ప్రమాణం వదన్

నరహరీ ! స్వామీ నీపాదపద్మముల స్మరణమును ప్రేమతో సాధించగలుగుట మిక్కిలి కష్టసాధ్యము. అయిననూ నీ అనుగ్రహముతో మాకు నీ పదకమల ధ్యానమే నిరంతరము నిశ్చలముగా కలుగుగాక. 24

" యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్. కుత అజాతోకుత ఇయం విసృష్టిః. అర్వాగ్దేవా అస్య విసర్జనాయ అథా కోవేద యత ఆబభూవ. అనేజదేకం మనసో జవీయో నైన ద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్. తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠన్ తస్మిన్నపోమా తరిశ్వాదధాతీ"-పరమాత్మతత్త్వమును గురించి వర్ణించలేక, గ్రహించలేక వాక్కుమనస్సులు అశక్తులై వెనుదిరిగినవి. ఆతత్త్వమును తెలిసినవాడు, దానిని చెప్పగలవాడులేడు. ఈసృష్టి ఎక్కడ నుండి కలుగు చున్నది. మరల ఎక్కడ లీనమగుచున్నది. అర్వాచీనులైన దేవతలు అతడు విడిచినవారే. అందువల్ల ఎక్కడనుండి వచ్చినదని తెలిసినవారులేరు. మనస్సు కంటే వేగవంతమైన పరమాత్మను దాటునదిలేదు. ఆయనను పొందలేక దేవతలు వెనుదిరిగిరి. ఎంత వేగవంతములైననైనా దానిని పొంద లేవు. దాటలేవు. జలము, వాయువు అతనియందే నిలిచినవి. అంటూ శ్రుతులు భగవతత్త్వమును గ్రహించుటమిక్కిలిగావీలులేనిది, గహనమైనదనీ చెప్పుచునే దానిని

జ్ఞానకారణాభావమాహ – యత ఉదగాదితి.యతః త్వత్తః ఋషిః బ్రహ్మా ఉత్పన్నః యం బ్రహ్మాణమను ఉభయే ఆధ్యాత్మికాధిదైవికా దేవగణా ఉత్పన్నాః. తతోఽప్యర్వాచీనాః సర్వే యదాతు భవాన్ సర్వమపకృష్య ఉపసంహృత్య శయీత. తర్హి తదా. అనుశాయినాం జీవానాం జ్ఞానసాధనం నాస్తి. యతః తదా నసత్ స్థూలం ఆకాశాది న చాసత్ సూక్ష్మం మహదాది. న చ ఉభయం సదసద్భ్యామారబ్ధం శరీరం. న చ కాలజవః తన్నిమిత్తభూతం కాలవైషమ్యం ఏవం సతి తత్ర తదా నకిమపి ఇంద్రియప్రాణాద్యపి. నచ జ్ఞాపకం శాస్త్రమపి అయమభిప్రాయః – అర్వాక్ సృష్టిగతానాం దేహాద్యుపాధిమతాం నరాణాం కాలవశేనచ మలినసత్త్వానాం న తావద్భగవజ్జ్ఞానసామర్థ్యం. తథా చ. శ్రు. “ నతం విదా థయ ఇదం జజానాన్యద్యుష్మాకమంతరం భవాతీ” త్యాద్యాః. యదా తు ప్రళయసమయేన బహ్వంతరమస్తి తథాపి సాధనాభావాన్న భగవజ్జ్ఞానసామర్థ్యం అతస్త్వదేకశరణతయా శ్రవణకీర్తనాదిభక్తిరేవ సుకరేతి. శ్లో. క్వాహం బుద్ధ్యాదిసంరుద్ధః క్వ చ భూమన్ మహస్తవ, దీనబంధో దయాసింధో భక్తిం మే నృహరే దిశ. 25

గ్రహించు శక్తిగలది ఒక్క భక్తి మాత్రమే అని విస్తృతముగా అంగీకరించిన వని చెప్పుచున్నారు– ఓ పరమాత్మా! ఈ జగత్తుకంటే ముందున్న అంటే పూర్వమేసిద్ధముగా ఉన్ననిన్ను పూర్వ పూర్వజన్మలనాశము, ఇప్పుడున్న ఉత్పత్తి నాశములను తెలియగలవాడెవ్వరు. ఈశ్వరునికి సనాతనత్వము, ఇతరమైన సృష్టికి అధునాతనత్వముల విషయమున ప్రమాణము చెప్పుచుఅది తెలియగలజ్ఞానమునకు కారణము చెప్పుచున్నాడు. నీ వలననే ఆదిఋషియైన బ్రహ్మ జన్మించినాడు. ఆ బ్రహ్మ పిదప ఆధ్యాత్మిక, ఆధిదైవికములైన దేవగణములు పుట్టినవి. ప్రళయకాలమున అర్వాచీనమైన ఈసమస్తముకంటే వేరుగా నీవు సర్వమును ఉపసంహరించి శయనింతువు. అటువంటి సమయమున అనుసరించి నిద్రించునట్టి(ఉనికిలేని) జీవులకు జ్ఞానవిషయమున స్థానములేదు. ఎందుకనగా అప్పుడు సత్తులై (ఆకారముతో కూడిన) స్థూలములైన ఆకాశాదులు, అసత్తులై (నిరాకారముగా) సూక్ష్మములైన మహదాదులు లేవు.సదసద్భావములు రెండింటిలో ప్రారంభమైన ఈ జగత్తు (శరీరము) లేదు. కాలముయొక్క వేగములేదు. కాలము కారణముగా ఉత్పన్నమైన భూతములకు కాలవైరుధ్యములేదు. విషయమిట్లుండగా ఆ సమయమున ఇంద్రియములు, ప్రాణములు అనేవి ఏ మాత్రములేవు. జ్ఞాపకము కూడా లేదు. శాస్త్రముకూడా ఈ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

విషయమునే చెప్పుచున్నది- అర్వాచీనముగా దేహాది ఉపాధులతో సృష్టిని పొందిన మానవులు కాలవశముచేత మలినమైన శక్తితో అట్టి భగవంతునికి సంబంధించిన జ్ఞానమునందు సామర్థ్యములేదు. ‘ న తం విదాథయ ఇదం జజానాన్యద్యుష్మా కమంతరం భవతి’- పరమాత్మ ఇట్టిదని తెలియగలజ్ఞానము లేదు. అంతయు ఆయన లోనేఉన్నది- అంటూశ్రుతులు ఈవిషయమునేస్పష్టపరచినవి. ప్రళయ కాలమున బైటి ఆకాశాది పంచభూతాలుకానీ, అంతరములైన మహదాదులుకానీ లేవు. సాధనములు లేనందువలనభగవంతుని గ్రహించగలుగు జ్ఞానసామర్థ్యము కలుగదు. అందువలననిన్నే శరణుపొంది, శ్రవణ కీర్తనాదులను ఆశ్రయించునట్టి భక్తితోమాత్రమే సులభముగా ఆశ్రయించదగినది ఆత్మతత్త్వము.

క్వాహం బుద్ధ్యాదిసంరుద్ధః క్వ చ భూమన్ మహస్తవ ।
దీనబంధో దయాసింధో భక్తిం మే నృహరే దిశ ॥(శ్రీధరీయము)

బుద్ధిమొదలైన ఇంద్రియముల అడ్డుగోడలుగలనేనెక్కడ? సర్వ వ్యాపకుడవైన తేజోరూపుడవు నీవెక్కడ? నిన్ను అనుభవించగల శక్తి మాత్రము నాకులేదు. కనుక ఓ దీనబంధుడా-దయాసముద్రుడా, ఓనర హరీ ! నాకు నీపాదపద్మములపట్ల భక్తినిమాత్రము ప్రసాదించుము. 25



శ్లో॥ జనిమసతస్సతో మృతిముతాత్మని యే చ భిదాం
విపణమృతం స్మరంత్యుపదిశంతి త ఆరుపితైః ।
త్రిగుణమయః పుమానితి భిదా యదబోధకృతా
త్వయనతతః పత్రస భవేదవబోధరసే ॥ 26

టీ:- ఇతోఽపి న జ్ఞానం సుశకం ఉపదిశతామపి భ్రమబాహుళ్యాదిత్యాహ- జనిమితి. అసతః జగతః జనిముత్పత్తిం. యే వైశేషికాదయో వదంతి సత ఏవ బ్రహ్మతత్వస్యోత్పత్తిం వదంతి. యే చ పాతంజలాదయఃసత ఏవైకవింశతి ప్రకారస్య దుఃఖస్య మృతిం నాశం మోక్షం వదంతి.యే నైయాయికాః. ఉత అపి యే చ సాంఖ్యాదయ ఆత్మని భిదాం భేదం యే చ మీమాంసకాః విపణం కర్మఫలవ్యవహారం ఋతం సత్యం స్మరంతి. తే సర్వే ఆరోపితైరారోపితైర్భ్రమైరేవోపదిశంతి న తత్త్వదృష్ట్యా. శ్రు. "అసద్వా ఇదమగ్ర ఆసీత్. సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్ బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి సమానే వృక్షే పురుషో నిమగ్నః. అనీశయా శోచతి ముహ్యమానః అవిద్యాయామంతరే వర్తమానాస్స్వయం ధీరాః పండితం మన్యమానాః. జంఘన్యమానాః పరియంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః. ఏకమేవాద్వితీయం బ్రహ్మ. ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్" ఇత్యాదిశ్రుతివిరోధాత్. కించ. వస్తుతః పురుషస్య త్రిగుణమయత్వే

చక్కగా ఉపదేశమును పొందినను జ్ఞానము భక్తికంటే సులభము కాదు. జ్ఞానము విషయమున పెక్కు భ్రమలున్నవి అనే విషయమును చెప్పుచున్నాడు- అసత్తునుండి జగము పుట్టినదని వైశేషిక దర్శనకారులు చెప్పుచున్నారు. పతంజలి మొదలైన యోగదర్శనకారులు జగత్తు బ్రహ్మతత్త్వముచేత పుట్టినదందురు. వారు ఇరువది ఒక్క విధములుగా దుఃఖమునకు మరణమే మోక్షము అనుచు నైయాయికులైన(న్యాయ దర్శనకారులైన) శాస్త్రవేత్తలు చెప్పుదురు. కపిలాది సాంఖ్యదర్శనకారులు ఆత్మ యందు భేదమును, భాట్టప్రభాకారాది పూర్వమీమాంసాకారులు జగత్తు కర్మఫలములచేత వ్యవహరింపబడునని, అది సత్యమని చెప్పుచున్నారు. వారందరూ తమ సిద్ధాంతములను భ్రమలనుపొంది ఉపదేశములు చేయుచున్నారు. కానీ తత్త్వదృష్టిచేతకాదు (అంతయు తమకే తెలియుననే) 'అసద్వా ఇదమగ్ర ఆసీత్. సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్ బ్రహ్మైవసన్ బ్రహ్మాపేతి సమానే వృక్షే పురుషో నిమగ్నః.అనీశయా శోచతి ముహ్యమానః అవిద్యాయామంతరే వర్తమానాస్స్వయం ధీరాః పండితం మన్యమానాః. జఘన్యమానాః పరియంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః. ఏకమేవాద్వితీయం బ్రహ్మ. ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ '-కార్యము(జగత్తు) ఉత్పత్తికి పూర్వము అభావము.'అసత్' (లేకుండుట) అనబడును. ఓసౌమ్యుడా! దీనికన్నా ముందు సత్తు (బ్రహ్మము) ఉన్నది.ఒకే వృక్షమును(శరీరమును)పొంది

సర్వమిదం సంగచ్ఛేత నతు తదస్తీత్యాహ– త్రిగుణమయః పుమానితి భిదా యదబోధకృతా త్వయీతి త్రిగుణమయః పుమానిత్యనేన హేతునా యా భిదా. ఉపలక్షణమేతత్ యా భిదాధీస్సా. యస్మాత్. త్వయి విషయే అబోధకృతా త్వద్విషయాజ్ఞాన విజృంభితా. తర్హి కిమజ్ఞానమస్తి వస్తుతః పుంసి నైవేత్యాహ – తతః అబోధాత్ పరత్ర పరస్మిన్. అసంగే అవబోధరసే జ్ఞానఘనే సః అబోధో న భవేత్ న సంభవతీత్యర్థః. మిథ్యాతర్కసుకర్క శేరిత మహావాదాంధ కారాంతరే భ్రామ్యన్మందమతేరమందమహిమన్ త్వజ్ఞానవర్త్మాస్ఫుటం, శ్రీమన్మాధవవామన త్రిణయన శ్రీ శంకర శ్రీపతే గోవిందేతి ముదా వదన్ యదుపతే ముక్తః కదాస్యామహమ్. అవిద్యాయామంతరే వర్తమానా ఇతి శ్రుతేరర్థః. స్వయం వయమేవ ధీరాః పండితాః విదితవేదితవ్యాశ్చేతి మన్యమానాః ఆత్మానం సంభావయంతః. తే చ దంద్రమ్యమాణాః ప్రదర్శ్యమానమార్గాః. యథా లోకే అంధాశ్చక్షూ రహితాః గర్తకంటకాదౌ పతంతి తద్వత్. 26

తానే బ్రహ్మమై (జీవుడు) బ్రహ్మమును పొందును. స్వయముగా ధీరులైనను (పండితులైనను) తమకుఈశ్వరత్వము (స్వాతంత్ర్యము) లేదనుకొని భ్రాంతిచెందితమను పండితులమనుకొని (అంతయు తమకు తెలియుననే) అజ్ఞానముతో సంకట పడుచున్నారు. తాము నీచులమనే భావముతో మూఢులై ఒకగ్రుడ్డివానిచే కొనిపోబడు గ్రుడ్డివానివలె (ఈ సంసార చక్రమున) పరిభ్రమించు చున్నారు. రెండవ పదార్థము లేనిది ఒక్క బ్రహ్మమే. జలములందలి చంద్రునివలె ఒక్క పరబ్రహ్మమే పెక్కు విధములుగా గోచరించుచున్నది – అంటూఈమొదలైన శ్రుతులకు వారు చెప్పిన సిద్ధాంతములు విరోధ మైనందువలన అవిగ్రహింపదగినవికావు. వాస్తవముగా పురుషుని యొక్క (పరమాత్మయొక్క) త్రిగుణములపూర్వత్వమునందుఈసర్వము వెంటనంటును. అంతేకానీ అది ఉన్నదనికాదు అనేవిషయమై చెప్పుచు న్నాడు– త్రిగుణములతోనిండినవాడు పురుషుడని అజ్ఞానముతో చేయ బడిన మూడుగుణముల భేదముచేత పురుషుని(పరమాత్మ)లో ఆరోపించిన అజ్ఞానము విజృభించినది. పురుషునియందు వాస్తవముగా అజ్ఞానము ఉన్నదా అంటేలేదని చెప్పుచున్నాడు– ఆ అజ్ఞానము పరమాత్మయందు కాకుండ ఇతరమందున్నది. ఏవిధమైనబంధము లేకపూర్ణజ్ఞానరసమైన అనగా పరిజ్ఞాన ఘనమైన పరమాత్మయందు అజ్ఞానము ఉండదని ఫలితార్థము.

మిథ్యాతర్కసుకర్కశేరితమహావాదాంధకారాంతరే

భ్రామ్యన్మందమతేరమందమహిమన్ త్వజ్ఞ్ఞానవర్త్మాస్ఫుటం ।

శ్రీమన్మాధవవామన త్రిణయన శ్రీశంకర శ్రీపతే గోవిందేతి

ముదా వదన్ యదుపతే ముక్తః కదాస్యామహమ్ ॥ (శ్రీధరీయం)

పరమాత్మ విషయమై నానావిధములైన అనాస్తవములై కఠినములైన వాదముల అంధకారము లోకమున వ్యాపించియుండగా అల్పజ్ఞానము కలవారికి అవి చిత్తభ్రమతో కలచివేయుచున్నవి. ఈవిక్షిప్తస్థితిలో అపార మైన మహిమగలఓపరమాత్మా! నీకు సంబంధించిన జ్ఞానమార్గము అవగతమగుటలేదు. దీనిని సాధించుశక్తి నాకులేదు. కనుక ఓ శ్రీమంతుడా!మాధవా, వామనా, త్రినేత్రా, శ్రీశంకరా, శ్రీపతీ, గోవిందా అని నిరంతరము నీ నామములనే స్మరించుచు ఓ యదునాథా ! ఈ చిత్తభ్రమనుండి ఎప్పుడు ముక్తి పొందగలనో నీవే నిర్ణయించుము. అవిద్యయందు అనగా అజ్ఞాన మందువర్తించే వారని శ్రుతికి అర్థము- మేము స్వయముగా పండితులము. బుద్ధికిపదునుపెట్టినవారము. తెలియవలసినదంతయు తెలిసిన వారని కొందరు తమను తాము గౌరవించుకొందురు. వారు అల్పులకు ఉపదేశించిన మార్గము లోకమున కన్నులులేనివారు గుంతలు, ముండ్లు గుర్తించలేక పడిపోయినట్లు - నిరర్థకమని భావము.

26

శ్లో॥ సదివ మనస్త్రివృత్త్వయి విభాత్య సదామనుజా
త్సదభిమృశంత్యశేషమిదమాత్మతయాత్మవిదః ।
న హి వికృతిం త్యజంతి కనకస్య తదాత్మతయా
స్వకృతమను ప్రవిష్టమిదమాత్మతయా వసితమ్ ॥ 27

టీ:- నను యద్యసన్నోత్పద్యతే. యది చ త్రిగుణమయః పురుషో న సంభవతి తర్హీదం ప్రపంచజాతం పురుషశ్చ పృథక్ నాస్తీత్యుక్తం స్యాత్. కథం తర్హి తయోస్సత్త్వేన ప్రతీతిరత ఆహ - సదితి. మనః మనోమాత్ర విలసితం. ఇదం త్రివృత్ త్రిగుణాత్మకం ప్రపంచజాతం అసదేవ సదివవిభాతి కథమితి చేత్తత్రాహ - త్వయ్యధిష్ఠానే అధిష్ఠానసత్తయా సద్వత్ ప్రతీయత ఇత్యర్థః. న కేవలమిదం వికారాస్పదం కింతు ఆమనుజాన్మనుజః పురుషః అభివిధావాకారః. పురుషమభివ్యాప్యేతి పురుషస్యాపి పృథక్ సత్త్వ ప్రతీతిః మనో మాత్ర విలసితేత్యర్థః. తథా చ శ్రు.“ అసతోధిమనో సృజత మనః ప్రజాపతి మసృజత ప్రజాపతిః ప్రజా అసృజత తద్వా ఇదం మనస్యేవ పరమం ప్రతిష్ఠితం. యదిదం కించే”తి. నన్వాత్మవిదామపి విశ్వం సదేవ స్ఫురతి. అతః కథ మసత్త్వాదత ఆహ - సదభిమృశంతీతి. ఆత్మవిదస్త్వశేషమిదం భోక్తృ భోగ్యాత్మకం విశ్వమాత్మతయైవ సదభిమృశంతి సదితి జానంతి.ఆత్మ కార్యత్వాన్న పృథగిత్యర్థః. తథా హి. యదుపాదానకం హి యత్కార్యం

అసత్తు అయినది పుట్టలేదు. పురుషుడు (పరమాత్మ) త్రిగుణమయుడు కానట్లే ఈ ప్రపంచము పుట్టినది. పురుషుడు వేరుగాలేదు అని చెప్పినట్లయితే ఆ రెండింటికి సత్త్వము (ఉనికి) చేత ప్రతీతి ఎట్లు కలగుచున్నది అనే విషయమును చెప్పుచున్నాడు - ఇది మనస్సుకు మాత్రమే ప్రకాశించును. ఈ విధముగా త్రిగుణములచేత పుట్టిన జగత్తు అసత్యమేకాని సత్తువలె ప్రకాశించుట ఎట్లు అనే విషయమై చెప్పుచున్నాడు-అధిష్ఠానమైన పరమాత్మ సత్త (శక్తి)చేత అసత్తు అయిన జగత్తు సత్తుగా భావింపబడుచున్నది. ఈ జగత్తు కేవలము వికారమునకు ఆస్పదమైనది కాదు. పురుషునితో (పరమాత్మతో) అంతటానిండినది. పురుషునికి వేరుగాఉన్న ప్రతీతి కేవలము మనస్సునకు మాత్రమే తెలియును అని అర్థము - ‘అసతోధిమనో సృజ్యత మనః ప్రజాపతి మసృజత ప్రజాపతిః ప్రజా అసృజత తద్వా ఇదం మనస్యేవ పరమం ప్రతిష్ఠితం. యదిదం కించ’ - అసత్తునుండి అధిష్ఠానమైన మనస్సు పుట్టినది. మనస్సు ప్రజాపతిని పుట్టించినది ప్రజాపతి ప్రజలను సృష్టించినాడు. అందువలన ఇదంతయు మనస్సునందే ప్రతిష్ఠించబడినది-అంటూ శ్రుతులు ఈ విషయమును చెప్పినవి. అయితే ఆత్మవంతులకు కూడా జగత్తు సత్యమైనదిగనే కనబడుచున్నందువలన ఇది అసత్యమైనదని ఎట్లు చెప్పవచ్చును. అనే విషయమై చెప్పుచున్నాడు-ఆత్మవేత్తలు, భోక్తలకు

భవతి తత్తేనైవ రూపేణ ప్రతీయతే ఉపాదీయ తేచేతి లోకాచారేణ దర్శయతి - నహి వికృతిమితి. కనకస్య వికృతిం కుండలాదికం కనకార్థినో న త్యజంతి హి. అత్ర హేతుః - తదాత్మతయా కనకరూపత్వేనేత్యర్థః. ఆతః స్వకృతమిదం విశ్వమను ప్రవిష్టం చ పురుష రూపమాత్మతయైవ అవసితం నిశ్చితం. శ్లో. "యత్సత్త్వయా సదాభాతి జగదేతసత్స్వతః, సదాభాసమసత్యస్మిన్ భగవంతం భజామ తమ్". 27

భోగ్యమైన ఈ సంపూర్ణ జగత్తును ఆత్మత్వము (పరమాత్మత్వము)తోనే సత్తు అని తెలియుచున్నారు. పరమాత్మకు ఈ జగత్తు కార్యమైనందు వల్ల ఇది అతనికంటే భిన్నమైనదికాదు. మూలకారణమునకు కార్యమైనదేదైనను ఆ కారణముచేతనే తెలియదగునని చూపుచున్నాడు -బంగారముయొక్క వికృతులైన హారములు, కుండలములు మొదలైనవి బంగారముఅనే తన వాస్తవమైన అర్థమును విడువవుకదా. దీనికి కారణము చెప్పుచున్నాడు-అది ఆ బంగారపుతనముతోనే బంగారు రూపముతోనే ఉండునని అర్థము. కనుక తానే నిర్మించిన విశ్వమునందు ప్రవేశించిన పురుషరూపము ఆత్మత్వముతోనే ఉండునని నిశ్చయము.

యత్సత్త్వయా సదాభాతి జగదేతసత్స్వతః ।
సదాభాసమసత్యస్మిన్ భగవంతం భజామ తమ్ ॥(శ్రీధరీయము)

పరమాత్మ సత్త-సామర్థ్యము, సత్యత్వము వలననే ఈ జగత్తు సత్యమైనదిగా ప్రకాశించుచున్నది. కానీ సహజముగా ఇది అసత్తు. ఈ అసత్యమైన జగత్తునందు నిత్యము ప్రకాశించునట్టి భగవంతునే ఉపాసింతుము. 27

శ్లో॥ తవ పరి యే చరంత్యఖిలసత్త్వ నికేతతయా
త ఉతపదాక్రమంత్యవిగణయ్యశిరో నిరృతేః ।
పరివయసే పశూనివ గిరా విబుధానపితాం
స్త్వయికృతసౌహృదాఃఖలు పునంతి న యే విముఖాః ॥ 28

టీ :- నను. శ్రు."సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. నేహ నానాస్తి కించన. మృత్యోస్సమృత్యుమాప్నోతి. య ఇహ నానేవ పశ్యతీ" త్యాది శ్రుతిభిరేవంభూతస్య భగవతః ప్రతిపాదనాత్ తత్ జ్ఞానం సుకరమేవేతి కుతః భక్త్యా అత ఆహ- తవేతి. తవేతి కర్మణి షష్ఠీ. త్వాం యే పరిచరంతి. ఛందసి వ్యవహితాశ్చేతి యచ్ఛబ్దేన వ్యవధానమదోషః. కేన రూపేణ అఖిలసత్త్వనికేతతయా అఖిలాని సత్త్వాని నికేతః యస్య తథా తస్య భావ స్తత్తా తయా సర్వభూతావాసతయేత్యర్థః. ఉత అత ఏవ అవిగణయ్య తిరస్కృత్య త ఏవ నిరృతేః మృత్యోః శిరః మూర్ధానం పదా పాదేన ఆక్రమంతి ఆక్రామంతి మృత్యోర్మూర్ధ్ని పదం దధతి తే తరంతి ముచ్యంత ఇత్యర్థః. యే పునః విముఖాః అభక్తాస్తాన్ గిరా వాచా పశూనివ విబుధాన్ విదుషోఽపి పరివయసే బధ్నాసి కుతః త్వయి కృతసౌహృదాః త్వయి కృతం సౌహృదం ప్రేమ యైస్తే.ఖలు నిశ్చితం పునంతి పవిత్రయంతి. ఆత్మానం అన్యానపీతి శేషః. నేతరే తథాచ. శ్రు. "తస్య వా క్తింతిర్నామాని దామాని తస్యేదం వాచా

'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. నేహ నానాస్తి కించన. మృత్యోస్స మృత్యుమాప్నోతి. య ఇహ నానేవ పశ్యతి'-బ్రహ్మస్వరూపము సత్యము, జ్ఞానము అనంతమైనది. ఇక్కడ (ఈలోకమున) ఏ కొంచెము కూడా అనేకములైనదిలేదు. అతడు మృత్యువుకే మృత్యువును కలిగించును. పరమాత్మనే ఈ లోకమున పలువిధములవలె కనపడును -మొదలైన శ్రుతులు ఈ విధమైన భగవంతునినే ప్రతిపాదించినవి. అటువంటి పరమాత్మ జ్ఞానము భక్తివలననే సులభమగునని చెప్పుచున్నాడు-సమస్త జీవరాశియందు నీ శక్తితో వసించుచున్నది నీవే అనే భావనతో నీకు సేవలుచేయు భక్తులు మృత్యువును తిరస్కరించి దాని తలపై పాదముతో త్రొక్కి ఆక్రమించుచున్నారు. (మృత్యువును జయించినారని భావము). అట్టివారు సంసారమును తరించుచున్నారు. అనగా వారి ప్రాపంచిక వ్యామోహములు తొలగిపోవునని అర్థము. నీపట్ల భక్తిలేనివారు అనగా నీ భక్తులు కానివారు పండితులైనను వారిని మాటలునేర్చిన పశువులవలె తిరస్కరించి నీవు కట్టివేయుచున్నావు. ఎందుకంటే నీయందు ప్రీతిగలవారే తమను, లోకములను పవిత్రము చేయగలరు. అంతేగాని అభక్తులు కాదు. 'తస్యవా క్తింతి ర్నామాని దామాని తస్యేదం వాచా తంత్యానామభిర్దామభిస్సర్వం సితం' – పరమాత్మవాక్కు (వేదము) – గోవు, అతని నామములు-వాటినికట్టు పలుపుత్రాళ్ళు. ఈ సర్వ జగత్తు అతనిదే ఇదంతయు ఆ వాక్కులు, గోవులు, నామములు,

తంత్యానామభిర్ధామభిస్సర్వం సిత" మితి. అయమభిప్రాయః - సత్యమేవంభూతమాత్మానం శ్రుతయః ప్రతిపాదయంతి. అత్రచ యద్యపి వస్తునః అపరోక్షత్వాత్ అపరోక్ష మేవ జ్ఞానముత్పద్యతే. తథాప్య సంభావనావిపరీతభావనా తిరస్కృతత్వాన్మలినచిత్తేషు పరోక్షమివ భవతీతి నాపరోక్షం సంసారభ్రమ నివృత్తి సమర్థం భగవత్పరిచర్యయా తు సమ్యగమలచిత్తానాం తత్ప్రసాదేన లబ్ధా పరోక్షజ్ఞానానామయత్నత ఏవ కరకలితామలకవత్ మోక్ష ఇతి తథా చ. శ్రు."దేహాంతే దేవః పరం బ్రహ్మ తారకం వ్యాచష్టే యమేవైష వృణుతే తేన లభ్యః యస్య దేవే పరాభక్తిరి" త్యాదయః. శ్లో. "తపంతుతాపైః ప్రపతంతు పర్వతాదటంతు తీర్థాని పఠంతు చాగమాన్, యజంతు యాగైర్వి నయంతు యోగైర్హరిం వినా నైవ మృతిం తరంతి". 28

బంధములచేత సర్వము స్వచ్ఛమైనది-అని శ్రుతి ఈ విషయమునే చెప్పుచున్నది. దీని అభిప్రాయము ఇది-ఈ విధమైన సత్యరూపుడైన పరమాత్మను వేదములు ప్రతిపాదించినవి. ఇక్కడకూడా ఎట్లయినను వస్తువుయొక్క అపరోక్షత వలననే దానికి సంబంధించిన అపరోక్ష (ప్రత్యక్ష) జ్ఞానము కలుగును. అయినప్పటికి అసంభావన, (భావనలేకపోవుట) విపరీతభావనచేత (వ్యతిరేకదృష్టి) తిరస్కరింప బడినందువలన మలిన చిత్తముగలవారికి పరమాత్మ పరోక్షమైన దాని వలననే (కనబడని-తెలియని దానివలనే) ఉండును కాని అపరోక్షము (ప్రత్యక్షము) కాదు. అట్టివారు పరమాత్మను తెలియలేరని భావము. సంసారవ్యామోహమును పోగొట్టగల సామర్థ్యము కలిగిన పరమాత్మ సేవచేతనే చక్కగా మలినములు తొలగిన మనస్సు కలవారికి పరమాత్మ అనుగ్రహముచేత అపరోక్షజ్ఞానము అప్రయత్నముగనే సిద్ధించి, మోక్షము కరతాలమలకమగును. 'దేహాంతే దేవఃపరం బ్రహ్మతారకం వ్యాచష్టే యమేవైష వృణుతే తేన లభ్యః యస్య దేవే పరా బుద్ధిః' దేహాంతమున (మరణించిన పిమ్మట - ఉపాధిని వదిలిన తరువాత) పరమాత్ముడు తరించునట్టి సర్వోత్కృష్ట జ్ఞానమును చెప్పెను. పరమాత్మను ఎవరు కోరుదురో వారికే లభించును. పరమాత్మయందు సర్వోత్కృష్టమైన భక్తిగలవారికే మొదలైన శ్రుతులు ఈ విషయమును స్థాపించుచున్నవి.

తపంతు తాపైః ప్రపతంతు పర్వతా
దటంతు తీర్థాని పఠంతు చాగమాన్ ।
యజంతు యాగైర్వినయంతు యోగై
ర్హరిం వినానైవ మృతిం తరంతి ॥ (శ్రీధరీయము)

వివిధములైన తపస్సులు చేసినను పర్వతములనుండి పడినను (హఠయోగాదుల వలన శరీరమునకుబాధకలిగించుకొన్నను),తీర్థ యాత్రలను సందర్శించినను, వేదములుచదివినను, యోగదీక్షలో మునిగినను వాస్తవముగా వీనికి డాంభికత్వమే హేతువగును. కనుక అకలంకమైన హరిభక్తి లేకుండా సంసారసాగరతరణము అసాధ్యము. (28)

శ్లో॥ త్వమకరణ స్వరాడఖిలకారకశక్తి ధరస్తవ
బలిముద్వహంతి సమదంత్యజయా నిమిషాః ।
వర్షభుజోఽఖిలక్షితిపతేరివ విశ్వసృజో
విదధతి యత్ర యే త్వధికృతా భవతశ్చకితాః ॥ 29

టీ:- నను యద్యఖిలసత్త్వనికేతత్వేన భగవతస్సేవ్యత్వముచ్యతే. తర్హి తత్తత్కరణ సంబంధాత్. కర్తృత్వ భోక్తృత్వే ప్రసజ్యేయాతాం న వస్తుత స్తథాత్వమితి చేత్తర్హి జీవానామపి తత్తుల్యమితి. కేన విశేషేణ పునస్సేవ్య

సమస్తజీవుల శరీరములందు పరమాత్మ ఉన్నాడన్న కారణము చేత భగవంతుని సేవించవలెనని చెప్పినచో ఆయా కారణముల సంబంధముతో కర్మలుచేయుట, వాని ఫలములను అనుభవించుటలందు కట్టుబడుచున్నారు. కానీ వాస్తవముగా వారికి అట్టి కట్టుబాటులేనిచో జీవులకును పరమాత్మ తుల్యత కలుగును. అప్పుడు మరి ఏ విశేషముతో పరమాత్మ సేవ్యుడు-జీవులు సేవకులు. అనగా సేవ్య-సేవకత్వభావము కలుగుననే శంకను తొలగించుచున్నాడు- 'న తస్య కార్యం కరణం చ విద్యతే నతత్స మశ్చాభ్యధికశ్చ దృశ్యతే,



సేవకత్వ మితీమామాశంకాం పరిహరంత్యః. శ్రు. "న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే, పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ. అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షుస్స శృణోత్యకర్ణః, స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాంత" మిత్యాద్యాః శ్రుతయః స్తువంతీత్యాహ - త్వమితి. కరణ సంబంధ రహిత ఏవ అఖిలకారక శక్తి ధరః అఖిలానాం ప్రాణినాం యాని కారకాణి ఇంద్రియాణి తేషాం శక్తీర్ధారయతి. ప్రవర్తయతీతి తథా. కుతః స్వరాద్యతః స్వేనైవ రాజసే దీవ్యసే. న హి స్వతస్సిద్ధజ్ఞాన శక్తేరింద్రియా పేక్షేత్యర్థః.అత స్తవ బలిముద్వహంతి పూజాం కుర్వంతి. అజయా అవిద్యయా సహితాస్తయా వృతా ఇత్యర్థః. అనిమిషా దేవాః ఇంద్రాదయః తత్పూజ్యాః విశ్వసృజః బ్రహ్మాదయోఽపి యథా సస్త్రీకా ఏవ కింకరాః స్వామినం సేవంతే తథా అవిద్యాయుక్తా దేవాదయస్త్వామితి లోకోక్తిః. సమదంతి చ మనుష్యైర్దత్తం హవ్యకవ్యాది లక్షణం బలిం భక్షయంతి చ. అత్ర దృష్టాంతః. వర్షభుజోఽఖిలక్షితిప తేరివేతి. యథా వర్ష భుజః ఖండమండలపతయః అఖిలక్షితిపతేర్మహామండలేశ్వరస్య స్వప్రజాదత్త బలిభుజః బలిముద్వహంతి తద్వదితి. కథం బలిం వహంతి తదాహ - విదధతి యత్ర యే త్వధికృతా భవతశ్చకితా ఇతి. త్వత్తో భీతాస్సంతః యస్మిన్ కర్మణి యే నియుక్తాస్తే తత్తత్కుర్వంతీతి. త్వదాజ్ఞాపరిపాలనమేవ పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ. అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్య చక్షుస్స శృణోత్యకర్ణః, స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాంతం'- పరమాత్మకు కార్యము కారణము రెండులేవు. అతనితో సమానుడుగానీ అధికుడుగానీ లేడు. స్వభాసిద్ధముగా జ్ఞానము, బలము, క్రియాపర్వతముగల ఆయన సర్వోత్కృష్టమైన శక్తి పెక్కు విధములుగా తెలియుచున్నది. ఆయనకు కాళ్ళు, చేతులు లేకపోయినను ఆయన మిక్కిలి వేగవంతుడు. కన్నులు లేకున్నను అన్నింటిను చూడగలడు. చెవులు లేకున్నను అన్నింటిని వినగలడు. అతనికి సర్వము తెలియును కానీ ఆయనను తెలియగలవాడు లేడు. సమస్తమునకంటే ముందున్న వాడని - ఆ మహా పురుషుని ఈ విధముగా వేదములు స్తుతించినవని చెప్పుచున్నాడు-నీకు ఏ విధమైన కరణములు (ఉపకరణములు-సాధనములు-ఇంద్రియములు) లేవు. అయినప్పటికి సమస్త ప్రాణులకు కార్యనిర్వహణమునకు అవసరమైన కారణములు అనగా ఇంద్రియములు వాని శక్తులను నీవే ధరించినావు. అనగా ప్రవర్తింపజేయు చున్నావు. ఎందుమనగా నీకైనీవే స్వయముగా ప్రకాశించగలవు. నీకు స్వతస్సిద్ధముగనే జ్ఞానశక్తి ఉన్నందువలన నీకు ఇంద్రియముల ఆవశ్యకతలేదు. అందుకనే అందరూ నిన్ను పూజించుచున్నారు. అందువలన ఇంద్రాది దేవతలు, జగత్తును

బలివహనమిత్యర్థః. తథా చ. శ్రు. "భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః. భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమ" ఇతి. శ్లో."అనింద్రియోఽపి యో దేవస్సర్వకారకశక్తిధృత్, సర్వజ్ఞస్సర్వకర్తా చ సర్వసేవ్యం నమామి తమ్. 29

సృష్టించిన బ్రహ్మాదులు భార్యలతోగూడి తాము అవిద్య-అజ్ఞానముచేత ఆవరింపబడినందు వలన సేవకులై యజమానుని సేవించినట్లు నిన్ను సేవించుచున్నారు. మానవులు సమర్పించిన హవ్యకవ్యరూపమైన బలిని భక్షించుచున్నారు-తమ ప్రజలు సమర్పించిన పన్నుల రూపమైన సంపదలో కొంత తాము అనుభవించుచు మండలాధికారులు, మిగిలిన పెద్ద మొత్తమును రాజుకు సమర్పించినట్లు దేవతలు నీకు పూజలుచేసి నివేదనలను సమర్పించుచున్నారు. ఈ నివేదనమును ఏ విధముగా ధరించుచున్నాడో చెప్పుచున్నాడు-నీవు అధికృతుడవైన ప్రతిది నీవు చేసిన నియమమును ఆచరించుచున్నది. నీ వలన భీతిచెంది-నీవు వేనిని ఏపని చేయుటకై నియోగించితివో అవి ఆయా పనులను సక్రమముగా చేయుచున్నవి. నీ ఆజ్ఞను పాలించుటయే నివేదనము అని అర్థము. 'భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః. భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమః' - పరమాత్మ భయము వలన గాలి వీచుచున్నది. సూర్యుడు ఉదయించుచున్నాడు. అగ్ని, ఇంద్రుడు వారి వారి కర్తవ్యములను నెరవేర్చుచున్నారు. ఐదవది అయిన మృత్యువు పారిపోవుచున్నది అని శ్రుతి.

అనింద్రియోఽపి యో దేవస్సర్వకారకశక్తిధృత్ ।
సర్వజ్ఞస్సర్వకర్తా చ సర్వసేవ్యం నమామి తమ్ ॥(శ్రీధరీయము)

ఏ విధమైన కరణముల ఆవశ్యకతలేకున్నను పరమాత్మ సర్వకార్యములు నెరవేర్చగలవాడు. సర్వజ్ఞుడు, సర్వమునకు కర్త సర్వుల సేవలు పొందదగినవాడు అట్టి భగవంతునికి నమస్కారము. 29



శ్లో॥ స్థిరజరజాతయస్స్యురజయోత్థ నిమిత్తయుజో
విహార ఉదీక్షయాయదిపరస్య విముక్తతతః ।
న హి పరమస్య కశ్చిదపరో న పరశ్చ భవే
ద్వియత ఇవాపదస్య తవ శూన్యతులాం దధతః ॥ 30

టీ:- తదేవం కరణప్రవర్తకమీశ్వరం కరణ పరతంత్రా నరా భజంతీ త్యుక్తం. న కేవల మియదేవ కారణం తత ఉత్పన్నత్వేనాపి తత్పర తంత్రత్వాదితి వదంతి. శ్రు. "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి ఏవ మేవాస్మాదాత్మన స్సర్వే ప్రాణాస్సర్వే లోకాస్సర్వే దేవాస్సర్వాణి భూతాని సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరంతీ" త్యాదిశ్రుతయ ఇత్యాహ - స్థిరేతి. హే విముక్త నిత్యముక్త. యది తవ అజయా మాయయా విహారః విహారః క్రీడా భవతి, తదా స్థిరచరజాతయః స్థిరాశ్చ చరాశ్చ జాతయః జాత్యాలింగితా దేహా యేషాం తే జీవాస్స్యుః భవేయుః. కథం భూతస్య తతః అజాతః పరస్యదూరే వర్తమానస్య అసంగస్యేత్యర్థః. తర్హి కథం విహారః ఉదీక్షయా ఈక్షణవశేన. నను మలినానాం జీవానాం కథం జన్మ స్యాత్తత్రాహ - ఉత్థనిమిత్తయుజ ఇతి. ఈహయైవ ఉత్థాని ఉత్థితాని ఆవిర్భూతాని నిమిత్తాని కర్మాణి తద్యుక్తాని లింగశరీరాణి వా తైర్యుజ్యంత ఇతి తే తథా. నను కిం నిమిత్తోత్థానేన మదిచ్ఛయైవ భవంతు న త్వయి వైషమ్యాభావాత్ విషమసృష్టేరయోగాదిత్యాహ - న హి.

ఈ విధముగా ఇంద్రియములను (కరణములను) ప్రవర్తింపజేయు పరమేశ్వరుని ఇంద్రియశక్తులపై ఆధారపడిన మానవులు భజించుచున్నారు. ఇంతమాత్రమే సేవించుటకు కారణముకాదు- పరమాత్ముడే జీవుల పుట్టుకకు కారణమైనందువలన కూడా వారు పరమాత్మ పరతంత్రులు (సేవకులు, స్వాతంత్ర్యము లేనివారు) అని చెప్పుచున్నారు. 'యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి ఏవ మేవాస్మాదాత్మన స్సర్వే ప్రాణాస్సర్వే లోకాస్సర్వే దేవాస్సర్వాణి భూతాని సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరంతి'- అగ్నినుండి చిన్న మిడుగురులు ఎగిరిపడునట్లుగా అట్లే సర్వప్రాణములు, సర్వలోకములు, సర్వదేవతలు, సర్వభూతములు పరమాత్మనుండి పైకి ఎగిరిపడినవే అని శ్రుతులు చెప్పినవని చెప్పుచున్నాడు- నిత్య యుక్తుడవైన ఓ పరమాత్మా ! నీవు మాయతో క్రీడించినప్పుడు స్థావరజంగమ లక్షణములుగల జీవులు కలుగుచున్నవి. పుట్టుకలేని నీవు వీనికంటే వేరై దూరముగా ఏ విధమైన సంబంధము లేనివాడవని అర్థము. అయితే ఇంత నిష్క్రియత్వము గలనీకు క్రీడ ఎందుకు కలిగినదనేదానికి ఈక్షణముచేత అనగా సంకల్పముచేత కలిగినదని అర్థము. అయితే శుద్ధమైన పరమాత్మనుండి మలినములైన జీవులు ఎలా జన్మించినవనే విషయమును చెప్పుచున్నాడు-సృష్టిచేయవలెనను సంకల్పముచేతనే కర్మలు కలిగి, వానితో కూడిన లింగశరీరములు

పరమస్యేతి. పరమస్య పరమకారుణికస్య వియత ఇవ ఆకాశసదృశస్య సమస్యేత్యర్థః. కశ్చిదపరః స్వీయః పరః అస్వీయశ్చ న భవేత్ న సంభవతీత్యర్థః. శ్రు. "ఆసద్వా ఇదమగ్ర ఆసీత్. తతో వై సదజాయత." ఇత్యాది శ్రుత్యా శూన్యపూర్వకత్వమివ ప్రతీయతే తదర్థం పునర్విశినష్టి – శూన్యతులాం దధతః శూన్యసామ్యం భజతః తదేవ దర్శయితుం పునర్విశినష్టి – అవదస్యేతి.న వద్యత ఇత్యవదః తస్య వాఙ్మనసయోరగోచరస్యేత్యర్థః. శ్లో."త్వదీక్షణవశక్షోభమాయాబోధిత కర్మభిః, జాతాన్ సంసరతః ఖిన్నాన్ నృహరే పాహి నః పితః. 30

ఏర్పడి నీకు వానితో కూడిక కలిగినది. ఏ కారణముచేత ఏది పుట్టినను అదిఅది నా ఇచ్ఛతోనే కలుగుచున్నది. అంతేకాని నీయందు ద్వేషభావము లేనందువల్ల విషమసృష్టి కలుగుటకు వీలులేదని చెప్పుచున్నాడు–అపారమైన దయగల పరమాత్మ అనంతమైన ఆకాశమువలె అన్నింటికి సమానుడు (ఆకాశము సూర్యుని, నక్షత్రాలను, దుమ్ము, ధూళి, పొగ అనేవాటిని సమానముగ తనలో ఇముడ్చుకొనును) అట్లే పరమాత్మకు వీడు నావాడు వీడు పరవాడు అనే భేదభావము లేదు. 'అసద్వా ఇదమగ్ర ఆసీత్. తతో వై సదజాయత'–ఇది ఇట్టిదని తెలియని (అసత్) పరమాత్మయే ఈ సృష్టికి ముందుండినది. దీనివల్లనే ఈ జగత్తు (సత్తు) పుట్టినది. మొదలైన శ్రుతులవల్ల పరమాత్మ శూన్య, సామ్యముగలదని సృష్టికలదని, సృష్టి శూన్యసామ్యత ముందుగా కలదని భావింపబడునని చెప్పి మరలా దానిని విశ్లేషించుచున్నాడు–నీవు అసదుడవు. అనగా వాక్కులకు, మనస్సుకు అందనివాడవని అర్థము.

త్వదీక్షణవశక్షోభమాయాబోధిత కర్మభిః ।
జాతాన్సంసరతః ఖిన్నాన్నృహరే పాహి నః ॥(శ్రీధరీయము)

నీసంకల్పమనే ఈ క్షణశక్తికి వశమైన మాయచేత నియంత్రింపబడిన కర్మలచేత పుట్టిన జీవులు సంసారమును తరించలేక సంకటపడుచున్నారు. ఓ నరహరీ ! అట్టి దీనులమైన మమ్ము దయతో కాపాడుము. 30

శ్లో॥ అపరిమితాధ్రువాస్తనుభృతో యది సర్వగతా
స్తర్హి న శాస్యతేతి నియమో ధ్రువనేతరథా ।
అజని చ యన్మయం తదవిముచ్య నియంతృభవే
త్సమ మనుజానతాం యదమతం మదదుష్టతయా ॥ 31

టీ:- ఏవం తావత్ పరమాత్మనస్సకాశాదవిద్యాకృతకార్యోపాధయ స్తదంశా ఏవ జీవా జాతాస్సంసరంతో భవంతీత్యుక్తం. తత్ర యద్యేకా అవిద్యా తదా సర్వజీవస్యాప్యేకత్వాదేకముక్తౌ సర్వముక్తి ప్రసంగః అథ నానా అవిద్యాస్తర్హి తస్యైవాంశాంతరేణ సంసారానపగమాదవిర్మోక్ష ఇత్యాదివితర్కబలేన. వస్తుత ఏవ జీవాజాత్యా నానాత్మానః తత్ర చ తేషామణుత్వే దేహవ్యాప్తిచైతన్యం న స్యాత్ దేహపరిమాణత్వే చ మధ్యమ పరిమాణానాం సావయవత్వేనా నిత్యత్వంస్యాత్. అతస్సర్వగతా నిత్యాశ్చేతి కేచన మన్యంతే. తత్ర న తావదుక్త దోషప్రసంగః. అవిద్యాభేదేన తచ్ఛక్తి భేదేన వాలబ్ధముక్తవ్యవస్థాసంభవాత్. ఈశ్వరస్య తు న కేనాప్యం శేన సంసారశంకేత్యుక్తమేవ ప్రసిద్ధం చాత్మైక్యం సర్వశ్రుతిషు. కించ. ఇమం పక్షం అంతర్యామి బ్రాహ్మణమపి న సహత ఇత్యాహ - అపరిమితా ఇతి. వస్తుత ఏవానంతాః ధ్రువాస్తేనైవ రూపేణ నిత్యాః సర్వగతాశ్చ తనుభృతో జీవా యది స్యుః, తర్హి తేషాం సమత్వాత్ శాస్యతా న ఘటత ఇతి కృత్వా హే ధ్రువ నియమః నియమనం

ఈ విధముగా అంతటి పరమాత్మ సామీప్యము వలన అవిద్య చేత చేఉబడిన కార్యరూపమైన ఉపాధులలో ఆ పరమాత్మ అంశలైన జీవులు జన్మించి ఈ సంసారమున సంచరించుచున్నారని చెప్పబడినది. ఒకే అవిద్య (అజ్ఞానము) సర్వజీవులందున్నందువలన జీవులకు ఏకత్మము ఉండుట వలన ఒకడు ముక్తిని పొందినచో జీవులందరికి ముక్తి కలుగుననే ప్రసక్తి వచ్చును. అవిద్యలు అనేకములుండుటచేత దానియొక్క వేరే అంశతో సంసారవ్యామోహమును తొలగించుకొనలేక పోయినందు వలన ముక్తి కలుగదుకదా అనే వితర్కబలముచేతనే ఏకముక్తి ప్రసంగము కలిగినది. వాస్తవముగా జీవులు అనేక ఆత్మలు కలవి. అందులో వానికి అణుత్వమునందు దేహమంతటా వ్యాపించిన చైతన్యముండదు. దేహపరిమాణమునందు మధ్యమ పరిమాణముగల వానికి సావయవత్వముచేత నిత్యత్వము కలుగదు. అందువలన సర్వగతములు, నిత్యములను కొందరు భావింతురు. అట్లయినచో ముందు చెప్పిన దోషమున్నది. అనగా ఒకరికి ముక్తి కలిగినచో అందరు ముక్తులే అగుదురన్న దోషమునకు అవకాశమే ఉండదు. అవిద్య యందలి భేదముచేతగాని, దానిశక్తి (తీవ్రత)యందలి భేదముచేతగాని బద్ధుడు -ముక్తుడు అనే వ్యవస్థ కలుగదు. ఈశ్వరునికి మాత్రము ఏ అంశచేతకూడా సంసారశంక కలుగదు అనే విషయమును సర్వశ్రుతులు ప్రసిద్ధముగా చెప్పినవి. ఈ విషయమున అంతర్యామి రూపమున ఉన్న పరమాత్మకును వర్తించును అనగా పరమాత్మకు ఏ

త్వయా న స్యాత్ ఇతరథా తు ఘటేత. కథం యన్మయం ఉపాధితో యద్వికారప్రాయం యత్ జీవాఖ్యం అజని జాతం తత్తస్య స్వవికారస్య నియంతృ నియామకం భవేత్. అవిముచ్య కారణతయా అపరిత్యజ్య కింతత్ సమమనుస్యూతం. నను కిం యత్తచ్ఛబ్దైః జ్ఞాయతే చేదుచ్యతాం ఇదం తదిత్యత ఆహ – అనుజానతాం యదమతమితి జానీమ ఇతి వదతాం యదమత మవిజ్ఞాతప్రాయం అవిషయత్వాత్. తథా చ. శ్రు. "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సఃఅవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతాం అవచనేనైవ ప్రోవాచ స హి తూష్ణీం బభూవే" త్యాది కించ మతస్య జ్ఞాతస్య దుష్టతయా దోషశ్రవణాత్. తథాచ. శ్రు. "యది మన్యసే నువేదేతి దభ్రమేవాపి నూనం. త్వం వేత్థ బ్రహ్మణో రూపం యదస్య త్వం యదస్య వేదేష్వి త్యాది తస్మాద్య త్తచ్ఛబ్దాబోధ్యమతర్క్యం కిమపి సర్వానుస్యూతత్వేన సమం నియంతృ భవేదిత్యర్థః." శ్లో. "అంతర్యంతా సర్వలోకస్య గీతశ్రుత్యా యుక్త్యా చైవమేవా వసేయః, యస్సర్వజ్ఞస్సర్వశక్తిం నృసింహం శ్రీమంతం తం చేతసైవావలంబే. 31

విధమైన బంధములేదని భావము అని చెప్పుచున్నాడు–వాస్తవముగా జీవులు అనంతములు, రూపముచేత నిత్యమైనవి, అంతటా వ్యాపించినవి, శరీరములను ధరించినవి అయినట్లయితే వానికి సమానత్వము వలన శాసింపబడుట ఘటించదుకదా అని భావించి ఓ కఠినమైన నియమము కలవాడా! వీనిని శాసించుట నీచేతకానిచో వేరేదానివలన ఘటించును. ఉపాధితో వికారమును పొందిన (రూపమును ధరించిన) జీవుడుగా పుట్టినవానికి అనగా తాను కారణమైన పరమాత్మ తానెట్లు నియామకుడు కాగలడు. కారణమును విడువకుండనే అనగా పరమాత్మను విడువకుండ అతనితో సమానముగా జీవుడెట్లున్నాడు. ఒకవేళ యత్తత్ (ఏదైతేఅది) శబ్దములచేత తెలియగలదు అన్నట్లయితే ఇదే అది (జీవుడే దేవుడు) అని చెప్పుచున్నాడు–తెలిసినది అనుకునేవానికి అది (పరమాత్మ తత్త్వము) అను విషయమైనందువలన తెలియని దానివలె ఉండును. 'యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః. అవిజ్ఞాతం విజ్ఞాతమవిజానతాం అవచనేనైవ ప్రోవాచ స హి తూష్ణీం బభూవ'– జీవునికి తెలియనిది పరమాత్మకు తెలియును. పరమాత్మ తత్త్వము మాత్రము ఎవరికి తెలియదు. నాకు తెలియునని దంభములు పలుకు వారికి ఏమియూ తెలియదు. తెలియదనేవారికే అది తెలియగలదు. మాటలు లేకుండనే అది అన్ని విషయములు చెప్పి అనగా మౌనముగా ఉదాసీనముగా ఉన్నది కదా అంటూ ఈ విషయమును వేదములు

చెప్పినవి. తెలిసినది అనే విషయము దుష్టమైనందువలన అది సరికాదు అనిభావము. యదిమన్యసే న వేదేతి దభ్రమేవాపినూనం. త్వం వేత్థ బ్రహ్మణో రూపం యదస్య త్వం యదస్య వేదేషు'- నాకు తెలియదు అని భావించుటకూడా వంచనయే. నీకు పరమాత్మ స్వరూపము తెలియును దానికి చెందిన వాడవే నీవు. దానికి చెందిన విషయమే వేదములందును ఉన్నది-అని వేదము చెప్పినది. అందువలన పరమాత్మతత్త్వము యత్తచ్ఛబ్దముల (ఏదైతేఅది) చేత తెలియరానిది. విచారించుటకు వీలులేనిది. అయితే అది (పరమాత్మ) తెలియరానిదైనను ఈ సమస్తమునందు ఎడతెగక కూర్పబడినందువలన అంతటిని సమానముగా శాసించుచున్నదని అర్థము.

అంతర్యంతా సర్వలోకస్య గీత
శ్రుత్యా యుక్త్యాచైవమేవావసేయః ।
యస్సర్వజ్ఞస్సర్వ నృసింహం
శ్రీమంతం తం చేతసైవాలలంబే ॥

సర్వలోకమంతటా వ్యాపించి దానిని నియమించువాడవని గానము చేయబడినది. వేదములు, యుక్తులు (శాస్త్రీయమై యథార్థ జ్ఞానమును కలిగించు ఉపపత్తులు) మొదలైనవి కూడా ఈ అంశమునే చిట్టచివరి సత్యమని నిర్ధారిమచినవి. సర్వజ్ఞుడై, సర్వశక్తులు కలిగి సర్వసంపదలతో (ఐశ్వర్యముతో) కూడిన నరసింహస్వామిని నామనస్సులో ఆశ్రయింతును. 31

శ్లో॥ న ఘటత ఉద్భవః ప్రకృతిపురుషయో రజయో
రుభయయుజా భవంత్యసుభృతో జలబుద్బుదవత్ ।
త్వయి త ఇమే తతో వివిధనామగుణైః పరమే
సరిత ఇవార్ణవే మధుని లిల్యురశేషరసాః ॥ 32

టీ:- నను చ యది పరమాత్మనో జీవా జాయంత ఇతి. నియంతృ నియమ్యభావ ఉచ్యతే. తథా సతి జీవానామనిత్యత్వప్రసంగేన ప్రతిదినం కృతనాశా కృతాభ్యాగమ ప్రసంగస్స్యాత్. కించ.తదా మోక్షో నామ జీవస్య స్వరూపహానిరేవ స్యాత్. నచైతద్యుక్తం. స్వప్రకాశానందాత్మనః అవిద్యా కృతానర్థ నివృత్తిమాత్రస్య మోక్షత్వాద్యభ్యుపగమాదిత్యా శంక్యోపాధిజన్మనైవ జన్మ జీవానాముచ్యతే న స్వతః అఘటనాదిత్యాహ - నఘటత ఇతి. తత్ర కిం ప్రకృతేర్జీవరూపేణోద్భవస్స్యాత్. పురుషస్య వా. ఉభయోర్వా. ఆద్యే జీవానాం జడత్వాపత్తిః. ద్వితీయే పురుషస్య వికారిత్వ ప్రసంగః. అత ఏవ న తృతీయ ఇత్యాశయేనోక్తం. ప్రకృతి పురుషయోరుద్భవో న ఘటత ఇతి శ్రుత్యా అజత్వప్రతిపాదనాదపీత్యాహ - అజయోరితి. తథాచ. శ్రు. " అజామేకాం లోహితశుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ సరూపాం. అజో హ్యేకోజుమాణోఽను శేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్య" ఇతి. ఉభయయుజా తు భవంతి ఉభయంచతత్ యుజ్యత ఇతి ఉభయయుక్ సంబంధః

పరమాత్మవలన జీవులు పుట్టినట్లయినచో ఆయన నియంత, (నియామకుడు) జగత్తు ఆయన శాసనమునకు లోబడునది. (నియమ్యము) అని చెప్పబడినది. అట్లయితే జీవులు అశాశ్వతమైనవి (అనిత్యములు) అనే ప్రసంగము వలన ఎప్పుడు సృష్టించిన జీవులు అప్పుడే చనిపోవుట జరుగును. అప్పుడు మోక్షమనగా జీవునికి మరణమే. అనగా ఉపాధినాశమే అగును అనే విషయమును చెప్పలేదు. స్వప్రకాశముతో ఆనందాత్ముడైన వానికి అవిద్య వలన కలిగిన అనర్థము నివారింపబడినపుడే మోక్షము మున్నగున్నవి కలుగునని అనుమానించి ఉపాధితో జన్మించినపుడే జీవులకు జన్మ అని చెప్పబడినది. అంతేగాని స్వయముగా ఘటింపక పోవుటవల్ల కాదని చెప్పుచున్నాడు-ఏ ప్రకృతి జీవరూపముగా ఉద్భవించుచున్నది? లేక పురుషునికే (పరమాత్మకే) పుట్టుక కలుగుచున్నదా? లేక పురుష ప్రకృతులు రెండూ జన్మను పొందినవా? మొదటి విషయమున-ప్రకృతి జీవుడగుటలో జడత్వము జీవులకు కలిగినది. రెండవదానిలో పరమాత్మయే జీవుడైనాడనుటలో -పురుషునికి వికారత్వమున్నదనే ప్రస్తావము కలుగును. అందువలన మూడవది లేదుకదా అనే అభిప్రాయముతో చెప్పుచున్నాడు. ప్రకృతి, పురుషులిద్దరికి పుట్టుక కలుగదని శ్రుతి. వానికి పుట్టుకలేదని ప్రతిపాదించినందువలన అని చెప్పుచున్నాడు- అజామేకాం లోహితశుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ సరూపాం. అజోహేక్యో

పరస్పరాధ్యస్తమితి యావత్. తేన అసుభృతః ప్రాణాద్యుపాధయో జీవా జాయంత ఇత్యర్థః. తత్ర చ ప్రకృతి పారతంత్ర్యా పారతంత్ర్యాభ్యాం తాభ్యాం. జీవేశ్వరవిభాగః జలబుద్బుదవదితి యథా కేవలేనానిలేన జలేన వా జలబుద్బుదాని న భవంతి. కింతు మిళితాభ్యాం తాభ్యాం తద్వత్. తత్ర చ యథానిలో నిమిత్తం జలముపాదానం బుద్బుదానాం. ఏవమత్రాపి ప్రకృతిః నిమిత్తం పురుషః ఉపాదానం. శ్రు. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి. యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరం త్యేవ మేవాస్మాదాత్మవస్సర్వే. ప్రాణాస్సర్వే లోకాస్సర్వే దేవాస్సర్వాణి భూతాని సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరంతీ" త్యాది శ్రుతిషు చేతనాచేతనా ప్రపంచస్య పరమాత్మో పాదానకత్వశ్రవణాత్. న చ వికారిత్వం పరిణామానంగీకారాత్. కేచిత్పునః పరిణామమంగీకృత్యా త్మనో వికారభియా విపరీతం నిమిత్తోపాదానభావమిచ్ఛంతి సర్వథా తావత్ప్రకృతిపురుషైక్యాత్ భవంతీతి సిద్ధం. తథైవం. శ్రు. "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ అజామేకాం. అవినాశీ వా అరేఽయమాత్మే" త్యాది శ్రుతిబలాత్ అనుత్పత్తి శ్రవణాచ్చ జీవానామౌపాధికమేవ జన్మ న స్వత ఇత్యుక్తం ఉపాధిలయేన పరమాత్మని పునర్లయ శ్రవణాదపి న వాస్తవం జన్మేత్యాహ - త్వయి త ఇతి. త్వయి కారణాత్మని త ఇమే జీవాః తత ఇతి యతో న వాస్తవం జన్మ తస్మాద్ద్వివిధనామగుణైరనేక ప్రకార

జమాణోఽను శేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్య"-పుట్టుకలేని ఒకానొక (అనిర్వచనీయమైన) ఎరుపు (రజస్సు), తెలుపు (సత్వము), నలుపు (తమస్సు)లతో కూడినది. అపారముగా ప్రజలను పుట్టించినది. రూపముతో కూడినది (మాయా-ప్రకృతి) (పరమాత్మవలన) కలిగినది. పుట్టుకలేని పరమాత్మ ఒక్కడే ఆనందమును అనుభవించుచు ఆయా ఉపాధులను అనుసరించి శయనించి ఉండును. అయితే భోగములననుభవించు ఉపాధికంటే ఇతటు వేరైనవాడు అని శ్రుతి చెప్పినది. పురుషప్రకృతులు రెండింటి వలన జీవుడు ఉత్పత్తి అయినాడు అనుటలో ఒకదానిపై మరొకటి ఆరోపితమైనందువలన రెండింటికి సంబంధముతో అని సారాంశము. ఆ కారణముచేత ప్రాణాది ఉపాధులతో జీవులు ఉత్పన్నమగుచున్నవని అర్థము. ప్రకృతికి లోబడినవాడు జీవుడు, లోబడనివాడు ఈశ్వరుడు అనే విభాగము నీరు, నీటిబుడగల వంటిది. అనగా కేవలము జలము వలనగానీ, కేవలము గాలివలమగానీ బుడగ ఏర్పడదు. నీరు, గాలి కలిసిననే బుడగ ఏర్పడును. బుదడకు గాలినిమిత్తము, నీరు ఉపాదానము అయినట్లుగా జీవుని విషయమున ప్రకృతి నిమిత్తమైనది, పురుషుడు ఉపాదానము- 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి. యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరం త్యేవ మేవాస్మాదాత్మనస్సర్వే. ప్రాణాస్సర్వే

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

కారణకార్యోపాధిభిస్సహ లిల్యుః లీనా బభూవుః. తత్ర సుషుప్తి ప్రళయయోః మధుని అశేషరసా ఇవ లీయంతే. యథా మధుని సకల కుసుమరసాః విశేషతః అనుపలక్ష్యమాణా అపి సామాన్యేన ఉపలక్ష్యంతే. ఏవం స్వాప్నాదౌ విశేషమాత్రలయాత్ కారణస్య విద్యమానత్వాత్ సామాన్యతో వర్తంతే ముక్తౌ తు కారణస్యాపి లయాత్ త్వయి పరమే నిరుపాధౌ సరిత ఇవార్ణవే లీయంత ఇతి వివేకః. తథాచ. శ్రు. "యథా సౌమ్య మధుమధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాం రసాన్ సమవహారమేకతాం సంగమయంతి తే యథా తత్ర న వివేకం లభంతే అముష్యాహం వృక్షస్య రసోఽస్మ్య ముష్యాహం వృక్షస్య రసోఽస్మీ త్యేవ మేవ ఖలు సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సతి సంపద్య న విదుస్సతి సంపత్స్యా మహ" ఇతి యథా నద్యస్స్యందమానాస్సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్య" మిత్యాద్యాః. శ్లో. "యస్మిన్నుద్యద్విలయమపి యద్భాతి విశ్వం లయాదౌ జీవోపేతం గురుకరుణయా కేవలాత్మావబోధే, అత్యంతాంతం వ్రజతి సహసా సింధువత్సింధుమధ్యే మధ్యే చిత్తం త్రిభువనగురుం భావయే తం నృసింహం. 32

లోకాస్సర్వే దేవాస్సర్వాణి భూతాని సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరంతి'- అంటూ మొదలైన శ్రుతులందు ఈ చేతనాచేతన రూపమైన ప్రపంచమునకు పరమాత్మయే ఉపాదానము. (జడ చైతన్య మూలకారణము) అని తెలియుచున్నది. అంతేకాని వికార రూపము పరిణామములు అంగీకరించదగనివి. కొందరు పరిణామమును అంగీకరించి ఆత్మకు వికారత్వము కలుగుననుకొని విపరీతముగా (వ్యతిరేకముగా) పరమాత్మ నిమిత్తోపాదానభావమును అంగీకరింతురు. ఎల్లవిధముల ప్రకృతి పురుషుల ఐక్యముచేత సృష్టి కలుగునని సిద్ధమైనది. 'ఏక మేవా ద్వితీయం బ్రహ్మ అజామేకాం. అవినాశీ వా అరేఽయమాత్మా' మొదలైన శ్రుతుల సామర్థ్యముచేత పుట్టుకలేదు అనుటవలన జీవులకు ఉపాధితోనే జన్మకాని స్వయముగా లేదు అని చెప్పబడినది. ఉపాధిలయమైన పిమ్మట మరల పరమాత్మను పొందును అన్నందువలన వాస్తవమైన జన్మలేదని చెప్పుచున్నాడు-కారణాత్ముడవైన నీ (పరమాత్మ) యందు జీవులన్నియు వ్యాపించియున్నవి. ఎందుకంటే జన్మ వాస్తవముకాదు. అందువల్ల అనేకములైన పేర్లు గుణములతో అనేక విధములుగ కారణకార్యోపాధులతో పరమాత్మయందు లీనమగును. ఇందులోకూడా గాఢనిద్ర, (సుషుప్తి) ప్రళయములందు- తేనెలో పెక్కు పుష్పముల మకరందమువలె లీనమగును. తేనెయందు సమస్తపుష్పముల రసములు వేరువేరుగా ఇవి ఇవి అని తెలియరాని

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

విధముగా ప్రత్యేకముగా కనపడనప్పటికి సామాన్యముగా (మాధుర్యముతో) తెలియగలవు. ఇదే విధముగా స్వప్నములందు విశేషములైన (శరీరధ్యాస) కారణము (ప్రాజ్ఞుడు) కనబడుచున్నందు వలన సామాన్యముగా వర్తించును. మోక్షమందు కారణముకూడా లయించుట వలన నిరుపాధికమైన పరమాత్మయందు-నదులు సముద్రమున కలిసినట్లు ఉండునని అర్థము. 'యథా సౌమ్య మధు మధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాం రసాన్ సమవహారమేకతాం సంగమయంతి తే యథా తత్ర న వివేకం లభంతే అముష్యాహం వృక్షస్య రసోఽస్మ్య ముష్యాహం వృక్షస్య రసోఽస్మీ త్యేవ మేవ ఖలు సౌమ్యేమాస్సర్వాః ప్రజాస్సతి సంపద్య న విదుస్సతి సంపత్స్యా మహే'– ఓ సౌమ్యుడా! తేనె పెక్కు వృక్షముల మకరందములు ఒకటిగా కలసిఉండగా ఇది ఈ చెట్టు మకరందము, ఇది ఈ చెట్టుది అని తెలియరాకుండ ఉన్నట్లుగా ఈ జీవరాశికూడా సత్పదార్థమును (పరమాత్మను) పొంది తాము పరమాత్మయందు లీనమైతిమని ఎరుగలేవు – అనేది ఎట్లో నదులు సముద్రమున కలిసి లీనమగునట్లుగా – విద్వాంసుడు అయినవాడు తనఉపాధికి సంబంధించిన నామ, రూపములనుండి ముక్తుడై పరాత్పరుడైన పురుషుని పొందును మొదలైనవి ఈ విషయమును దృఢపరచుచున్నవి.

శ్లో॥ నృషు తవ మాయయా భ్రమ మమీష్వవగత్య భృశం
త్వయి సుధియో భవేదధతి భావమను ప్రభవమ్ ।
కథమనువర్తతాం భవభయం తవ యద్భ్రుకుటి
స్సృజతిముహుస్త్రిణే మిరభవచ్ఛరణేషు భయమ్ ॥ 33

టీ:- ఏవం తావత్పరమేశ్వరాత్ జీవా జాయంతే తద్వశేన చ కర్మాణి కుర్వంతి పునస్తత్ర లీయంత ఇతి. సంసారచక్ర భ్రమణముక్తం ఇదానీం

యస్మిన్నుద్యద్విలయమపి యద్భాతి విశ్వం లయాదౌ
జీవోపేతం గురుకరుణయా కేవలాత్మావబోధే ।
అత్యంతాంతం వ్రజతి సహసా సింధువత్సింధుమధ్యే
మధ్యే చిత్తం త్రిభువనగురుం భావయే తం నృసింహమ్ ॥(శ్రీ)

పరమాత్మ ఈ అనంత విశ్వము ఉదయించుచున్నది. మరల పరమాత్మయందే సంపూర్ణముగా లీనమగుచున్నది. పరమాత్మ వలన ప్రళయకాలమున ఈ విశ్వము ఎల్లజీవులలో (సూక్ష్మరూపమున) ప్రకాశించుచున్నది - వేగముగా నదులు సముద్ర మధ్యముకు చేరినట్లు జగత్తు పరమాత్మలో లీనమగుచున్నది. గురుదేవుని కరుణతో ఆత్మజ్ఞానమును పొంది త్రిలోకగురుడైన నృసింహస్వామిని మనస్సు నందు ధ్యానింతును. 32

ఈ విధముగా పరమేశ్వరుని వలన జీవులు ఉత్పన్నమై పరమాత్మ వశముచేత కర్మలను చేయుచు మరల పరమాత్మయందే లీనమగుచున్నవి అని సంసారచక్రభ్రమణము చెప్పబడినది. ఇప్పుడా జననమరణచక్రమునుండి ముక్తిని పొందుటకై - 'పరీత్యలోకాన్ పరీత్యభూతాని పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ ప్రజాపతిః ప్రథమజా ఋతస్యాత్మనాత్మానమభిసంబభూవ'-సర్వలోకములు,సర్వభూతములు, సర్వదిక్కులు, దిశలు వ్యాపించి పరమాత్మ తన సంకల్పముచేత మొదట

తన్నివృత్తయే.శ్రు. "పరీత్య లోకాన్ పరీత్య భూతాని పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ ప్రజాపతిః ప్రథమజా ఋతస్యాత్మనాత్మానమభిసం బభూవే" తాద్యాః భగవదనువృత్తిం విదధతీత్యాహ – నృష్వితి. నృషు జీవేషు అమీషు తవ మాయాభ్రమం ఉక్తలక్షణ మవగత్య జ్ఞాత్వా సుధియః భృశం త్వయి అభవే భవనివర్తకే భావం స్వభావమనువృత్తిం దధతి కుర్వంతి. అనుప్రభవం అన్వనుప్రభవో యస్మిన్ తం భావం. తతః కిమతఅహ. –కథమనువర్తతా మితి. అనువర్తతాం అనువర్తమానానాం త్వామేవ శరణం భజతాం భవభయం సంసార భయం కథం భవేత్ న కథంచిద పీత్యర్థః. కుతః యద్యస్మాత్తవ భ్రుకుటిః భ్రూభంగరూపః త్రిణేమిస్త్రిస్రో నేమయ ఇవ అవచ్ఛేదాః శీతోష్ణవర్షాకాలా యస్య సంవత్సరాత్మకస్య కాలస్య సః. అభవచ్ఛరణేషు న భవాన్ శరణం రక్షితా యేషాం తేష్వేవ భయం జన్మమరణాదిలక్షణం సృజతి కరోతి. అత ఏవం భూతం సంసారమాకలయ్యతన్నివృత్తయే సుధియః త్వయి భావం దధతీతి. శ్లో. సంసారచక్రక్రకచైర్విదీర్ణముదీర్ణ నానాభవతాపతప్తం, కథం చిదాపన్నమిహ ప్రసన్నం త్వ ముద్ధర శ్రీనృహరేనృలోకమ్. 33

ప్రభవించిన సత్యమైన మాయను తనలో లీనముచేసికొని ఉండును మొదలైన శ్రుతులు భగవంతుని అనుసరించిన వృత్తిని ఏర్పరచి చెప్పుచున్నవి- ఈ జీవులందు నీ మాయవలన జననమరణచక్రము కలుగుచున్నదని చెప్పిన లక్షణమును అర్థము చేసికొని విద్వాంసులైన వారు జన్మను నాశనముచేయు నీయందే మనస్సు అనుసరించి వర్తించునట్లు చేయుదురు. దానితర్వాత ఏమి అనే విషయమును చెప్పుచున్నాడు–నిన్నే అనుసరించి నిన్నే శరణుపోందిన వారికి సంసారభయము ఎట్లు కలుగును. అంటే ఎప్పటికి కలుగదని భావము. నీభృకుటి యందలి మూడు మడతలవలె శీతాకాలము, ఎండాకాలము, వర్షాకాలము అనే మూడు ఖండములతో సంవత్సరాత్మకమైన కాలమునకు ఆశ్రయము అతడే. నీ పాదపద్మాలను ఆశ్రయించిన వారికే జన్మమరణములనే లక్షణములుగల సంసారభయమును కలిగించుచున్నాడు అందుకే ఈ విధమైన సంకటములకు నిలయమైన సంసారమును అర్థము చేసుకొని దీనినుండి ముక్తిని పొందుటకై విద్వాంసులు మనస్సును నీయందే నిలుపుచున్నారు.

సంసారచక్రక్రకచైర్విదీర్ణనానాభవతాపతప్తం ।
కథంచిదాపన్నమిహ ప్రసన్నం త్వముద్ధర శ్రీనృహరే నృలోకమ్ ॥

ఈ సంసారమనే రంపపుకోరలలోపడి చితికి అపారముగా పలువిధములైన సంకటములలో నలిగి ఎట్లో పూర్వసుకృత విశేషముతో ఆర్తిని బాపుమని నీపాదములను ఆశ్రయించిన ఈ దీనుని ఓ నరహరీ! కాచి రక్షించుము. 33

శ్లో॥ విజితహృషీకవాయుభిరదాంత మనస్తురంగం
య ఇహ యతంతి యంతు మతిలోలముపాయఖిదః ।
వ్యసన శతాన్వితాస్సముపహాయ గురోశ్చరణం
వణిజ ఇవావిశంత్యకృత కర్ణధరా జలధౌ ॥ 34

టీ:- స చ భగవతి భావః మనో నియమే సతి భవతి సోఽపి గురూపసదనాదితి గురూపసదనం విదధతి. శ్రు."తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం. ఆచార్యవాన్ పురుషో వేదనైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠే"త్యాద్యాః శ్రుతయ ఇత్యాహ. - విజితేతి. విజితాని హృషీకాణి ఇంద్రియాణి వాయుః ప్రాణశ్చ యైస్తైరపి అదాంతమనస్తురగం అదాంతం అదమితం మనఏవ తురగః అశ్వః దుర్దమత్వసామ్యాత్ తం యే యంతుం నియంతుం యతంతి ప్రయతంతే. అతిలోలం అతిచపలం గురోశ్చరణం సమపహాయ అనాశ్రిత్య. తే ఉపాయేషు ఖిద్యంతే క్లిశ్యంతీత్యుపాయఖిదస్సంతః వ్యసనశతాన్వితాః బహువ్యసనాకులాః. ఇహ సంసారసముద్రే అవిశంతి సంతిష్ఠంతి దుఃఖమేవ ప్రాప్నువంతీత్యర్థః. హే అజ అకృతకర్ణధారాః అస్వీకృత నావికాః వణిజో. యథా తద్వత్. గురుణోపదర్శిత భగవద్భజన సుఖానుభూతౌ తు స్వత ఏవ మనో నిశ్చలం భవతి నాన్యథేతి భావఃశ్లో. యదా

భగవంతునియందు మనస్సు లగ్నమై ఉన్నప్పటికీ గురువును ఆశ్రయించుటకై గురువు ఇంటికి వెళ్ళవలెనని చెప్పుచున్నాడు- 'తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం. ఆచార్యవాన్ పురుషో వేద నైషా తర్కేణమతిరాపనేయా ప్రోక్తాన్యే నైవసుజ్ఞానాయ ప్రేష్ఠ'- పరమాత్మ జ్ఞానమును పొందుటకై సమిధలను తీసికొని శ్రోత్రియుడై, బ్రహ్మనిష్ఠుడైన గురువును దరిజేరవలెను. ఆ ఆచార్యుడు శిష్యుని వేదనను గమనించి అతని మనస్సునందలి అనుమానములను నివారించి ఇతరములైన సూక్తులతో చక్కని విజ్ఞానమునకై ప్రేరేపించును - అంటూ శ్రుతులు ఈ విషయమునే చెప్పినవి. విజాతాని-ఇంద్రియములను ప్రాణమును వానివానిచేత లొంగని మనస్సనే గుర్రమును నియమించుటకు ప్రయత్నింతురు. గురుపాదములను ఆశ్రయించక మిక్కిలి చలించునట్టి మనస్సనే గుర్రమును అదుపులోనికి తేవలెనని భావించుచున్నారు. ఆయా ఉపాయములందు వ్యర్థులై అనేక సంకటములందు ఆకులపాటు పొందుచున్నారు. దీని ఫలితముగా ఈ లోకమున ప్రాపంచిక వ్యామోహ సముద్రమునందు పడి దుఃఖమునే పొందుచున్నారు. ఓ అజుడా! నావికులు లేని పడవయందు వ్యాపారివలె చిక్కులందు పడుచున్నారు. గురువు చూపిన విధముగా భగవంతుని భజించుట వలన కలిగిన సుఖానుభూతియందే నిశ్చలత్వమును కలుగును కానీ మరేదానివల్ల కలుగదని భావము.

పరానందగురోఽభవత్పదే పదం మనో మే భగవన్ లభేత వై, తదా నిరస్తాఖిలసాధనశ్రమశ్శ్రయేయ సౌఖ్యం భవతః కృపావశాత్. 34

శ్లో॥ స్వజన సుతాత్మదారధామధరసురత్తై
స్త్వయి సతి కిం నృణాం శ్రయత ఆత్మని సర్వరసే ।
ఇతి సదజానతాం మిథునతో రతయే చరతాం
సుఖయతి కోన్విహస్వ్వవిహతే స్వనిరస్తభగే ॥ 35

టీ:- శ్రు. "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన." తథా "యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది స్థితాః. అథ మర్త్యో మృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుత" ఇత్యాద్యాః వైరాగ్యమంగం విదధతీత్యాహ-స్వజనేతి. ఆత్మా దేహః ధామ గృహం అసుః ప్రాణః స్వజనాదిభిః ద్వంద్వనిర్దిష్టైః సర్వరసే సర్వే రసాః సుఖాని

యదా పరానందగురోఽభవత్పదే
పదం మనో మే భగవన్ లభేత వై ।
తదా నిరస్తాఖిలసాధనశ్రమ
శ్శ్రయేయ సౌఖ్యం భవతః కృపావశాత్ ॥ (శ్రీధరీయము)

ఓ సర్వోత్కృష్టమైన ఆనందమును ప్రసాదించే స్వరూపుడా! భగవంతుడా ! నీ పాదమందే నా మనస్సు నిశ్చలతను పొందుగాక, అప్పుడు నేను సర్వసాధనల శ్రమలను వదులుకొని నీ అనుగ్రహముతో కేవలమైన సౌఖ్యమును పొందగలను. 34

'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన-బ్రాహ్మణుడు కర్మలచేత కప్పబడిన లోకములను పరీక్షించి (అవినిరర్థకములని) వానిపై వైరాగ్యమును పొందును. అట్టివాడు ఏమిచేసినను దోషముండదు. 'యథా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృది స్థితాః. అథ మర్త్యో ఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుత'-ఫలవైరాగ్యమును పొందినవానికి అతని హృదయమందున్న కోరికలన్నియు నశించును. అప్పుడు మానవుడు ఈ లోకమునే (శరీరప్రాణసహితముగనే) అమృతత్వమును పొందును. బ్రహ్మ భావనను పొందును. మొదలైన శ్రుతులు భక్తికి వైరాగ్యమును అంగముగా చెప్పుచున్నవి-స్వజనేతి- తన శరీరము, ప్రాణము, ఇల్లు,

విద్యంతే యస్మిన్ త్వయి పరమానందే. శ్రు. "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతీ" తి శ్రుతేః.శ్రయతః త్వాం సేవమానస్య పుంసః ఆత్మనిసతి.నృణాం తుచ్ఛైరేతైః కింక ఉపయోగః? ఇతిసత్ సత్యం పరమార్ధ సుఖమజానతాం అతఏవ మిథునతః స్త్రియా మిథునీ భూయ రతయే మాయాసుఖాయ చరతాం ప్రవర్తమానానాం కర్మణి షష్ఠీ. అజానతశ్చరతః పురుషాన్ కోనుఅర్ధస్సుఖయతి ఆనందయతి న కోఽపీ త్యర్థః. ఇహసంసారే కథంభూతే స్వవిహతే స్వత ఏవ నశ్వరే స్వనిరస్తభగే స్వత ఏవ గతసారే. పాఠాంతరే కో న్విహేత్యస్యైవ ఏతద్విశేషణద్వయం. అతస్త్వద్భజన మేవోచితమిత్యర్థః. శ్లో. "భజతో హి భవాన్ సాక్షాత్పరమానంద చిద్ఘనః, ఆత్మైవ కిమతః కృత్యం తుచ్ఛదారసుతాదిభిః. 35

తనవారు (భార్యాపుత్రాదులు) అనే ద్వంద్వములచేత సమస్త సుఖములు కనపడుచుండగా పరమానందప్రదుడవైన నీయందు మనస్సు నిలుపరు. 'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి'– పరమానందమును వదిలి దాని లేశముతోనే జనులు తృప్తిపొందుచున్నారని శ్రుతి. పరమాత్మానంద సముద్రమునందు సర్వలౌకికానందములు తుషారముల వంటివని స్థాపించినది. సర్వ రసమయుడై పరమానంద రూపుడైన పరమాత్మ తమలోనే ఉండగా మానవులకు తుచ్ఛమైన ఈ అల్ప సుఖమువల్ల ఉపయోగమేమున్నది. అని సత్యమైన పరమాత్మ సుఖమును తెలియనందువలననే సంభోగములందు స్త్రీలమధ్యన మాయాసుఖమైన రతితో మునిగిఉన్న పురుషులను ఏ విషయము సుఖపెట్టగలదు. అనగా ఏదికూడా యథార్థ సుఖమును కలిగించలేదని భావము. సారములేక నాశనప్రాయమైన ఈ సంసారముతో ఉపయోగము లేదని భావము.

భజతోహిభవాన్ సాక్షాత్పరమానంద చిద్ఘనః ।
ఆత్మైవ కిమతః కృత్యం తుచ్ఛదారసుతాదిభిః ॥ (శ్రీధరీయము)

సేవించేవారికి నీవే సాక్షాత్తుగా అపారమైన ఆనందమును కలిగించునట్టి పరిపూర్ణ జ్ఞానస్వరూపమైన పరమాత్మవు. అట్టి దానిని వదిలి ఈ నీచమైన భార్యాపుత్రులకొరకై ప్రాకులాడుట వ్యర్థము. 35

శ్లో॥ భువి పురుపుణ్యతీర్థ సదనాన్యృషయో విమదా
స్త ఉత భవత్పదాంబుజహృదోఘభిదంఘ్రిజలాః ।
దధతి సకృన్మనస్త్వయి య ఆత్మని సత్యసుఖే
న పునరుపాసతే పురుషసార హరావసథాన్ ॥ 36

టీ:- ఏవం గురూపదేశేన తత్త్వమవగమ్య సారాసారవివేకేన చ సర్వతో నిర్విద్య తదేవ మహత్సంగేన ఉపపత్తిభి స్సమ్యగవధారయితుం తీర్థసదనాని తత్పురుషదర్శనాయ మునయః పర్యటంతీతి మంతవ్య ఇతి శ్రుత్యర్థమాహ - భువీతి. తే ఉక్తలక్షణాః ఋషయః విమదాః నిరహంకారాః యతః భవత్పదాంబుజ హృదః భవంతః పదాంబుజం హృది యేషాం తే అతః స్వయ మేవ అఘభిదంఘ్రిజలాః అఘభిత్ అంఘ్రి జలం యేషాం తే ఉత అపి తథా విధా అపి భువి పృథివ్యాం పురూణి బహూని తీర్థాని సదనాని క్షేత్రాణి తామేవ ఉపాసతే సేవంతే. ప్రాయస్తత్రైవ మహత్సంగో భవతీతి. అథవా పురు అధికం భగవద్భజన లక్షణం పుణ్యం యేషాం తాని తీర్థాని గురవః మహాంత ఇత్యర్థః. తేషాం సధనాని ఆశ్రమాన్ యధామహామరసింహః -"నిపానాగమయో స్తీర్థమృషిజుష్టజలే గురా" వితి. న పునః పురుషసారహరావసథా నుపాసతే. పురుషాణాం సారం వివేకస్థైర్య ధైర్యక్షమాశాంతి ప్రముఖం హరంతీతి తథా. తేచ తే ఆవసథాః గృహాః తాన్. న చ తేషాం గృహాది

ఈ విధమైన గురుపదేశముతో తత్త్వమును తెలిసి సారవంతమైనదేది, కానిదేది అనే వివేకముతో అన్ని విషయములందు రోత కలిగిన పిమ్మట మహాత్ముల సహచర్యముచేత దృష్టాంతములతో విషయమును చక్కగా జ్ఞప్తిలో ఉంచుకొనుటకై తీర్థములందు, దేవాలయములందు ఆ మహాత్ముని (పరమాత్మను) దర్శించుటకై మునులు సంచరించుచున్నారని భావించవలెనని శ్రుతుల అర్థమును చెప్పుచున్నాడు-భువీతి-ముందు చెప్పిన లక్షణములుగల ఋషులు అహంకారమును వదిలి నీ పాదపద్మమును హృదయమందు నిలుపు కొన్నవారై ఆ పాదపద్మముల జలమే స్వయముగా సర్వపాపములను నాశనము చేసిన పిదపకూడా ఈ పుడమియందలి పెక్కు తీర్థములు, ఆలయములందు పరమాత్మనే ఉపాసించుచున్నారు. సామాన్యముగా అటువంటి స్థలములందే మహాపురుషుల సాంగత్యము లభించగలదు. లేక అధికముగా భగవమతుని భజన లక్షణమైన పుణ్యము కలుగునని యాత్రలు చేయుచున్నారు. తీర్థములకంటే గురువులే గొప్పవారని అర్థము. కనుకనే వ్యక్తుల సారము అనగా ప్రాపంచిక వ్యామోహమును హరించునట్టి గురువుల ఆశ్రమమును సేవించుచున్నారు. గురువులకు గృహములైన ప్రాపంచిక వ్యామోహము ఉండదని చెప్పుచున్నాడు- వారు నీయందే ఎల్లప్పుడు మనస్సును నిలిపి, నీయందే పరమానంద సుఖమున్నదని ఎరిగినవారైనందువలన అట్టివారు ఎన్నటికినీ గృహాదులందు ఆసక్తులు కారని అర్థము.

భవ కుత్సిత సుఖాపేక్షేత్యాహ– దధతి సకృన్మనస్త్వయి య ఆత్మని నిత్య సుఖ ఇతి సకృదపి త్వయి యే మనో దధతి తేఽపి గృహాద్యాసక్తా న భవంతి. కింపునరేవంభూతా ఇత్యర్థః. శ్లో. "ముంచన్నంగతదంగ సంగమనిశం త్వామేవ సంచితయన్ సంతస్సంతి యతో యతో గతమదాస్తానాశ్రమానావసన్, నిత్యం తన్ముఖపంకజాద్విగళితత్వత్పుణ్యగాథామృత స్రోతస్సంప్లవసంప్లుతో నరహరే న స్యామహం దేహభృత్. 36

శ్లో॥ సత ఇదముత్థితం సదితి చేన్ననుతర్కహతం
వ్యభిచరతి క్వచ క్వచ మృషా న తథో భయయుక్ ।
వ్యవహృతయే వికల్ప ఇషితోఽంధపరంపరయా
భ్రమయతి భారతీత ఉరువృత్తి భిరుక్థజడాన్ ॥ 37

టీ:– నన్వామ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్యమతదర్థానాం క్రియార్థేనేన సమామ్నాయ ఇతి తత్ర తత్ర జైమినినా వేదస్య క్రియా పరత్వాభిధానాదుపనిషదామపి తదేవ యుక్తం యథోక్తం.

ముంచన్నంగ తదంగ సంగమనిశం త్వామేవ సంచితయన్
సంతస్సంతి యతో యతో గతమదాస్తానాశ్రమానావసన్ ।
నిత్యం తన్ముఖపంకజాద్విగళితత్వ త్పుణ్యగాథామృత
స్రోతస్సంప్లవసంప్లుతో నరహరే న స్యామహం దేహభృత్ ॥

భార్యాపుత్రాదుల వ్యామోహమునువీడి నిన్నే చింతించునట్టి యోగులు ఉన్నారు. వారు ప్రాపంచిక మదమును పూర్తిగా వదలి అక్కడక్కడ ఆయా ఆశ్రమములందున్నారు. నిరంతరము అట్టివారి ముఖపద్మములనుండి జాలువారిన నీ పవిత్ర గాథలనే అమృతప్రవాహమున ఓలలాడుచు ఓ నరహరీ! నేను ఈ జననమరణ చక్రమునుండి ముక్తిని పొందగలను. 36

వేదముయొక్క క్రియార్థత్వము వలన అనర్థకత్వము కలుగదు. దాని అర్థముకాని విషయములకుకూడా క్రియార్థముతో కూడిక కలుగునని అక్కడక్కడ జైమిని మహాముని వేదముల క్రియలకు వేరే అర్థమున్నదని చెప్పినందువలన ఉపనిషత్తులకు కూడా అది వర్తించునను అభిప్రాయము యుక్తము. తంత్రవార్తిక కర్తలును క్రతువు అర్థమునకు కర్తను ప్రతిపాదించుట వలన ఉపనిషత్తులు కోరదగినవి కావని వాఖ్యానించిరనుట సరికాదు. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ అచక్షురశ్రోత్రం' మొదలైన శ్రుతులకు విపరీతముగా ఆత్మప్రతిపాదన

తంత్రవార్తికకృతా ఏతేన త్వర్థ కర్తృ ప్రతిపాదనాత్ అనేన ఉపనిషదాం నైరాకాంక్ష్యం వ్యాఖ్యాతమితి చేన్న. శ్రు. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ అచక్షురశ్రోత్ర" మిత్యేవం తద్విపరీతాత్మ ప్రతిపాదనాత్. నహ్యద్వితీయ పరమానందరూపస్య కర్మాంగత్వం యుజ్యతే. అననుమతం చైతద్వార్తిక కృతః. కథం శ్లో. "సర్వత్రైవ హి విజ్ఞానం సంస్కారత్వేన గమ్యతే, పరాంగం చాత్మ విజ్ఞానాదన్యత్రే త్యవధార్యతాః." మితి. తేనైవోక్తత్వాత్. తదర్థమేవ మననాయ మునయః పర్యటంతీత్యుక్తం. తత్ర తాద్వైతస్య సత్య త్వే భవేద ప్యేవం. తదేవ తు న సంభవతీతి ప్రశ్నోత్తరాభ్యాం మననేన తత్త్వావధారణ ప్రకారమాహ – సత ఇతి. ఇదం విశ్వం ధర్మి సదితి సాధ్యో ధర్మః. సత ఉత్పన్నత్వాదితి హేతుః. యత్ యతః ఉత్పన్నం తత్ తదాత్మ కమేవ దృష్టం. యథా కనకాదుత్పన్నం కుండలాది తదాత్మకం తద్వదితి. తత్ర యది సదభేదస్సాధ్యతే తదా ఉపాదానత్వ నిర్దేశేనైవ భేదప్రతీతేః విరుద్ధో హేతురిత్యాహ – నను తర్కహతమితి. నను నాభేదం సాధయామః కింతు. తదుత్పన్న త్వేన కుండలాదివత్ భేదం ప్రతిషేధయామః.తతశ్చ అభేద ఏవ స్యాదిత్యా శంక్య అనైకాంతిక త్వేన దూషయతి. వ్యభిచరతి క్వచేతి పితృ పుత్రాదిషు ముద్గరఘట ప్రధ్వంసాదిషు చ తథా ఆదర్శనాదితి భావఃనను తదత్పన్నత్వం నామ తదుపాదానకత్వం. న తు తన్నిమిత్తత్వం అతోనానైకాంతికత్వమిత్యా శంక్య దూషయతి – క్వ చ మృషేతి. గుణోపాదానస్యాపి ఫణినో న

జరుగును కనుక అది సరికాదు. అద్వితీయుడైన పరమానందరూపుడైన ఆత్మకు కర్మాంగత్వము కలుగదు. ఈ వార్తికము చెప్పిన విషయము అంగీకరింపదగినది కాదు. విజ్ఞానము అంతటా సంస్కారము చేతనే పొందదగినది. ఆత్మజ్ఞానముకంటే అంగత్వము వేరుగా ఉన్నదని తెలియుమని ఆ వార్తికకారుడే చెప్పినాడు అనే ఈ మాటను మననము చేసుకొనుటకే (ఆత్మతత్త్వమును అవగాహన చేసికొనుటకే) మునులు పర్యటించుచున్నారు'. ద్వైతము సత్యము అనిపించుట వలన ద్వైతచ్ఛేదమునకై యాత్రలు చేయుచుండిరి. వాస్తవముగా ద్వైతము సంభవింపదని ప్రశ్నోత్తరముల వలన మననము చేత తత్త్వము అవధారణకువచ్చు విధానమును చెప్పుచున్నాడు 'సత' అని. ఈ ప్రపంచము ధర్మి. పరమాత్మ సాధ్యమైన ధర్మము. సత్తునుండి (పరమాత్మనుండి) పుట్టుటవలన అనేది ధర్మి అనుటకు హేతువు. ఏది దేనినుండి పుట్టునో అది దానికి సంబంధించినదని అనుభవములో ఉన్నది. బంగారము వలన ఏర్పడిన కుండలము మొదలైన ఆభరణములు బంగారముతోనే ఉండును. ఒకవేళ సత్తుతో అభేదము సాధింపబడినట్లయిన అప్పుడు ఉపాదానత్వమును నిర్దేశించుటతోనే భేదమున్నదనే విషయమునకు విరుద్ధము అనుటకు అది తర్కమునకు కుదరదనే హేతువును చెప్పుచున్నాడు. ఒకవేళ అభేదము లేదని సాధించుటకు–దానినుండే పుట్టినందువలన భేదమును నిషేధించు

గుణత్వం కింతు మిథ్యాత్వం అన్యథా. కుండలాదివదబాధ ప్రసంగాత్. అతః పునరప్యనైకాంతికత్వ మేవేతి భావః. నను తత్ర న కేవలం గుణమాత్రం ఫణిన ఉపాదానం కింతు అవిద్యాయుక్తం. తథాభూతస్యావస్తుత్వాత్ యుక్తం ఫణినో మిథ్యాత్వ మిత్యాశంక్య తత్తుల్యమత్రాపీతి దూషయతి- న తథోభయయుగితి అయమర్థః. అత్రాప్యవిద్యా యుక్తస్యైవ సత ఉపాదానత్వం. ఏవం భూతస్య చ న వస్తుత్వం. అతస్సదుపాదానత్వమసిద్ధమితి న వస్తుత్వం ప్రపంచస్యేతి. నను మాభూదనేన హేతునా ప్రపంచస్య సత్త్వం హేత్వంతరేణ తు సాధయామః. తథా హి సదిదం అర్థ క్రియా కారిత్వాత్. యత్ అర్థక్రియాకారి తత్సత్ న యదేవం న తదేవం యథాశుక్తిరజతమితి తత్రాహ- వ్యవహృతయే వికల్ప ఇషిత ఇతి. వ్యవహృతయే వ్యవహారాయ అర్థక్రియార్థం వికల్పః భ్రమః ప్రసిద్ధః. అత్యంతాసత్త్వే కథం ప్రపంచభ్రమస్స్యాత్? సత్వే నానాద్వై తసిద్ధిః. ఉక్తం చ భట్టైః. శ్లో. "అధ్యస్యతే ఖపుష్పత్వ మసత్కథమవస్తుని, ప్రజ్ఞాత గుణసత్తాక మధ్యారో పేతవానవేతి. తత్రాహ- అంధపరంపరయేతి. అంధపరంపరయా యో వికల్ప ఇత్యన్వయః. అయం భావః. సంస్కార జన్యో భ్రమః సంస్కారసిద్ధయే పూర్వప్రతీతి మాత్రమపేక్షతే. న వస్తు సత్యత్వం ప్రతీతౌ సత్యాం వస్తుసత్యత్వాభావేన భ్రమవ్యతిరేకా దర్శనాత్. అతః అనాదిత్వాత్పూర్వ పూర్వభ్రమదృష్టస్యోత్తరో త్తరారోపో భవిష్య

చున్నాను. అందువలన అభేదమే ఉన్నదని శంకించి అనేకములుగా ఉండుటచేత (అనైకాంతికత్వముచేత) కొన్నిచోట్ల అది కుదరదను చున్నాడు. ఇనుపగుదియతో కుండలను నాశనము చేసినట్లుగా తండ్రికొడుకులమధ్య అట్టి నాశనము కనిపించదని భావము. ఇక్కడ దానినుండి పుట్టినది అంటే దానికి ఉపాదానత్వమే ఉన్నదికాని నిమితత్త్వము లేదు.అయితే అనైకాంతిత్వము (పెక్కు విధములుగా ఉండుట) లేదా అనే శంకకు అది ఒక్కోసారి అసత్యమగును. సర్పముల గుణములకు ఆధారమైనప్పటికి చీకటిలో త్రాడును-దాని మెత్తటి తనము, గుండ్రటి తనము, సన్నగా, పొడవుగానుండు గుణత్వమున్న ప్పటికినీ వాస్తవముగా దానికి సర్పత్వములేదు. వేరుగా మిథ్యత్వము- అనగా వెలుగుప్రసరించిన పిమ్మట అది పాముకాదు త్రాడు అనే యథార్థజ్ఞానము కలిగిన పిమ్మట సర్పత్వము అసత్యమే కాగలదు. కానీ కుండలాదులందు అవి నాశనమైనను బంగారత్వమునకు భంగము వాటిల్లదు. కనుక అనైకాంతికత్వమే ఉన్నదని భావము. సర్పముల భ్రాంతియందు కేవలము గుణముచేతనే (మెత్తగా ఉండుటచేతనే) సర్పమును భ్రాంతి అజ్ఞానముచేత కలిగినది. సర్పములాగా కనబడగలిగిన ఆకారత్వము చేత త్రాడు పాముకాజాల నందువలన అసత్యమే అగునుకదా అనిశంకించి ఇక్కడకూడా దానితో (పాముతో) సమానమైనదనుటను గుణము ఉపాదానము రెండు కలసినందు వలన

తీత్యంధపరంపరాన్యాయేన తేన చ వస్తు వ్యవహారః సేత్స్యతీత్య ప్రయోజకో హేతురితి. నను. శ్రు.“అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్య యాజినస్సు కృతం భవతి. అపామసో మమమృతా అభూమే” త్యాధిభిః కర్మ ఫలస్య నిత్యత్వ ప్రతిపాదనాదసత్వం నఘటతే న హి నిత్యం వస్తు అసద్భవతి తస్మాద్వేద ప్రతిపాదితత్వాత్ ద్వైతం సదేవేత్యాశంక్యాహ – భ్రమయతీతి. హే భగవన్ తే తవ భారతీ వేదవాక్. ఉరువృత్తిభిః గౌణలక్షణాదివృత్తిభిః. ఉక్థజడాన్ కర్మ శ్రద్ధాభరాక్రాంత మందమతీన్. భ్రమయతి మోహయతి. అయం భావః. నహి వేదః కర్మఫలస్య నిత్యత్వమభిప్రైతి. కింతు లక్షణయా ప్రాశస్త్యమాత్రం. విధ్యేక వాక్యత్వాత్ అన్యథా వాక్యభేద ప్రసంగాత్. శ్రు. “తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయత” ఇతి న్యాయో పబృంహిత శ్రుత్యంతర విరోధాచ్చ. అతః కర్మ జడానామిదం భ్రమమాత్ర మితి. ఏతనైవ. శ్రు. ‘‘తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూత’’ ఇత్యాదీనామప్యన్య పరత్వం దర్శితం భవతి. శ్లో. ఉద్భూతం భవతస్సతోఽపి భువనం సన్నేవ సర్పస్రజః కుర్వత్కార్య మపీహకూటక నకం వేదోఽపి నైవం పరః, అద్వైతం తవ సత్పరం తు పరమానందం పదం తన్ముదా వందే సుందరమిందిరానుత హరే మాముంచ మామానతమ్. 37

కాదని ఖండించుచున్నాడు. ఇక్కడ అజ్ఞానమే కారణమనుచున్నాడు. సత్యమైనదానికే ఉపాదనత్వముండును. దానిలాగాఉన్న ఏ వస్తువుకూ వస్తుత్వము ఉండదు. అందువలన సత్యమైన ఉపాదానత్వము కలుగదు కనుక ప్రపంచమునకు వస్తుత్వము (వాస్తవత్వము) లేదు. ఈ కారణముచేత ప్రపంచమునకు వస్తుత్వము లేకపోయినను వేరే కారణముచేత సాధింతును. ఈ ప్రపంచము అర్థముగల (ఫలముగల) క్రియలను (కర్మలను) చేయుచున్నందు వలన ఈ జగత్తు సత్యము. ఇది ముత్యపు చిప్పలందలి వెండిలాంటి కాంతివంటిది కాదు అనే విషయమై చెప్పుచున్నాడు– వ్యవహారము కొరకు భ్రాంతి ఇష్టమే. లోకవ్యవహారమునకు అర్థవంతమైన క్రియలకు భ్రమ ఇష్టమే. సమ్మెట, నాణెము మొదలైన వానిచేత అక్కడక్కడ వ్యవహారము కనబడుచున్నది. ఒకచోట ఉన్న వస్తువునకు (సతః) వేరేచోట ఆరోపము (భ్రమ) ప్రసిద్ధమే. వాస్తవముగా అసత్యమైనదాని యందు ప్రపంచభ్రమ ఎట్లు కలుగును? అనే దానికి సత్వము (సత్యపదార్థము) నందు అనేకములైన ద్వైతములు (వేరువేరు వస్తువులుండుటలు)–నానాద్వైత సిద్ధి కలుగును. ‘అధ్యస్యతే ఖపుష్పత్వ మసత్కథమవస్తుని, ప్రజ్ఞాత గుణసత్తాక మధ్యారోపేతవాన వా’– అసత్యమైన (లేని) ఆకాశపుష్పమను వస్తువు కానిదానియందు (అవస్తువునందు) ఆకాశమునందు ఆరోపించుటకు వీలులేదు. తెలిసిన గుణము కలిగిన వస్తువును వేరేదానియందు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఆరోపించినను ఆరోపించకపోయినను కుదురునని-భట్టపాదులవారి మాట అనే విషయమును చెప్పుచున్నాడు -గ్రుడ్డితనముతో (అంధపరంపరయా)ఈ భ్రమ కలుగుచున్నదని అన్వయము. సంస్కారజన్యమైన భ్రమ సంస్కారసిద్ధి కొరకు మాత్రమే పూర్వ ప్రసిద్ధిని కాంక్షించును. వస్తు సత్యత్వము ఎరుకలో కలిగినను వాస్తవముగా అక్కడ వస్తువు లేనందువలన (త్రాటిలో పాము భ్రాంతి సత్యమైననూ వాస్తవముగా పాములేనందువలన) భ్రమలేదనుటకు వీలులేదు. అందువలన అనాదిత్వముచేత (ఆదిలేనిదై) పూర్వభ్రమలచేత వాస్తవమైన దానియందు తరువాత వేరువేరైనవి ఆరోపింపబడుచున్నవను అంధ పరంపరాన్యాయముచేత వస్తు వ్యవహారము సిద్ధించగలదనుట నిష్ప్రయోజనము. 'అక్షయ్యగ్ం హ వైచాతుర్మాస్యయాజినస్సుకృతం భవతి. అపామ సోమమమృతా అభూమ'-చాతుర్మాస్య యాగమును చేసినవానికి నాశనరహితమైన పుణ్యము కలుగును. సోమపానము చేసి అమృతత్వమును పొందితిని వంటి శ్రుతులు కర్మఫలములకు నిత్యత్వమును ప్రతిపాదించుట వలన ప్రపంచము అసత్యముకాదు. నిత్యమై కనబడనట్టి ప్రపంచము అవాస్తవము కాదు అని వేదము ప్రతిపాదించినందువలన ద్వైత్వము సత్యమే అనే శంకకు అది కేవలము భ్రమింపజేయునని చెప్పుచున్నాడు-ఓ భగవంతుడా ! నీ వేదవాక్కు గౌణలక్షణాది వృత్తులతో

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

కర్మలందే శ్రద్ధగల మందమతులను మోహింపజేయుచున్నది. వేదము కర్మ ఫలమునకు నిత్యత్వమును చెప్పలేదు. కానీ లక్షణచేత దాని ప్రాశస్త్యమును మాత్రమే చెప్పినది. అది విధిని (తప్పనిసరిగా చేయవలసిన దానిని) ఒకే వాక్యములో చెప్పి, చేయకూడని వాటిని, ఇతర ఔపచారిక విషయములను అనేక వాక్యములతో ప్రసంగించినవి. 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే'– ఈ లోకమున కర్మలచే పక్వమై లోకము క్షీణించునో అట్లే పరమున పుణ్యవంతునికినీ లోకము (పుణ్యలోకత్వము) క్షీణించుననే న్యాయముతో చెప్పబడిన ఇతర శ్రుతివాక్యములకు విరోధము కలుగుట వలన కర్మను మాత్రమే నమ్మిన మందమతులకు ఈ లోకము భ్రమప్రాయమైనదే కనుక "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః '– పరమాత్మనుండి ఆకాశము పుట్టినది మొదలైన శ్రుతులకుకూడా ఆత్మపరత్వమే సిద్ధించుచున్నది.

ఉద్భూతం భవతస్సతోఽపి భువనం సన్నేవ సర్పస్రజః
కుర్వత్కార్య మపీహ కూటకనకం వేదోఽపి నైవం పరః ।
అద్వైతం తవ సత్పరం తు పరమానందం పదం తన్ముదా
వందే సుందరమిందిరానుత హరే మాముంచ మామానతమ్ ॥(శ్రీ)

సత్యరూపుడవైన నీవల్ల ఈ లోకము ఉత్పన్నమైనది. మెడలో పుష్పమాల భ్రాంతితో సర్పమును ధరించినట్లు అనగా వాస్తవముకాని

శ్లో॥ న యదిదమగ్ర ఆస నభవిష్యదతో నిధనా
దనుమితమంతరా త్వయి విభాతి మృషైకరసే ।
అత ఉపమీయతే ద్రవిణజాతి వికల్ప పథై
ర్వితథమనో విలాసమృత మిత్యవయంత్యబుధాః ॥ 38

టీ:- తదేవం ప్రపంచస్య సత్త్వే సాధకం నాస్తీత్యుక్తం ఇదానీమసత్త్వే సృష్టిప్రళయ శ్రుతయః. శ్రు. "యతో వా ఇమాని జాయంత" ఇత్యాద్యాః తన్మూలం చ అనుమానం ప్రమాణమిత్యాహ- నేతి. యద్యస్మాదిదం విశ్వం అగ్రే సృష్టేః పూర్వం నాస నాసీత్. శ్రు. "సదేవ సోమ్యేదమగ్ర

దానిని వాస్తవమైనదను భ్రమతో కార్యము చేయుచు ఈ లోకమున కూటకనకముగా అనగా బంగారము విలువైనదైనను దానికి క్షుద్రలోహమైన ఇనుపసుత్తెదెబ్బలు తప్పనట్లు (తాను ఆత్మ స్వరూపుడైనను అజ్ఞానముతో (ప్రాపంచికసంకటముతోబాధపడినట్లు) న్నది మానవునిస్థితి. వేదము కూడా ఈవిధముగనే జగత్తు పరమాత్మకంటే భిన్నముకాదనే చెప్పినది. అయినను సత్యస్వరూపుడవైన నీకు అద్వైతమే పరమావధి. అది పరమానందపదమైనది. దానికై సంతోషముతో ఓ లక్ష్మీస్తుతా ! శ్రీహరీ ! నీకు నేను నమస్కరించుచున్నాను. నీకు నమస్కరించుచున్న నన్ను వదిలిపెట్టకుము. 37

ఈ విధముగా ప్రపంచషము సత్యమనుటకు రుజువులేదనిచెప్పి "యతోవాఇమానిజాయంతే' దేనివలనఈసర్వభూతములు ఉద్భవించినవో-అనేసృష్టిప్రళయ శ్రుతులు అసత్యమైన విషయమందు(జగత్తునందు) దీనికిమూలము అనుమానము ప్రమాణమని చెప్పుచున్నవి- ఈజగత్తు సృష్టికిపూర్వము లేకుండినది-"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్. ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీత్.'-ఈసృష్టికంటేముందు సత్తేఉన్నది. ఆత్మఒక్కటే సృష్టికంటే ముందు ఉండినది -అనే శ్రుతులుదీనికిప్రమాణము. ప్రళయానంతరముకూడాసృష్టి ఉండబోదు."నాసదాసీన్నోస దాసీత్తదానీం- అప్పుడు లేనిది(అసత్తు)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



ఆసీత్. ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్." ఇత్యాది శ్రుతేః. న చ నిధనాత్ ప్రళయాత్ అను అనంతరం భవిష్యత్ భవిష్యతి. శ్రు. "నాసదాసీన్నోస దాసీత్తదానీ" మిత్యాదిశ్రుతేః. అతః కారణాత్ అంతరామధ్యేఽపి ఏకరసే కేవలే త్వయి మృషా మిథ్యారూపమేవ విభాతీతి మితం నిశ్చితం.యత ఏవం హ్యతః శ్రుత్యా ద్రవిణజాతి వికల్పపథైః ద్రవిణజాతీనాం ద్రవ్య మాత్రాణాం మృల్లోహకార్ష్ణయ స్వరూపాణాం వికల్పాః భేదాః ఘటకుండలా దయః తేషాం పంథానః మార్గాః ప్రకారాః తైరుపమీయతే సదృశతయా నిరూప్యతే. యథా. తత్ర కార్యాకార్యాణాం నామధేయమాత్రతా కారణం మృదాద్యేవ తు సత్యం తథా త్రాప్యాకాశాదీనాం నామమాత్రతా బ్రహ్మైవ సత్యమితి నిరూప్యత ఇత్యర్థః. తథా చ. శ్రు. "యథా సోమ్యైకేన మృత్పిండేన విజ్ఞాతేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం యథా నామైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాత్. తథా ఏకేన నఖనికృంతనేన సర్వం కార్ష్ణయసమి" త్యాది. తస్మాదస్య సత్వే ప్రమాణాభావాత్. అసత్త్వే తు ప్రమాణస్య విద్యమానత్వాత్ వితథమనోవిలాసం ఋతం. సత్యమితి యే అవయంతి జానంతి తే అబుధాః అజ్ఞా ఇత్యర్థః. అత్రైవం ప్రయోగః -వివాదధాసితం నసత్. అద్యంతయోరవిద్యమానత్వాత్ వికారిత్వాత్ దృశ్యత్వాద్వా శుక్తిరజతాదివదిత్యన్వయే ఆత్మవచ్చేతివ్యతిరేకే దృష్టాంతః

లేదు. ఉన్నది(సత్తు) లేదుఅని శ్రుతి. ఈ కారణముచేత సృష్టికి పూర్వము, ప్రళయానంతరము జగత్తులేదు. కనుక సృష్టి-ప్రళయముల మధ్యన కూడా అనగా విశ్వముసృష్టియై విధ్యమానమగుచున్నకాలమున కూడా (అనగా ఎల్లప్పుడు కాలభేధరహితముగా) ఏకరసముతో- కేవలముగా ఉన్న పరమాత్మయందు ఈజగత్తు మిధ్యారూపముగా మాత్రమే ప్రకాశించుచున్నదనుట నిశ్చయము. అందువల్ల ద్రవిణ జాతులు అనగా ద్రవ్యము(పదార్ధము) మాత్రములైన మట్టి,ఇనుము, ఇతర లోహములు మొదలైనవాని భేధరూపములైన కుండ, కొడవలి, హారములు, తట్టలు, గిన్నెలు మొదలైనవి ఏర్పడిన విధముగా పరమాత్మ కూడా వివిధములైన జగద్రూపములుగా ఏర్పడుచున్నాడని ఉపదేశించి నిరూపించినారు. ఈ విషయమున కార్యా కార్యములకు (అకార్యము - కారణము) కుండ-మట్టివలెపేరుతో మాత్రమేభిన్నత్వము. కారణములైన మట్టి,ఇనుము,బంగారము మొద లైనవి మాత్రమే సత్యమైనవి. అట్లే ఇక్కడ(పరమాత్మ- జగత్తుల విషయ మున) కూడాఆకాశాది పంచభూతములకునామమునమాత్రమే భేధము. వీనికి కారణమైన బ్రహ్మమే సత్యము అని నిరూపింపబడినదని అర్ధము. "యథా సోమ్యైకేన మృత్పిండేన విజ్ఞాతేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యవ సత్యం యథా నామైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాత్. తథా ఏకేన నఖనికృంతనేన సర్వం కార్ష్ణాయసమితి" - మట్టి అనే విషయము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో. "మకుట కుండలకంకణకింకిణీ పరిణతం కనకం పరమార్థతః, మహదహం కృతిఖప్రముఖం తథా నరహరేర్న పృథక్పరమార్థతః". 38

తెలిసినంతనే ఘటాదులు మొదలైనవి మట్టితోచేయబడినవని తెలియును. వాక్కు వ్యవహారమాపమైన వికారమే కుండ,కడవ మొదలైన పేర్లన్నియు. ఇవన్నియు మట్టేఅనేది సత్యము. ఇనుపఇరుసు,చీల అనే పేరు మాత్రమేవేరు కానీఅంతయూ ఇనుమే అని తెలియగలదు. వాని నుండి ఒకముక్కను వేరుచేసినను అదిఇనుమే-అనిఈవిషయమున శ్రుతిప్రమాణము. ఈ జగత్తు సత్య మనుటకు ప్రమాణములేనందువల్ల ఈఅసత్యమైన మనోవిలాసమును సత్యమనితెలిసినవారుఅజ్ఞానులు. 'వివాదమునందు ఆరోపితమైనది సత్యముకాదు. సృష్టికిముందు-ప్రళయముతరువాత లేనందువలన, వికారమైనందువలన, భౌతికముగా ఉపాధులతో కనపడినప్పుడు కూడా ముత్యపుచిప్ప యందలి వెండివంటిదనే అన్వయమందు(ముత్యపు చిప్ప యందలి తెల్లని కాంతి వంతమైన భాగమును వెండిగా భ్రాంతి పడుటవలె) ఆత్మవంటిది(జగత్తు కాదని) వ్యతిరేకరూపమైన దృష్టాంతమేవ్యవహారము.

మకుట కుండలకంకణకింకిణీ
పరిణతం కనకంపరమార్థతః ।
మహదహంకృతిఖ ప్రముఖం తథా
నరహరేర్న పృథక్పరమార్థతః ॥

కిరీటము, కుండలము,కడియము, చిరుగజ్జెలుగా మార్పు చెందినది బంగారము మాత్రమే వాస్తవముగా ఉన్నది. అట్లే మహత్తు, అహంకారము, పంచభూతములు వేరుగా ఉన్నట్లు అనిపించిననూ వాస్తవముగా అవన్నియు శ్రీనరహరి కంటే భిన్నములుకావు. 38

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ



శ్లో॥ స యదజయాత్వజా మనుశయాత గుణాంశ్చ జుషన్
భజతి సరూపతాం తదను మృత్యుమపేతభగః ।
త్వముత జహాసితా మహిరివ త్వచమాత్త భగో
మహసి మహీయసేఽష్టగుణితే పరిమేయ భగః ॥ 39

టీ:- నను యది ప్రపంచో నామ నాస్త్యేవ నచాసతా తేన చైతన్యస్య సంబంధగంధోఽపి. తర్హి కిమపదార్థం జీవేన. యతః అయం సంసరతి కింవా బహుపుణ్యమీశ్వరస్య. యతో నిత్యముక్తః. కిం విషయం చ తదా కర్మ కాండమిత్య పేక్షాయాం జీవేశ్వరవిశేషం. శ్రు. "ద్వాసుపర్ణా సయుజా సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే. తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి. అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామి" త్యాద్యా వదంతీత్యాహ- స ఇతి. సతు జీవః యత్ యస్మాదజయా మాయయా అజామవిద్యా మనుశయాత ఆలింగేత తతః గుణాంశ్చ దేహేంద్రి యాదీన్ జుషన్ సేవమానః ఆత్మతయా అధ్యస్యన్. తదను తదనంతరం సరూపతాం తద్ధర్మ యోగం చ జుషన్ ఆపేతభగః పిహితానందాదిగుణస్సన్ మృత్యుం సంసారం భజతి ప్రాప్నోతి తద్విషయ మేవ చ కర్మకాండమితి భావః . త్వముతస్తిత్వం తు జహాసితాం అజాం మాయాం నను సామయ్యేవాస్తి కథం తత్త్యాగస్తత్రాహ-అహిరివ త్వచమితి. అయంభావః యథా

ప్రపంచమే లేదని అన్నట్లయితే అసత్యమైనదానికి చైతన్య రూపము యొక్క సంబంధవాసనకూడా ఉండదు. అయినప్పుడు ఈజీవుడు ఏమి అపరాధము చేసినందువలన ఈసంసారజంజాటమున పడినాడు. ఈశ్వరుడు ఏమి పుణ్యముచేసినాడు తాను నిత్యము ముక్తుడగుటకు. అట్లయితే కర్మకాండ ఎందుకు అనే విషయమై జీవేశ్వరుల విశేషమేమి అనేదానికి'ద్వాసుపర్ణా సయుజా సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే. తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి. అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపాన్"-సమానమైన మిత్రులైన పక్షులు ఒకే వృక్షమును సమానముగాఆశ్రయించి యున్నవి. వాటిలోఒకటి రుచికరమైన పిప్పల పత్రమును ఆరగించుచున్నది. మరొకటి ఫలమును తినకుండా చూచుచున్నది. ఎరుపు, నలుపు, తెలుపు వర్ణములతో పుట్టుకలేని ఒకానొక మాయను ఆకారముతోనున్న ప్రజలను పుట్టించుటకై - పరమాత్మ సృజించినాడని ఈ మొదలైన శ్రుతులు చెప్పుచున్నవని చెప్పుచున్నాడు. జీవుడు పుట్టుకలేని మాయచేత అవిద్యను ఆశ్రయించి దేహేంద్రియాది గుణములను ఆత్మభావనచేత సేవించుచు వానివాని ధర్మములరూపమును పొంది కప్పబడిన (వంచనతోకూడిన) ఆనందమును అనుభవించుచు మృత్యురూపమైన సంసారమునుపొందుచున్నాడు. కర్మలను చేయుటయే ఆనందము (పరమాత్మ) అనే భావనతో ఉన్నాడు. నీవు(పరమాత్మ)మాత్రము మాయను వదిలితివి. ఆమాయ పరమాత్మ యందు మాయలేకపోవుటకు

భుజంగః స్వగతమపి కంచుకం గుణబుద్ధ్యా నాభిమన్యతే. తథా త్వం అజాం న వా నిరంతరాహ్లాది సంవిత్కామధేను బృందపతే రజయా కృత్యమితి తాముపేక్షస ఇతి. కుత ఏతత్తదాహ- ఆత్తభగః నిత్యప్రాప్తైశ్వర్యః మహసి పరమైశ్వర్యేఅష్టగుణితే అణిమాద్యష్ట విభూతిమతి మహీయసే పూజ్యసే రాజసే. కథం భూతః అపరిమేయ భగః అపరిమితైశ్వర్యః, నహ్యన్యేషామివ దేశాకాలాది పరిచ్ఛిన్నం తవ అష్టగుణితమైశ్వర్యం అపితు పరిపూర్ణ స్వరూపాను బంధిత్వాదపరిమిత మిత్యర్థః. శ్లో. నృత్యంతీ తవ వీక్షణాంగణగతా కాలస్వభావాదిభిర్భావాన్ సత్త్వరజస్తమోగుణమయానున్మీలయంతీ బహూన్, మామా క్రమ్య పదా శిరస్యతిభరం సంమర్దయంత్యాతురం మాయా తే శరణం గతోऽస్మి నృహరే త్వామేవ తాం వారయ. 39

దానిని త్యాగముచేయుటకేకారణమని చెప్పుచున్నాడు- సర్పము తనయందే ఉన్న చర్మమును(కుబుసమును) వాస్తవముగా గుణము బుద్ధితో తనదనిభావించని విధముగా మాయ నిరంతరము ఆహ్లాదమును కలిగించదని, అది ఎడతెగకుండా కోరికలను కలిగించి భోగములపట్ల ఆసక్తిని వృద్ధిపొందించునని దానిని ఉపేక్షించితివి. మాయ (విషయ) త్యాగము ఎట్లుఅనేవిషయమును చెప్పుచున్నాడు -నిత్యము ఐశ్వర్యము(ఈశ్వరభావమును) పొంది,అణిమాది అష్టసిద్ధులతో కూడిన అపారమైన ఐశ్వర్యముతో ప్రకాశించుచున్నావు. పరిపూర్ణ స్వరూపము వలన పరిమితులు లేనివాడవని అర్థము.

నృత్యంతీ తవవీక్షణాంగణగతా కాలస్వభావాదిభి
ర్భావాన్ సత్త్వరజస్తమోగుణమయానున్మీలయంతీ బహూన్ ।
మామాక్రమ్య పదా శిరస్యతిభరం సంమర్దయంత్యాతురం
మాయా తే శరణంగతోऽస్మి నృహరే త్వామేవతాం వారయ ॥

నీ కనుచూపు మేరను పొంది, కాలము, స్వభావము మొదలైన వానితో సత్త్వము, రజస్సు, తమస్సులనే గుణములుగల పెక్కుభావములను ప్రేరేపించుచు అశక్తుడనైన నాతలపై మిక్కిలి బరువైన పాదములతో ఆక్రమించి నీమాయ నన్ను త్రొక్కుచున్నది. ఓ నరహరీ ఆమాయ బాధను భరించలేక (నీ మాయను పరిహరించి నాకు జనన మరణ బాధ కలుగకుండ చేయుమని భావము) నేను నిన్ను శరణుపొందు చున్నాను. నీవే దానిని నివారించుము. 39

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ యది న సముద్ధరంతి యత యోహృది కామజటా
దురధిగమో సతాం హృది గతోఽస్మృత కంఠమణిః ।
అసుతృపయోగినాము భయతోఽప్యసుఖం భగవ
న్ననపగతాంతకాదనధిరూఢపదాద్భవతః ॥ 40

టీ:- ఏవం తావదుక్తసాధనకదంబేన యే భగవంతం భజంతి తే మృత్యుం తరంతి ఇతరే సంసరంతీత్యుక్తం. ఇదానీ యే బహిస్సంగం పరిత్యజ్య భగవన్మార్గే ప్రవృత్తా అపి కథంచిత్ అంతః వాంతాశనవత్ సకలకామాన్నముంచతి తే భగవంతం ప్రాప్నువంతి. న చేహ సుఖం లభంతే. కేవలం కుయోనీరేవ ప్రాప్నువంతీతి. తాన్ శోచన్. శ్రు. "కామాన్ యః కామయతే మన్యమానస్సకామకర్మభిర్జాయతే తత్ర తత్రేత్యాది శ్రుత్యర్థమాహ-యదీతి. హే భగవన్. యే యతయః హృదిస్థితాః కామజటాః కామస్య జటాః మూలాజ్ఞానవాసనాః. యదిన సముద్ధరంతి నోత్పాటయంతి తేషామసతాం భవాన్ త్వం హృదిగతోఽపి దురధిగమః దుష్ప్రాపః కథం అస్మృతకంఠమణిః విస్మృతో యః కంఠమణిఃతత్తుల్యః. స యథా కంఠే వర్తమానోఽప్యస్మృతశ్చేదప్రాప్త ఇవ భవతి తద్వదితి. న కేవలమేతావత్. అపితు అసుతృపయోగినామింద్రియతర్పణపరాణాం యోగచ్ఛద్మనాం. ఉభయతోఽప్యసుఖం ఇహాముత్ర చ దుఃఖమేవ. తదాహ - అనపగతాంతకాత్ అని

ఈవిధముగా సాధన సముదాయములచేత భగవంతుని సేవించినవారు మృత్యువును జయింతురు. ఇతరులు అనగా భగవంతుని సేవించనివారు జనన మరణ చక్రమున పడుదురని చెప్పబడినది. ఇప్పుడు ప్రపంచసంబంధమును విడిచిపెట్టి భగవంతుని మార్గమున ప్రవర్తించువారు కూడా మధ్యలో ఎట్లైనను కక్కిన ఆహారమును భుజించినట్లు ఎల్లకోరికలను వదలకపోయినను వారు భగవంతుని పొందుచున్నారు. అయితే వారు ఈలోకమున సుఖమును పొందలేరు. వారు కేవలము నీచజన్మలనే పొందుచున్నారు. "కామాన్ యః కామయతే మాన్యమానస్సకామకర్మభిర్జాయతే తత్ర తత్ర' - కోరికలను గురించి చింతనచేయుచు కామకర్మలచేత కోరుకొనువాడు ఆయా (నీచ) యోనులందు పుట్టుచున్నాడు. -మొదలైన శ్రుతుల అర్థమును చెప్పుచున్నాడు.- ఓభగవంతుడా! యతీశ్వరులకు కూడా తమ మనస్సులందలి కామజటలను అనగా(సర్వానర్థములకు) మూలమైన అజ్ఞాన వాసనలను పెకిలించివేయలేకున్నారు. అట్టి దుష్టులైనవారికి నీవు(పరమాత్మ) హృదయమందున్నను వారు నిన్ను పొందలేక తమనుతాము ఉద్ధరించుకొనలేరు. తమ మెడలోని మణి(కంఠమణి)ని మరిచిపోయి అదిపోయినదని భావించునట్లు దుష్టులు తమలోని పరమాత్మను గుర్తించలేరు. కంఠమునందు మణి ఉన్నను మరచిపోయినట్లయితే అది లేనిదాని వలెనే (పొందలేని దాని

వృత్తాన్మృత్యోర్లో కారాధన ధనార్జనాది క్లేశాత్ భోగవైభవప్రాకట్య భయాచ్చ ఇహ తావద్దుఃఖం భవతః ఈశ్వరాదపి దుఃఖం. కథం భూతాత్ అనధిరూఢపదాత్ అనధిరూఢం పదం స్వరూపం యస్య తస్మాత్. త్వత్స్వ రూపప్రాప్త్యభావాత్ అవిద్యావద్విషయత్వేన ప్రాప్తనిజకర్మాతి క్రమ నిభంధనత్వద్దండరూపనరకప్రాప్తేః అముత్రాప్యసుఖమిత్యర్థః. శ్లో. "దంభన్యాసమిషేణ వంచితజనం భోగైకచింతాతురం

సమ్ముహ్యాంత మహర్నిశం విరచితోద్యోగక్లమైరాకులమ్,
ఆజ్ఞాలంఘినమజ్ఞ మజ్ఞ జనతాసమ్మాన నాదున్మదం
దీనానాథ దయానిధాన పరమానంద ప్రభో పాహి మామ్. 40

వలెనే) అగును. ఇంతమాత్రమే కాదు. ఇంకను విశేషముగా ఇంద్రియలాలసులై యోగులనే మోసపు వేషమున ఉన్నవారు ఇహపరములు రెండింటికి భ్రష్టులగుదురు. వారికి ఈలోకమున సుఖముండదు. పరలోకమున సుఖముండదనే విషయమును చెప్పుచున్నాడు - లోకారాధనతో అనగా లోకమును వంచించి అపారముగా ధనమును సంపాదించి దానిని దాచుకొనలేక భోగములతో వైభవమును అనుభవించినచో ధనము తరిగిపోవునను దుఃఖముతో దుఃఖమే కలుగును. కోరికలతో జననమరణచక్రము తొలగనందువల్ల దుఃఖమే. పరమేశ్వరునివలన కూడా వారికి దుఃఖమే కలుగును. పరమాత్మ స్వరూపమును పొందలేరు. అజ్ఞానముతో ప్రాపంచిక వ్యామోహముతో తన కర్మలబంధమును విడిపించుకొనలేక పరమాత్మను పొందలేక దానికి శిక్షగా నరకమును పొందుటవలన పరలోకమున దుఃఖమే కలుగును.

దంభన్యాసమిషేణ వంచితజనం భోగైకచింతాతురం
సంముహ్యాంతమహర్నిశంవిరచితోద్యోగక్లమైరాకులమ్।
ఆజ్ఞాలంఘినమజ్ఞమజ్ఞ జనతాసమ్మానదుర్మానదం
దీనానాథ దయానిధాన పరమానంద ప్రభోపాహి మామ్ ॥

నేను ఈలోకమున మోసగించుచున్న విషయము తెలియనీయక దాచిపెట్టి జనులను వంచించుచు, భోగములపట్ల మాత్రమే ఉత్సాహము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ త్వదవగమీ నవేత్తి భవదుత్థ శుభాశుభయో
ర్గుణ విగుణాన్వయాంస్తర్హి న దేహభృతాంచ గిరః।
అనుయుగమన్వహం స గుణగీత పరంపరయా
శ్రవణభృతో యతస్త్వమపవర్గగతిర్మనుజైః॥ 41

టీ:- నను యతేర్న కిమపి కృత్యమస్తి ప్రారబ్ధమపి సుఖోపభోగేనా పక్షీయతే - అతః కిమితి వృధా శప్యతే ఉభయతోऽప్యసుఖమితి. శ్రూయతే శ్రు. "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య. న కర్మణా వర్ధతే నో కనీయాని" త్యాదితత్రాహ-త్వదవగమీతి.హేసగుణ షడ్గుణైశ్వర్య

కలవాడనై, నిరంతరము చిత్తవైకల్యముతో, (కోరికల వ్యామోహముతో) నాకోరికలను సాధించుకొనుటకై అక్రమ ప్రయత్నములు చేయుచు, ఆ ప్రయత్నమున అలసిపోయితినని కలత చెందుచు, న్యాయధర్మముల పరిధిని అతిక్రమించిన అజ్ఞానముతో, పెక్కురు అజ్ఞానుల గౌరవమును పొంది మదించిన నన్నుదీనులు, అనాథులపట్ల దయగలవాడవై, పరమానందరూపుడవైన ఓస్వామీ! ఉద్ధరించి రక్షించుము అని శ్రీధరస్వామి ప్రార్థించినాడు. లోకవంచనయే సార్వత్రికమైన మానవ నైజమనే విషయమును స్పష్టపరచినాడు. 40

అయితే ప్రారబ్ధము అనగా ఈ జన్మలోచేసిన పాపపుణ్యముల ఫలరూపమైన దుఃఖము,సుఖములు అనుభవించిననేగానీ తొలగవు. అన్నప్పుడు పరమాత్మప్రాప్తికై ఎంతప్రయత్నించినను ఉపయోగము కలుగనప్పుడు ఇహపరములు రెండింటను సుఖములేదని వ్యర్థముగాశపించుట ఎందుకు? "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య. న కర్మణా వర్ధతే నో కనీయాని"- కర్మలు చేయుట ఫలమును అనుభవించుటలు జీవునికి నిత్యము.అది పరమాత్మ మహిమ. కర్మవల్లభోగములు వృద్ధిపొందవు- క్షీణించవు.అని శ్రుతులు చెప్పుటవలన పరమాత్మజ్ఞానమును పొందినవాడు కూడా ఈలోకమున కలుగు శుభాశుభములు అనగా నీవే(పరమాత్మయే)కర్మకు ఫలమును

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

యుక్త, త్వదవగమీ త్వజ్ఞానవాన్. భవదుత్థశుభాశుభయోః భవతః కర్మఫలదాతుః ఈశ్వరాద్ధేతోః ఉత్థయోరావిర్భూతయోశ్శుభాశుభయోః ప్రాచీన పుణ్యా పుణ్య కర్మణోః ఫలభూతాన్ గుణవిగుణాన్వయాన్ సుఖదుఃఖ సంబంధాన్ నవేత్తి నాను సంధత్తే. తర్హి తదానీం చ. దేహభృతాం దేహాభిమానినాం ప్రవృత్తికర్మ కరీర్గిరః విధినిషేధలక్షణాః న వేత్తి విగత దేహాభిమానతయా కార్యావబోధా భావాన్న నియుజ్యత ఇత్యర్థః. యుక్తం చైతత్. యతః కారణాత్ నుజైరన్వహం శ్రవణభృతః అనుదినం శ్రవణేన చేతసి ధృతః త్వం తేషామపవర్గగతిః అపవర్గరూపా గతిర్భవసి కథం శ్రవణభృతః. అనుయుగం ప్రతియుగం యా గీతపరంపరా ఉపదేశసంతతిః తయా సంప్రదాయానుసారేణేత్యర్థః. ఏతదుక్తం భవతి. యే తావత్తత్త్వజ్ఞానినః న తేషాం కర్మాధికారశంకాపి యే చ అనవరతం త్వత్కథా శ్రవణాదినిష్ఠాః తేషామప్యాసన్న భవత్పదానాం న విధినిషేధభావః ఇతి రేషాం తు యోగచ్ఛద్మనా ఇంద్రియలాలసానాం ఉభయతోఽప్య సుఖ మితి శ్లో. అవగమం తవ మే దిశ మాధవ స్ఫురతి యన్నసుఖాసుఖసంగమః, శ్రవణ వర్ణనభావమథాపి వా న హి భవామి యథా విధికింకరః. 41

ప్రసాదించు ఈశ్వరుడవైన కారణముచేత పూర్వపుణ్య పాపకర్మలకు ఫలమైన మంచి చెడ్డ గుణములను, వానికి సంబంధించిన సుఖ దుః ఖములను తెలియలేడు. అప్పుడుకూడా శరీరధారులకు ప్రకృతి సంబంధముగా కర్మలు చేయుట తప్పదనే మాటకు విధి, (తప్పక చేయదగినది) నిషేధము (చేయగూడనిది) అనే లక్షణాలు తెలియలేడు. అనగా దేహాభిమానము లేకుండాకానీ, కార్యజ్ఞానము లేకుండా అనగా ఫలకాంక్షరహితముగాకానీ కర్మలు చేయవలెనని అర్థము. ఇదే సరియైనది. ఈ కారణముచేత మనుష్యులు నిరంతరము పరమాత్మను గురించి వినుటచేత (భావన చేత) వారి మనస్సునందు స్థిరముగా నిలిచినవాడివై నీవే వారికి మోక్షరూపమగు మార్గమగుచుంటివి. ప్రతియుగమున గీత పరంపరలచేత కలిగిన ఉపదేశ సముదాయము లను ములను అనుసరించి శ్రవణము చేయవలెను. ఈవిధమైన తత్త్వజ్ఞానము కలవారికి కర్మాధికరాశంక ఉండదు. వారు ప్రాపంచిక ధర్మముగా మాత్రమే కర్మలను చేయుదురు కాని వారికే మాత్రమూ ఫలాకాంక్ష ఉండదని భావము. వారు నిరంతరము పరమాత్మకథలు వినుటయందే నిష్ఠగలవారు. వారికి విధి నిషేధములు (ఈ పని మంచిది, ఇది చెడ్డది అనేవి) ఉండవు. ఎందుకంటే వారు నిత్యము పరమాత్మపాదములచెంతనే ఉందురు. అట్లుగాక పరమాత్మ భక్తులమనెడు కపటముతో ఇంద్రియభోగములపట్ల ఆసక్తులైనవారికి

శ్లో॥ ద్యుపతయ ఏవ తేన యయురంత మనంతతయా
త్వమపి యదంతరాండనిచయా నను సావరణాః ।
ఖ ఇవ రజాంసి వాంతి వయసా సహ యచ్ఛ్రుతయ
స్త్వయి హి ఫలంత్యతన్నిరసనేన భవన్నిధనాః ॥ 42

ఇహపరసుఖములు కలుగవని నిర్ణయము.

అవగమం తవమేదిశ మాధవ
స్ఫురతి యన్న సుఖాసుఖసంగమః ।
శ్రవణ వర్ణనభావమథాపి వా
న హి మి భవామి యథా విధి కింకరః ॥(శ్రీధరీయము)

ఓ మాధవా! నాకు సుఖములపట్లగాని, దుఃఖములపట్లగాని సంబంధము కలుగనట్టి నీజ్ఞానమును నీవు ప్రసాదించుము. లేక నిన్ను గురించి వినుటనుగానీ, నిన్ను మననము చేయుటనుగానీ ప్రసాదించుము. నేను కృత్యాకృత్యములకు బానిసను కాకుండునట్టి విధానమునే నీవు నాకు ప్రసాదింపుము. 41

పరమాత్మను ఎరిగిన వానికి సుఖదుఃఖములు కాని, విధి నిషేదములుకాని ఉండవని చెప్పబడినది. అట్లయితే అర్థము చేసుకొనుటకు వీలుకాని పరతత్త్వమును అర్థము చేసుకొనగల శక్తి ఎక్కడిది అని శంకించి – ఈ విషయము సత్యమే అయినను అర్థము కాని మహిమగల అనగా వాక్కులకు, మనస్సుకు అందని విషయత్త్వము (నిర్విషయము) వలననే జ్ఞానము కలుగునని"యాదూర్ధ్వం గార్గి, దివో యదర్వాక్ పృథివ్యా యదంతరా ద్యావా పృథివీ ఇమే యద్భూతం భవచ్చ భవిష్యచ్చ"– ఓగార్గీ ! ఈజగత్తుకంటేపైన (సర్వవిశేషమై, అసద్వి

టీ:- త్వదవగమీ న వేత్తి సుఖ దుఃఖేన చ విధినిషేధావిత్యుక్తం. తత్ర నను కథమవగతుం శక్యం దురవగమత్వస్యోక్తత్వాదిత్యేవమాశంక్య సత్యమే వేదం అనవగాహ్యమహిమ్నోఽ వాఙ్మనసగోచరత్వాదవిషయత్వే నైవ జ్ఞానముక్తమితి దర్శయన్. శ్రు."యాదూర్ధ్వం గార్గి, దివో యదర్వాక్ పృథివ్యాయదంతరాద్యావాపృథివీ ఇమే యద్భూతం భవచ్చ భవిష్యచ్చే" త్యాది శ్రుతి ప్రతిపాదితమపరిమిత మహిమాన మహ-ద్యుపతయితి. హే భగవన్ తే అంతం ద్యుపతయః స్వర్గాదిలోకపతయః బ్రహ్మాదయోఽసి న యయుః న ప్రాపుః తత్కుతః యదంతవద్వస్తు తత్కిమపి త్వం న భవసి ఆస్తాం తావద్యుపతయో న యయురితి. యద్యస్మాత్త్వమపి ఆత్మనోఽంతం నయాసి కుతస్తర్హి సర్వజ్ఞతా సర్వశక్తితా వా అత ఆహ - అనంతతయా అంతాభావేన న హి శశవిషాణాజ్ఞానం సార్వజ్ఞ్యం తదప్రాప్తిర్వా శక్తివైభవం విహంతి అనంతత్వమేవాహ- యదంతరేతి. యస్య తవ అంతరా మధ్యే. నను అహో. సావరణాః ఉత్తరోత్తర దశ గుణ సప్తావరణ యుక్తాః. అండనిచయాః బ్రహ్మాండసమూహాః. వాంతి పరిభ్రమంతి వయసా కాలచక్రేణ. ఖేరజాంసీవ. సహ ఏకదైవ న తు పర్యాయేణ. హి యస్మాదేవం అతశ్రుత స్త్వయి ఫలంతి తాత్పర్యవృత్త్యా పర్యవస్యంతి. న తు సాక్షాద్వదంతి అయమేతావానితి. సగుణస్యగుణానంత్యాత్. నిర్గుణస్య చాగోచరత్వాత్. కథం తర్హ్య పదార్థే తాత్పర్యమితి. తత్ర

లక్షణముగా) (ఆకాశమునకంటే ముందుగా, ఆధునికములైనపృథివి మొదలైన పంచభూతము పిమ్మట (ప్రళయాంతరము) ఈ భూమ్యా కాశముల మధ్యభాగమున సార్వకాలికముగా పరమాత్మ ఉండినది (భూతము) ఉంటున్నది (వర్తమానము) ఉండగలది (భవిష్యత్తు) అని శ్రుతులు ప్రతిపాదించిన అపారమైన మహిమగల వాడనే విషయము 'ద్యుపతయ'అని ఇందు చెప్పబడినది. ఓ పరమాత్మా! నీ చివరను స్వర్గాదిలోకముల అధిపతులు, బ్రహ్మాదులు కూడా పొందలేరు. అందువల్ల అంతమున్న (నాశమున్న) వసువులలో దేనివలెను నీవు కాదు. (జగత్తులో దేనిమాదిరి నీవు లేవని భావము). అందుకే ఎంతటి వారునూ నిన్ను పొందలేరు. అయితే నీవు కూడా ఆత్మను పొందలేకపోతే నీకు సర్వజ్ఞత్వము, సర్వ శక్తులు ఎట్లు సంభవించ గలవు. అనే విషయంమై చెప్పుచున్నాడు - నీ అనంతత్వము వలననే నీకుఅంతములేకపోయినది (అనంతత్వమున్నందున అంతములేదని- తెలియరాదని). అంతేకాని అది శశవిషాణము (కుందేటి కొమ్ము)వలె అత్యంతముగా అభావమైనది (అసలే లేనిది) కాదు. లోకమున అసలేలేని దానిని తెలియ లేకపోవుటఅశక్తతకాదు. నీవునిండిన ఈ జగత్తులో ఆయా ఆవరణములకు (పరిమితులకు)లోనై అనగా పది గుణములు, (దశేంద్రియములు) సప్తావరణములు అనే వానితో కూడిన బ్రహ్మాండ సముదా యములు- ఆకాశమునందలి ధూళి వలె

విధిముఖవాక్యే భవేదేవం నియమః పదార్థస్యైవ వాక్యార్థత్వమితి. నిషేధముఖేతు నాయం నియమ ఇత్యాహ– అతన్నిరసనేనేతి. శ్రు. ''అన్యదేవ త్వదిదితాదధోఽవిదితాత్. అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాదన్యత్రాస్మాత్కృతాత్. అస్థూలమనణ్విత్యా'' ది ప్రకారేణ లక్షణయా చ తత్త్వమసీత్యాదయః పర్యవసంతీతి, న చ వాచ్యం నిషేధైశ్శూన్యమేవ జ్ఞాప్యత ఇతియతః భవన్నిధనాః భవతి త్వయి నిధనం సమాప్తిః యాసాం తా స్తథా. న హి నిరవధిర్ని షేధస్సంభవతి. అతః అవధిభూతేత్వయి ఫలంతీత్యర్థః. శ్లో. ద్యుపతయో విదురంత మనంత తేన చ భవాన్నగిర శ్శృతి మౌళయః, త్వయి ఫలంతి తు తానతదిత్యతో జయజయేతి భజే తవ తత్పదమ్. (42–43)

కాలచక్రమునందు ఒక్కోసారి తిరుగుచున్నవి. అంతేగానీ ఒక క్రమముగా మాటి మాటికి తిరగకున్నవి. ఇది ఇట్లున్నందు వలననే శ్రుతులునీయందే తాత్పర్యవృత్తిచేత ఫలించు చున్నవి,ముగియుచున్నవి. అంతేకాని పరమాత్మ ఇట్టివాడని నిష్కర్షగా చెప్పలేదు. అనంతమైన గుణము లుండుటవలన నిర్గుణమైనందువలన కనపడక (తెలియరాక) పోవుటవలన అనగా అపదార్థమైన దాని యందు (పదార్థముకాని దానిలో) తాత్పర్యమెట్లుకుదురును? విధి (ఇట్లు చేయవలెను) అనేది ముందుగా ఉన్న వాక్యమునందు ఇదిఇట్లేఉండును. (భవే దేవం). అనే నియమము అనే పదముయొక్క అర్థమునకే వాక్యార్థత్వముసిద్ధమని అర్థము. నిషేధము (ఇట్లు చేయకూడదు) అనేది ముందుగా ఉన్నవాక్యము నందు–ఇది ఇట్లుండదు.(న అయం) అనేదినియమము. అని చెప్పుచు న్నాడు–''అన్యదేవ తద్విదితాదధోఽవిదితాత్. అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాదన్యత్రాస్మాత్ కృతాత్.అస్థూలమనణు''– పరమాత్మ తత్త్వము తెలిసిన పిమ్మట దానికంటే వేరుగా తెలియవలసినసిన దేదియునూ లేదు. ఒకచోట ధర్మముగా, మరొకచోట అధర్మముగా, దీనివలన ఒకచోటమంచి, మరొకచోట చెడు ఉండ (లేనందు) నందువలన ఇది స్థూలమైనదికాదు. సూక్ష్మముగా కాదు. మొదలైన విధముగా లక్షణావృత్తిలో'తత్త్వమసి' అదే నీవు అగుచున్నావని వేదవాక్యములు ముగించుచున్నవి. వాచ్యము నిషేధములచేత

శ్రీ భగవానువాచ

శ్లో॥ ఇత్యేతద్బ్రహ్మణః పుత్రా ఆశ్రుత్యాత్మాను శాసనమ్ ।
సనందనమథానర్చుస్సిద్ధా జ్ఞాత్వాత్మనో గతిమ్ ॥ 43

శూన్యమైనదనికాదు. అనగా పరమాత్మ శూన్యము కాదని గుర్తుచేయుచున్నవనుటకే– పరమాత్మ చిట్టచివరి ప్రాప్తిస్థానమని చెప్పుచున్నవి. ఈ నిషేధము(హద్దు) లేకుండా (నిరవధిః) ఉండదు. కనుక చిట్టచివరి హద్దు (మేర)గాఉన్న నీ యందే వేదములు ముగియుచున్నవని అర్థము.

ద్యుపతయో విదురంత మనంత తేన
చ భవాన్నగిరశ్శ్రుతి మౌళయః ।
త్వయి ఫలంతి తు తానతదిత్యతో
జయజయేతి భజే తవ తత్పదమ్॥ (శ్రీధరీయము)

నిన్ను గురించి బ్రహ్మాదిదేవతలుకానీ, వాక్కులుకానీ, వేదశిఖలైన ఉపనిషత్తులుకానీతెలియలేదు. అయితే అవన్నీ నీ యందేఫలించుచున్నవి. పర్యవసించుచున్నవి. కానీ నీవు అన్నింటికంటేవేరైనవాడవు. అట్టినీకు జయజయ శబ్దములు పలుకుచు నీపాదపద్మములను సేవింతును. 42

అని ఈవిధముగా బ్రహ్మమానసపుత్రులు,సిద్ధులు అయిన సనకాదులు పరమాత్మతత్త్వము తెలిసి సనందునిఅర్చించిరి. 43

ఈ విధముగా సర్వవేదములు, పురాణముల ఉపనిషత్తుల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఇత్యశేష సమామ్నాయ పురాణోపనిషద్రసః ।
సముద్ధృతః పూర్వజైస్తైర్వ్యోమ యానైర్మహాత్మభిః ॥ 44

టీ:- ఇతీతి. శ్లో. ఇత్య శేషసమామ్నాయపురాణో పనిషద్రస ఇతి సర్వ శ్రుతిపురాణ రహస్య తాత్పర్య మిత్యర్థః. 44

శ్లో॥ త్వం చైతద్బ్రహ్మదాయాద శ్రద్ధయాత్మాను శాసనమ్ ।
ధారయంశ్చర గాం కామం కామానాం నిధనం నృణామ్ ॥45

టీ:- త్వమితి. బ్రహ్మదాయాదేతి- బ్రహ్మైవ దాయమివ అప్రయత్న ప్రాప్యం అత్తి సేవత ఇతి తథా. బ్రహ్మ పుత్రేతి వా. 45

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏవం స్వగురుణాదిష్టం గృహీత్వా శ్రద్ధయాత్మవాన్ ।
పూర్ణశ్రుతధరో రాజన్నాహ వీరవ్రతో గురుమ్ ॥ 46

టీ:- ఏవమితి. పూర్ణః కృతకృత్యః. శ్రుతధరః శ్రుతమర్థం మనసి ధారయన్. వీర వ్రతః నైష్ఠికః. 46

రహస్య తాత్పర్యమును సనాతనులు, ఆకాశసంచారులు, మహాత్ములు అయిన సనకాదిమునీశ్వరులు చక్కగాఅనుభవించి ఆచరించినారు. 44

నారదా నీవు కూడా బ్రహ్మమును (జ్ఞానమును) అయత్నముగా పొందిసేవించుచు, లేక నీవునూ బ్రహ్మమానసపుత్రుడవే కనుక నీ జ్ఞాతులైన సనకాదులవలె ఆత్మజ్ఞానమున అనుభవములో, ఆచరణలో నిలుపుకొని కోరికలపట్ల ఆసక్తులైన మానవులకు ప్రాపంచికమైన అజ్ఞానమును నాశనము చేయుచూ ఈభూమి యందు సంచరించుమని భగవంతుడు చెప్పినాడు. 45

**శ్రీశుకుడిట్లు చెప్పినాడు**

ఓ రాజా! నారదుడు ఈ విధముగా పరమాత్మ గుణములను గురించి చెప్పిన జ్ఞాన విషయమును స్వీకరించి శ్రద్ధతో ఆత్మజ్ఞానమును పొంది కృతకృత్యుడై, విన్న అర్థమును మనస్సులో నిలుపుకొన్నవాడై నియమ నిష్ఠలతో గురువైన శ్రీకృష్ణుని అడిగినాడని శుకుడు చెప్పినాడు. 46

**నారదుడిట్లు చెప్పినాడు**

నారద ఉవాచ

శ్లో॥ నమస్తస్మై భగవతే కృష్ణాయామలకీర్తయే ।
యో ధత్తే సర్వభూతానామభయాయ సతీః కలాః ॥ 47

టీ:- నమఇతి. నమ ఇతి కృష్ణావతారతయా నారాయణం నమస్యతి- ఉక్తం హి. శ్లో."ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమి"తి. 47

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇత్యాద్యమృషి మామంత్ర్య తచ్ఛిష్యాంశ్చామలాత్మనః ।
తతోఽగాదాశ్రమం సాక్షాత్పితుర్ద్వైపాయనస్య మే ॥ 48

కృష్ణావతారములో నారాయణుని స్తుతించుచున్నాడు- నిర్మల కీర్తిగల ఓభగవంతుడవైన కృష్ణుడా! నీవు సర్వజీవులకు అభయమును ప్రసాదించుటకై సంపూర్ణకళలతో అవతారమును ధరించితివి. ఇతరములైన 'మత్స్య''కూర్మాది' అవతారములందు పరమాత్మ అంశమాత్రమే ఉన్నది. సకల కళాసంపూర్ణుడైన శ్రీకృష్ణుడుసాక్షాత్తుగా భగవంతుడే. 47

శ్రీశుకుడిట్లు చెప్పినాడు

అని ఈ విధముగా ఆదిఋషియైన నారాయణుని ఆయన శిష్యులను సెలవడిగి నిర్మలాత్ముడై, నాకు సాక్షాత్తుగా అనగా మాతృసంపర్కము లేకుండానే తండ్రిగారైన కృష్ణద్వైపాయనుని ఆశ్రమమునకు నారదుడు వెళ్ళినాడని శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పినాడు. (జనకమహారాజు చేయుచున్న యాగమున వ్యాసుడు అగ్నినిమథించు సమయమున ఒకానొక అరణియందు పడిన వీర్యమును ఆయన మథించగా- తల్లిగర్భమున నవమాసములుండుట అనే వ్యవధానము లేకుండా కేవలము తండ్రి వీర్యమునుండే జన్మించినవాడు శుకమహర్షి అని చెప్పుచున్నారు.) 48

వ్యాసాశ్రమమున వ్యాసమహర్షి నారదుని సగౌరవముగా

శ్లో॥ సభాజితో భగవతా కృతాసనపరిగ్రహః ।
తస్మై తద్వర్ణయామాస నారాయణముఖాచ్ఛ్రుతమ్ ॥ 49

శ్లో॥ తథైతద్వర్ణితం రాజన్ యన్నః ప్రశ్నః కృతస్త్వయా ।
యథా బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణేऽపి మనశ్చరేత్ ॥ 50

టీ:- ఇతీతి. సాక్షాత్ పితురితి. యోనివ్యవధానం వినా జనకస్య అగ్ని మథనావసరే కథం చిదరణౌ రేతః అధః పతితం మమంథ వ్యాసః. తదైవ తత ఉత్పన్నః- శుక ఇతి వదంతి. (48-50)

శ్లో॥ యోऽస్యోత్ప్రేక్షక ఆదిమధ్య నిధనేయోऽవ్యక్తజీవేశ్వరో
యస్సృష్ట్వేదమనుప్రవిశ్య ఋషిణా చక్రే పురశ్శాస్తితాః ।
యం సంపద్య జహాత్యజామనశయీ సుప్తః కులాయం యథా
తం కైవల్యనిరస్తయోనిమభయం ధ్యాయేదజస్రం హరిమ్॥ 51

టీ:- సమస్త వేదస్తుత్యర్థం సంగృహ్య అనుస్మారయతి- య ఇతి. యః అస్య విశ్వస్య ఉత్ప్రేక్షకః- ఇత్యేవ మనుశాయినా సమస్త పురుషార్థ సిద్ధయే సృష్టిస్థితిలయాః ప్రాపణీయా ఇత్యాలోచక ఇత్యర్థః. అనేన నిమిత్త త్వముక్తం. ఏవమాలోచ్య అస్య ఆదిమధ్యనిధనే ఆదిర్జన్మ, మధ్యం

ఆసీనుని చేసినాడు. పిమ్మట నారదమహర్షి ఆయనకు తాను బదరికాశ్రమమున ఆదిఋషియైన నారాయణుని వలన విన్న విషయమును వివరించినాడు. 49

ఓరాజా ! ఇది ఇట్టిదని నిర్దేశించుటకు వీలులేని నిర్గుణుడైన పరమాత్మయందు మనస్సు ఏవిధముగా చరించునని నీవు నన్నడిగిన ప్రశ్నకు సమాధానము ఈవిధముగా వర్ణితమైనది. 50

సమస్త వేదస్తుతి యొక్క అర్థమును సేకరించి జ్ఞప్తిచేయుచున్నాడు. పరమాత్మ ఈసర్వజగత్తుకూ ఉత్రేక్షకుడు (పైనుండి సర్వమును దర్శించువాడు) అని చెప్పి మరల అతడే ఈజగత్తునందలి సమస్తమున ఉండి (అనుశయించి) సర్వపురుషార్థములను, సిద్ధింపచేయుట కొరకు సృష్టి, స్థితి, లయములను కలిగించుటకు సంకల్పించినాడని అర్థము. దీని వలన పరమాత్మకు జగన్నిర్మాణమున నిమిత్తత్వమున్నదని చెప్పబడినది. అని పరమాత్మ ఈ విధముగా ఆలోచించి ఈ జగత్తునకు ఆది - జన్మ, మధ్యం -పరిపాలనము, నిధనం - నాశము - అనే కర్మలందు ఆయనే వర్తించుచున్నాడు. దీనివలన పరమాత్మయే ఈ జగత్తునకు ఉపాదానమని సిద్ధమైనది.

పాలనం, నిధనం అంతః, యేషు కర్మసు యో వర్తతే. అనేనోపాదానత్వ ముక్తమ్. నను ప్రకృతి పురుషయోరుపాదాన నిమిత్తత్వే ప్రసిద్ధే సత్యంత యోరపి తత ఏవోద్భూతత్వాన్మూలకారణం స ఏవేత్యాహ– యో వ్యక్తజీవేశ్వర ఇతి. ప్రవేశనియమనే, దర్శయతి య ఇతి. పూర్వోక్త ప్రకారేణ ఇదం సృష్ట్వా– యదర్థమేతత్స ృష్టం తేన ఋషిణా సృష్టే కార్యే అహమితి దర్శనాదృషిర్జీవః తేన సహానుప్రవిష్టః పురః శరీరాణి తస్య భోగాయతనాని చక్రే– తాః పురః శాస్తి తస్య భోగం దధత్పరి పాలయతి. ఉపాసకస్య చ కైవల్యరూపో భవతీత్యాహ–యం సంపద్యేతి. యం సంపద్య ప్రాప్య అనుశయీ అన్వనుదండవత్ప్రణామైశ్చరణ మూలే శేత ఇతి తథా సః జీవః. అజాం కార్యకారణ లక్షణాం అవిద్యాం. జహాతి త్యజతి. నను బ్రహ్మసంపన్నస్యాపి జీవస్య తత్సంబంధో దృశ్యతే అత ఆహ– సుప్తః కులాయం యథేతి. అయం భావః– యథా సుప్తం శరీరవంతమన్యే పశ్యంతి సతు నాత్మానం తథా పశ్యతి. ఏవం జీవన్ముక్త మపి అన్యే దేహవంతం పశ్యంతి. స తు న కించిత్పశ్యతీతి తం హరిం అజస్రం అనవరతం ధ్యాయేత్. కిమిత్యత ఆహ– అభయం న భయం యస్మాత్ భయనివర్తకమిత్యర్థః. కుత ఏతత్? కైవల్యనిరస్తయోనిం కైవల్యేన అప్రచ్యుత స్వరూపావస్థా నేన నిరస్తా తిరస్కృతా యోనిః మూలకారణం మాయా యేన తం. హరిం ధ్యాయేదిత్యన్వయః. శ్లో. సర్వ శ్రుతిశిరోరత్న విరాజిత పదాంబుజమ్, భోగయోగప్రదం వందే

అయితే ప్రకృతికి – ఉపాదానత్వము, పురుషునికి – నిమితత్వములు సత్యమని ప్రసిద్ధియున్నను ఆ రెండిటిలో పరమాత్మనుండే ప్రకృతి ఉద్భవించినందు వలన మూలకారణము – పరమాత్మయే అనే విషయమును– 'వ్యక్తజీవేశ్వరః'అనిచెప్పుచున్నాడు – జగత్తున తానే ప్రవేశించి దానిని నియమించి చూపుచున్నది అతడే అని ముందుచెప్పిన విధముగా జగత్తును సృష్టించినాడు. జ్ఞానసారముగల ఋషిచేత సృష్టి కలుగగా 'నేను'అనే భావముతో చూచువాడు – జీవుడు. ఆ జీవుని యందు తానేచేరి, ఆ జీవుని భోగములకు స్థానములైన శరీరములను నిర్మించినాడు. ఆ శరీరమును శాసించుచు అతనికి(జీవునికి)భోగము లను ప్రసాదించి వానిని పరిపాలించు చున్నాడు. పరమాత్మను ఉపాసించు వానికి మాత్రము కైవల్య (మోక్ష) రూపమే అగుచున్నాడు. ఆ పరమాత్మను పొంది దండప్రమాణములతో ఆయన పాదముల వద్ద ఆ జీవుడు న్నాడు. దానివలన కార్యకారణ లక్షణమైన అనగా పుణ్యాపాపకర్మలతో – ఫలభోక్త ృత్వముతో జన్మమరణచక్రమును పొందించునట్టి అవిద్యను (అజ్ఞానమును, మాయను) విడిచిపెట్టు చున్నాడు. అయితే బ్రహ్మజ్ఞానమును పొందిన జీవునికి – నీ ఆయా కర్మలతో సంబంధము కలుగుచున్నది కదా అనే విషయమై చెప్పుచున్నాడు– అయితే అట్టివారు తమ శరీరమును వేరైనదిగనే (జడమైనదిగనే) చూచుచున్నారుగాని, – పరమాత్మగా భావించుట

మాధవం కర్మినమ్రయోః. ఈక్షంతా మిచ్ఛయా సంతః క్షమంతాం మమ సాహసమ్, మయా హి స్వీయబోధాయ కృతమేతన్న సర్వతః. (51)

శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, సప్తాశీతితమోऽధ్యాయః

లేదు. ఈ విధమైన జీవన్ముక్తుని ఇతరులు తెలియక అతడును సామాన్యమైన శరీరముగల మానవుడనియే భావించుచున్నది. కాని జీవన్ముక్తుడైన సాధకుడు ఇంక దేనిని గురించి ఆలోచించిక కేవలము నిరంతరము ఆ పరమాత్ముడు శ్రీహరినే ధ్యానించును. అతనికి జగత్తంతయు విష్ణుమయముగనే కనబడును. శ్రీహరే భయమును – తొలగింపగలడని సాధకుడు అతనినే ధ్యానించునని అర్థము. కైవల్యముచేత యోనిని పొందక – తన స్వరూపమునందు ఎట్టి ఎడబాటు లేకుండా ఉండి మరల మూలకారణమైన మాయను తిరస్కరించి పరమాత్మను ధ్యానించునని అన్వయము.

సర్వ శ్రుతి శిరోరత్న విరాజిత పదాంబుజమ్ ।
భోగయోగప్రదం వందే మాధవం కర్మినమ్రయోః ॥
ఈక్షంతా మిచ్ఛయా సంతః క్షమంతాం మమ సాహసమ్ ।
మయా హి స్వీయబోధాయ కృతమేతన్న సర్వతః ॥

ధర్మకర్మలుచేయువారికి, ఆశ్రయమునుపొంది వినయ విధేయతలు గల భక్తులకు ఇహపరసౌఖ్యములు కలిగించుచు సర్వవేద శాస్త్రములకు చిట్టచివరి తాత్పర్యమైన పాదపద్మములతో విరాజిల్లునట్టి మాధవునికి నమస్కారము.

ఆత్మసాక్షాత్కారమును కాంక్షించి, తనకు తానే ఆత్మావగతికి

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఉన్ముఖుడై జ్ఞానలబ్ధిని పొందుటకై ఈవిధముగా శ్రుతిగీతలకు అవగాహన రూపముగా మాత్రమే ఈ వ్యాఖ్యానమును చేసితిని, ఇది సంపూర్ణముకాదని సత్పురుషులు తన సాహసమును మన్నించవలెనని ఈవిధముగా ఈ శ్రుతిగీతల వ్యాఖ్యానమును ముగించుచు శ్రీధరాచార్యుడు వినమ్రుడై వేడుకొన్నాడు. 51

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనుబదిఏడవ అధ్యాయముసమాప్తము**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

## అష్టాశీతితమోఽధ్యాయః

శ్లో॥ అష్టాశీతితమే విష్ణుభక్తః కైవల్యమశ్నుతే ।
తతోఽర్వాగ్దేవ భక్తస్తు విభూతిమితి వర్ణ్యతే ॥

**పరీక్షిత్ ఉవాచ**

శ్లో॥ దేవాసురమనుష్యేషు యే భజంత్యశివం శివమ్ ।
ప్రాయస్తే ధనినో బ్రహ్మన్ న తు లక్ష్మ్యాః పతిం హరిమ్ ॥ 1

శ్లో॥ ఏతద్వేదితుమిచ్ఛామస్సందేహోఽత్ర మహాన్హి నః ।
విరుద్ధశీలయోః ప్రభ్వోర్విరుద్ధా భజతాం గతిః ॥ 2

టీ:- హరిర్భజతాం ముక్తిద ఇత్యుక్తం అభయం ధ్యాయేదజస్రం హరిమితి. తత్ర శంకతే - దేవాసురేతి.అశివం అవధీరితభోగం త్యక్తవిషయం ధనినః భోగినః లక్ష్మ్యాః పతిం సర్వభోగయుక్తం. (1-2)

## 88వ అధ్యాయము

ఎనుబది ఎనిమిదవ అధ్యాయమున కేవలము విష్ణుభక్తుడే కైవల్యమును పొందగలడు. ఆ పరమాత్మకంటే అధునికులైన దేవతలను ఉపాసించువారు లౌకికములైన సంపదలనే పొందగలరు. ముక్తి ప్రదుడైన హరినే సేవించవలెనని చెప్పినాడు. ఎల్లప్పుడు భయము లేనివిధముగా (జన్మలేకుండునట్లుగా) హరినే ధ్యానము చేయుడన్నాడు.

**పరీక్షిత్తు ఇట్లడిగినాడు**

ఓ బ్రాహ్మణోత్తమా ! దేవతలు, రాక్షసులు, మనుష్యులలో కొందరు కలత పెట్టునట్టి అనగా విడిచిపెట్టవలసిన (అశివము) సంపదలకొరకై శివునే నిరంతరము భ్రాంతితో సేవించుచున్నారు. అంతేగాని సాక్షాత్తుగా లక్ష్మీపతియై సర్వభోగములతో కూడిన విష్ణువును సేవించరు. 1

శివకేశవుల విషయమున నాకు గొప్ప సందేహము కలిగినది. విరుద్ధమైన గుణగణములు గల ఇరువురు ప్రభువులను భజించు భక్తులకు విరుద్ధములైన మార్గములు, ఫలితములు కలుగుచున్నవి. కనుక ఈ విషయమును స్పష్టముగా వివరించుడని పరీక్షిత్తు శుక మహర్షిని అడిగినాడు. 2

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ శివశ్శక్తియుతశ్శశ్వత్త్రి లింగో గుణ సంవృతః ।
వైకారికస్తైజసశ్చ తామసశ్చేత్యహం త్రిధా ॥ 3

టీ:- శివ ఇతి. అన్యోన్యోపమర్దేన తమసస్త్రై విధ్యాత్ త్రిలింగః - త్రిలింగత్వమేవాహ- వైకారిక ఇతి. అహం అహంకారః. 3

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

శక్తిసహితుడైన శివుడు ఎల్లప్పుడు మూడులింగముల (లక్షణముల)తో కూడినవాడు. సహజముగా శివుడు తమోగుణుడైనను పరస్పరభేదముతో తమస్సు లక్షణములను బట్టి వైకారికము, తైజసము, తామసమని తాను (అహం - అహంకారము) అని చెప్పినాడు. 3

శ్లో॥ తతో వికారా అభవన్ షోడశామీషు కంచన ।
ఉపధావన్ విభూతీనాం సర్వాసామశ్నుతే గతిమ్ ॥ 4

టీ:- తత ఇతి. వికారాః మన ఇంద్రియభూతరూపాః షోడశేతి ఇంద్రియ దేవానామభేదవివక్షయా కంచనేతి, యత్కించిద్వికారోపాధికం భజన్. ఉపాధ్యనురూపాణాం విభూతీనాం గతిం స్వరూపం ప్రాప్నోతి. 4

ఆ శివుని వలన మనస్సు, ఇంద్రియములు, భూతములు (పంచభూతములు) అనేవాని రూపముగా వికారములు పదునారు విధములగును. ఇంద్రియములకును వాని దేవతలకును అభేదమును చెప్పుటకై 'కంచన' అనుట జరిగినది. వీనిలో ఏ కొంచెమో ఉపాధిగా ఉన్న దేవతలను భజింతురు. ఆయా ఉపాధులయొక్క సంపదలకు (శక్తులకు) అనుగుణమైన మార్గమును అనగా స్వరూపమును పొందుదురు. 4

శ్లో॥ హరిర్హి నిర్గుణస్సాక్షాత్పురుషః ప్రకృతేః పరః ।
స సర్వదృగుపద్రష్టా తం భజన్ నిర్గుణో భవేత్ ॥ 5

టీ:- హరిరితి. ఉపద్రష్టా సాక్షీ సన్ యతః సర్వదృక్ సర్వం పశ్యతి

శ్రీహరిమాత్రము సాక్షాత్తుగా నిర్గుణుడైన (గుణముల వికారమును పొందని) పరమాత్మ, ఆయన ప్రకృతికంటేవేరై సర్వోత్కృష్టమైనవాడు. ఆయన అన్నింటిని చూడగల (శాసించగల) సాక్షీభూతుడు. ఆయనను సేవించినవాడు నిర్గుణుడగును.

అతః ప్రకృతేః పర ఇతి. అత్రేదం తత్త్వం. శ్లో. "వస్తునో గుణ సంబంధే రూపద్వయమిహేష్యతే, తద్ధర్మ యోగాయోగాభ్యాం బింబవత్ప్రతి బింబ వత్". గుణాస్సత్త్వా దయశ్శాంత ఘోరమూఢాస్స్వభావతః, బ్రహ్మవిష్ణు శివానాం చ గుణయంతృ స్వరూపిణాం. నాతిభేదో భవేద్భేదో గుణధర్మై రిహాంశతః, సత్త్వస్య శాంత్యా నో జాతు విష్ణోర్విక్షేపమూఢతే. రజస్తమో గుణభ్యాం తు భవేతాం బ్రహ్మ రుద్రయోః, గుణోపమర్దనాద్భూయ స్తదంశానాం చ భిన్నతా. అతస్సమగ్రసత్త్వస్య విష్ణోర్మోక్షకరీ తనుః, అంశతో భూతిహేతుశ్చ తదానంతమయీ స్వతః. అంశతస్తారతమ్యేన బ్రహ్మ రుద్రాది సేవినామ్, విభూతయో భవంత్యేవ శనైర్మోక్షోఽ ప్యనంశతః. ఇదమేవాభిప్రేత్య తత్ర తత్రోచ్యతే. "శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనోర్నృణాం స్యురి" తి. తథా. సత్త్వం యస్య ప్రియా మూర్తిరితి తథా సత్త్వం తత్తీర్థసాధనమితి. తథా త్రయాణా మేకభావానాం యోనుపశ్యతి వైభిదామితి తథా. శ్లో. "న తే మయ్యచ్యుతేఽజే చ భిదామణ్వపి చక్షత" ఇత్యాది. ఏవం చ సతి న కించిదసమంజసం తత్తద్భక్తానాం తు కలహో మోహమాత్రమితి. (5-7)

(సర్వబాధలనుండి విముక్తుడగును).

వాస్తవముగా ఇక్కడ తత్త్వమిది-వస్తువుకు గుణ సంబధముచేత అనగా సంపూర్ణ గుణత్వము, దాని అంశ లక్షణములతో రెండు రూపములుండును. గుణ లక్షణముతో కూడియండుట, కూడియుండక పోవుట బింబప్రతిబింబములవలె రూపద్వయము. సత్త్వము, రజస్సు, తమస్సు అనే గుణాల స్వభావముతో శాంతము, ఘోరము, మూఢము అనే లక్షణాలు కలవి. బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే దేవతలు ఆయా గుణములను నియమించే స్వభావము కలవారు. వీరి మధ్యన గుణస్వరూపముచేత అభేదము, అంశత్వముచేత స్వల్ప భేదములు మాత్రము ఉన్నవి. సత్త్వగుణము శాంతిలక్షణముచేత విష్ణువుకు ఎప్పటికి మార్పు కలుగదు. అట్లే బ్రహ్మ, ఈశ్వరులకు రజస్సు, తమస్సులనే గుణములచేత ఘోరత్వము, మూఢత్వముల అంశల వలన ఏవిధమైన మార్పురాదు. వారు గుణముల ప్రభావమును అణిచివేయువారైనందు వలన వారికి గుణముల అంశ (లక్షణము) తో మాత్రమే భేదమున్నది. సమగ్రమైన సత్త్వము కలిగిన విష్ణువు మోక్షమును ప్రసాదించు రూపము, సత్త్వముయొక్క అంశవలన సంపదలను ప్రసాదించు రూపములు రెండునూ ఉన్నందువలన స్వయముగా ఆనందమయుడు రజస్సు, తమస్సు అనే గుణముల అంశలవల్లనే బ్రహ్మ, రుద్రాది దేవతలను సేవించువారికి ముందుగా

సంపదలు కలిగి క్రమముగా అంశను విడిచి పూర్ణగుణ భావముతో మోక్షసిద్ధికూడా కలుగును. ఈ విషయమునే తెలుపుచు అక్కడక్కడ వేదవాక్యాలు 'శ్రేయాంసి తత్రఖలు సత్త్వతనోర్నృణామ్' – పరిపూర్ణ సత్త్వరూపము వలననే మానవులకు శుభములు కలుగునని ఉద్ఘాటించినవి. సత్త్వము ప్రియమైన రూపముగలవానికి (సత్త్వరూపునికి) అని చెప్పి సత్త్వమే మోక్ష సాధనమని చెప్పబడినది. అందువల్ల తాత్త్వికముగా మూడు గుణములకు ఒకే భావమున్నందు వలన వానిని భేదరహితములుగ (భేదములు లేవని) చూడవలెను. 'నాకు, విష్ణువుకు, బ్రహ్మకు అణుమాత్రమైన భేదములేదని శివునివాక్కు. ఈ విధముగా త్రిమూర్తులందు ఆయా గుణముల (సత్త్వ, రజస్తమస్సుల) అంశ లక్షణములున్నందు మాత్రమే స్వల్పమైన భేదమున్నందువలన ఆయా దేవతలను సేవించే భక్తులు తమతమ దేవతలే గొప్ప, ఇతరులు తక్కువ అని కలహించుకొనుట కేవలము అజ్ఞానమే. 5

శ్లో॥ నివృత్తేష్వశ్వమేధేషు రాజా యుష్మత్పితామహః ।
శృణ్వన్ భాగవతాన్ ధర్మా నపృచ్ఛదిద మచ్యుతమ్ ॥ 6

మీ తాతగారైన ధర్మరాజు అశ్వమేధయాగము ముగిసిన పిమ్మట భాగవత ధర్మములను వినుచున్నవాడై శ్రీకృష్ణుని ఈ విధముగా అడిగినాడు. 6

శ్లో॥ స ఆహ భగవాంస్తస్మై ప్రీతశ్శుశ్రూషవే విభుః ।
నృణాం నిశ్శ్రేయసార్థాయ యో౽వతీర్ణో యదోః కులే ॥ 7

శుశ్రూషలు చేయుచున్న ధర్మరాజు సేవలవలన ప్రీతిపొందినవాడై మానవులకు మోక్షప్రాప్తిని కలిగించుటకై యాదవకులమున అవతరించిన పరమాత్మ కృష్ణుడు ధర్మరాజుకు ఈ విధముగా చెప్పినాడు. 7

**శ్రీ భగవాను ఉవాచ**

శ్లో॥ యస్యాహమను గృహ్ణామి హరిష్యే తద్ధనం శనైః ।
తతో౽ధనం సంత్యజంతి స్వజనా దుఃఖ దుఃఖితమ్ ॥ 8

టీ:- యస్యేతి. యస్యాహమనుగృహ్ణామీతి. అయమర్థః యో విషయాన్ పరిజిహీర్షురపి కథం చిద్విద్యమానేషు సజ్జతే క్లిశ్యతి చ తస్య విషయాపహార ఏవాను గ్రహ ఇతి. యథా శ్రుతత్వే ధ్రువాదీనామైశ్వర్య విరోధాత్. అథవా ప్రథమం విభూతిం కామనాను రూపాం దత్త్వా శనైః విషయోపభోగావసానే తస్య నిర్వేదముత్పాద్య హరిష్యామి- పరమాను గ్రహం కర్తుమితి. తదుక్తం భగవతైవ. శ్లో. "న మయ్యా వేశితధియాం కామః కామాయ కల్పతే" ఇతి. దుఃఖ దుఃఖిత మితి. దుఃఖాదను పునర్దుః ఖితమివ ప్రతియమానమిత్యర్థః. 8

**భగవానుడు ఇట్లు చెప్పినాడు**

నేను ఎవరిని అనుగ్రహించదలచితినో మెల్లగా (క్రమముగా) వారిధనమును హరించి వేయుదును. పిమ్మట నిర్ధనుని దుఃఖముతో సంకటపడునట్టి అతనిని చూచి తనవారే విడిచి పెట్టుదురు.

దీని అర్థము ఇది. విషయములు అనగా లౌకికములైన సుఖములపట్ల గల కోరికలను విడువదలచిన వాడుకూడా ఎదురుగా కనబడుచున్న భార్యాపుత్రాదులపట్లగల అనుబంధముతో వారిని వీడలేక బాధపడుచున్నందు వలన (అనగా భావమునందు వైరాగ్యము కలుగుట కష్టమని భావము) అట్టి వారికి ఆయా విషయముల వాంఛలకు సంబంధించిన బంధములను తొలగించుటయే నేనువారికి కలుగజేయు (మొదటి) అనుగ్రహము. శాస్త్రములు అనగా వేదములు ధ్రువమైనవి అని చెప్పిన విషయములకు లోకమునందు కోరికలకు కారణమైన సంపదలకు (ఐశ్వర్యములకు) విరోధమున్నది లేక ముందుగా కోరికలకు మూలమైన సంపదను ప్రసాదించి మెల్లగా కోరికలు ముగియు

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

సమయమున వారివారి బంధములను పరమానుగ్రహము కలిగించుటకై (ముక్తిని ప్రసాదించుటకై) హరింతును (అభావమున విరక్తి, తద్ద్వారా ముక్తికాంక్ష కలుగునని భావము) అనే విషయమును భగవంతుడే ఈ విధముగా చెప్పినాడు – 'న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే' – నా పట్లే ఆవేశమును పొందిన బుద్ధిగల వారికి కామము కోరికల కొరకు కలుగదు అనగా వారియందు కేవలము ముక్తికాంక్షనే మిగులునని భావము అని చెప్పినాడు. దుఃఖదుఃఖితుడు – అనుట వలన ఒక దుఃఖమును అనుసరించి మరొక దుఃఖము కలుగును. అనగా ఒక కోరిక తీరిన వెనుక మరొక కోరిక కలుగుచునే ఉండును. వాటిని తీర్చుకొనుటలో ఒకదానివెంట మరొక కష్టము దాపరించునని భావము. 8

శ్లో॥ స యదా వితథోద్యోగో నిర్విణ్ణస్స్యాద్ధనేహయా ।
మత్పరైః కృతమైత్రస్య కరిష్యే మదనుగ్రహమ్ ॥ 9

టీ:– స ఇతి. స పునర్బంధూనామనుగ్రహేణ ధనేహయా ప్రవృత్తోఽపి మదనుగ్రహేణ యదా నిష్ఫలోద్యమో నిర్విణ్ణస్స్యాత్ తదా మదనుగ్రహమితి. మమ సాధారణమనుగ్రహమ్. 9

వ్యక్తి ధనమునందలి వ్యామోహమును వదలి వైరాగ్య భావముతో ధనసాధన విషయమైన తన ప్రయత్నమును మానుకొన్నప్పుడు నాయందు బుద్ధులను లగ్నముచేసి నాపట్ల మైత్రిని (ప్రీతిని) పొందునపుడు నేనతనని అనుగ్రహింతును. వ్యక్తి ధనముపై కోరికతో బంధువులందలి అనురాగముతో ప్రవర్తించునప్పటికి నా అనుగ్రముచేత ఆ ప్రయత్నమును వీడి వైరాగ్య భావమును పొందినపుడు వారిపై నా సాధారణ అనుగ్రహము కలుగును. 9

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తద్బ్రహ్మ పరమం సూక్ష్మం చిన్మాత్రం సదనంతరమ్ ।
తతో మాం సుదురారాధ్యం హిత్వాన్యాన్ భజతే జనః ॥ 10

శ్లో॥ తతస్త ఆశుతోషేభ్యో లబ్ధరాజ్యశ్రియోద్ధతాః ।
మదాత్ప్రమత్తా వరదాన్ విస్మరంత్య వజానతే ॥ 11

టీ:- తమేవాహ - తద్బ్రహ్మేతి. జనః పశ్చాదపి మోక్షమరోచయన్ అత్యాసక్తః అన్యాన్ భజత ఇత్యర్థః. (10-11)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ శాప ప్రసాదయోరీశా బ్రహ్మవిష్ణు శివాదయః ।
సద్యశ్శాప ప్రసాదోంగ శివో బ్రహ్మన చాచ్యుతః ॥ 12

ఆ విషయమునే చెప్పుచున్నాడు – ఈ సత్తుకు పిమ్మట చిన్మాత్ర (జ్ఞానమాత్ర) రూపమై మిక్కిలి సూక్ష్మమైనది బ్రహ్మపదార్థము.(నేను) అందువలన చక్కగా ఆరాధించుటకు అసాధ్యమైనవాడను కనుక జనులు నన్ను విడిచిపెట్టి ఇతరులను సేవించుచున్నారు అనగా జనులు నేనన్నిటికంటె వేరైన వాడినని తెలిసికూడా మోక్షముకొరకు ప్రయత్నించక ప్రాపంచిక సుఖములందే ఆసక్తులై ఇతర దేవతలను సేవించుచున్నారని భావము. 10

అందువల్ల అట్టి వారు సులభముగా అనుగ్రహించే సామాన్యమైన ప్రాపంచిక సంతోషమును కలిగించునట్టి వానిని దేవతలను ఆశ్రయించి వారు ప్రసాదించిన రాజసంపదలతో గర్వించి మదముతో నన్ను విస్మరించి తెలియలేకున్నారు. 11

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

ఇదే విషయమును ఒక కథద్వారా స్పష్టముగా చెప్పుచున్నాడు – బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు శాపానుగ్రహసమర్థులే. అయితే వీరిలో బ్రహ్మ, ఈశ్వరుడు ఇరువురు మాత్రము సులభముగనే ఆగ్రహమును అనుగ్రహమును ప్రసాదింతురు. అనగా కొంచెము తపస్సునకే సంతసించి వరములిచ్చుటగానీ అల్పదోషమునకే శాపముతో శిక్షించుటగానీ



టీ:- ఏత దేవేతిహాసేన స్పష్టయితు మాహ- శాప ప్రసాదయోరితి. బ్రహ్మే చేత్యన్వయః. (12-13)

చేయుదురు. విష్ణువు అట్లుగాక అపారమైన తపస్సుకు మరీమరీ పరీక్షించి గాని వరములిచ్చుట, భయంకరమైన నేరమునకే శిక్షంచుట చేయును. 12

శ్లో॥ అత్రో చోదాహరంతీమ మితిహాసం పురాతనమ్ ।
వృకాసురాయ గిరిశో వరం దత్వాపి సంకటమ్ ॥ 13

ఈ విషయమున నేను నీకు ఒక ప్రాచీనమైన దృష్టాంత పూర్వకముగా వివరింతును. ఈశ్వరుడు వృకాసురునికి వరమిచ్చి తానే స్వయముగా సంకటమును పొందినాడు. 13

శ్లో॥ వృకో నామాసురః పుత్రః శకునేః పథి నారదమ్ ।
దృష్ట్వాశు తోషం పప్రచ్ఛ దేవేషు త్రిషు దుర్మతిః ॥ 14

పూర్వము శకుని అనే వాని పుత్రుడు వృకాసురుడనే రాక్షసుడు మార్గమధ్యమున నారదుని చూచి దుష్టమనస్సుతో ఆయనను త్రిమూర్తులలో శీఘ్రముగా ప్రసన్నుడగు దేవుడెవరో తెలుపమని కోరినాడు. 14

శ్లో॥ స ఆహ గిరిశం దేవముపధావాశు సిద్ధయే ।
సోఽల్పాభ్యాం గుణదోషాభ్యామాశు తుష్యతి కుప్యతి ॥ 15

నారదుడు 'ఈశ్వరుని వంచనతో శీఘ్రముగా (సులభముగా) ప్రసన్నుని చేసుకొనవచ్చును. ఆయన అల్ప గుణదోషములకే అనుగ్రహించును, కోపించును' అని చెప్పినాడు. 15

టీ:- వృక ఇతి. శకునేః పుత్రః. (14-15)

శ్లో॥ దశాస్య బాణయోస్తుష్ట స్తువతోర్వందినోరివ ।
ఐశ్వర్యమతులం దత్త్వా తత ఆప సుసంకటమ్ ॥ 16

టీ:- దశాస్యేతి. సుసంకటమాప కైలాసోత్పాటనం పురీపాలనం చ-సుకంటకమితివా పాఠః. 16

రావణుడు, బాణుడు, వందిమాగధులవలె స్తోత్రముచేయగా సంతసించిన పరమేశ్వరుడు వారికి అపారమైన సంపదలు (వరములను) ప్రసాదించి పిమ్మట గొప్ప సంకటమును పొందినాడు. ఈశ్వరుని వర ఫలితముగా రావణుడు కైలాసమును పెకలించగా, బాణాసురుని శోణపురమునకు కాపలాదారుడుగా పెక్కు సంకటములను అనుభవించినాడు. 16

శ్లో॥ ఇత్యాదిష్ట స్తమసుర ఉపాధావత్స్వగాత్రతః ।
కేదార ఆత్మక్రవ్యేణ జుహ్వానోఽగ్ని ముఖం భవమ్ ॥ 17

టీ:- ఇతీతి. స్వగాత్రయా ఉపాధావత్ స్వదేహేన యాజయామాస కథం ఆత్మక్రవ్యేణ స్వమాంసేన జుహ్వాన ఇతి. 17

శివుడు శీఘ్రఫలదుడని నారదుని వలన విన్న వృకాసురుడు కేదారక్షేత్రమునకు వెళ్ళి అక్కడ హోమకుండమున అగ్నిలో తనశరీర భాగముల మాంసమును శివుని ప్రీతికై హవనము చేసినాడు. 17

శ్లో॥ దేవోపలబ్ధిమప్రాప్య నిర్వేదాత్సప్తమేఽహని ।
శిరోఽవృశ్చత్స్వ ధితినా తత్తీర్థక్లిన్న మూర్ధజమ్ ॥ 18

టీ:- దేవేతి. అవృశ్చత్ ఛేత్తుముద్యతః. 18

ఈ విధముగా ఆరు రోజులు హవనము చేసినను ఈశ్వరుడు ప్రసన్నుడు కానందున ఏడవదినమున ఈశ్వరుని తీర్థముతోతడిసిన వెంట్రుకలుగల తనతలను విందుగా ఖండించుకొనుటకై సిద్ధపడినాడు. 18

శ్లో॥ తదా మహాకారుణికస్స ధూర్జటిః
యథా వదిష్టోఽగ్నిరివో త్థితోఽనలాత్ ।
నిగృహ్యా దోర్భ్యాం భుజయోర్న్య వారయ
త్తత్స్పర్శనా ద్భూయ ఉపస్కృతా కృతిః ॥ 19

టీ:- తదేతి. స్వయం చ- అగ్నిరివ మూర్తిమానగ్ని రివ దేదీప్యమాన ఇత్యర్థః.వయం అధునా కథాభిర్యథా కథం చిద్దుఃఖేన మర్తుకామం వారయామః తద్వదితి. స చ ఉపస్కృతాకృతిః పరిపూర్ణదేహోఽభవత్ న్యవారయచ్చ. 19

అప్పుడు అపారదయగల శివుడు తనకు ఇష్టమైన మూర్తీభవించిన అగ్నివలె దేదీప్యమానముగా వెలుగుచు హోమకుండ మందలి అగ్నినుండి ఆవిర్భవించి ఒకానొక దుఃఖకారణముచేత ప్రాణత్యాగము చేయదలచిన వృకాసురుని వారించుటకై తన రెండు చేతులతో అతని భుజములను తలను ఖండించుకొకుండా గట్టిగా పట్టుకొన్నాడు. పరమేశ్వరుని కరస్పర్శతో ఆరు దినములనుండి ఖండించుకొని దహనము చేసిన శరీర భాగములన్ని మరల సిద్ధించి వృకాసురుడు పరిపూర్ణమైన శరీరమును పూర్వమువలెనే పొందినాడు. 19

శ్లో॥ తమాహ చాంగాలమలం వృణీష్వ మే
యథాభికామం వితరామి తే వరమ్ ।
ప్రీమీయతోయేన నృణాం ప్రపద్యతా
మహో త్వయాత్మా భృశమర్ద్యతే వృథా ॥ 20

ఓ వృకాసురా! నీ ప్రయత్నము చాలుచాలు. నీకేమి కోరక ఉన్నదో కోరుము. దీనిని నీకు ప్రసాదింతును. భక్తితో జలమును (అభిషేకము) ఇచ్చిన భక్తులకు వరములిత్తును. అట్టిచో నీవు నీ శరీరమును అర్పించి ప్రాణములను సమర్పింపదలచి వ్యర్థముగా పీడను పొందితివి అని శివుడు చెప్పినాడు. 20

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ దేవాత్స వవ్రే పాపీయాన్ వరం భూతభయావహమ్ ।
యస్య యస్య కరంశీర్ష్ణి ధాస్యేస మ్రియతామితి ॥ 21

టీ:- ఏవమాహచ తమితి. తోయేనాపి భజతాం ప్రీతః స్యాం. త్వయా తు దేహో వృథా పీడ్యత ఇతి. (20-21)

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

దుష్టుడైన ఆ వృకాసురుడు తానెవరి నెత్తిన చేయిపెట్టిన వారందరూ మరణించునట్టి వరమును కోరినాడు. 21



శ్లో॥ తచ్ఛ్రుత్వా భగవాన్ రుద్రో దుర్మనా ఇవ భారత ।
ఓమితి ప్రహసంస్తస్మై దదేఽహేరమృతం యథా ॥ 22

టీ:- తదితి. దాతుమనర్హ మపి దదే దత్తవాన్. అహేః సర్పస్య అమృతం క్షీరమివ.(22-23)

ఓ పరీక్షిత్తూ! దుష్ట మనస్కుడైన అతని కోరిక విని భగవంతుడైన శివుడు అట్టి వరమును ప్రసాదించుటకు తగనిదైనను పాముకు అమృతము త్రాపినట్టుగా 'ఓం' అని (సరేఅని) ఆ వరమును అనుగ్రహించినాడు. 22

శ్లో॥ స తద్వరపరీక్షార్థం శంభోర్మూర్ధ్ని కిలాసురః ।
స్వహస్తం ధాతుమాం రేభే సోఽభి భ్యత్స్వకృతాచ్ఛివః ॥ 23

వాడు ఆ వరప్రభావమును పరీక్షింపదలచి ఈశ్వరుని నెత్తిన తన చేతిని పెట్ట యత్నించగా శివుడు తాను చేసిన తప్పిదము వలన అధికముగా భీతి చెందెను. 23

శ్లో॥ తేనోపసృష్టస్సంత్రస్తః పరాధావత్సవేపథుః ।
యావదంతం దిశో భూమేః కాష్ఠానాముదగాదుదక్ ॥ 24

టీ:- తేనేతి. ఉపసృష్టః అనుగతస్సన్ ఉదగాత్ ఉత్తరతః అగాత్ ఊర్ధ్వమగచ్ఛద్వా ఉదక్ ఊర్ధ్వమంచన్. 24

వృకాసురుడు వెంటనంటగా వణకుచు దూరముగా ఉత్తర దిక్కునుండి ఎల్లదిక్కులకు పరిగెత్తి ఊర్ధ్వమునకు(పైకి)వెళ్ళినాడు. 24

శ్లో॥ అజానంతః ప్రతివిధిం తూష్ణీమాసన్ సురేశ్వరాః ।
తతో వైకుంఠమగమద్భాస్వరం తమసఃపరమ్ ॥ 25

వృకాసురునినుండి పరమేశ్వరుని రక్షించు విషయము తెలియక ఇంద్రాది దేవతలు మిన్నకుండిరి. చీకటికంటె (తమస్సుకంటె) వేరుగా విశేషముగా ప్రకాశించు వైకుంఠమునకు శివుడు వెళ్ళినాడు. 25

శ్లో॥ యత్రనారాయణస్సాక్షాద్యోగినాం పరమా గతిః ।
శాంతానాం న్యస్తదండానాం యతో నావర్తతే గతః ॥ 26

పరమశాంతులు, సన్యసించినవారు, యోగీశ్వరులకు ఆశ్రయుడై, ఆయనను పొంది మరల తిరిగిరాని లోకమైన ఆ వైకుంఠమున సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడు ఉన్నాడు. 26

టీ:- అజానంత ఇతి. వైకుంఠం శ్వేతద్వీపం. (25-26)

శ్లో॥ తం తథా వ్యసనం దృష్ట్వా భగవాన్ వృజినార్దనః ।
దురాత్ప్రత్యుదియాద్భూత్వా వటుకో యోగమాయయా ॥ 27

భగవంతుడు కష్టములను అనుభవించు వారిపట్ల దయగలవాడు అయిన నారాయణుడు సంకటపడుచు ఆ విధముగా వచ్చిన పరమేశ్వరుని దూరమునుండే చూచి అతని బాధను నివారించు టకై యోగమాయతో బ్రాహ్మణ బ్రహ్మచారిగా ఎదురొచ్చినాడు. 27

టీ:- తమితి. తం వృకాసురం తథా వ్యసనం తాదృగ్వ్యసనం యస్య తం. శివం వృజినార్దనః దుఃఖహంతా దూరత ఏవ దృష్ట్వా. 27

శ్లో॥ మేఖలాజిన దండాక్షైస్తేజసాగ్నిరివోజ్జ్వలన్ ।
అభివాదయామాస చ తం కుశపాణిర్వినీతవత్ ॥ 28

మౌంజి (దర్భలతో అల్లినత్రాడు మొలత్రాడుగా), జింకచర్మము, పలాశ (మోదుగు) దండము, జపమాలతో అగ్నివంటివర్చస్సుతో చేతులందు కుశలనుపట్టుకొని వినయముతో (వృకాసురునికి) నమస్కరించినాడు. 28

టీ:- మేఖలేతి. మేఖలాదిభిరుపలక్షితః ప్రత్యుదియాత్ సమ్ముఖ మాగతః. 28

శ్రీ భగవాను ఉవాచ

శ్లో॥ శాకునేయ భవాన్ వ్యక్తం శ్రాంతః కిం దూరమాగతః ।
క్షణం విశ్రామ్యతాం పుంస ఆత్మాయం సర్వకామధుక్ ॥ 29

శ్రీ భగవానుడు ఇట్లు చెప్పినాడు

ఓ వృకాసురా! నీవు బాగ అలసినవానివలె కనబడుచున్నావు. చాలా దూరమునుండి వచ్చితివా ఏమి? ఇక్కడొక క్షణము విశ్రాంతిని

టీ:- శాకునేయేతి. వ్యక్తం నిశ్చితం కిం కిమర్థం ఆత్మా దేహః. స్వ పురుషార్థహేతుః. అతో మాపీడయేతి. 29

పొందుము. ఎల్ల పురుషార్థములకు మూలమైన ఈ నీ శరీరమునకు బాధ కలిగించవద్దు. 29

శ్లో॥ యదినశ్శ్రవణాయాలం యుష్మద్వ్యవసితం ప్రభో ।
భణ్యతాం ప్రాయశస్సర్వైః పుంభిస్స్వార్థాన్ సమీహతే ॥ 30

నీవు పురుషులకవసరమైన స్వార్థ ప్రయోజనమును నెరవేర్చు కొనుటకై వచ్చితివా లేక ఇతర పురుషుల సాహాయ్యముతో అన్ని కార్యాలను సాధించుటకు ఇక్కడికి వచ్చితివా నాకు తెలుపుమని అడిగినాడు. 30

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏవం భగవతాపృష్టో వచసాఽమృత వర్షిణా ।
గతక్లమోఽబ్రవీత్తస్మై యథాపూర్వమనుష్ఠితమ్ ॥ 31

టీ:- యదీతి. ప్రాయశః పుంభిర్భృతైః భవాన్ స్వార్థాన్ సమీహతే సాధయితుమిచ్ఛతి అథవా జనః పుంభిః సహాయైః స్వకార్యాణి సాధయతి అతో నః కథ్యతామితి. (30-31)

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

ఈ విధముగా వటుని రూపమున ఉన్న భగవంతుడు నారాయణుడు అమృతమువంటి మధురమైన మాటలతో తన ఆగమన కారణ విషయమై అడుగగా వృకాసురుడు మార్గశ్రమను విస్మరించిన వాడై అతనికి ముందు జరిగిన విషయమంతయువివరించినాడు. 31

**శ్రీ భగవాను ఉవాచ**

శ్లో॥ ఏవం తర్హ్యంగ తద్వాక్యం న వయం శ్రద్ధధీమహి ।
యో దక్షశాపాత్పైశాచ్యం ప్రాప్తః ప్రేత పిశాచరాట్ ॥ 32

**శ్రీ భగవానుడు ఇట్లు చెప్పినాడు**

ఇట్లయినచో ఓ వృకాసురా! శివుడిచ్చిన వరముపై మాకు నమ్మకములేదు. ఎందుకంటే శివుడుదక్షుని పాశములతో బంధితుడై ఆ ప్రేతపిశాచములకు నాథుడై శివుడు పిశాచభావమును పొందినాడు. 32

శ్లో॥ యది తే తత్ర విస్రంభో దానవేంద్ర జగద్గురౌ ।
తర్హ్యంగాశు స్వశిరసి హస్తం న్యస్య ప్రతీక్ష్యతామ్ ॥ 33

ఓ రాక్షసేంద్రా ! నీకు ఇంకను ఆ జగద్గురుడైన శివుని మాటలపై నమ్మకమున్నచో వెంటనే నీతలపై చేయిపెట్టుకొని ఎదురు చూడుము. 33

టీ:- ఏవమితి. పైశాచ్యం పిశాచానామివ వృత్తిం. (32-33)

శ్లో॥ యద్య సత్యం వచశ్శంభో కథం చిద్దానవర్షభ ।
తథా త్వం జహ్యసద్వాచం నయద్వక్తానృతం పునః ॥ 34

ఓ రాక్షసశ్రేష్ఠా! ఈశ్వరుని మాట అసత్యమైనచో నీవు ఆ అసత్య వాక్యమును ఎట్లయినను విడిచిపెట్టుము. ఇక మీదట ఎవరు అసత్యము చెప్పినను ఆ వక్త మాటను మన్నింపకుము అని చెప్పినాడు. 34

టీ:- యదీతి. యత్ యథా వక్తా వదిష్యతి. 34

శ్లో॥ ఇత్థం భగవతశ్చిత్రైర్వచోభిస్సుపేశలైః ।
భిన్నధీర్విస్మిత శ్శీర్ష్ణి స్వహస్తం కుమతిర్న్యదాత్ ॥ 35

ఈ విధముగా భగవమతునియొక్క వీనులకింపైన చిత్రమైన మాటలు విని తన బుద్ధిని మరచిపోయి దుష్టుడైన వృకాసురుడు తన తలపై తన చేతిని పెట్టుకొన్నాడు. 35

శ్లో॥ అథా పతద్భిన్న శిరావజ్రాహత ఇవ క్షణాత్ ।
జయశబ్దో నమశ్శబ్ద స్సాధు శబ్దోఽభవద్దివి ॥ 36

వెంటనే క్షణమాత్రముననే వజ్రాయుధముచేత బద్దలు కొట్టినట్లు వానితల ముక్కచెక్కలై పడిపోయినాడు. అప్పుడాకాశమునుండి జయ, సాధు, నమః అనే శబ్దములు మారుమ్రోగినవి. 36

శ్లో॥ ముముచుః పుష్పవర్షాణి హతే పాపే వృకాసురే ।
దేవర్షి పితృ గంధర్వా మోచితస్సంకటాచ్ఛివః ॥ 37

పాపాత్ముడైన వృకాసురుడు మరణించగనే దేవతలు, ఋషులు, పితృదేవతలు, గంధర్వులు సంతోషముతో పుష్ప వర్షమును

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ముక్తం గిరిశమభ్యాహ భగవాన్ పురుషోత్తమః ।
అహో దేవ మహాదేవ పాపోఽయం స్వేన పాప్మనా ॥ 38

టీ:- ఇత్థమితి. చిత్రైర్భ్రామకైస్సుపేశలైః అతిరమ్యైః భిన్నధీః భ్రంశితమతిః. (35-38)

శ్లో॥ హతః కోనుమహత్స్వీశజంతుర్వైకృత కిల్బిషః ।
క్షేమీస్యాత్కిము విశ్వేశే కృతాగా జగద్గురౌ ॥ 39

టీ:- హతఇతి. కిము వక్తవ్యం విశ్వేశే త్వయి కృతాం గాః కృతాపరాధః 39

శ్లో॥ య ఏవమవ్యాకృత శక్త్యుదన్వతః
పరస్య సాక్షాత్పరమాత్మనో హరేః ।
గిరిత్రమోక్షం కథయేచ్ఛృణోతివా
విముచ్యతే సంసృతిభిస్తథారిభిః ॥ 40

టీ:- య ఇతి. అవ్యాకృతశక్త్యుదన్వతః అవాఙ్మానసగోచరశక్తి సముద్రస్య గిరిత్ర మోక్షం శివ మోచనరూపం చరిత్రం సంసృతిభిః నానాయోనిసంసారైః. 40

**శ్రీ మద్భాగవతే, దశమస్కంధే, అష్టాశీతితమోఽధ్యాయః**

**ఏకోననవతితమోఽధ్యాయః**

కురిపించినారు. శివుడు వృకాసురుని సంకటమునుండి బయట పడినాడు. 37

వృకాసురుని బాధనుండి విముక్తిని పొందిన ఈశ్వరునితో పురుషోత్తముడు, భగవంతుడైన నారాయణుడు - ఓ మహాదేవా! ఈ పాపాత్ముడైన వృకాసురుడు తన పాపముల వలన తానే హతుడైనాడు. మహాత్ములకు అపకారము చేయగల వారికెవరికిని క్షేమము కలుగదు. అందులో జగద్గురుడై విశ్వేశ్వరుడైన మీకు అపకారము చేయదలచిన వాని విషయమేమని చెప్పవలెను. అనగా విశ్వనాథునికి అపకారము చేయదలచి బ్రతికి బట్టకలుగుట అసాధ్యము. (38-39)

ఈ విధముగా అపారమైన సముద్రమంతటి శక్తి కలిగిన సాక్షాత్తు పరమాత్మ అయిన శ్రీహరి- పరమేశ్వరుని సంకటములనుండి కాపాడిన ఈ వృత్తాంతమును చెప్పినవారు విన్నవారు సర్వశత్రువుల బాధలనుండి ప్రాపంచిక వ్యామోహములనుండి ముక్తిని పొందగలరు. 40

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**

**ఎనుబదిఎనిమిదవ అధ్యాయముసమాప్తము**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ నవాశీతితమే దేవః కో మహానితి సంశయే ।
పరీక్ష్య విష్ణోరుత్కర్షం మునిభ్యోఽవర్ణయద్భృగుః ॥

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ సరస్వత్యాస్తటే రాజన్నృషయస్సత్రమాసత ।
వితర్కస్సమభూత్తేషాం త్రిష్వధీశేషు కో మహాన్ ॥ 1

శ్లో॥ తస్య జిజ్ఞాసయా తే వై భృగుం బ్రహ్మసుతం నృప ।
తజ్ఞ్జప్త్యై ప్రేషయామాసుస్సోఽభ్యగాద్బ్రహ్మణస్సభామ్ ॥ 2

శ్లో॥ న తస్మై బ్రహ్మణే స్తోత్రం చక్రే సత్త్వపరీక్షయా ।
తస్మై చుక్రోధ భగవాన్ ప్రజ్వలన్ స్వేన తేజసా ॥ 3

టీ:- ఇతిహాసాంతర మాహ- సరస్వత్యా ఇతి. (1-3)

శ్లో॥ స ఆత్మన్యుత్థితం మన్యుమాత్మజాయాత్మనా ప్రభుః ।
అశీశమద్యథా వహ్నిం స్వయోన్యావారిణాత్మభూః ॥ 4

## 89వ అధ్యాయము

ఈ ఎనుబదితొమ్మిదవ అధ్యాయమున త్రిమూర్తులలో ఎవరుగొప్ప అని సంశయము మునీశ్వరులకు కలుగగా భృగుమహర్షి త్రిమూర్తులను పరీక్షించి శ్రీమహావిష్ణువే గొప్పవాడని వర్ణించుట విషయము.

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

ఆ విషయమై ఒక ఇతిహాసమును చెప్పుచున్నాడు - ఓ రాజా! సరస్వతీనదీ తీరమున యాగమున ఉన్న ఋషులకు త్రిమూర్తులలో ఎవరుగొప్ప అనే విషయమై గొప్ప వివాదము కలిగినది. 1

రాజా! త్రిమూర్తులలో గొప్పవారెవరనే విషయము తెలిసికొని వచ్చుటకై ఆ ఋషులందరు బ్రహ్మదేవుని పుత్రుడైన భృగుమహర్షిని పంపినారు. ఆయన ముందుగా బ్రహ్మదేవుని సభకు వెళ్ళినాడు. 2

ఆయన బ్రహ్మశక్తిని పరీక్షించు నిమిత్తమై బ్రహ్మదేవుని స్తుతించలేదు. అప్పుడు పరమేష్ఠి తన తేజస్సుతో మండుచు వినయరహితుడైన భృగువుపై కోపించినాడు. 3

తనయందు పుట్టి క్రోధమును వచ్చినవాడు తన కొడుకైన భృగువు అనే కారణముతో బ్రహ్మదేవుడు తన అవసరమునకై రగిల్చిన అగ్నిని తన అవసరము తీరగనే తనే ఆర్పివేసినట్లు అణచుకొన్నాడు. 4

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ తతః కైలాసమగమత్సతం దేవో మహేశ్వరః ।
పరిరబ్ధుం సమారేభే ఉత్థాయ భ్రాతరం ముదా ॥ 5

పిమ్మట భృగువు కైలాసమునకు వెళ్ళినాడు. అప్పుడు పరమేశ్వరుడు లేచివచ్చి సంతోషముతో సోదరుడైన భృగువును కౌగిలించ సిద్ధపడినాడు. 5

శ్లో॥ నైచ్ఛత్వమశుభాచారస్తతో దేవ కోప హ ।
శూలముద్యమ్య తం హంతుమారేభే తిగ్మలోచనః ॥ 6

అప్పుడు శివుడు అశుభావహమైన ఆచారములు కలిగినందున (శ్మశానవాసము, చర్మధారణము, భిక్షాటనము, కపాలవృత్తి, శవ భస్మధారణ మొదలైనవి) అతని కౌగిలింతను భృగువు ఇష్టపడలేదు. అప్పుడు అగ్నినేత్రుడైన మహాశివుడు కోపించి భృగువును సంహరింప సిద్ధపడినాడు. 6

శ్లో॥ పతిత్వా పాదయోర్దేవీ సాంత్వయామాస తం గిరా ।
స తు కృచ్ఛ్రాత్తతో ముక్తః కైలాసాద్రజతాచలాత్ ॥ 7

శ్లో॥ మునిర్జగామ వైకుంఠం యత్ర దేవో జనార్దనః ।
శయానం శ్రియ ఉత్సంగే పదా వక్షస్య తాడయత్ ॥ 8

అప్పుడు పార్వతీదేవి శివుని పాదాలపైబడి భృగువును సంహరించవద్దని ప్రాధేయపడినది. అతడా సంకటమునుండి ముక్తిని పొంది వెండికొండయైన కైలాసమునుండి జనార్దనుడున్న వైకుంఠమునకు వెళ్ళి లక్ష్మీదేవి తొడపై శయనించిన విష్ణువు రొమ్ముపై కాలుతో తన్నినాడు. (7-8)

శ్లో॥ తత ఉత్థాయ భగవాన్ సహలక్ష్మ్యా సతాం గతిః ।
స్వతల్పాదవరుహ్యాశు ననామ శిరసా మునిమ్ ॥ 9

అప్పుడు సత్పురుషులకు ప్రాప్తి స్థానమైన భగవంతుడు నారాయణుడు శీఘ్రముగా తల్పమునుండి దిగి లక్ష్మీదేవితో కలిసి భృగుమహర్షికి శిరస్సు వంచి నమస్కరించినాడు. 9

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ ఆహ తే స్వాగతం బ్రహ్మన్నిషీదాత్రాసనే క్షణమ్ ।
అజానతామాగతాన్ వః క్షంతుమర్హథ నః ప్రభో ॥ 10

ఓ స్వామీ ! రండి అని స్వాగతము చెప్పి అక్కడి ఆసనమున క్షణకాలము విశ్రమించమని మీ రాకను గమనించని నా అజ్ఞానమును మన్నించుమని ప్రార్థించినాడు. 10

టీ:- స ఇతి. స్వయోన్యా స్వస్యైవ రూపాంతరేణాభివ్యక్తిస్థానేన స్వకార్యేణత్యర్థః. తేన యథా కశ్చిద్వహ్నిం శమయితి తథా స్వ కార్యేణ పుత్రేణ నిమిత్తేన క్రోధం శమయామాసేత్యర్థః. (4-10)

శ్లో॥ పునీహి సహలోకం మాం లోకపాలాంశ్చ మద్గతాన్ ।
పాదోదకేన భవతస్తీర్థానాం తీర్థకారిణా ॥ 11

పుణ్యతీర్థములకే పవిత్రతను కలిగించు నీ పాద తీర్థముతో నన్ను నా లోకమున సద్గతులు పొందిన లోకపాలకులను పవిత్రులుగా చేయుము. 11

శ్లో॥ అద్యాహం భగవన్ లక్ష్మ్యా ఆసమేకాంత భాజనమ్ ।
వత్స్యత్యురసి మే లక్ష్మీర్భవత్పాదహతాంహసః ॥ 12

ఓ భగవంతుడా ! లక్ష్మీదేవితో కలిసి ఏకాంతమున్నను నేను, నా వక్షస్థలమున ఉన్న లక్ష్మీదేవి నీ పాద తాడనముచేత సర్వదోషముల నుండి విముక్తులమై ఐశ్వర్యమును పొందితిమి. 12

టీ:- పునీహీతి. తీర్థకారిణా తీర్థత్వ నిమిత్తేన. (11-12)

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏవం బ్రువతి వైకుంఠే భృగుస్తన్మంద్రయా గిరా ।
నిర్వృతస్తర్పితస్తూష్ణీం భక్త్యుత్కంఠాశ్రులోచనః ॥ 13

**శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు**

ఈ విధముగా వైకుంఠనాథుడు భృగుమహర్షిని మెల్లని గంభీరమైన మాటలతో తృప్తి పరచగా ఆయన భక్తిభావము పెల్లుబుకగా ఆనందాశ్రువులతో నిశ్చలముగా ఉండినాడు. 13

శ్లో॥ పునశ్చ సత్త్రమావ్రజ్య మునీనాం బ్రహ్మవాదినామ్ ।
స్వానుభూతమశేషేణ రాజన్ భృగురవర్ణయత్ ॥ 14

టీ:- ఏవమితి. తస్య మంద్రయా గిరా గంభీరవాచా నిర్వృత స్తూష్ణీం బభూవేతి శేషః. (13-14)

శ్లో॥ తన్నిశమ్యాథ మునయో విస్మితా ముక్తసంశయాః ।
భూయాంసం శ్రద్ధధుర్విష్ణుం యతశ్శాంతిర్యతోఽభయమ్॥15

టీ:- తదితి. విస్మితాః అపరాధాతిరేకేఽపి నిర్వికారత్వేన భూయాంసం శ్రద్దధుః మహత్తమం నిశ్చితవంతః యతః యస్మిన్. 15

శ్లో॥ ధర్మస్సాక్షాద్యతో జ్ఞానం వైరాగ్యం చ తదన్వితం ।
ఐశ్వర్యం చాష్టధా యస్మాద్యశశ్చాత్మ మలాపహమ్ ॥ 16

రాజా! ఈ విధముగా విష్ణువుతో సత్కృతుడైన భృగుమహర్షి సరస్వతీ తీరమందలి యాగప్రాంతమునకు మరలి వచ్చి బ్రహ్మవాదులైన మునీశ్వరులకు తాను తన అనుభవములో తెలుసుకొని వచ్చిన విషయమును వర్ణించి చెప్పినాడు. 14

భృగుమహర్షి అనుభవ పూర్వకముగా చెప్పిన మాటలు మునులందరు మిక్కిలి ఆశ్చర్యముతో విని సందేహ నివృత్తిని పొంది భయరహితముగా శాంతిని కలిగించు శ్రీమహావిష్ణువు పట్ల అపారమైన భక్తి భావమును పొందిరి. 15

వైరాగ్యము నాలుగు విధములు అనుటలో ఆ నాలుగు భేదములను ఈ విధముగా గ్రహించవలెను-విషయ సుఖాలపట్ల ఆసక్తిని వదలగల శక్తిలేని వారికి గౌరవములందు (సన్మానములందు) ఆసక్తిని వదులుట మొదటి వైరాగ్యము. దాని పిమ్మట విషయ సుఖాలందు ఆహారములో ఉప్పు, కారాలను తగ్గించుకొను వృత్తి రెండవ వైరాగ్యము. అట్టి వృత్తిలో మనస్సునందు అనురాగముక్రమముగా (సన్మానములు, ఉప్పుకారములందు) అభిరుచి తగ్గగా బాహ్యేంద్రియ ములతోడనే విషయమును సేవించుట (కేవలము చూపుతోనే తృప్తిచెంది అనుభవించకుండా దూరముగా ఉండుట) మూడవ వృత్తి రూపమైన

శ్లో॥ మునీనాం న్యస్తదండానాం శాంతానాం సమచేతసామ్ ।
అకించనానాం సాధూనాం యమాహుః పరమాం గతిమ్॥17

టీ:- ధర్మ ఇతి. వైరాగ్యం చ చతుర్విధమితి పాఠే తచ్చాతుర్విధ్యమేవం

వైరాగ్యము. ఆ చూపులపటల్ల కూడా ఉదాసీనత్వమును పొందుట (విషయవైముఖ్యమును) నాల్గవ వృత్తి రూపమైన వైరాగ్యము – 'వైరాగ్య మాద్యం యతమానసంజ్ఞం క్వచిద్విరాగో వ్యతిరేక సంజ్ఞం, ఏకేంద్రియాఖ్యం హృది రాగసౌక్ష్మ్యం తస్యాప్య భావస్తు వశీకృతాఖ్యః' – వైరాగ్య విషయమున కోరికలను అణచుకొను ప్రయత్నము మొదటిస్థితి. వాని పట్ల కొంత ఇష్టము తగ్గుట రెండవ స్థితి. కోరకలను మనస్సులోనే సూక్ష్మముగా ఉంచగలుగుట మూడవ స్థితి. మనస్సులో కూడా కోరికలుండకపోవుట అనే వశీకృత చిత్తత (మనస్సును నిగ్రహించగలుగుట) పూర్ణవైరాగ్యము – అని చెప్పబడినది.

విష్ణువు వలననే ధర్మభావన కలుగును. దాని వలన జ్ఞానము సిద్ధించును. జ్ఞానము వలన వైరాగ్య భావన కలుగును. దాని వలన ఎనిమిది విధములైన అణిమాదిసిద్ధులతో కూడిన ఐశ్వర్యము (ఈశ్వర భావము) వృద్ధి పొందును. దీని వలన శరీరము దానియందలి అంతః కరణము నందలి మాలిన్యము తొలగించునట్టి కీర్తి కలుగును. 16

దండకమండలములతో సర్వసంగపరిత్యాగులై శాంతము, సమచిత్తతలతో ఏ వికారములులేనివారై సాధువులైన మునీశ్వరులకు శ్రీమహావిష్ణువే చిట్టచివరగా పొందదగిన సర్వోత్కృష్ట స్థానము. 17

ద్రష్టవ్యం విషయాం స్త్యక్తుమశక్నువతోఽపి సంమానేచ్ఛాత్యాగ ఆద్యం వైరాగ్యం- తతో విషయాణాం మధ్యే లవణాదివ్యతిరేకేణాపి వృత్తిర్ద్వితీయం. తథా వృత్తావపి మనసి రాగ శైథిల్యేన బాహ్యేంద్రియైరేవ విషయసేవనం తృతీయం. తత్రాప్యౌదాసీన్యం చతుర్థం. తదాహుః - శ్లో. "వైరాగ్య మాద్యం యతమానసంజ్ఞం క్వచిద్విరాగో వ్యతిరేక సంజ్ఞం, ఏకేంద్రియాఖ్యం హృది రాగసౌక్ష్మ్యం తస్యాప్య భావస్తు వశీకృతాఖ్య" మితి. (16-17)

శ్లో॥ సత్త్వం యస్య ప్రియామూర్తిః బ్రాహ్మణాస్త్విష్ట దేవతాః ।
భజంత్యనాశిష శ్శాంతా యం వా నిపుణబుద్ధయః ॥ 18

టీ:- సత్త్వమితి. యస్య భగవత ఏవ. 18

శుద్ధమైన సత్త్వగుణమే (శుద్ధసత్త్వఘనుడు-పొడవు, వెడల్పు, ఎత్తు అనే మూడు విధముల కొలతలతో పరిపూర్ణముగా సత్త్వగుణమే కలవాడు) ప్రియమైనరూపము కలవాడు, బ్రాహ్మణులే పర దైవతములుగా భావించివాడు అయిన శ్రీమన్నారాయణుని నిపుణమైన బుద్ధులు కలవారు పరమశాంతితో నిష్కాములై నిరంతరము సేవింతురు. 18

శ్లో॥ త్రివిధా కృతయస్తస్య రాక్షసా అసురాస్సురాః ।
గుణిన్యా మాయయా సృష్టాస్సత్త్వం తత్రార్థసాధనమ్ ॥ 19

టీ:- త్రివిధాకృతయ ఇతి. తస్య భగవత ఏవ త్రివిధాఆకృతయః తత్ర తాసు సత్త్వమేవ అర్థసాధనం పురుషార్థహేతుః. 19

ఆ పరమాత్ముని సాత్త్వికము, రాజసము, తామసము అనే భేదములతో మూడు రూపములున్నవి. వానిలో శుద్ధసత్త్వము ఒక్కటే పురుషార్థములను సాధించుటకు మూలకారణము. రాక్షసులు, అసురులు, దేవతలు అనేవారు పరమాత్ముని గుణములు కలిగిన మాయ వలన జన్మించిరి. 19

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇత్థం సారస్వతా విప్రా నృణాం సంశయనుత్తయే ।
పురుషస్య పదాంభోజసేవయా తద్గతిం గతాః ॥ 20

టీ:- ఇత్థమితి. ఇత్థం నిశ్చిత్య సరస్వతీతీరవాసినో విప్రాః హరిపదాంభోజసేవయా ముక్తిం ప్రాపురితి. 20

### శ్రీ సూత ఉవాచ

శ్లో॥ ఇత్యేతన్ముని తనయాస్యపద్మగంధ
పీయూషం భవభయ భిత్పరస్య పుంసః ।
సుశ్లోక్యం శ్రవణపుటైః పిబన్న భీక్ష్ణం
సంసార భ్రమణ పరిశ్రమం జహాతి ॥ 21

టీ:- ఇతీతి. వ్యాసనందనస్య ముఖపంకజాదుద్గతం గంధయుక్త పీయూషతుల్యం హరేః ప్రశస్తం యశో యస్సంసారీ సేవతే స ముక్తో భవతీతి. 21

### శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏకదా ద్వారవత్యాం తు విప్రపత్న్యాః కుమారకః ।
జాతమాత్రో భువంస్పృష్ట్వా మమార కిల భారత ॥ 22

### శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

ఈ విధముగా సరస్వతీ తీరమందున్న విప్రులు సంశయమును వీడినవారై పరాత్పరుడైన శ్రీహరి పాదపద్మములను సేవించి ముక్తిని పొందిరని శుకుడు వివరించినాడు. 20

### శ్రీ సూతుడు ఇట్లు చెప్పినాడు

ఈ విధముగా వ్యాసమునీంద్రుని తనయుడైన శుక మహర్షి ముఖపద్మమునుండి జాలువారిన సువాసనభరితమై అమృతము వంటి శ్రీహరిస్తుతి రూపమైన కీర్తిప్రవాహమును చెవులనెడు దొన్నెలతో తృప్తిగా త్రాగినవారు జన్మభీతినివదిలి స్వేచ్ఛగా ఈజగత్తున జన్మమరణ చక్రమున సంచరించు ఆయాసమును వదిలి ముక్తిని పొందుదురు. (21)

### శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

ఓ రాజా! ఓ సారి ద్వారకానగరమున ఒక బ్రాహ్మణకుమారుడు పుట్టుక మాత్రములో భూమిపైపడిన వెంటనే మరణించినాడు. 22

శ్లో॥ విప్రో గృహీత్వా మృతకం రాజద్వార్యుపధాయ సః ।
ఇదం ప్రోవాచ విలపన్నాతురో దీన మానసః ॥ 23

అప్పుడు ఆ బాలుని తండ్రి మృత శిశుకళేబరమును కొనివచ్చి రాజమందిర ద్వారమును సమీపించి సంకటముతో విలపించుచు దీనభావముతో ఇట్లు పలికినాడు. 23

శ్లో॥ బ్రహ్మద్విషశ్శఠధియోలుబ్దస్య విషయాత్మనః ।
క్షత్రబంధోః కర్మదోషాత్పంచత్వం మేఽర్భకోగతః ॥ 24

బ్రాహ్మణద్వేషులు, దుష్టబుద్ధులు, లోభముతో కూడిన ప్రాపంచిక వ్యామోహము కలవారు అయిన రాజబంధులు చేసిన దుష్కర్మల ఫలితముగా నాకుమారుడు మరణించినాడు. 24

శ్లో॥ హింసావిహారం నృపతిం దుశ్శీలమజితేంద్రియమ్ ।
ప్రజాభజంత్యస్సీదంతి దరిద్రా నిత్య దుఃఖితాః ॥ 25

టీ:- స చోక్తలక్షణో భగవాన్ శ్రీకృష్ణ ఏవేతి దర్శయితు మాఖ్యానాం తరమాహ - ఏకదేతి. (22-25)

దుష్టమైన నడవడితో ఇంద్రియలోలుడై, హింసలకు పాల్పడునట్టి దుష్టడైన రాజును సేవించి ప్రజలు నిత్యము దుఃఖములను అనుభవించుచుచు దరిద్రముతో నరకయాతనలను అనుభవించు చున్నారు. 25

శ్లో॥ ఏవం ద్వితీయం విప్రర్షిస్తృతీయం త్వేవమేవ చ ।
విసృజ్య స నృపద్వారి తాం గాథాం సమగాయత ॥ 26

ఈ విధముగా ఆ బ్రాహ్మణఋషి మొదటి పుత్రుడు భూమిపై పడిన వెంటనే మరణించినట్లుగా రెండవ, మూడవ పుత్రులు అట్లే తర్వాత పుట్టినవారుకూడా మరణించగా వారి శవములను రాజమందిర ద్వారమున వదిలిపెట్టి విలపించిన విషయమును చెప్పినాడు. 26

శ్లో॥ తామర్జున ఉపశ్రుత్య కర్హిచిత్కేశవాంతికే ।
పరేతే నవమే బాలే బ్రాహ్మణం సమభాషత ॥ 27

ఆ విషయమును ద్వారకలో శ్రీకృష్ణుని సమీపమున అప్పుడుండిన అర్జునుడు విని, అదే సమయమున తన తొమ్మిదవ బాలుడుకూడా మరణించగా దుఃఖించుచున్న ఆ బ్రాహ్మణునితో

టీ:- ఏవమితి. బ్రహ్మద్విష ఇత్యాదికాం తాం గాథాం వాక్యం మయిన కశ్చద్దోషః. అతో రాజదోషేణైవ మత్పుత్రాః మ్రియంత ఇతివారం వారం చుక్రోశేత్యర్థః. (26-27)

అర్జునుడు ఇట్లు చెప్పినాడు. 27

శ్లో॥ క్వింస్విద్బ్రహ్మంస్త్వన్నివాసే ఇహనాస్తి ధనుర్ధరః ।
రాజన్యబంధురప్యేతే బ్రహ్మణాస్సత్ర మాసతే ॥ 28

టీ:- కింస్విదితి. హేబ్రహ్మన్ కింస్విత్ కిమర్థం వృథారోదిషి? యత స్త్వన్నివాసే ధనుర్ధరమాత్రో రాజన్య బంధురపి నాస్తి. బ్రహ్మణ్యస్య తు కా వార్తా ఏతే తు సత్రే యాగ ఏవ బ్రాహ్మణా మిళితా భవితుమర్హంతీ త్యర్థః. 28

ఓ బ్రాహ్మణా! ఎందుకీ విధముగా వ్యర్థముగా ఏడ్చుచుంటివి? నీ ఇంట ధనుర్బాణములు ధరించిన రాజబంధులు ఎవరూ లేరు. ఈ బ్రాహ్మణులందరు యాగమునకు వచ్చినవారు. 28

శ్లో॥ ధనదారాత్మజాయుక్తా యత్ర శోచంతి బ్రాహ్మణాః ।
తే వై రాజన్యవేషేణ నటా జీవంత్యసుంభరాః ॥ 29

టీ:- తదేవాహ- ధనేతి. ధనదారాదిభిర్వియుక్తాః యత్ర యేషు జీవత్సు శోచంతి తే జీవంతి కేవలం జీవికాం సంపాదయంతి. 29

ఆ విషయముననే చెప్పుచున్నాడు - ధనము, భార్యాపిల్లలతో కూడిన బ్రాహ్మణులు సంకటమును పొందినచో దానిని చూచుచున్న రాజులు రాజుల వేషమున ఉన్న నటులవంటివారై కేవలము తమ ప్రాణధారణ మాత్రమున తృప్తి పొందువారు. (అనగా బ్రాహ్మణుల సంకటములను నివారించని రాజులు వ్యర్థులని భావము) 29

శ్లో॥ అహం ప్రజానాం రక్షిష్యే భగవన్ దీనయోరిహ ।
అనిస్తీర్ణ ప్రతిజ్ఞోఽగ్నిం ప్రవేక్ష్యేఽహత కల్మషః ॥ 30

ఓ పరమాత్మా! నేను ప్రజలను కాపాడుదును. అట్లు చేయలేక పోయినచో ఈ బ్రాహ్మణుని ఏడుపును విన్న పాపకారణము చేత అగ్ని

**బ్రాహ్మణ ఉవాచ**

శ్లో॥ సంకర్షణో వాసుదేవః ప్రద్యుమ్నో ధన్వినాం వరః ।
అనిరుద్ధోఽప్రతిరథో న త్రాతుం శక్నువంతి యత్ ॥ 31

టీ:- అహమితి. హతకల్మష ఇతి అగ్ని ప్రవేశేన బ్రాహ్మణవిలాపశ్రవణ పాతకాత్ పూతో భవేయమిత్యర్థః. అహత కల్మషశ్చేతి వా. (30-31)

శ్లో॥ తత్కథన్ను భవాన్కర్మ దుష్కరం జగదీశ్వరైః ।
చికీర్షతి స్మ బాలిశ్యాన్న తచ్ఛ్రద్దధ్మహే వయమ్ ॥ 32

**అర్జున ఉవాచ**

శ్లో॥ నాహం సంకర్షణో బ్రహ్మన్ న కృష్ణః కార్ష్ణిరేవ చ ।
అహం పార్థోఽర్జునో నామ గాండీవం యస్య వై ధనుః ॥ 33

శ్లో॥ మావమంస్థా మమ బ్రహ్మన్ వీర్యం త్ర్యంబకతోషణమ్ ।
మృత్యుం విజిత్య ప్రధనే ఆనేష్యేతే ప్రజాః ప్రభో ॥ 34

ప్రవేశముతో ప్రాణత్యాగముతో పవిత్రుని చేసుకొందును. లేక ఆ పాపముతో నశింతును అని శపథము చేసినాడు. 30

**బ్రాహ్మణుడు ఇట్లు చెప్పినాడు**

బలరాముడు, శ్రీకృష్ణుడు, శ్రేష్ఠమైన విలుకాడైన ప్రద్యుమ్నుడు, యుద్ధమున ఎదురులేని రథికుడైన అనిరుద్ధుడు నన్ను రక్షించుటకు శక్తిలేనివారై ఉండగా నీవు అసాధ్యమైన పనికి పూనుకొనుట ఎందుకు? ఆ పని జగదీశ్వరులకే సాధ్యమగును కానీ బాలురకు కాదు. అందువల్ల నీ మాటలు మేము విశ్వసించమని ఆ బ్రాహ్మణుడు అర్జునునితో చెప్పినాడు. (31-32)

**అర్జునుడు ఇట్లు చెప్పినాడు**

దానికి అర్జునుడు ఈ విధముగా సమాధానము చెప్పినాడు. ఓ బ్రాహ్మణా ! నేను బలరాముడిని కాదు. కృష్ణుడిని కాదు. లేక కృష్ణుని సంతానమూ కాదు. నేను కుంతీ పుత్రుడనైన గాండీవ ధనువును ధరించిన అర్జునుడను. 33

ఓ బ్రాహ్మణా ! నన్ను బాలుడని చులకన భావముతో అవమానించకుము. నేను పరమేశ్వరుడు తృప్తి పడినట్టి పరాక్రమము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- తదితి. న శ్రద్దధ్మహే న సంప్రతీమః. (32-34)

కలవాడను. యుద్ధమున మృత్యువును జయించి ఓ స్వామీ! మీ పుత్రులను కొనివత్తును అని అర్జునుడు చెప్పినాడు. 34

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఏవం విస్రంభితో విప్రః ఫల్గునేన పరంతప ।
జగామ స్వగృహం ప్రీతః పార్థవీర్యం నిశామయన్ ॥ 35

అర్జునుడీవిధముగా నమ్మబలుకగా పార్థుని పరాక్రమమును నమ్ముకొని ఆ బ్రాహ్మణుడు సంతుష్టుడై తన గృహమునకు వెళ్ళినాడు అని పరీక్షిత్తుకు శుక మహర్షి తెలిపినాడు. 35

శ్లో॥ ప్రసూతికాల ఆసన్నే భార్యయా ద్విజసత్తమః ।
పాహి పాహి సుతం మృత్యోరిత్యాహార్జునమాతురః ॥ 36

టీ:- ఏవమితి. ఏవం ప్రౌఢవాక్యైః విస్రంభితః విశ్వాసం ప్రాపితః - నిశామయన్ శృణ్వన్. (35-36)

ఇట్లుండగా ఆ బ్రాహ్మణుని భార్యకు మరల ప్రసూతి సమయము సమీపించగా ఆ బ్రాహ్మణుడు తన పుత్రుని మరణము నుండి కాపాడుమని ఆందోళనతో అర్జునునికి మొరపెట్టుకొన్నాడు. 36

శ్లో॥ స ఉపస్పృశ్య శుచ్యంబు నమస్కృత్య మహేశ్వరమ్ ।
దివ్యాస్త్రాణి చ సంస్కృత్య సజ్యం గాండీవ మాదదే ॥ 37

టీ:- స ఇతి. బ్రాహ్మణోపేక్షితత్వేన కృష్ణమవజ్ఞాయ మహేశ్వరం నమస్కృత్య. 37

అప్పుడు అర్జునుడు తీర్థజలమును స్పర్శించి (ఆచమించి), పరమేశ్వరునికి నమస్కరించి, దివ్యాస్త్రములకును వందనమాచరించి అల్లెత్రాటితో సిద్ధపరచిన గాండీవమును స్వీకరించినాడు. బ్రాహ్మణుడు ఉపేక్షించినందువలన అర్జునుడు తానుకూడా కృష్ణుని స్మరించక అవమానించినవాడైనాడు. 37

శ్లో॥ న్యరుణత్సూతికాగారం శరైర్నానాస్త్రయోజితైః ।
తిర్యగూర్ధ్వమధః పార్థశ్చకార శరపంజరమ్ ॥ 38

పలువిధములైన అస్త్రములను సంధించిన బాణములతో ఆ బ్రాహ్మణపత్ని ప్రసూతి గృహమునకు పైన కప్పుగా నాలుగు వైపుల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:-న్యరుణదితి. న్యరుణత్ ఆవృతవాన్. తదేవాహతిర్యగూర్ధ్వమితి. 38

ప్రాకారముగా భూమిపై ఒక శరపంజరమును అర్జునుడు నిర్మించి నాడు. 38

శ్లో॥ తతః కుమారస్సంజాతో విప్రపత్న్యా రుదన్ముహుః ।
సద్యో దర్శనమాపేదే సశరీరో విహాయసా ॥ 39

అప్పుడు పుత్రుడుదయించినాడు. విప్రుని పత్ని మరిమరి గట్టిగా ఏడ్చుచుండగా ఆ శిశువు సశరీరముగా అందరూ చూచుచుండగా ఆకాశమున కనబడి వెంటనే మాయమయ్యెను. 39

శ్లో॥ తదాహ విప్రో విజయం వినిందన్ కృష్ణసన్నిధౌ ।
మౌఢ్యం పశ్యత మే యోఽహం శ్రద్దధే క్లీబకత్థనమ్ ॥ 40

టీ:- తతఇతి. అదర్శనమాపేదే దేహోఽపి నావతిష్టత ఇత్యర్థః. (39-40)

అప్పుడా బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని ఎదుటనే అర్జునుని నిందించుచు ఒక పేడివాని (అర్జునుని) డాంబికపు మాటలను విశ్వసించిన నా మూర్ఖత్వమును చూడుడని బాధపడినాడు. 40

శ్లో॥ న ప్రద్యుమ్నో నానిరుద్ధో న రామో న చ కేశవః ।
యస్య శేకుః పరిత్రాతుం కోఽన్యస్తదవితేశ్వరః ॥ 41

టీ:- నేతి. యస్య ప్రజాః తదవితా. 41

బాలును రక్షించుటకు ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, బలరాముడు, శ్రీకృష్ణుడు కూడా సమర్థులు కానప్పుడు వేరే ఏ ఈశ్వరుడు (సామర్థ్యము కలవాడు) ఎవరున్నారు. ఎవ్వరును సాధించలేరని భావము. 41

శ్లో॥ ధిగర్జునం మృషావాచం ధిగాత్మ శ్లాఘినో ధనుః ।
దైవోపసృష్టం యో మౌఢ్యాదానినీషతి దుర్మతిః ॥ 42

అసత్యము పలికే అర్జునుడు వ్యర్థము. తనను తాను పొగడుకొనుటకు తప్ప గాండీవము వ్యర్థము. భగవంతుడే ఇష్టములేక విడిచిపెట్టిన వానిని (కాపాడకున్నవానిని) ఈ దుష్టుడైన అర్జునుడు తీసుకొని వత్తుననుకొన్నాడు. 42

ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య. ఓం న మో భ గ వ తే వా సు దే వా య.

శ్లో॥ ఏవం శపంతి విప్రర్షౌ విద్యామాస్థాయ ఫల్గునః ।
యయౌ సంయమనీమాశు యత్రాస్తే భగవాన్ యమః ॥ 43

ఈ విధముగా ఆ బ్రాహ్మణఋషి నిందించుచుండగా అర్జునుడు ఎవ్వరికిని చెప్పకుండా బ్రాహ్మణ బాలునికొరకై శీఘ్రముగా తన శక్తిని నమ్ముకొని అక్కడనుండి భగవంతుడైన యముని పట్టణమైన సంయమనికి వెళ్ళినాడు. 43

శ్లో॥ విప్రాపత్యమచక్షాణస్తత ఐంద్రీమగాత్పురీమ్ ।
ఆగ్నేయీం నైరృతీం సౌమ్యాం వాయవ్యాం వారుణీమథ
రసాతలం నాకపృష్ఠం ధిష్ణ్యాన్యన్యాన్యుదాయుధః ॥ 44

టీ:- తత్రాహ - ధిగితి. (42-44)

అక్కడనుండి బ్రాహ్మణ శిశువును అన్వేషించుచు ఇంద్ర పట్టణమైన అమరావతికి వెళ్ళినాడు. పిమ్మట అగ్నిపట్టణమైన నైరుతిపట్టణము, చంద్రుడు, వాయువు, వరుణుల పట్టణములను, రసాతలములను, స్వర్గమును, ఇంకా అవకాశమున్న పెక్కు స్థలములను సాయుధుడై అన్వేషించుచు తిరిగినాడు. 44

శ్లో॥ తతోఽలబ్ధద్విజసుతో హ్యనిస్తీర్ణ ప్రతిశ్రుతః ।
అగ్నిం వివక్షుః కృష్ణేన ప్రత్యుక్తః ప్రతిషేధతా ॥ 45

టీ:- తతఇతి.ప్రత్యుక్తః నివారితః ఉపపత్తిభిః ప్రతిషేధం కుర్వతా. 45

ఎక్కడ కూడా బ్రాహ్మణ పుత్రుడు లభించనందువల్ల తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనలేక ఇల్లుచేరి అగ్నిని వెలిగించి ప్రాణత్యాగమునకు సిద్ధపడగా శ్రీకృష్ణుడు ఉపపత్తులలో అతని అగ్నిప్రవేశ ప్రయత్నము తగనిదని నివారించినాడు. 45

శ్లో॥ దర్శయే ద్విజసూనూంస్తే మావజ్ఞాత్మానమాత్మనా ।
మానవాస్స్థాపయిష్యంతి కీర్తిం నిందతి యే హి నః ॥ 46

నీకు నేను బ్రాహ్మణ పుత్రులను చూపింతును. నీవు అశక్తుడైతినని నిన్ను నీవు అవమానించుకొనకుము. మొదట మనలను నిందించిన వారే పని అయిన పిమ్మట మన కీర్తిని స్థాపింతురు. దీని వలన నీకు అపారమైనకీర్తి నిన్నునిందించిన వారే కలిగింతురు. 46

శ్లో॥ ఇతి సంభాష్య భగవానర్జునేన మహేశ్వరః ।
దివ్యం స్వరథమాస్థాయ ప్రతీచీం దిశమావిశత్ ॥ 47

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య
ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- దర్శయ ఇతి. మావజ్ఞ మావజానీహి- యే నిందంతి త ఏవ మనుష్యాః నః కీర్తిం స్థాపయిష్యంతి నిశ్చలాం కరిష్యంతి. ఏతేన కీర్తిం విపులాం మానవాస్థాపయంతి చేతి పాఠాంతరం. (46-47)

ఈ విధముగా కృష్ణుడు అర్జునునికి ఓదార్పు మాటలు చెప్పి భగవంతుడు మహేశ్వరుడు అయిన కృష్ణుడు తన దివ్య రథముపై అర్జునునితో కలసి దక్షిణ దిశను ప్రవేశించెను. 47

శ్లో॥ సప్తద్వీపాన్ సప్తసింధూన్ గత్వా సప్తగిరీనథ ।
లోకాలోకం తథాతీత్య వివేశ సుమహత్తమః ॥ 48

సప్తద్వీపములను, సప్తసముద్రములను దాటి పిమ్మట ఏడుకుల పర్వతములను, లోకాలోకపర్వతమును (చక్రవాళపర్వతము, భూమ్యాకాశములు కలియునట్లు కనబడు కొండను) అతిక్రమించి అపారమైన చీకటిలోనికి ప్రవేశించెను. 48

శ్లో॥ తత్రాశ్వాస్సైన్య సుగ్రీవమేఘపుష్పబలాహకాః ।
తమసా భ్రష్టగతయో బభూవుర్భరతర్షభ ॥ 49

ఓ భరతకులశ్రేష్ఠా ! అక్కడ కృష్ణుని రథమునందలి అశ్వములైన సైన్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకములు అపారమైన చీకటిచేత నడకలందు కుంటుబడినవి. 49

శ్లో॥ తాన్ దృష్ట్వాభగవాన్ కృష్ణో మహాయోగీశ్వరేశ్వరః ।
సహస్రాదిత్యసంకాశం స్వచక్రం ప్రాహిణోత్పురః ॥ 50

గతితప్పిన గుర్రములను చూచి మహాయోగేశ్వరేశ్వరుడు, భగవంతుడనైన శ్రీకృష్ణుడు వేయి సూర్యుల ప్రకాశముగల తన సుదర్శన చక్రమును ముందునకు పంపినాడు. 50

టీ:- సప్తేతి. సప్త సప్త సంఖ్యాః గిరయో యేషు ద్వీపేషు. (48-50)

శ్లో॥ కృతం సుఘోరం గగనచ్ఛదం మహ
ద్విదారయద్భూరితరేణ రోచిషా ।

ఆ సుదర్శనచక్రము భయంకరముగా ఆకాశమును కప్పివేసిన గాడాంధకారమును తన అపారమైన కాంతితో, మనోవేగముతో సర్వము

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

మనోజవం నిర్వివిశే సుదర్శనం
గుణచ్యుతో రామశరో యథా చమూం ॥ 51

టీ:- కృతమితి. ప్రకృతి పరిణామరూపం నాలోకాభావమాత్రం. 51

శ్లో॥ ద్వారేణ చక్రానుపథేన తత్తమః
పరం పరంజ్యోతి రనంత పారగమ్ ।
సమశ్నువానం ప్రసమీక్ష్య ఫల్గునః
ప్రతాపితాక్షః పిదధేஉక్షిణీ ఉభే ॥ 52

టీ:- ద్వారేణేతి. చక్రానుపథేన చక్రమనుగతేన ద్వారేణ తత్తమః పరం తస్మాత్తమసః పరం దూరే వర్తమానం పరం శ్రేష్ఠం భాగవతం జ్యోతిః సమ శ్నువానం వ్యాప్నువత్ ప్రసమీక్ష్య ప్రతాపితాక్షః నేత్రే న్యమీలయదితి. 52

శ్లో॥ తతః ప్రవిష్టస్సలిలం నభస్వతా
బలీయసైజద్బృహదూర్మి భూషణమ్ ।
తత్రాద్భుతం వైభవనం ద్యుమత్తమం
భ్రాజన్మణిస్తంభ సహస్రశోణితమ్ ॥ 53

కనపడునట్లుగా అనగా చీకటిఅంధకారత్వమును పటాపంచలు చేయునట్లుగా రాముని అల్లెత్రాడునుండి వెలువడిన బాణము రాక్షస సైన్యమున జొరబడినట్లుగా ముందున్న అంధకార కుహరమున ప్రవేశించినది. (ఇక్కడి చీకటి ప్రకృతిపరిమాణరూపమైనదే కాని - ఏమిలేదు - లోకమే లేదనే అభావము మాత్రము కాదు). 51

ఆ సుదర్శనచక్రము అనుసరించిన ద్వారముగుండా ఆ చీకటికంటె ఆవల చాలా దూరమున ఉన్న సర్వశ్రేష్ఠమైన, అనంతమై అంతటా వ్యాపించిన పరమాత్మ జ్యోతిని చూచి అర్జునుడు ఆ కాంతి తన కన్నులకు మిగుల తాపమును కలిగించగా దానిని చూడలేక కన్నులను గిట్టిగా మూసికొన్నాడు. 52

అక్కడ బలమైన గాలితో ఎగిసిపడునట్టి గొప్ప అలలే అలంకారమైన జలముల మధ్యన అపారముగా ప్రకాశించునట్టి వేలకొలది మణిస్తంభములతో ఎర్రనై మిక్కిలి కాంతి కలిగిన ఒక అద్భుతమైన భవనమున ప్రవేశించినాడు. 53

టీ:- తత ఇతి. ఏజంతః ఉచ్చలంతః బృహంతః మహాంతః ఊర్మయో భూషణం యస్య తత్ తత్ర సలిలే భవనం మహాకాలపురం ద్యుమత్తమం ద్యుతిమత్సుశ్రేష్ఠమ్. 53

ఆ భవనము గొప్ప సర్పరాజైన అనంతుడు అద్భుతముగా తన వేయిపడగలమీది మణులకాంతులతో ప్రకాశించుచు, రెండువేల కన్నులతో మెరియుచు, స్ఫటికపు కొండవంటి కాంతితో నల్లని కంఠములతో నాలుకలతో విరాజిల్లుచున్నాడు. 54

శ్లో॥ తస్మిన్ మహాహీంద్ర మనంతమద్భుతం
సహస్రమూర్ధన్య ఫణామణిద్యుభిః ।
విభ్రాజమానం ద్విసహస్రనేత్రై
స్సితాచలాభం శితికంఠజిహ్వామ్ ॥ 54

టీ:- తస్మిన్నితి. సహస్రమూర్ధ్ని భవాః ఫణాః తాసు మణయః తేషాం ద్యుతిభిః ద్విసహస్రనేత్రైరూర్జితం స్ఫటికగిరిసంకాశం శితికంఠజిహ్వాం కంఠాశ్చ జిహ్వాశ్చ శితయః నీలాః కంఠజిహ్వా యస్య తమ్. 54

ఆ అనంతుని పడగలపై సుఖాసనమున విరాజిల్లుచున్న మహానుభావుడు, పురుషోత్తముడు, నీలమేఘశ్యాముడు, పీతాంబరుడు, ప్రసన్నముఖుడు, అందమైన విశాలమైన కన్నులు కలవాడు, గొప్ప మణుల సముదాయముతో కూడిన కిరీటము, కుండలముల కాంతులతో వ్యాప్తమైన సుందర కేశములు కలవాడు, (గుడాకేశుడు) పొడవై అందమైన ఎనిమిది భుజములు కలవాడు, శ్రీవత్సలాంఛనము, కౌస్తుభమణి, తులసీమాలలు ధరించిన దేవదేవుడు దర్శనమిచ్చినాడు. (55-56)

శ్లో॥ దదర్శతద్భోగ సుఖాసనం విభుం
మహానుభావం పురుషోత్తమోత్తమమ్ ।
సాంద్రాంబుదాభం సుపిశంగవాససం
ప్రసన్నవక్త్రం రుచిరాయతేక్షణమ్ ॥ 55

టీ:- దదర్శేతి. తద్భోగ సుఖాసనం తస్య అనంతస్య భోగో దేహః సుఖరమాసనం యస్య తమ్. 55

శ్లో॥ మహామణి వ్రాత కిరీటకుండల
ప్రభాపరిక్షిప్త సహస్రకుండలమ్ ।
ప్రలంబ చార్వష్ట భుజం సకౌస్తుభం
శ్రీవత్సలక్ష్మం వనమాల యావృతమ్ ॥ 56

టీ:- మహామణీతి. మహాంతో మణివ్రాతా యేషు తేషాం కిరీట కుండలానాం ప్రభా తయా పరిక్షిప్తాః సర్వతః స్ఫురంతః సహస్ర మపరిమితాః కుంతలా యస్య తమ్. 56

శ్లో॥ సునంద నంద ప్రముఖైస్స్వపార్షదై
శ్చక్రాదిభిర్మూర్తి ధరైర్ని జాయుధైః ।
పుష్ట్యా శ్రియా కీర్త్యజయాஉఖిలర్ధిభి
ర్నిషేవ్యమాణం పరమేష్ఠినాం పతిమ్ ॥ 57

శ్లో॥ వవంద ఆత్మాన మనంతమచ్యుతో
జిష్ణుశ్చ తద్దర్శన జాత సాధ్వసః ।
తావాహ భూమా పరమేష్ఠినాం ప్రభు
ర్బద్ధాంజలీ సస్మిత మూర్జయా గిరా ॥ 58

సునందుడు, నందుడు మొదలైన ముఖ్య సభ్యులు, శరీరధారులైన తన శంఖచక్రములు మొదలైన ఆయుధములుండగా పుష్టి, లక్ష్మి, కీర్తి, అజయ (మాయ), అష్టసిద్ధులు మొదలైన వానిచేత సేవలందుకొనుచున్నవాడు. బ్రహ్మాదులైన సృష్టికర్తలకు ప్రభువైన ఆ పరమాత్మునికి కృష్ణార్జునులు నమస్కరించిరి. ఆ పరమాత్ముడుని దర్శించిన ఆనందాతిరేకముతో చేతులు జోడించిన వారిరువురితో సృష్టికర్తలకు అధినాయకుడైన భూపతి చిరునవ్వు నవ్వుచు ఉత్సాహముతోకూడిన మాటలతో ఇట్లు చెప్పినాడు. (57-58)

టీ:- సునందేతి. కీర్త్యజయా కీర్తిసహితాజయా అఖిలర్ధిభిరణి మాదిబి ర్విభూతిభిర్మూర్తిధరాభిః. (57-58)

శ్లో॥ ద్విజాత్మజావై యువయోర్దిదృక్షయా
మయోపనీతా భువి ధర్మ గుప్తయే ।
కలావతీర్ణావవనేర్భరాసురాన్
హత్వేవ భూయస్త్వరయే తమంతి మే ॥ 59

లోకమున ధర్మమును ఉద్ధరించుటకై నా కళలతో పుడమిపై అవతారమును స్వీకరించిన మిమ్ములను దర్శించుటకే బ్రాహ్మణ పుత్రులను నేను ఇక్కడకు తెచ్చితిని. భూమికి భారమైన రాక్షసులను నాశనముచేసి మరల నా సమీపమునకు రండి అని మిమ్ముల వేగిరపరచుటకే మిమ్ము ఇక్కడికి రప్పించితిని. 59

టీ:- ద్విజాత్మజా ఇతి. మే కలావతీర్ణౌ ఇతి సంబోధనం. శీఘ్రం మే అంతి సకాశం ఇతం ఆగచ్ఛతమ్. 59

శ్లో॥ పూర్ణకామావపి యువాం నరనారాయణావృషీ ।
ధర్మమాచరతం స్థిత్యై ఋషభౌ లోకసంగ్రహమ్ ॥ 60

మీరు సర్వశ్రేష్ఠులు, పరిపూర్ణకాములు అయిన నరనారాయణు లనెడు ఆది ఋషులు అయినప్పటికి లోకవ్యవహారము సక్రమముగా కొనసాగుటకై ధర్మమును ఆచరింతురు, ఆచరింపజేయుదురు అని చెప్పినాడు. 60

శ్లో॥ ఇత్యాదిష్టౌ భగవతా తౌ కృష్ణౌ పరమేష్ఠినా ।
ఓమిత్యానమ్య భూమానమాదాయ ద్విజదారకాన్ ॥ 61

శ్లో॥ న్యవర్తేతాం స్వకం ధామ సంప్రహృష్టౌ యథాగతం ।
విప్రాయ దదతుః పుత్రాన్యథారూపం తథా ప్రభూ ॥ 62

మీరు పూర్ణకాములు, ధర్మమును ఆచరింతురు, రక్షింతురు అనేవి బారత యుద్ధమున కంటె ముందుగనే జరిగినను వారు చేసిన పనియందలి గొప్పదనమును మరలా స్మరించు నెపమున ఇక్కడ మరల

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ప్రశామ్య వైష్ణవం ధామపార్థః పరమవిస్మితః ।
యత్కించిత్పౌరుషం పుంసాం మే నే కృష్ణానుకంపితమ్ ॥ 63

శ్లో॥ ఇతీదృశాన్యనేకాని వీర్యాణీహ ప్రదర్శయన్ ।
బుభుజే విషయాన్ రమ్యానీజే చాత్యూర్జితైర్మఖైః ॥ 64

శ్లో॥ ప్రవర్షాఖిలాన్ కామాన్ ప్రజాసు బ్రాహ్మణాదిషు ।
యథా కాలం యథైవేంద్రో భగవాన్ శ్రైష్ఠ్యమాస్థితః ॥ 65

ప్రస్తావింపబడినది – ఈ విధముగా ఆ భగవంతుడైన పరమేశ్వరుడు ఆదేశించగా ఆ కృష్ణులిద్దరు (అర్జునునికి కృష్ణ నామధేయము ప్రసిద్ధము) ఓం అని (పరమాత్మని ఆదేశమునకు సరేఅని) అంగీకరించి నమస్కరించి బ్రాహ్మణ పుత్రులను భూమికితెచ్చి సంతోషముతో తమ వాసమైన ద్వారకకు మరలివచ్చి వెంటనే ఉన్నవారు ఉన్నట్లుగనే (ఏ మాత్రము ఆలస్యము చేయక) సజీవముగా ఆ బ్రాహ్మణునికి అతని పుత్రులను సమర్పించిరి. (61-62)

విష్ణువుని తేజమును ఆశ్చర్యముతో దర్శించినందు వలన మిక్కిలి శాంతిని పొందిన అర్జునుడు వ్యక్తియందలి ఏ కొంచెమైన శక్తికూడా కృష్ణుని అనుగ్రహము వలన కలిగినదే అని భావించినాడు. 63

ఈ విధముగా ఈ బ్రాహ్మణ బాలకులను రక్షించిన వృత్తాంతము వంటి ఎన్నో అద్భుత లీలలను ప్రదర్శించుచు, రమ్యమైన విషయ సుఖములను అనుభవించి, గొప్పయజ్ఞములను (లోకోపకారకమైన పనులను) ఎన్నింటినో కృష్ణుడు నిర్వహించినాడు. 64

ప్రజలకు బ్రాహ్మణులకు సమస్తమైన కోరికలను సుఖములను అపారముగా కురిపించినాడు. తనకాలము వరకు ఇంద్రుడు

శ్లో॥ హత్వా నృపానధర్మిష్ఠాన్ ఘాతాయిత్వార్జునాదిభిః ।
అంజసా వర్తయామాస ధర్మం ధర్మసుతాదిభిః ॥ 66

టీ:- పూర్ణకామావితి. ఆచరతం కురుతం ఇదం తు భారతయుద్ధాత్పూర్వమేవ కృతమపి శ్రైష్ఠ్యకథన ప్రస్తావేనాత్రోక్తం.(60-66)

**శ్రీమద్భాగవతే, దశమస్కంధే, ఏకోననవతితమోఽ ధ్యాయః**

భోగములను అనుభవించినట్లుగా భగవంతుడు సర్వశ్రేష్ఠత్వమును పొందినాడు. 65

అధర్మపరులైన రాజులను తానుచంపి, అర్జునుడు, భీముడు మొదలైన యోధవీరుల చేతిలో చంపించి ధర్మరాజు మొదలైన వారివల్ల శీఘ్రముగా - వాస్తవముగా ధర్మము నెలకొల్పునట్లు శ్రీకృష్ణుడు చెసినాడని శుక మహర్షి వివరించినాడు. 66

**అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు**
**ఎనుబదితొమ్మిదవ అధ్యాయముసమాప్తము**

## నవతితమోఽధ్యాయః

శ్లో॥ చరమే తు పునః ప్రోక్తా కృష్ణలీలా సమాసతః ।
యదువంశ ప్రసూతానామానంత్యం చ కారణమ్ ॥

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ సుఖం స్వపుర్యాం నివసన్ ద్వారకాయాం శ్రియః పతిః ।
సర్వసంపత్సమృద్ధాయాం సంవృతో వృష్ణిపుంగవైః ॥ 1

శ్లో॥ స్త్రీభిశ్చోత్తమవేషాభిర్నవయౌవన కాంతిభిః ।
హర్మ్యేషు కందుకాద్యైస్తు క్రీడంతీభిస్తటిద్ద్యుభిః ॥ 2

శ్లో॥ నిత్యం సంకులమార్గాయాం మదచ్యుద్భిర్మతంగజైః ।
స్వలంకృతైర్భటైరశ్వై రథైశ్చ కవచోజ్జ్వలైః ॥ 3

శ్లో॥ ఉద్యానోపవనాఢ్యాయాం పుష్పితద్రుమరాజిషు ।
నిర్విశద్భృంగ విహగైర్నాదితాయాం సమంతతః ॥ 4

శ్లో॥ రేమే షోడశసాహస్ర పత్నీనామేక వల్లభః ।
తావంతి బిభ్రద్రూపాణి తత్తద్గృహేషుమహర్ధిషు ॥ 5

## 90 వ అధ్యాయము

దశమస్కంధము చవరి అధ్యాయమున మరల శ్రీకృష్ణుని లీలలను సంగ్రహముగా చెప్పి, యదువంశమున జన్మించిన వారి పరంపరను కారణ సహితముగా వివరించుట విషయము.

### శ్రీ శుకుడు ఇట్లు చెప్పినాడు

శ్రీకృష్ణుని ఐశ్వర్యమును సంగ్రహముగా చూపుచున్నాడు. ఆ ద్వారకానగరమున సర్వసంపదలతో తులతూగునట్టిది రాజమార్గమున మదజలమును స్రవించు మదగజములు, చక్కని అలంకారములతో కూడిన రథములు, గుర్రములు కవచములతో ప్రకాశించు సాయుధులైన భటులు నిరంతరము సంచరించుచుందురు. ఆ నగరమునందలి మేడలందు మెరుపుతీగలవంటి కాంతితో, యౌవన వతులైన స్త్రీలు ఉత్తమమైన వేషభూషణములు ధరించినవారై బంతియాట మొదలైన పెక్కు క్రీడలతో విహరించుచుందురు. పుష్పించిన వృక్షములతో, అంతటా వ్యాపించిన నానావిధములైన ధ్వనులు చేయుచు సంచరించు చున్నట్టి భ్రమరములు పక్షులతో కూడిన మనోహరమైన ఉద్యాన వనములతో విరాజిల్లినది ఆ ద్వారక. పదునారువేలమంది పడతులకు తానొక్కడే భర్తయై కూడా వారివారి ఇండ్లయందు వారిసంఖ్యకు తగినన్ని రూపములతో సర్వసంపదలతో, కామభోగము లనుభవించుచు

టీ:- శ్రీకృష్ణ విభూతిం సమాసేన దర్శయతి- సుఖమితి.సర్వ సంపద్వి శిష్టాయాం. శియఃపతిః షోడశసహస్రపత్నీనామేకవల్లభస్సన్ తాసాం గృహేషు రేమ ఇత్యన్వయః. (1-5)

తనవారైన యాదవప్రముఖులతో కలిసి లక్ష్మీపతియైన ఆ శ్రీకృష్ణుడు ద్వారకానగరమున నివసించినాడు. (1-5)

శ్లో॥ ప్రోత్ఫుల్లోత్పల కల్హార కుముదాంభోజ రేణుభిః ।
వాసితామరతోయేషు కూజద్ద్విజకులేషు చ ॥ 6

టీ:- ప్రోత్ఫుల్లేతి. గృహవిశేషణం ప్రోత్ఫుల్లేతి శ్లోకేనోక్తం. 6

శ్లో॥ విజహార విగాహ్యాంభో హ్రదినీషు మహోదయః ।
కుచకుంకుమ లిప్తాంగః పరిరబ్ధశ్చ యోషితామ్ ॥ 7

టీ:- విజహారేతి. తథా హ్రదినీషు చ, అంభో విగాహ్య విజహార. మహాను దయోవైభవం యస్య సః.యోషితాం కుచకుంకుమైర్లిప్తాంగః యతస్తాభిః పరిరబ్ధః.7

వికసించిన కలువలు, ఎఱ్ఱతామరలు,పద్మాలు మొదలైన పుష్పముల పుప్పొడుల సువాసనలతో విలసిల్లు జలములు గల నదులందు తనభార్యలతో కలిసి జలక్రీడలాడుచు ఆస్త్రీల కౌగిలింతలతో వారికుచములందలి మకరికా పత్రములచేత ఎఱ్ఱబారిన నీలశరీరుడై అపారమైన భోగమును శ్రీకృష్ణుడు అనుభవించినాడు. (6-7)

శ్లో॥ ఉపగీయమానో గంధర్వైర్మృదంగ పణవానకాన్ ।
వాదయద్భిర్ముదా వీణాస్సూత మాగధవందిభిః ॥ 8

ఆసమయమున గంధర్వులుమద్దెలలు,తప్పెటలు,దుందుభులు, వీణలు మొదలైన వాద్యములను ప్రయోగించుచు పాడుచుండగా, సూత వందిమాగధులు స్తోత్రపాఠములు చదువుచుండగా శ్రీకృష్ణుడు తనపై

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ సిచ్యమానోఽచ్యుతస్తాభిర్హసంతీభిశ్చ రేచకైః ।
పత్నీస్సించన్ విచిక్రీడే యక్షీభిర్యక్షరాడివ ॥ 9

టీ:- ఉపగీయమానఇతి. సూతమాగధవందిభిశ్చ ఉపగీయమానం. (8,9)

భార్యలు నీళ్ళుచల్లుచు నవ్వుచుండగా వారిపై మరల తాను నీళ్ళు చల్లుచు-యక్షరాజైన కుచేరుడు తనభార్యలైన యక్షిణులతో క్రీడించినట్లుగా విహరించినారు. (8-9)

శ్లో॥ తాః క్లిన్న వస్త్రవివృతోరుకుచ ప్రదేశా
స్సించంత్య ఉద్ధృత బృహత్కబర ప్రసూనాః ।
కాంతం స్మ రేచక జిహీర్షుతయోపగూహ్య
జాతస్మరోత్స్మయలసద్వదనా విరేజుః ॥ 10

టీ:- తా ఇతి. తాః క్లిన్నవస్త్రాః అత ఏవ వివృతో రుకుచ ప్రదేశాః. ఉద్ధృతాని విస్రస్తాని బృహత్కబరేభ్యః ప్రసూనాని యాసాం తాః. జాతేన స్మరేణ య ఉత్స్మయః తేన లసంతి. వదనాని యాసాం తాః . 10

కృష్ణుని చల్లులాటచేత తడిసిన వస్త్రములతో తొడలు, కుచములు బయల్పడగా తమ గొప్ప కొప్పులనుండి పువ్వులురాలకుండా పట్టుకొనుచున్నవారై కృష్ణుని పత్నులు ఆయనను చల్లులాడు ప్రయత్నము నుండి విరమింపచేయుటకై గట్టిగా కౌగలించుకొనగా వారు మన్మథ భావనకు లోనై చిరునవ్వుతో ప్రకాశించు ముఖములతో వెలిగిరి. 10

శ్లో॥ కృష్ణస్తు తత్స్తనవిషజ్జిత కుంకుమస్ర
క్క్రీడాభిషంగధుతకుంతల బృందబంధః ।
సించన్ ముహుర్యువతిభిః పరిషిచ్యమానో
రేజే కరేణుభిరవేభపతిః పరీతః ॥ 11

కృష్ణుడు కూడా ఆ స్త్రీల స్తనములందు అలంకరింపబడిన మకరికా పత్రములు, పూలదండలతో క్రీడించు అభినివేశములతో తలవెంట్రుకలు జారినవాడై భార్యలపైనీళ్ళుచల్లుచు, వారిచే తడుపబడుచున్నవాడై- చుట్టూ ఆడ ఏనుగులతో జలక్రీడలాడునట్టి గజరాజు వలె ప్రకాశించినాడు. 11

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ నటానాం నర్తకానాం చ గీతవాద్యోపజీవినాం ।
క్రీడాలంకారవాసాంసి కృష్ణో౭దాత్తస్య చ స్త్రియః ॥ 12

కృష్ణుడు అతనిపత్నులు-నటులు, నర్తకీమణులు మొదలైన సంగీతము, వాద్యములవలన జీవించువారికి విలాసవంతమైన ఆభరణములు, వస్త్రములు మొదలైనబహుమతులతో సత్కరించిరి. 12

శ్లో॥ కృష్ణస్యైవం విహరతో గత్యాలాపేక్షితస్మితైః ।
నర్మకేళి పరిష్వంగైః స్త్రీణాం కిల హృతాధియః ॥ 13

టీ:- కృష్ణఇతి. తాసాం స్తనేభ్యో విషజ్జిత కుంకుమాస్రక్ యస్య సః క్రీడాయాం అభిషంగేణ అభినివేశేన ధుతః కంపితః కుంతల బృంద బంధో యస్య సః. (11-13)

ఈవిధముగా కృష్ణుడు భార్యలతో జలక్రీడలాడుచు మధురమైన మాటలు, చూపులు, చిరునవ్వులు, సంభోగము, కౌగిలింతలతో వారి మనస్సులను హరించినాడు. 13

శ్లో॥ ఊచుర్ముకుందైకధియో గిర ఉన్మత్తవజ్జడమ్ ।
చింతయంత్యో౭రవిందాక్షం యాని మే గదతస శృణు ॥ 14

టీ:- ఊచురితి. ముకుందైకధియః సమాహితాః ఉన్మత్తా ఇవ క్షణమగిరస్సత్యః పునస్తమేవేశం చింతయంత్యో జడం యథా భవతి తథా యాని వాక్యాని ఊచుస్తాని మే మత్తః గదతః శృణ్విత్యర్థః. 14

కృష్ణునియందే మనస్సు లగ్నమై నిరంతరము అతని ధ్యాసయందేయున్న మరికొందరు స్త్రీలు పిచ్చివారివలె విరహముతో పలికిన మాటలను చెప్పెదను వినుమని శుకమహర్షి పరీక్షిత్తుకుచెప్పినాడు. 14

శ్లో॥ కురరి విలపసిత్వం వీతనిద్రావిశేషే
స్వపతి జగతి రాత్ర్యామీశ్వరగ్రస్త బోధే ।
వయమివ సఖిచ్చిద్గాఢ నిర్విద్ధచేతా
నళిన నయన హాసోదారలీలేక్షణేన ॥ 15

టీ:- కురరీతి. ఈశ్వరః శ్రీకృష్ణః తేన గ్రస్తబోధే జగతి స్వపతి. త్వం తు నిద్రాభంగం కుర్వంతీ విలపసిన శేషే న స్వపి షితదనుచితమిత్యర్థః అథవా నానాపరాధస్తవాపీత్యాశయేనాహుః -నళిననయనస్య హాసేన సహితం ఉదారం యల్లీలేక్షణం తేనే కచ్చిద్గాఢం నిర్విద్ధచేతాస్త్వమితి. 15

ఈశ్వరుడైన శ్రీకృష్ణునియందు లగ్నమైనబుద్ధితో రాత్రిపూట జగత్తు నిద్రించుచుండగా నీవు మాకు నిద్రాభంగమును కలిగించుచు ఓ లకుముకీ ! విలపించుచున్నావు. రాత్రిపూట మిగిలినకాలమున (వేకువన) నిద్రించుట అనుచితమని తెలుపుటకు కదా అని అర్థము. లేక నీయందును పెక్కుదోషములున్నవనే విషయమును చెప్పుచున్నాడు - నీవునూ ఓచెలీ ! మావలెనే ఒకానొక ప్రియుని పద్మములవంటి కన్నులుకల ప్రియుని యొక్క చిరునవ్వుతో కూడినగొప్ప విలాసమైన చూపులతో భాధింపబడిన హృదయము కలదానివా ఏమి?(లకుముకి ఉపాలంభన) 15

శ్లో॥ నేత్రే నిమీలయసి నక్తమదృష్టబంధు
స్త్వం రోరవీషి కరుణం బత చక్రవాకి ।
దాస్యం గతా వయమివాచ్యుత పాదజుష్టాం
కిం వా స్రజం స్పృహయసే కబరేణ వోఢుమ్ ॥ 16

టీ:- నేత్ర ఇతి. నక్తం రాత్రావదృష్టబంధుస్సతీ రోరవీషి కిం చ నైతావత్ వయమివ స్పృహయసే. 16

ఓ చక్రవాకీ ! రాత్రిపూట నీ జంట పక్షియైన ప్రియుని ఎడబాసి కన్నులు మూసుకొని ఎందుకు దయనీయముగా విలపించుచున్నావు. నీవు అట్లు విలపించుట తగదు.మేము కృష్ణునికి దాస్యము చేయుచు అతని పాదములందు తగుల్కొన్న పూలదండను సిగలో ధరించుటకు ఇష్టపడినట్లుగా నీవునూ మావలెనే కోరుకొంటివా. (చక్రవాకి ఉపాలంభన) 16

శ్లో॥ భోభో సదా నిష్టనసే ఉదన్వన్నలబ్ధ
నిద్రో௨ధిగత ప్రజాగరః ।
కింవా ముకుందాపహృతాత్మలాంఛనః
ప్రాప్తాం దశాం త్వం చ గతో దురత్యయామ్ ॥ 17

ఓ సముద్రుడా! నిద్రపట్టక మేల్కొని ఎందుకు దుఃఖించుచున్నావు. నీవునూ కృష్ణపరమాత్మ– నీగొప్పదనమునకు గుర్తుగా ఉన్న (ఆత్మలాంఛనము) శ్రీకౌస్తుభమణిని హరించినందువలన దాటలేని ఈ దుర్గతిని పొందితివా ఏమి?( సముద్రోపాలంభన) 17

టీ:– భోభో ఇతి. అలబ్ధనిద్రః సదా నిష్టనసే క్రోశసి కింవా అస్మాభిః ప్రాప్తాం దశాం త్వమపి గతో௨సి అహో కష్టం. యథా వయం సంభోగేన ముకుందాపహృత కుచ కుంకుమాదిలాంఛనాః. తథా త్వమపి. యతః అపహృత శ్రీకౌస్తుభాదిలాంఛనో లక్ష్యసే. 17

శ్లో॥ త్వం యక్ష్మణా బలవతా నిగృహీత ఇందో
క్షీణస్తమోననిజదీధితిభిః క్షిణోషి ।
కచ్చిన్ముకుందగదితాని యథా వయం త్వం
విస్మృత్య భో స్థగిత గీరుపలక్ష్యసే నః ॥ 18

ఓ చంద్రుడా! నీవునూ మావలెనే ఏకాంతమున కృష్ణుడు రహస్యముగా చెప్పిన శృంగారపు మాటలను మరచి ఆయన యందలి చింతతో కృశించి–క్షయరోగము(నశించిపోవుట)తో క్షీణించినట్లు– నీకాంతులు నశించుటతో కాంతిరహితుడవై, మాటలుకూడా పెగలలేని స్థితిలోకనబడుచున్నావు. (చంద్రోపాలంభన) 18

టీ:– త్వమితి. ముకుంద గదితాని రహస్యాని విస్మృత్య. తదేక చింతయా కచ్చిత్త్వం క్షిణోషి వయమివ స్థగితగీః స్తబ్ధవాక్ హే ఇందో నస్తథైవోప లక్ష్యసే. 18

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ కిం వా చరిత మస్మాభిర్మలయానిల తే ప్రియమ్ ।
గోవిందాపాంగ నిర్భిణ్ణహృదీరయసి నస్స్మరమ్ ॥ 19

టీ:- కిమితి. అప్రియాచరణం వినా స్మరోదీరణేన వ్యథాజననం మలయానిల. తవానుచిత మిత్యర్థః. 19

శ్లో॥ మేఘ శ్రీమంస్త్వమసి దయితో యాదవేంద్రస్య నూనం
శ్రీవత్సాంకం వయమివ భవాన్ ధ్యాయతి ప్రేమబద్ధః ।
అత్యుత్కంఠశ్చపలహృదయో౽స్మ ద్విధోబాష్పధారాః
స్మృత్వా స్మృత్వా విసృజసి ముహుర్దుఃఖదస్త్వత్ప్రసంగః ॥ 20

టీ:- మేఘేతి. తాపార్తిహరణాదిసామ్యాత్ త్వం యాదవేంద్రస్య నూనం దయితః సఖాసి అతో భవాన్ తం ధ్యాయతి. ధ్యానే లింగాన్యాహుః - అత్యుత్కంఠ ఇత్యాది. అహో కిమితి త్వయా తేన సఖ్యం కృతం యతో దుఃఖదస్త్వత్ప్రసంగ ఇతి. 20

ఓ మలయానిలుడా! కృష్ణుని కడగంటి చూపులవలననే మా హృదయములు పగిలి ఉండగా నీవు మరల మాకు మన్మథ బాధను కలిగిం చుచున్నావు. విరహమున తపించు మావంటి రాగవివశులకు బాధకలిగించుటే నీకు ఉచితమైనదా? నీకుకూడా మావలెనే కృష్ణుని వలన దుఃఖము ప్రియమైనదా. (మలయానిల ఉపాలంభన) 19

ఓ మేఘుడా !తాపమును పోగొట్టుట అనే పోలికతో నీవు కృష్ణునికి ప్రీతిపాత్రుడవే అనగా మిత్రుడవే కదా. మావలెనే నీవునూ ఆ శ్రీవత్సలాంఛనుని శరీరఛాయవంటి నల్లనైన రూపమనే ప్రేమ బంధముతో ఆయనను ధ్యానించువాడివే కదా. అయ్యో అట్టి నీవు మిక్కిలి ఉత్సాహముతో చంచలమైన మనస్సుతో ఆ కృష్ణుని వియోగమున క్రుగ్గుచున్న మమ్ములను నీ మైత్రీ భావమును విడనాడి మా కన్నీటిని (వియోగదుఃఖమును)గమనించకుండా మాకు దుఃఖమును వృద్ధిపొందించుచున్నావు. ఇది నీకు తగునా. అయితే నీవు కూడా వర్షధారల నెపముతో మావలెనే దుఃఖబాష్పములనే కురియుచున్నావు. మమ్ములను బాధించినందువల్ల నీకు ఈ దుఃఖము తప్ప మంచి ఏమిజరిగినది. (చంద్రోపాలంభన) 20

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.



శ్లో॥ ప్రియరావపదాని భాషసే మృత సంజీవకయానయా గిరా ।
కరవాణి కిమద్య తే ప్రియం వద మే వల్గితకంఠ కోకిల ॥ 21

టీ:- ప్రియరావేతి. హే కోకిల ప్రియరావస్య ప్రియంవదస్య శ్రీకృష్ణస్య పదానీవ పదాని శబ్దాన్ త్వం భాషసే. మృతాన్ సంజీవయతీతి తథా. తయా అనయా కోమలయా గిరా వల్గితకంఠ రమణీయకంఠ మే వద కథయ కిం తవ ప్రియం కరవాణీతి. 21

ఓ మధురగాన నిపుణుడవైన కోకిలా! ఇంపుగా ఇష్టమైన శ్రీకృష్ణుని పలుకులవంటి- మృతుని కూడా పునర్జీవింపచేయగల అమృతమైన పలుకులు పలికేవాడవు నీవు. ఇప్పుడు కూడా మధురముగా అదే విధముగా కోమలమైన మాటలనే నీవు మాట్లాడుము. నీకు మేమేమి ప్రత్యుపకారము చేయవలెనో తెలుపమని స్త్రీలు కోకిలను స్తుతించిరి. (కోకిల స్తుతి) 21

శ్లో॥ న చలసి నవదస్యుదార బుద్ధే
క్షితిధర చింతయసే మహాంత మర్థమ్ ।
అపి బత వసుదేవ నందనాంఘ్రిం
వయమివ కామయసే స్తనై ర్విధర్తుమ్ ॥ 22

టీ:- నేతి. హే క్షితిధర. త్వం న వదసి న చలసి అతో నూనం మహాంతమర్థం చింతయసే. బత తర్హి అపికిం యథా స్తనైర్విధర్తుం వయం కామయామహే. తథా త్వమసి స్తనతుల్యైశ్శృంగైర్వోఢుం కామయసే ఓమితి చేత్తర్హి తవాప్యస్మదవస్థా భవిష్యతీతి భావః. 22

ఓ (గోవర్ధన) పర్వతా! నీవు చలించవు. ఏమియూ మాట్లాడవు. అందుకని నిశ్చలముగా ఏదో అనిర్వచనీయమైన గొప్ప అర్థమును (విషయమును) గురించి ఆలోచించుచున్నావు. మేము వసుదేవ నందనుని పాదముద్రలను మాస్తనములపై ధరించుటకు ఇష్టపడినట్లే నీవునూ స్తనములగు శృంగములచే గోవిందుని పాదచిహ్నములను ధరించుటకు కాంక్షింతువు. ఔనని నీ వంగీకరించినచో మావంటి అవస్థనే నీకు కలుగ గలదని భావము. అని ఈ విధముగా స్త్రీలు పర్వతమును స్తుతించిరి. (పర్వత స్తుతి) 22



శ్లో॥ శుష్యద్ధ్రదాః కృశతరా బత సింధుపత్న్య
స్సంప్రత్యపేత కమలశ్రియ అస్తభర్తుః ।
యద్వద్వయం యదుపతేః ప్రణమావలోక
మప్రాప్య శుష్కహృదయాః పురకర్శితాస్స్మ ॥ 23

టీ:- శుష్యదితి. భో సింధుపత్న్యః నద్యః సంప్రతి గ్రీష్మే సింధుర్మేఘ ద్వారా అమృతవృష్ట్యా యుష్మాన్నానందయతి. బత అహో కష్టం. అతః శుష్యంతో హ్రదా యాసాం తాః. అపగతకమల శోభాః కృశతరాశ్చ ఆస్త. వయం యథా ప్రియతమస్య భర్తుర్మధుపతేః స్మ ప్రసిద్ధమ్. 23

శ్లో॥ హంస స్వాగతమాస్యతాం పిబ పయో బ్రూహ్యంగ శౌరేః కథా
దూతం త్వానువిదామ కచ్చిదజిత స్స్వస్త్యాస్త ఉక్తం పురా ।
కిం వా నశ్చల సౌహృదస్స్మరతి తం కస్మాద్భజామో వయం
క్షౌద్రాలాపమకామదం శ్రియమృతేనైవైకనిష్ఠాం స్త్రియామ్ ॥ 24

టీ:- తదైవ దైవాదాగతం హంసం దూతం కల్పయిత్వాహుః - హంసేతి. నః అస్మాన్ ప్రతి పురా రహసి ఉక్తం కిం వాచలసౌహృదః స్మరతి. స్మృత్వైవ మాం ప్రస్థాపిత వానితి చేదత ఆహుః - హే క్షౌద్ర క్షుద్రస్య దూత, కస్మాద్వయం తం భజామః? స కిమర్థమాహ్వయతి?

ఓ నదులారా! గ్రీష్మమున మీపతి సముద్రుడు మేఘముద్వారా అమృతజల వర్షముతో మీ కడుపులను నింపి(అంతర్వత్నులనుచేసి) మిమ్మానందపరచును. మీరిప్పుడు (ఈశరత్తున) పద్మములకాంతులు మందగించి, జలప్రవాహములేక కృశించి అయ్యో దుఃఖమును పొందితిరి. ఇప్పుడు మేమునూ శ్రీకృష్ణుని జతకు దూరమై అతని ప్రేమ చూపులు పొందలేక మోడువారిన గుండెతో తపించితిమి. మీ కునూ మావలెనే ఎంత కష్టము వాటిల్లినది. అని స్త్రీలు నదులతో తమకున్న సామ్యమును వివరించి ఓదార్పు మాటలు పలికిరి. (నదీస్తుతి) 23

స్త్రీలు ఈవిధముగా కృష్ణుని వియోగదుఃఖముతో పలవరించు చుండగా అప్పుడే దైవికముగా అక్కడకు వచ్చిన హంసను చూచి అది శ్రీకృష్ణుని దూత అని భావించి దానితో ఇట్లనుచున్నారు- ఓ హంసమా! నీకు స్వాగతము. ఇక్కడ విశ్రమింపుము. ఈ పాలు త్రాగుము. నీవు మా కృష్ణుని వర్తమానమును తెలుపుము. నిన్ను మేము కృష్ణుని వద్దనుండి వచ్చిన దూతగా తెలిసితిమి. నీకు శుభమగును. పూర్వము మాకు ఏకాంతమున రహస్యముగా చెప్పిన శృంగార విషయములను- చంచలమైన స్నేహభావముగల- స్వైరముగా పలువురు స్త్రీలతో గడుపునట్టి ఆ అజితుడు గుర్తుచేసుకొనునా. లేక మేము గుర్తున్ననూ మమ్ములను బుద్ధి పూర్వకముగనే దూరముగా ఉంచినాడా అనే

యుష్మదాజ్ఞేతి చేదత ఆహుః –అహో తర్హి తం ఇహాలాపయ ఆకారాయ. ఓ మితి గచ్ఛంత మివ తం పునరాహుః – యా ఆస్మాన్ వంచయిత్వా ఏకాకినీ రమతే తాం శ్రియమృతే తమేవాలాపయ. సా తదేకనిష్ఠా కథం పరిహర్తుం న శక్యత ఇతి చేదత ఆహుః – స్త్రియాం జాతవేక వచనం. అస్మాసు స్త్రీషు మధ్యే సైవైకనిష్ఠా న తు వయమిత్యర్థః. క్షౌద్రాలాపమకామదమితి పాఠాంతరే తు క్షౌద్రం తు మధుతద్వత్ మధురాలాపమాత్రం యస్య తం అకామదం అరతి ప్రదం. శ్రియమృతే వయం కస్మాద్భజామః? కింతు అనాదృతాపి సతీ పునః సైవ భజతు యతః అస్మాదృశ్యః మానిన్యః స్త్రియః ఏకనిష్ఠాః ఏకత్రైవ స్వసంమాన సిద్ధౌ నిష్ఠా యాసామితి. (24-25)

విషయమైచెప్పుచున్నారు. ఓ క్షుద్రుని (చేసినమేలు, చెప్పిన మాటలు మరచిపోవువాని) దూతుడా! ఆ కృతఘ్నుని మేమెందుకు సేవించవలెను. అతడు మమ్మెందుకు పలుకరించుచున్నాడు. మీరే కోరితిరికదా.(అని హంస అన్నట్లుగా) అనే విషయమై చెప్పుచున్నాడు– ఆహా నీవు (హంస) అట్లని చెప్పినచో–మాటలు తీపిగా మాట్లాడి ఏమిచేయక పోవుటలు – శుష్కప్రియములు, శూన్య హస్తములవంటివే (మీకృష్ణుని చేష్టలు). ఓ మిలతి–సరేయని తిరిగివెళ్ళుటకు సిద్ధపడినదిగా హంసను భావించి వానితో మరలా వారిట్లు చెప్పుచున్నారు– మమ్ము మోసగించి ఏకాంతమున ఆ లక్ష్మీదేవితో భోగ సుఖములనుభవించు అతనితో ఆమె లేనప్పుడు మా ఈ మాటలు విన్నవించుము. అయితే లక్ష్మీదేవి నిరంతరము ఆయనవెంటనే ఉండును. (తదేకనిష్ఠ)కదా. ఆమెకు తెలియకుండ ఆయనకు నివేదించు శక్తి నాకు(హంస)లేదే అనే విషయమై చెప్పుచున్నాడు.(ఇక్కడ 'స్త్రియాం' అనే ఏకవచన ప్రయోగము స్త్రీ జాతినుద్దేశించినది) ఆమె ఒక్కతే ఆయనను తత్పరత (ఏకనిష్ఠ)తో భజించు నదికాదు. మేము కూడా సర్వాత్మనా ఆయననే నిష్ఠతో సేవించితిమి.(ఇక్కడ క్షౌద్రాలాపము అనుటలో అతని మాటలు మాత్రమే తీయనివి కాని, చేతలు మాత్రము ఇష్టములేనివే) లక్ష్మీదేవిని కాదని అతనిని మేమెట్లు సేవించగలము.అనాదరమునకు గురియైనను ఆమెనే మరలమరల ఆయనను సేవించునా. మాకు మాత్రము మామానమే (ఆత్మగౌరవమే) ఇష్టము. అందే మాకు నిష్ఠ. మమ్ము తిరస్కరించిన అతనితో మాకేమిపనిఅని ఆక్రోశించిరని భావము. 24

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఇతీ దృశేన భావేన కృష్ణే యోగేశ్వరేశ్వరే ।
క్రియమాణేన మాధవ్యో లేభిరే వైష్ణవీం గతిమ్ ॥ 25

అని ఈవిధముగా యోగీశ్వరుడైన శ్రీకృష్ణునియందు పరిపూర్ణముగా నిలిపిన మనస్సుతో మాధవి మొదలైన స్త్రీలు విష్ణుగతిని పొందినారు. 25

శ్లో॥ శ్రుతమాత్రోஉపియః పుంసాం ప్రసహ్యాకర్షతే మనః ।
ఉరుగాయోరుగీతో వా పశ్యంతీనాం చ కిం పునః ॥ 26

ఆ స్త్రీలు కృష్ణునిపట్ల ఇంత గాఢముగా మనస్సు నిలుపుట చిత్రము కాదని చెప్పుచున్నాడు- కృష్ణుని ప్రసక్తిని విన్నంత మాత్రము చేతనే పురుషుల మనస్సులను కూడా బలవంతముగా తన వైపుకు పరమాత్మ ఆకర్షించుచుండగా ఆ విశ్వరూపుని నిరంతరము తమ గానములతో అలరించుచు, నిత్యమూ ఆయన సన్నిధానమున తమ లౌకికనేత్రములతో ఆ దివ్యమంగళరూపమును తనివితీరా దర్శించి తరించుచున్న ఆ యువతుల విషయమును వేరుగా చెప్పవలసిన దేమున్నది. వారికి విష్ణుగతి సహజసిద్ధమని భావము. 26

శ్లో॥ యాస్తం పర్యచరన్ ప్రేమ్ణా పాదసంవాహనాదిభిః ।
జగద్గురుం భర్తృబుద్ధ్యా తాసాం కిం వర్ణ్యతే తపః ॥ 27

టీ:- తాసాం కృష్ణే ఏవంభూతో భావః నాతి చిత్ర మిత్యాహ- శ్రుత మాత్రోஉపీతి. ఉరుభిర్గాయైర్గీతైః ఉరుగీతో వా యైః కైశ్చిద్గీతైః యథా కథంచిదపి గీతో వేత్యర్థః . (26-27)

జగద్గురుడైన కృష్ణునికి నిత్యము ప్రేమపారవశ్యముతో ఆయనే తమ భర్తయను బుద్ధితో పాదములు వత్తుటవంటి పెక్కు పరిచర్యలు చేయునట్టి ఆ స్త్రీల తపో మహిమను ఏ విధముగా వర్ణించగలము. 27

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ ఏవం వేదోదితం ధర్మం హ్యనుతిష్ఠన్ సతాం గతిః ।
గృహం ధర్మార్థకామానాం ముహుశ్చాదర్శయత్పదమ్ ॥ 28

ఈ విధముగా సత్పురుషులకు గమ్యమైన కృష్ణుడు వేదము ప్రతిపాదించిన ధర్మము, అర్థము, కామము అనే పురుషార్థాలను ఆచరించుచు వారికి చివరకు తురీయమైన మోక్షపురుషార్థమును కలిగించును. 28

శ్లో॥ ఆస్థితస్య పరం ధర్మం కృష్ణస్య గృహమేధినామ్ ।
ఆసన్ షోడశసాహస్ర మహిష్యోఽష్ట శతాధికాః ॥ 29

సర్వోత్కృష్టమైన గృహస్థ ధర్మమును ఆచరించుచున్న కృష్ణునికి పదునారువేల ఎనిమిదిమంది పత్నులుండిరి. 29

టీ:- ఏవ మితి. పదం స్థానం. (28-29)

శ్లో॥ తాసాం స్త్రీరత్నభూతానామష్టాయాః ప్రాగుదాహృతాః ।
రుక్మిణీ ప్రముఖా రాజన్ తత్పుత్రాశ్చానుపూర్వశః ॥ 30

ఓ రాజా ! వారిలో స్త్రీలలో రత్నములవంటివారైన రుక్మిణీదేవి మొదలైన వారిని గురించి ముందుగనే వివరించితిని. ఇప్పుడు వరుసగా వారి పుత్రుల విషయమును చెప్పెదను. 30

టీ:- తాసామితి. యాః రుక్మిణీ ప్రముఖాః అష్టౌ తాః ఉదాహృతాః ప్రాగేవ. 30

శ్లో॥ ఏకైకస్యాం దశ దశ కృష్ణోఽజీజనదాత్మజాన్ ।
యావత్య ఆత్మనో భార్యా అమోఘగతిరీశ్వరః ॥ 31

తన పదునారువేల ఎనిమిదిమంది భార్యలకు ఒక్కొక్కరికి పదేసిమంది పుత్రులను సఫల వీర్యుడైన ఆ పరమేశ్వరుడు ప్రసాదించినాడు. ఈ విధముగా కృష్ణుని పుత్రుల సంఖ్య ఒక లక్షా అరువది వేలా ఎనుబది. 31

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ తేషాముదార వీర్యాణామష్టాదశ మహారథాః ।
ఆసన్నుదారయశసస్తేషాం నామాని మే శృణు ॥ 32

టీ:- ఏకైకస్యామితి. ఏవమష్టోత్తర శతాధికషోడశ సహస్ర మహిషీణాం పుత్రాః లక్షమేక మశీత్యుత్తరైకషష్టి సహస్రాణి భవంతి. (31-32)

శ్లో॥ ప్రద్యుమ్నశ్చానిరుద్ధశ్చ దీప్తిమాన్ భానురేవ చ ।
సాంబో మిత్రో బృహద్భానుర్మిత్రవిందో వృకోఽరుణః ॥ 33

శ్లో॥ పుష్కరో దేవబాహుశ్చ శ్రుతదేవస్సునందనః ।
చిత్రభానుర్వరూథశ్చ కవిర్న్యగ్రోధ ఏవ చ ॥ 34

శ్లో॥ త్రివక్రాయాముపక్రోశః పుత్రః కృష్ణమనువ్రతః ।
శిష్యస్సాక్షాన్నారదస్య దధౌ చిత్తమఖండితమ్ ॥ 35

శ్లో॥ తేనోక్తం సాత్వతం తంత్రం యత్ జ్ఞాతా ముక్తిమాన్భవేత్ ।
యత స్త్రీ శూద్రదాసానాం సంస్కారో వైష్ణవః స్మృతః ॥ 36

శ్రీకృష్ణుని పుత్రులందరూ మహాపరాక్రమవంతులు. అపారమైన కీర్తిమంతులు. వీరిలో పదునెనిమిదిమంది మహారథులు. వారిపేర్లను చెప్పెదను వినుమని శుకమహర్షి పరీక్షిత్తుకు వినిపించినాడు. 32

ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, మిత్రుడు, బృహద్భానుడు, మిత్రవిందుడు, వృకుడు, అరుణుడు, పుష్కరుడు, దేవబాహుడు, శ్రుతదేవుడు, సునందుడు, చిత్రభానుడు, వరూథుడు, కవి, న్యగ్రోధుడు అనిపేర్లు. వీరిలో అనిరుద్ధుడు ప్రద్యుమ్ని కొడుకు కనుకమనమడు. కృష్ణునికి అనిరుద్ధుడను పేరుగల మరొక పుత్రుడైననూ కావచ్చును. (33,34)

కృష్ణ భక్తుడైన ఉపక్రోశుడు కుబ్జకొడుకు. ఇతడు నారదుని శిష్యుడై అతనికి తనమనస్సును అర్పించినాడు. 35

ఈ ఉపక్రోశుడు సాత్వతతంత్రమనే గొప్ప తంత్ర గ్రంథమును వెలయించినాడు. ఈగ్రంథ జ్ఞానమును పొందినవాడుముక్తిని పొందును. దాని వలన స్త్రీలు, శూద్రులు, దాసులకును వైష్ణవ సంస్కారముకలుగును. 36

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ ఏతేషామపి రాజేంద్ర తనూజానాం మధుద్విషః ।
ప్రద్యుమ్న ఆసీత్ప్రథమః పితృవద్రుక్మిణీ సుతః ॥ 37

ఓ రాజా! శ్రీకృష్ణుని పుత్రులందరిలో ప్రద్యుమ్నుడు ముందు జన్మించినవాడు. ఈ రుక్మిణీ సుతుడు ఎల్ల విధముల తండ్రిని పోలినవాడు. 37

శ్లో॥ స రుక్మిణోదుహితరముపయేమే మహారథః ।
తస్యాం సుతో௨నిరుద్ధో௨భూన్నాగాయుత బలాన్వితః ॥ 38

మహారథుడైన ఆ ప్రద్యుమ్నుడు తన మేనమామ రుక్మి కూతురును పెండ్లియాడెను. వారికి పదివేల ఏనుగుల బలముగల అనిరుద్ధుడు జన్మించెను. 38

శ్లో॥ స చాపి రుక్మిణః పౌత్రీం దౌహిత్రో జగృహే తతః ।
వజ్రస్తస్యాత్మభూర్యస్తు మౌసలాదవశేషితః ॥ 39

అనిరుద్ధుడు రుక్మి మనుమరాలు తన మేనమామకూతురు అయిన రుక్మలోచనను పెండ్లియాడెను. పిమ్మట శోణపురాధిపతి బాణాసురుని కూతురు ఉషను వివాహమాడినాడు. వీరి కుమారుడే వజ్రుడు. ఇతడు ముసలము(రోకలి)కారణముగా నాశనమైన యదువంశమునందు మరణించక మిగిలినాడు. ఇతడు ఇంద్రప్రస్థము రాజధానిగా పరిపాలించినాడు. 39

శ్లో॥ ప్రతిబాహురభూత్తస్మాత్సుబాహుస్తస్య చాత్మజః ।
సుబాహోరుగ్రసేనో௨భూచ్ఛతసేనస్తు తత్సుతః ॥ 40

అనిరుద్ధుని కొడుకైన వజ్రునికి ప్రతిబాహుడు పుత్రుడు. ఇతని కుమారుడు సుబాహుడు. సుబాహుని కొడుకు ఉగ్రసేనుడు. ఇతని కొడుకు శతసేనుడు. 40

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ న హ్యేతస్మిన్ కులే జాతా అధనా అబహు శ్రుతాః ।
అల్పాయుషోఽల్ప వీర్యాశ్చ అబ్రహ్మణ్యాశ్చ జజ్ఞిరే ॥ 41

శ్లో॥ యదువంశ ప్రసూతానాం పుంసాం విఖ్యాత కర్మణామ్ ।
సంఖ్యా న శక్యతే కర్తుమపి వర్షాయుతైర్నృప ॥ 42

టీ:- ప్రద్యుమ్న ఇతి. అనిరుద్ధశ్చేతి అతః పుత్రాణాం మధ్యే సప్తదశైవ జ్ఞేయాః - అథవా అనిరుద్ధనామాపి కశ్చిత్పుత్ర ఏవేతి. (33-42)

శ్లో॥ తిస్రః కోట్యస్సహస్రాణామష్టా శీతిశతాని చ ।
ఆసన్ యదుకుమారాణామాచార్యా ఇతి నశ్శ్రుతమ్ ॥ 43

టీ:- తిస్ర ఇతి. సహస్రాణామపరిమితానాం కుమారాణామిత్యన్వయః యదా ప్రత్యేకం బహూనధ్యాపయతామాచార్యాణామియం సంఖ్యా. తదిపి శ్రుతమాత్రం న తు సమ్యక్ జ్ఞాయతే. 43

శ్లో॥ సంఖ్యానం యాదవానాం కః కరిష్యతి మహాత్మనాం ।
యత్రాయుతానామయుత లక్షపుత్రస్స ఆహుకః ॥ 44

ఈ యాదవకులమున ధనము లేనివారుకానీ, పండితులు కానివారు కానీ అల్పాయుష్కులుకానీ, పరాక్రమము లేనివారు కానీ, బ్రహ్మద్వేషులుకానీ పుట్టలేదు. 41

ఓ రాజా! యాదవవంశమున జన్మించిన పురుషులందరూ గొప్ప కార్యములు నెరవేర్చినారు. వారు చేసిన ఘనకార్యములను గూర్చి వివరించుటకు పదివేల సంవత్సరముల కాలము కూడా సరిపోదు. 42

యదుకుమారులు మూడుకోట్ల ఎనిమిదివేల ఎనిమిది వందలు న్నారని వినికిడి. ప్రత్యేకముగా ఆచార్యులు అధ్యాపనము చేయించిన వారిని బట్టి ఈ సంఖ్య గణింపబడినది. అది కూడా కేవలము వినికిడి వల్ల కలిగిన గణనమే కాని సరిగా ఇంతమంది అని తెలియదు. 43

మహాత్ములైన యాదవులసంఖ్యాగణనము ఎవరికిసాధ్యము. యదుకుమారులే అపరితమైనవేలసంఖ్యలోఉండగా మొత్తము యాదవుల సంఖ్యను నిర్ణయించుట సాధ్యము కాదనిభావము. అయితే

టీ:- సంఖ్యానమితి. తదా కుమారాణామేవ సంఖ్యానం కర్తుం శక్యతే కుతః పునస్సర్వయాదవానామితి. 44

వారు పదివేల పదివేల లక్షలని అనగా పదిలక్షల కోట్ల సంఖ్యతో ఉన్నారని ఒక అంచనా. 44

శ్లో॥ దేవాసుర హతా యే వై దైతేయాస్త్వతి దారుణాః ।
తే చోత్పన్నామనుష్యేషు ప్రజాదృప్తా బబాధిరే ॥ 45

దేవాసురులచేత చంపబడిన మిక్కిలి భయంకరులైన రాక్షసులు అనేక విధములైన రూపములతో మానవ లోకమున జన్మించి మహాగర్వముతో ప్రజలను బాధించిరి. 45

టీ:- దేవాసురేతి. తేచోత్పన్నా ఇతి. ప్రత్యేకం బహుభిః రూపైరితి జ్ఞేయం. 45

శ్లో॥ తన్నిగ్రహాయ హరిణా ప్రోక్తాదేవా యదోః కులే ।
అవతీర్ణాః కులశతం యేషామేకాధికం నృప ॥ 46

ఓ రాజా ! అట్టి దుష్టులను నిగ్రహించుటకై శ్రీహరిచేత ప్రేరితులై దేవతలు యాదవకులమున నూటొక్కరు జన్మించిరి. 'సహశస్సముద్భూతా దేవా యదుకులే పృథక్' అనిచెప్పబడినది. 46

శ్లో॥ తేషాం ప్రమాణం భగవాన్ ప్రభుత్వే చాభవద్ధరిః ।
చేతోఽనువర్తినస్తస్య వవృధుస్సర్వయాదవాః ॥ 47

ఆవిధముగా జన్మించిన దేవతలు ఆయా విధముగా నియమించుటకు సాక్షాత్తు భగవంతుడు శ్రీహరియే నాయకుడై జన్మించుటయే నిదర్శనము. ఆయన మనస్సుకు నచ్చిన విధముగా యాదవులందరూ వర్తించిరి. 47

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో॥ శయ్యాసనాటనాలాప క్రీడా స్నానా శనాదిషు ।
న విదుస్సంతమాత్మానం వృష్ణయః కృష్ణచేతసః ॥ 48

శ్లో॥ ఈజే క్రతుభిరాత్మానం సర్వదేవార్థ సంగ్రహమ్ ।
స్వయోగమాయారచితైః కురుక్షేత్రాదిషు క్రమాత్ ॥ 49

శ్లో॥ కృష్ణగార్గ్యసితావంత్య కామాచార్యోద్ధవేశ్వరః ।
దీక్షితో హ్యగ్రపత్నీభిః పుణ్యశ్లోక శిఖామణిః ॥ 50

టీ:- తన్నిగ్రహాయేతి. ఏవమేవ యదుకులే దేవా ఇతి తథా చోక్తం. శ్లో. "సహస్రశస్స ముద్భూతా దేవా యదుకులే పృథగి" తి.(46-50)

వారందరూ శ్రీకృష్ణునితో కలసి నిద్రించుట, కూర్చుండుట, తిరుగుట, మాట్లాడుట, ఆటలాడుట, స్నానముచేయుట, భుజించుట మొదలైనవాటియందు శ్రీకృష్ణమనస్కులై తమను తామే విస్మరించిరి. 48

కురుక్షేత్రము మొదలైన ప్రదేశములందు వరుసగా తన యోగమాయచేత నిర్మితమైన పెక్కుయాగములను సర్వదేవతల అర్థసముదాయ రూపుడైన తనకొరకు- కృష్ణ(వ్యాసుదు) గార్గి, అసితుడు, అవంత్య, కామాచార్య, ఉద్ధవ ఈశ్వరుదు, ఉత్తమోత్తముడైన శ్రీకృష్ణుడు తన పట్టపు రాణులతో దీక్షబూని చేసినాడు. (49-50)



శ్లో॥ తీర్థం చక్రే నృపోనం యదజని యదుషు స్వస్సరిత్పాదశౌచం
ద్విట్స్నిగ్ధాస్తత్స్వరూపం యయురజితపరా శ్రీర్యదర్థేఽన్య యత్నః
యన్నామామంగళఘ్నం శ్రుతమథగదితం యత్కృతో గోత్రధర్మః
కృష్ణస్యైతన్న చిత్రం క్షితిభరహరణం కాలచక్రాయుధస్య ॥ 51

టీ:- తస్మాత్ శ్రీకృష్ణకీర్తేః సర్వతీర్థోత్తమత్వం శ్రీకృష్ణస్య సర్వ దేవోత్తమత్వేన న చిత్రమిత్యాహ- తీర్థమితి. ఇతః పూర్వం స్వస్సరిదేవ సర్వతోఽధికం తీర్థం ఆసీత్. ఇదానీం తు యదుషు యదజని జాతం తీర్థం శ్రీకృష్ణకీర్తన రూపం తత్స్వస్సరిద్రూపం పాదశౌచం తీర్థం ఊనం అల్పం చక్రే స్వయమేవ సర్వతీర్థోపరి విరాజత ఇత్యర్థః. శ్రీకృష్ణస్య ద్విషః స్నిగ్ధాశ్చ తస్య స్వరూపం సారూప్యమయయురిత్యపి న చిత్రం. తస్య పరమకారుణికత్వాత్ యథా ఇదం చ న చిత్రం కిం తత్? అజితపరా అజితా అపరాజితా కైశ్చిదప్యప్రాప్తా పరా సర్వతః పరిపూర్ణా శ్రీకృష్ణస్యైవ నాన్యస్యేతి తదేవాహ - యదర్థే అన్యేషాం బ్రహ్మాదీనాం యత్నఇతి. ననునిరపేక్షంతమేవ లక్ష్మీః శ్రయత ఇతి. చిత్రమేవేతి చేన్నహి పరమమంగళనామధేయత్వాత్తస్యేత్యాహ - యన్నామేతి. తదపి నార్థస్మరణాపేక్షమిత్యాహ - శ్రుతమథగదితమితి. సర్వధర్మాశ్రయత్వా దపీత్యాహ - యత్కృతోగోత్ర ధర్మఇతి గోత్రేషు తత్తదృషివంశేషు ధర్మోయత్కృతః యేన ప్రవర్తితః. తస్యక్షితిభారహరణం నైవచిత్ర

అందువలన శ్రీకృష్ణుని కీర్తికే సర్వోత్తమత్వము. శ్రీకృష్ణునికే సర్వోత్తమత్వములుండుట ఆశ్చర్యము కాదని చెప్పుచున్నాడు- ఇంతకు పూర్వము (శ్రీకృష్ణుని జననముకన్న ముందు) శ్రీమహావిష్ణువు పాదమున జనించిన గంగానదియే సరస్వతీ తీర్థముల కంటె ఉత్తమమైనది. ఇప్పుడు యాదవవంశమున జన్మించిన శ్రేష్ఠతమమైన తీర్థరూపుడైన శ్రీకృష్ణుని కీర్తనరూపమైన తీర్థము ఆ గంగానది తీర్థత్వమునకు అల్పత్వమును కలిగించినది. నేనే సర్వతీర్థ రాజముననను గంగా ప్రధాన్యము తగ్గినదని అర్థము. దాని స్థానమును శ్రీకృష్ణుని కీర్తనము పొంది సర్వశ్రేష్ఠమైనదని భావము. శ్రీకృష్ణుని శత్రువులు కూడా స్నేహభావముతో అతని సారూప్యమును పొందుట కూడా ఆశ్చర్యముకాదు. అతని అపారమైన కరుణవల్ల ఇదంతయు (ఈజగమంతయు)ఒక్కడే అయినప్పుడు వైరుధ్యమునకు తావులేదు. అజితపరా అనగా అపరాజితమైన పరముకలది. అనగా పొందలేని ముక్తి ఎవరికినీ లేదు. అనగా ముక్తి అందరికీ లభ్యము. అంతటా పరిపూర్ణమైనది శ్రీకృష్ణుని అనుగ్రహము. ఇంతటి సామర్థ్యము మరెవ్వరికీలేదు. ఆ పరమాత్మ అనుగ్రహమునకై బ్రహ్మాదిదేవతలును యత్నింతురు. వారు సంపదలను కూడా ఆశించరు అనునది ఆశ్చర్యము కాదు. పరమ మంగళమైనది ఆయన నామము. అందువలన దానినే ఆశింతురు. ఐహికములైన సంపదల కొరకు మాత్రమే ఆ శ్రీపతిని ఆశ్రయించ

మిత్యాహ- కృష్ణస్యైతదితి. కాల చక్రాయుధస్యేతి. సర్వ సంహార కాలమూర్తేః విశేషతో దురంత ప్రభావ చక్రాయుధస్య కియదేతదిత్యర్థః 51

శ్లో॥ జయతి జననివాసో దేవకీజన్మవాదో
యదువర పరిషత్స్వైర్దోర్భి రస్యన్న ధర్మమ్ ।
స్థిరచరవృజినఘ్న స్సుస్మిత శ్రీముఖేన
వ్రజపుర వనితానాం వర్ధయన్ కామదేవమ్ ॥ 52

టీ:- యత ఏవం భూతః శ్రీకృష్ణః- తతః సేవ్యస్స ఏవ సర్వోత్తమ ఇత్యాహ- జయతీతి. జనానాం జీవానాం యో నివాసః ఆశ్రయః. తేషు వా నివసతి అంతర్యామితయా తథా స కృష్ణో జయతి. దేవక్యాం జన్మేతి వాదమాత్రం యస్య సః యదువరాః పరిషత్ సభా సేవకరూపా యస్య సః -ఇచ్ఛామాత్రేణ నిరసన సమర్థోఽపి క్రీడార్థం స్వైః దోర్భిరధర్మమస్యన్ క్షిపన్ స్థిర చర వృజినఘ్నః అధికారి విశేషానపేక్ష

కూడదని భావము. ఆయనే ఆయా ఋషుల వంశములందు ఆయా ధర్మములను ప్రవర్తింపచేయుచున్నాడు. అందువలన ఆయన భూమిని భరించుట నాశము చేయుటలు ఆశ్చర్యముకాదని చెప్పుచున్నాడు- ఆయన కాల చక్రాయుధుడు. అనగా సర్వమును సంహరించు కాలరూపుడు, విశేషముగా అనంత ప్రభావము కలిగిన ఆ చక్రాయుధునికి ఇదంతయు ఎంత అనగా అతని శక్తికి ఈసృష్టి, నాశములు అత్యల్పమైనవని భావము. 51

ఈ విధమైన శ్రీకృష్ణుడే సేవించదగిన ఎల్ల దేవతలలో సర్వోత్తముడని చెప్పుచున్నాడు- సర్వ జీవులకు ఆశ్రయుడు, అనగా అన్ని శరీరములందు అంతర్యామిగా వర్తించువాడు శ్రీకృష్ణుడే. ఈయన దేవకి వల్ల జన్మించినాడనేది కేవలము ఒక మాట మాత్రమే. యాదవ సమూహము సేవకభావమును పొందిన భగవంతుడు శ్రీకృష్ణుడు సంకల్ప మాత్రముచేతనే దీనిని తిరస్కరించగల సమర్థుడైనప్పటికి తన విలాసార్థము తన భుజములపై ధర్మభావమును మోపుకొని ఈ చరాచరమైన జగత్తునందలి పాపములను సంకటములను నాశనము చేసి, అధికారి విశేషమును కోరకనే అనగా గ్రహించగల యోగ్యతలతో వ్యక్తి ఎక్కువ తక్కువలను గమనింపక బృందావనమందలి చెట్లు, పూల తీగలకు కూడా సంసార దుఃఖమును నివర్తింపచేసినాడు. అట్లే

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

మేవ బృందావనగతానాం తరులతాగవాదీనామపి సంసార దుఃఖ హంతా. తథా విలాసవైదగ్ధ్యానపేక్షం వ్రజ వనితానాం పురవనితానాం చ సుస్మితేన శ్రీమతా ముఖేనైవ కామదేవం వర్ధయన్. కామాశ్చాసౌ దీవ్యతి విజిగీషతి సంసారమితి దేవః తం భోగద్వారా మోక్షం ప్రవర్ధయన్నిత్యర్థః. 52

శ్లో॥ ఇత్థం పరస్య నిజధర్మరిరక్షయాత్త
లీలాతనో స్తదనురూప విడంబనాని ।
కర్మాణి కర్మకషణాని యదూత్తమస్య
శ్రూయాదముష్య పదయోరనువృత్తిమిచ్ఛన్ ॥ 53

టీ:- ఇత్థమితి. తత్తత్కార్యవిశేషైః స్వీకృతమత్స్యకూర్మాది నానావ తార మూర్తేర్వి శేషతో యదూత్తమస్య సతః పరస్య పరమస్య తదను రూపానుకారిణి కర్మకషణాని కర్మనిబర్హణాని కర్మాణి చరితాని శ్రూయాత్ శృణుయాతిద్యర్థః. 53

గోపికలకు, పురస్త్రీలకు శృంగార చేష్టలందలి నైపుణ్యమును కోరకనే చిరునవ్వులతోడి లక్ష్మీ సంపన్నమైన ముఖముతోనే చూపులతోనే మన్మథభావన కలిగించి- కామమే సంసారమును సంపూర్ణముగా జయించగలదని వారికి సంభోగముద్వారా మోక్షకాంక్షను వృద్ధి పొందించినాడు. 52

ఈ విధముగా పరమాత్మ తన వేదధర్మమును రక్షించుటకై ఆయా కార్యములను సాధించు నిమిత్తము ఆయా మత్స్య, కూర్మాది నానా అవతా రములను ధరించి విశేషముగా యాదవకులమున సర్వోత్కృష్టుడైన శ్రీ మహావిష్ణువు శ్రీకృష్ణుడుగా అవతరించి ఆయా అవసరములకు తగిన విధముగాఉన్న కర్మలను నాశనము చేయుటకు (దుష్టులను నాశనము చేయుటకు) చేసిన లీలాచరితములను ఆయన పాదముల ఆశ్రయమును కోరినవాడవై విందువుగాక. 53

శ్లో॥ మర్త్యస్తయానుసవమేధితయానువృత్త్యా
శ్రీమత్కథాశ్రవణ కీర్తనచింతయైతి ।
తద్ధామదుస్తర కృతాంత జనాపవర్గం
గ్రామాద్వనం క్షితి భుజో౽పియయుర్య దర్థాః ॥ 54

టీ:- అనువృత్తేః ఫలమాహ -మర్త్య ఇతి. శ్రీమత్యాః కథాయాః శ్రవణ కీర్తన యుక్త యాచింత యాసంవర్ధితయా అనువృత్త్యా తయా తన్నిష్ఠత్వేన తస్యధామ లోకమేతి. లోకత్వే౽పి కాలేనా కలితమిత్యాహ- దుస్తరేతి దుర్లభ పురుషార్థతామాహ - గ్రామాద్వనం క్షితిభజ ఇతి. 54

పరాశ్రయత్వ ఫలమును చెప్పుచున్నాడు- మానవుడు మంగళకరమైన పరమాత్మ కథలను (లీలలందు) వినుట, కీర్తించుట, చింతన చేయుటలచేత వృద్ధిపొందిన విధేయమైన మనోవృత్తి యందే నిశ్చలతను సాధించి ఆపరమాత్మ లోకమును పొందును. ఆలోకస్థితి కూడా కాలముతో సంబంధమున్నదేకదా అనేదానికి కాదని చెప్పుచున్నాడు. అది దాటవీలులేనిది. మరణాది భాధలకు దుర్లభమైనదని చెప్పినాడు. ఆనిర్వికల్పస్థితికై రాజుకూడా గ్రామమునుండి (వనప్రస్థితికి) వెళ్ళుచున్నాడని శుకమహర్షి పరీక్షిత్తుకు వినిపించాడు. 54

శ్రీమద్భాగవతే, దశమస్కంధే, నవతితమో౽ధ్యాయః

**ఓం తత్సత్**

అని శ్రీమద్భాగవతమున దశమస్కంధమందు
ఎనుబదితొమ్మిదవ అధ్యాయముసమాప్తము
దశమస్కంధము సమాప్తము

**ఓం తత్సత్**

సదానందో విజయతే

జయ కృష్ణానంద

మదనానందో విజయతే తరామ్

జయ మాధవానంద

# శ్రీగురుమదనానందసరస్వతీపీఠము

రాంపురం, తొగుట మం., మెదక్ జిల్లా




సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్